# కృతజ్ఞత

స్వర్గీయులైన పూజ్యపాదులు మా నాయనగారు రచించిన "పరివర్తనము" అను ఈ నవలను ఆంధ్రమహాజనులకు సమర్పించు భాగ్యము లభింపజేయు నుద్దేశముతో ముద్రణమునకు ప్రోత్సహించిన పూజనీయులు, మా తండ్రిగారి మిత్రులు శ్రీ దర్శి వెంకటసుబ్బారావు (అడిషినల్ ఫస్టుక్లాసు మేజస్ట్రేటు), శ్రీ కె. జ్వాలానరసింహం (డిప్యూటీ కలెక్టరు), శ్రీ వాసిరెడ్డి చినకోటయ్య (చినపాలెం), శ్రీ కాకుమాను అంజయ్య (ప్రొప్రయిటరు, జానకిరాం బైండింగువర్క్సు-తెనాలి) మొదలుగాగల సహృదయు లందఱును, ఈ కృతిని తెర బయటకు వచ్చుటకు యెన్నియోరీతుల తోడ్పాటుగావించిన పెద్ద లందఱును, అత్యల్పమూల్యముననే ఈ గ్రంథమును ముద్రించి సాయపడిన శ్రీ తెనాలి భారతీప్రెస్‌వారును, ముద్రణసమయమందు ప్రూఫులను యెంతయో శ్రమపడి సరిజూచిన ఉభయభాషాప్రవీణ శ్రీ దర్శనాచార్య శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారును మా కెంతయు వందనీయులు. వీరందఱికి మే మెంతయు కృతజ్ఞులము.

ఆంధ్రదేశము ఈనవలను అర్హరీతి సమ్మానింపగలదని యాశించుచున్నాము.

ఇట్లు,
గోనుగుంట సీతాబాయమ్మ
గోనుగుంట సోమశేఖరరావు
(కవి బిడ్డలు)

అయితానగరం,
తెనాలి,
10-5-1956.

# ఉపోద్ఘాతము

శ్రీ గోనుగుంట పున్నయ్యగారిచే రచియింపఁబడిన పరివర్తనము అను గ్రంథమునకు పీఠిక వ్రాయుటకు నా కవకాశమిచ్చిన మిత్రులకు నే నెంతయు కృతజ్ఞుఁడను. స్వాతంత్ర్యమును సంపాదించిన మన భారత జాతి యిప్పుడు చేసికొనవలసిన మార్పులను గురించి, ఆ మార్పులను జేసికొనుటలో మన మవలంబించవలసిన మార్గములను గూర్చి యీ గ్రంథమున వివరముగఁ జర్చింపఁబడినది.

నవీనత భావములయందు మాత్రమేగాక భాషయందును జూపెట్టినాఁడీరచయిత. మొత్తముమీద నవ్యభాషీయవాఙ్మయమునే సృష్టించినాఁడు. భాషీయ వాఙ్మయమునకుగూడ వ్యాకరణ ముండు నని మరచిపోయి పలువురు వాడుకభాష రచయితలు, శిష్టులు సాధారణముగ ఉపయోగించు రూపములను విడిచి గ్రామములలో నెక్కడనో మారుమూలల నుపయోగింపఁబడు వికార రూపముల నుపయోగింతురు. దేశముయొక్క వివిధ భాగములలో నుపయోగింపఁబడు జాతీయ తెనుఁగు ప్రయోగముల నుపయోగింప గూడదని నా యభిప్రాయము గాదు. పల్లెటూళ్ళలో పడియున్న జాతిరత్నముల ప్రోగుచేయవలసినదనిగూడ నా యభిప్రాయమే. అప్పుడే మనము చక్కని తెలుఁగును సమకూర్చుకొనగలము. పున్నయ్యగారు అందఱు తెలుఁగువారును సాధారణముగ నుపయోగించు జాతీయపు తెనుఁగు ప్రయోగములనే ముద్దులు గులుకునట్లు కూర్చి శరవేగముగల శైలితో రచియించినారు. చేయితిరిగిన వ్రాత. అడ్డులేని కలము.

ఇప్పుడు మనము భారతజాతిలోఁ జేయవలసిన సంస్కారణ లన్నియు ఇప్పటి మన నాయకులు క్రొత్తగా వెదకి యేర్పరచుకొను నవిగావు. స్వాతంత్ర్య సంగ్రామమును ప్రారంభించిన గాంధి మహాత్ముఁడే ఆ పోరాటమును జరిపిన కాంగ్రెసుయొక్క ఆదర్శములను సంగ్రామానంతరము స్వరాజ్య పాలనములోఁ జేయవలసిన సంస్కారణలను నిరూపించియున్నాఁడు. ఇప్పట్టున సర్వ మానవులు సమానతా స్వాతంత్ర్యములకు హక్కు గలిగియున్నారని ప్రధాన

ధర్మమును మహాత్ముఁడు ఆదేశించినాఁడు. దీనిలో అన్ని ధర్మములును ఇమిడియున్నవి. ప్రజాప్రభుత్వములో నున్న అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు మున్నగు క్రైస్తవ దేశములలోను, భరతఖండమునందును ఈ ధర్మము వ్యర్థముగనే యున్నది. నీ సోదరుని నిన్నుగా ప్రేమింపు మను బైబిలు బోధయును, "శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః" అను గీతాబోధయును లోకమును మార్చలేకపోయినవి. మొన్నటివరకును ఇంగ్లండులో స్త్రీలకు పార్లమెంటుకు మెంబరుగ నిల్చుటకుగాని ఓటిచ్చుటకుగాని అధికారములేదు. స్త్రీకి ఇంగ్లండులో ఓటు అధికారమిచ్చినచో ఇండియా యేవగించుకొని ఇంగ్లండుపై తిరుగుబాటు సేయునని ఆంగ్ల మహానాయకులు లండనులో నిచ్చిన యుపన్యాసములను స్వయముగ విన్నాము. నేటివరకును అమెరికాలో నీగ్రోలకు దాస్యవిమోచన మాచరణయందు లేదు. కోట్లకొలది దిగువ జాతులు భరతఖండమునం దెట్టి స్థితియం దున్నారో మనకు తెలియును. అందుచేతనే మహాత్ముఁడు స్త్రీ పురుష భేదము లేక భారతీయు లందరికి సమానస్వత్వములను సమకూర్చుట యే స్వరాజ్యము సంపాదించిన వెంటనే చేయుదగినదని యాదేశించినాఁడు. స్వరాజ్యము వచ్చినవెంటనే యధికారమునకు వచ్చిన కాంగ్రెసు కేంద్రప్రభుత్వమును, రాష్ట్రప్రభుత్వములును స్త్రీలకుపురుషులతోబాటు పౌరస్వత్వము, వివాహము మున్నగు విషయములయందు సమాన స్వత్వములను గల్గించు చట్టములు చేసినవి. అటులనే దిగువ జాతులందరియొక్క స్వత్వములను రక్షించుటకును, పెంపొందించుటకును చట్టములు చేయుచున్నారు.

భారతజాతి దాస్యమునుండి విముక్తిచెంది స్వాతంత్ర్యమును బొందిన తరువాత మహాత్ముఁడు సూత్రప్రాయముగఁ జెప్పిన ధర్మమును విపులీకరించి యెట్లాచరణకు దేవలసినదియు "పరివర్తనము"న సూచింపబడినది. చేయవలసిన సంస్కరణము లన్నియు సంస్కరణ చట్టములుగ వ్రాసి చూపుట యొక పద్ధతి. వివిధ చట్టములను సెక్షనులుగ వ్రాసి చూపుటకు బదులుగ వివిధములైన అధ్యాయములుగ

వ్రాసి చూపుట రెండవ పద్ధతి. ఈ ధర్మము లన్నియు అధ్యాయ రూపమున గాని, సెక్షనుల రూపమునగాని వ్రాసి చూపినంత మాత్రమున అమలులోనికి రావు. స్వరాజ్యము వచ్చిన వెనుకకూడ పూర్వపు పద్ధతులే యమలులో నుండవలయునుగాని మార్పులు చేయకూడదను పూర్వాచారపరాయణులును, స్వార్థ పరు లు ను పెక్కురు నిరోధించక మానరు. స్వరాజ్యమును సంపాదించిన నాటి కంటె స్వరాజ్యోద్దేశములను ఆచరణలోనికి దెచ్చుటకే యెక్కువ త్యాగముల నెక్కువ కాలము చేయవలసియుండును. అందుచేతనే కాంగ్రెసువారు పార్లమెంటు సభ్యులై, మంత్రులై, ఉద్యోగులై చేయవలసినదానికంటె, ధర్మములను మహాజనులలో ఆచరణలోనికి దెచ్చుటకే ఎక్కువ కృషి చేయవలసియున్నదని మహాత్ముఁడు కాంగ్రెసు వారిని నిర్మాణ కార్యక్రమపరులనియు, పాలకవర్గమనియు రెండుగా విభజించి రెండుమార్గముల నేర్పరచెను. పాలకవర్గమున జేరిన వారందఱును అధికారకాంక్ష గలవారనియు, నిర్మాణకార్యక్రమము చేపట్టినంతమాత్రమున త్యాగశీలురనియుఁ జెప్పవీలులేదు. పాలకవర్గమున గూడ త్యాగశీలురైన సమర్థులు చేరనిది పాలనము సాగనే సాగదు. పాలకవర్గమునఁ జేరువారు కొన్నివేళల పెక్కుశోధనలకు లోబడవలసి వచ్చును. అందుచేత పాలకవర్గమున జేరుటకు ఎక్కువమంది కాకర్షణలున్నను ఆదర్శశీలురైన పెక్కురు మహానాయకులు ఉద్యోగముల స్వీకరించి ఆదర్శప్రాయముగ పాలనముచేసి చూపనిచో ఎక్కువ విపత్తు రాగలదు. కొంతవరకు కాంగ్రెసుప్రభుత్వము ఈ విషయమున దెబ్బతిన్నదని మనమెరుగనిదిగాదు. ఐనను మొత్తముమీద చాల మంది చక్కని మార్గముననే వర్తించి కాంగ్రెసుయొక్కయు, మహాత్మునియొక్కయు పేరుప్రతిష్ఠలు నిలువబెట్టిరనుటకు సందేహము లేదు. కాని నిర్మాణ కార్యక్రమమునకుఁ బూనినవారిసంఖ్య తక్కువయైనది. అందుచేతనే మద్యనిషేధము మున్నగు చట్టములు తగురీతిగ విజయవంతములు కాజాలకపోయినవి. కాంగ్రెసేతరులైన ఉద్యోగులు గూడ పెక్కుమంది బ్రిటిషుపాలనమున తాము గడించిన యనుభవ

మును కాంగ్రెసుయొక్క సేవకు సమర్పించి ఆదర్శప్రాయముగ వర్తించి కాంగ్రెసు విధానమును విజయవంతము గావించి భారతజాతికి మహా సేవ యొనర్చిరి.

పరివర్తన గ్రంథమున ఇదివరకు కాంగ్రెసు పోరాటమున సేవ యొనర్చినవారు మాత్రమే యీమహాకార్యమునకు చాలుదురని యనుకొనుట తప్పని స్పష్టముగ నిరూపింపఁబడినది. ఇదివరకు కాంగ్రెసులో జేరనివారును, నూతనముగ విద్యను గడించిన విద్యార్థికులైన యువకులును లక్షలాదిగ దేశసేవకు ముందంజవేసి ప్రతి గ్రామమునందును కాంగ్రెసుసేవ యొనర్చుట యవసరమని స్పష్టీకరింపఁబడినది.

పై నుదహరించిన యొకటి రెండు రకముల గ్రంథములేగాక స్త్రీ పురుషులును, పిన్నలును, పెద్దలును దేశసేవలో దుమికి మహా త్యాగము లొనర్చి ఆదర్శప్రాయముగ దేశ సేవ చేసిన పాత్రలను సృష్టించి నవలా రూపమున ఒక మూడవరకపు గ్రంథమును రచించి దేశీయులను సేవకు పురికొల్పినా డీ గ్రంథకర్త. ఆదర్శప్రాయములైన పాత్రలు అద్భుతముగ సృష్టింపఁబడినవి. రాజశేఖరరావను పురుష పాత్రను, శాంతమ్మ యను స్త్రీపాత్రను సృష్టించుటలో నవలాకారుఁడు గొప్ప సామర్థ్యమును జూపినాడు. వారి త్యాగమును, శీలమును అద్భుతముగ జిత్రింపఁబడినవి. రాజశేఖరరావును గాంధిమహాత్ముని ప్రతిరూపముగ సృష్టించినాఁడు. ప్రేమగుణముయొక్క మహత్త్వము శత్రుహంతకునిలో నెట్టి హృదయపరివర్తనము గావించునో చూపించుటచే మహాత్ముఁడు తన మహోద్యమమునకు మూలసూత్రముగ గ్రహించిన అహింసాత్మక సత్యాగ్రహముయొక్క మహత్త్వము ప్రకటింపఁబడినది. మహాత్ముని ప్రేమసూత్రమునకు గ్రంథమంతయు నొక మహాభాష్యముగ పరిణమించినది. ఈ పరివర్తనము నవ్యభారత జాతిని సృష్టింపగోరు నుత్తమ సేవికాసేవకులందఱి చేతులలో నుండదగినది. వారు దీనిని నిత్యపాఠ్యగ్రంథముగా స్వీకరింప నవసరము.

శారదానికేతనము, గుంటూరు
15—12—1955

వున్నవ లక్ష్మీనారాయణ

# సమీక్ష

ప్రతిభావ్యుత్పత్తులు, శక్తిసామర్థ్యములు అన్నియు నుండి అవకాశహీనులై అంతరించి కాలప్రవాహమున గాలిబుడగలవలె కొట్టుకొనిపోయిన మహా మేధావులలో గోనుగుంట పున్నయ్యగారుకూడ నొకరు. అన్నిహంగులు నుండి ఎట్టి ప్రక్కవాద్యములు లేని పాటగానిని మనసార మెచ్చుకొనలేని యీ మొండి లోకములో ప్రచారమన్న నసహ్యించుకొను పున్నయ్యగారివంటి నిరాడంబర కవి కుచితమగు గౌరవము లభింపలేదన్నచో నాశ్చర్యపడనక్కఱలేదు. బ్రతికినంతకాలమును పరాధీన లేఖినీచోదకుడై అక్కఱకురాని యుద్యోగపు టరవచాకిరితో జీవితమెల్ల భయంకర కాళరాత్రిగా వేగించిన నిస్పృహుడీ కవి.

చిన్నతనమున ఉన్నతపాఠశాలలో నేనాలుగుముక్కలు నేర్చికొనినాడో కాని, కళాశాలా ప్రాంగణమునకైన నడుగుపెట్టుటకు నోచుకొనని యీ పేదకవి పదునెనిమిదేండ్లైన నిండని పసరుప్రాయముననే కడుపుకక్కుఱితికై యుద్యోగపు పద్మవ్యూహమున చిక్కుకొనుటచే రసికలోకమునకే తీరని యన్యాయము జరిగినది. అయినను అధికారుల మెప్పునకై రాత్రింబవళ్లు చిత్తము శరీరము వొంటిగ నంటగట్టి చేసిన సేవావృత్తిలో నీత డనుభవించిన నరకబాధయే ఒక మనోహర ఖండకావ్యమై వెలసినది. దాస్యశకటము నీడువతరముగాక పడుచు లేచుచునున్న యీతనిపయినిగూడ ఏలికలచేతి కొరడాలు జాలిగొనలేదట! చూడగా, చూడగా నుద్యోగమే యీతని కొక పెద్ద పిశాచమై కనిపించినది. నిముస మన్యార్థమేగిన నిర్దయమగు నీ పిశాచము కోపించునేమోయని "అనుకూలయైన యిల్లాలి ప్రేమఫలము తృప్తితీఱగా నారగింప" వెఱచినాడట! "హృద్యంగమాంధ్ర సాహిత్య చంద్రికలందు స్వేచ్ఛానుగతి విహరింప" లేకపోయినాడట! అంతేకాదు; "సరసముగా మ్రోల సాక్షాత్కరించిన కైతతోకూడ కేల్కేలు కలుప" లేదట!

"యౌవనదాస్య గేహమున క్రగ్గి రగిల్చి దురంత దాస్య పూ
జావిధి లావులెత్త వెతజల్లితి, జీవిత పశ్చిమార్ధము
దేవి యమూల్య రత్నమటు లీ వెనువెంట మెసంగుచున్న స
ద్భావముతోడ; నేడు గనవచ్చె సమాధి శిలల్ ఫలంబులై"

[పున్నయ్యగారి "స్వప్నసందేశము" నుండి]

అని లోలోన కుమిలి కుమిలి కృశించుచు నలుబదియేడేండ్ల జీవితములోని పశ్చిమార్థమంతయు నెట్లో వెళ్ళబుచ్చినాడు. చివరకు సమాధిశిలలే ఫలములై మిగిలినవి.

## నవల రచన

సాహిత్య వ్యవసాయముతోడి సంబంధములేక కేవల సేవావృత్తియందు గంతగట్టిన గానుగయెద్దులకుబోలె తలవంచుకొని తమదారిని తాము పోయెడు సామాన్యులకు కాలికడ్డముదగిలిన వస్తువునైనను పరామరిసించు జ్ఞానముండదు. కాని పున్నయ్యగారీ తెగకుజెందిన గతానుగతికుడు గాడు. కనిపించిన ప్రతివస్తువును, ప్రతిమానవుని కంటిచూపానినంతవఱకే కాక బుద్ధినైశిత్యము ప్రసరించినంతమేర పరిశీలించెడి పరమలోకజ్ఞుడు. లోకములోని యానంద విషాదములకును సుఖదుఃఖములకును సానుభూతిస్పందము పొందగల ఉత్తమ మనస్వి. అందువలననే అస్యభూమికయందు సతమతమగుచుండియు సాహిత్యముతోడి సంబంధము కల్పించుకొని కవి కాగల్గినాడు.

ప్రభుత్వోద్యోగమునందు సహకారశాఖలో (Co-operative Dept.) దీర్ఘకాలము పనిచేసినవాడగుటచే నీతనికి ఆంధ్రదేశమునందలి పెక్కు గ్రామములు బాగుగా పరిశీలించు నవకాశమేర్పడినది. భారతదేశమందలి గ్రామము లెంత దుస్థితిలో నున్నదియు చక్కగా తెలిసికొనినాడు: గ్రామసౌభాగ్యమే దేశసౌభాగ్యమని మహాత్ములు పల్కిన పల్కులలోగల సత్యమును అనుభవపూర్వకముగా గ్రహించినాడు. గ్రామ పునరుద్ధరణ మార్గము సూచించు రచనలు తెలుగులో మృగ్యమగుట చేతను సమాజనిర్మాణమునకును, సంఘసంస్కారమునకును సాహిత్యము పరమసాధనమని విశ్వసించియుండుట చేతను, ఏతద్భావ పరివర్తనముగా "పరివర్తన" మను నీనవలను పున్నయ్యగారు రూపొందించినారు. సహకార సంఘములు, పంచాయతీ పరిపాలనము, గ్రామ పునరుద్ధరణము - మున్నగాగల యీ ముడిపదార్థమును నవల రచనా శిల్పములో నొదిగించుట యన్న అంతంతమాత్రమైన పనిగాదు. అయినను శిల్పి క్రియానైపుణ్యము సాధన పరికరముల అవధులు దాటి సిద్ధధ్వజమెత్తునుగదా! నవల రచనలో పున్నయ్యగారికి తొలిమలిప్రయత్నములు రెండును నిదియేయైనను నవలశిల్పమున కెట్టిలోటును రానీయక సిద్ధధ్వజమే ఎత్తినాడు.

## పాత్రచిత్రణము

రాజశేఖరుడు ఒకప్రక్క సరియైన ఉద్యోగము దొరకక, మఱొకప్రక్క తాను చిన్ననాటినుండి ప్రేమించిన శాంతను కులమర్యాద ననుసరించి యొకని కిచ్చి పెండ్లిసేయగా భగ్నమనోరథుడై తల్లిదండ్రులకైన జెప్పక ఇల్లువిడచి యుద్ధములో చేరి మృత్యువుకోరలలో నానినాని బైటపడి దేశదేశములు తిరిగి ఏకలవ్యన్యాయమున గాంధీచరణసేవాదీక్షితుడై తానొనర్పదలచిన మానవసేవకు తనజన్మగ్రామమగు వేములపల్లె ప్రథమరంగము గావింపదలచి మహాత్ముని సిద్ధాంతప్రాతిపదికపై ఆ గ్రామమునందు నిత్యనూతనమగు నొక పరివర్తనము గొనితెచ్చుటయే ఈనవలయందలి ప్రధానమగు నితివృత్తము. ప్రాసంగికముగా నవల కథాశరీరమైన

కనువగు ననేక సన్నివేశములు, భిన్నప్రవృత్తులుగల పాత్రలు చిత్రింపబడినను, నవలయంతయు చదివి యావలబెట్టినతరువాత పఠితమనస్సుపై శాశ్వతముద్రవేయగల పాత్రలలో నాయికానాయకులగు శాంతారాజశేఖరులు, అలివేణి, రమణారెడ్డి, పుల్లయ్యపంతులు - ఈపాత్ర లతిముఖ్యములు. అట్లగుటచే రాజశేఖరుని తలిదండ్రులగు సీతమ్మ కోదండరామయ్య, శాంత తలిదండ్రులగు లక్ష్మమ్మ, వెంకటరెడ్డి, శాంత అన్నయగు రాఘవరెడ్డి, అతనిభార్యయగు తాయారమ్మ- మొదలగు పాత్రలకు ప్రాధాన్యము లేదనికాదు. ఎంతటి చిన్నపాత్రనైనను ఒకటి రెండు మాటలతో స్వభావనిరూపణము గావించి జీవకళ తొణికిసలాడు బొమ్మవోలె కన్నులముందాడింపగల అమోఘశక్తిగలవాడీ రచయిత. పెండ్లియైనకొద్ది కాలమునకే, లోకోత్తర సౌందర్యవతియగు శాంత నెత్తిపై నిప్పులుచల్లి అవతారము ముగించిన చంద్రారెడ్డి పాత్రను ప్రవేశపెట్టు ఘట్టమొకటి చూచిన రచయిత పాత్ర చిత్రణశక్తి వ్యక్తముగాగలదు. "చంద్రారెడ్డి బి. ఏ. అనిపించుకొన్నవాడ"ట. ధనవంతు డగుటచే కాబోలు ఒక్కొక్క తరగతి రెండుమూడేడులు చదివి గట్టిచేసికొనుచు నిరువదినాలుగేండ్లకు బి.ఏ వఱకు బెటపెట లాగినాడట. బి. ఏ. పూర్తియగుటకు ముప్పదేడులు పూర్తియగు సూచనలు కన్పించుటచే నంతటితో చదువునకు స్వస్తిచెప్పినాడట! ఇక చదువు మదరాసులో నగుటచే శీలము పరామర్శించుట కవకాశమే లేకపోయినది; మనకేకాదు, పిల్లనీయదలంచిన వెంకటరెడ్డిగారికి కూడనట! మఱి రూపమో! దానినిగూర్చి చెప్పనక్కఱలేదు. "మునిబండ్లు కొంచెమెత్తే! కొంచెమననేల! రెండుపెదవులు కలియనంత"యట! దేహమునిండ రోమజాలము పెఱిగి పొట్టిగానున్న యాతడొక చిన్న ఎలుగుబంటి వలెనే యుండును. అయినను ఆడుపిల్ల తండ్రిగావున వెంకటరెడ్డిగారెట్లో సమాధానపడి శాంతనిచ్చి వివాహము గావించినాడట. నిజమున కీచంద్రారెడ్డి నవలయందెచ్చటను పల్లెత్తి మాటాడినదిలేదు. అయినను అతని రూపము మాత్రము మఱచుట పఠిత కసాధ్యము.

పుల్లయ్యపంతులు, రమణారెడ్డి—ఈ రెండుపాత్రలు రెండు భిన్నధర్మముల ప్రతిపాదనకొఱకై సృష్టింపబడినవి. వేములపల్లి గ్రామముయొక్క పుట్టుపూర్వోత్తరములు తెలిసిన డెబ్బదియేండ్ల బోసినోటి పుల్లయ్యపంతులు పల్లీజీవనమన్నను ప్రాచీన సంస్కృతియన్నను పడిచచ్చెడి డొక్కశుద్ధిగలైన మొండిఘటము. పూర్వాచారపరాయణుడు. పిడివాదమునకు మొనగాడు. కాలక్షేపము కానప్పుడు కల్పతరువువంటివాడు.

ఇక రమణారెడ్డియన్ననో పల్లీజీవనపు పొడయే కిట్టని శుద్ధనాగరకుడు. దట్టముగాపట్టిన ఇంగ్లీషునాగరకతతో నోరార తెలుగుకూడ మాటాడలేని మూర్ఖుడు. ముడుపు కోసమో ముద్దరాలికోసమో యని వేములపల్లికి ఇల్లఱికము వచ్చిన విజయవాడ నివాసి. ఈతనినంతయు కార్యరూపము తాల్పలేని కేవల దంభసంస్కారము.

మాటలాడునపుడు పుల్లయ్యపంతులు "దేవుడు మేలుచేస్తే" అను నూతపదము (Mannerism) లేకుండ మాటాడలేనట్లే యీతడుకూడ "మైగుడ్ గాడ్" అను నూతపదము లేకుండ ఇంగ్లీషు కలియని స్వచ్ఛమైన పది తెలుగుమాటలుకూడ మాటాడలేడు. ఈ యిరువురును సిద్ధాంతచర్చకు దిగిరో ఉత్తర దక్షిణ ధ్రువములకుబోలె నెడమొగము పెడమొగమైపోవుదురు. "బస్తీలో మనసు బిగబట్టలేకపోయినా మాట బిగబట్టాలి. మనసులో మాలిన్యం, ముఖంలో నైర్మల్యం, అడుగడుక్కూ నమస్కారాలు, అకారణమందహాసాలు, ఎదుటివాడికొంప ఎలా తీస్తామా అనే ఎప్పుడూ ఆలోచనలు - ఇదే బస్తీనాగరికత, సభ్యత, మీ నీతీ సంస్కృతీ నాదగ్గర చెప్పబోకు. దేవుడు మేలుచేస్తే......" అని పుల్లయ్యపంతులు తాఁస్థాయి నందుకొనుచుండగా రమణారెడ్డి "మైగుడ్ గాడ్ నీవూ, నీ సిద్ధాంతాలూ మ్యూజియంలోగాని ఇంకెక్కడా పనికిరా"వని ఒక్కమాటలో త్రుంచివైచుచుండువాడు. కాని గ్రామపునరుద్ధరణ దీక్షాకంకణుడగు రాజశేఖరుడు మాత్రము ఇటు పుల్లయ్యపంతులునుగాని, అటు రమణారెడ్డినిగాని ఎవ్వరిని త్రోసిరాజనక కలిసికట్టుగా గ్రామము నొక్కత్రాటిపై నడిపింపవలయునని స్థిరసంకల్పుడైనవాడు. రమణారెడ్డివంటి యువకులను కలుపుకొని పంతులువంటి వయోవృద్ధుల అనుభవముల నుపయోగించుకొని సంస్కరణ సాగించిన అనతికాలములోనే గ్రామము బాగుపడునని యాతని అభిప్రాయము. కాని దుష్టబుద్ధియైన రమణారెడ్డి కలసివచ్చినట్లే కనిపించుచు, గంగానదివలె పవిత్రయగు శాంతతో పొందుగోరి తనదారికి రాజశేఖరుడే అడ్డని భ్రమపడి యాతని నెట్లైన సాధింపవలయునని ప్రక్కప్రక్కగా ఆలోచనలు సేయ నారంభించినాడు. ద్వేషము కప్పిపుచ్చగల సామర్థ్యమే యితనిలోని ముఖ్యవిశేషము.

ఇక ఈతనిభార్య అలివేణి - చూడచక్కని చిన్నది. భర్త యిల్లటికమునకు వచ్చిన తొలినాళ్ళలో ఏమైన సుఖమనుభవించినదో లేదో కాని రానురా నాతనితోడి కాపుర మామెకు నరకప్రాయమై పోయినది. చివరకు తెగించి మాటకుమాట వడ్డించు స్థితికికూడ వచ్చినది. స్ఫురద్రూపియైన రాజశేఖరుడువచ్చి తనమగనితో మాటలాడుచుండగా సమయమునకు కాఫీ సిద్ధముచేయలేదని మగడు మండిపడి "ధూ ముండమోపి" యని నోరు పారవేసికొనగా "అంతభాగ్యమా నాకని" మెల్లగా వడ్డించి యూరకున్న యిల్లాలామె. కామమోహిత నేత్రములతో రమణారెడ్డి శాంతాదేవిని కనిపించినచోటనెల్ల వెంటాడినట్లే అలివేణికూడ రాజశేఖరునింటికేపోయి అతనిని వేటాడసాగినది. రమణారెడ్డి పైలా పచ్చీసుగా తిరుగ నేర్చిన బస్తీబిడ్డగావున ప్రారంభదశలో తన స్వభావమును పొక్కనీయక గుట్టుగా మసలుకొనినాడు. అలివేణి కా నైపుణ్యము కొఱవడుటచే రాజశేఖరునితో మొదటనే కొంచెము మోటుగా ప్రవర్తించినది.

శాంతతోడి నెయ్యము సాధింపవలెనన్నచో తఱచుగా నామెయింటికి పోవు వసతి యేర్పడవలయును. అందుకై రమణారెడ్డి శాంతయన్నయగు రాఘవ

రెడ్డితో వరుసలుకల్పుకొన మొదలుపెట్టినాడు, "రాఘవరెడ్డి భార్య తాయారమ్మ తనకు పినతండ్రి (పెదతాతకుమారుడు) వదినె (భార్యసోదరి గారి తోడికోడలికి చెల్లెలి కూతురట - అనగా తాయారమ్మ తనకు చెల్లెలివరుస - సారాంశము ! శాంతాదేవి తనకు మఱదలు. శాంత తనకు లొంగకపోయిన కొలది అతనికి రాజశేఖరునిపై ద్వేషము వృద్ధియగుచున్నది. శాంత తండ్రియగు వెంకటరెడ్డి గారి జ్ఞాతివర్గములోనివారగు పాపిరెడ్డిని హనుమరెడ్డిని ఉసికొల్పి శాంతా రాజశేఖరులకు సంబంధముగలదని ధ్రువముచేయ మొదలుపెట్టెను. రాజశేఖరుని బోధనాపద్ధతులలో పంచాయతీ పరిపాలనము - మహిళాజనోద్ధరణము - హరిజనవాటికా సంస్కరణము - మున్నగు కార్యక్రమములలో కుటుంబజీవితమున పొందలేని అనిర్వాచ్యమగు నానందమునను భవించుచున్న శాంతాదేవిసంకల్పబలమును ఇంటిలో తాయారమ్మ ఒఱగొడ్డెములుగాని యూరిలో రమణారెడ్డిబృందము నాడిపోతలుగాని యించుకయు సడలింపలేకపోయెను. రమణారెడ్డి తడబడుచు తానువ్రాసిన ప్రేమలేఖను శాంతచేతి కందించునపుడు మహిషాసురమర్దనివలెనైన యామె వాలకమున కాత డదరుకొని తిరిగి నోరెత్తక బైటకు బరుగెత్తిపోయినాడు. అయినను కొంతదూరముపోయి ప్రాణముచేదుకొని "After all she is a country widow" కాని యీ రాజశేఖరంగాడిది పెద్దయిబ్బందయింది. వీణ్ణి ఎలిమినేట్ చేస్తేగాని లైన్ క్లియర్ గాదు. కానీచూస్తాం" అని గిరీశంపంతులుగారితో గొంతుకలుపుకొని పలుకుకొనును. గిరీశం "డామిట్ కథ అడ్డంతిరిగింది" అని మెల్లగా సర్దుకొని పోవుఘటము; వీ డట్లుగాదు. "ట్రై ట్రై ఎగేన్" అని రాబర్టు బ్రూసును స్మరించుకొని క్రొత్తప్రణాళిక సిద్ధముచేయు రకము. తుట్టతుదకొక వెన్నెలరాత్రి శాంతాదేవి హరిజనవాటికనుండి యొంటరిగా వచ్చునపుడు అదేసమయమని రమణారెడ్డి యామెను బలాత్కరింపబోగా నామె విద్యుల్లతవోలె దుర్నిరీక్ష్యమై చెప్పు కాలితో నాతనికిబుద్ధిచెప్పి పోయినది. బురదగుడ్డలతో మెల్లగా లేచి నడుములు విఱుగనందుకు మాత్రము సంతోషపడుచు నింటికిపోయినాడు. పాదరక్షలేక యుత్తపాదముతో తన్నియున్న బాగుండెడిది. శాంతా పదపల్లవమైన నాతని మేన సోకినచో "నను భవదీయదాసుని మనంబున నెయ్యపుకినుకబూని తాచినయది నాకు మన్ననయ" యని తిమ్మన్నగారి కృష్ణునితోపాటు తానును తృప్తిపడి యుండెడివాడట ! అతని జాతకమున నాయదృష్టము లేదని రచయిత చాల విచారపడినాడు.

## సంస్కరణదృష్టి

"భూతవర్తమాన కాలములను సమన్వయపఱచుకొని భవిష్యత్తును చూచుచు పురోగమించుటే, బాగుపడదలచిన యే జాతికైనను కర్తవ్య" మని మనః పూర్వకముగా విశ్వసించినవాఁడీరచయిత. సర్వమానవ సౌభ్రాత్రమే మానవుని

కైక్షైక మతముగావలెనని రుచిరస్వప్నముగాంచు విశాలహృదయమాయనది. అంతే కాదు ! క్రొత్తప్రాతలను మేళవించి నూతనమార్గమును సృష్టింపగల సమన్వయ దృష్టి కూడ కలవాడు. ఈ భావములన్నియు నీ నవలలో నడుగడుగునను కన్పించుచునే యున్నవి. రచయిత తన యమూల్య భావనిక్షేపమంతయు కరగ బోసి మనోహరమూర్తిని సృష్టింపగా వెలసినవాడే రాజశేఖరుడు. భగ్నమనోరథుడై రాజశేఖరు డింటినుండి వెడలిపోయిన తరువాత యుద్ధములోచేరి ఎట్టి కోటనుండి బైటపడువఱకు నాతడు పొందిన వివిధానుభవములే అతని మనఃపరిణామమునకు కారణభూతములైనవి. "చేతులార తానెన్నో జీవములు తీసినాడు. పీనుగు గుట్టలమీదుగా నడిచివచ్చినాడు. నిజమునకు ఒక్కొక్కసారి మృత్యువాతనిని చప్పరించి విడిచినది." భయంకరమైన యీవాతావరణమునుండి బైటపడి కనువిప్పు కలిగి ప్రపంచమంతయు పర్యవేక్షణ చేయగా మానవజాతి నుద్ధరించుటకు మహాసాధనము మహాత్ముడు బోధించిన సేవామార్గముతప్ప మఱొకటి లేదని స్ఫురించినది. ఆ దృష్టితోనే స్వగ్రామమైన వేములపల్లిలో నడుగుపెట్టినాడు.

ఎనిమిదేండ్ల క్రిందట తాను యుద్ధములో చేరబోయినపుడు వేములపల్లి ఎట్లున్నదో తాను వచ్చిన తరువాతకూడ నెదుగుబొదుగు లేక యట్లే యుండెను. ఊరంతయు నే మూల చూచినను మురికిగా నుండి రాదారి సౌకర్యమే లేకపోవుట, ఒకపాఠశాలగాని, ఆసుపత్రిగాని గ్రంధాలయముగాని లేకపోవుట, రైతుల భూములన్నియు చీలికలుగా నుండుట, కూలీలకు కూలి చాలకపోవుట-ధరలు పెరిగిపోవుట, ప్రజలు ఋణబాధతో కూలిపోవుట - ఒక టేమి ? అంతయు అధ్వాన్నముగనే యుండెను. ఈ బాధలన్నియు తొలగించి గ్రామమును బాగుచేయవలెనన్నచో పంచాయతీ పాలనము, సహకార సంఘము నెలకొల్పవలయును. ఈ రెండును ప్రారంభింపవలయునన్న ఊరివా రందరును కలిసి రావలయును. మఱి గ్రామములో తరతరములుగా పాతుకొనిపోయిన పార్టీ కక్షలో ! ముందు వీనిని నిర్మూలింపవలె ననుకొనినాడు. యువకబృందముతో గూడి ఊరిలోని కక్షిదారులకు మెత్తని మాటలతో నచ్చజెప్ప జూచినాడు. లాభము లేకపోయినది. చివరకు మహాత్ము డిచ్చిన నిరశనవ్రత మహాయుధమునే ప్రయోగించి విజయము సాధించినాడు. రాజశేఖరుడు సత్యాగ్రహతత్త్వమును బాగుగా గ్రహించినవాడు "Satyagraha is the vindication of truth not by infliction of suffering on the opponent but on one's self" "An implicit trust in human nature is the very essence of its creed" మహాత్ముని ఈ సత్యాగ్రహ నిర్వచనము నణువణువు పరిశీలించి అనుభవపూర్వకముగా అర్థము చేసికొనినాడు. అందువలననే రమణారెడ్డి తనను కమ్యూనిష్టని నిరూపించి పోలీసులచే బంధింపనెంచినపుడుగాని, తనకును శాంతకును సంబంధము గలదని యపవాదు వేసినప్పుడుగాని రాజశేఖరుని కాతనిపై జాలిగలిగినది కాని ద్వేషము జనింపలేదు. "ద్వేషము అజ్ఞానమువల్ల కలుగును. దానినే ద్వేష్ట

మందుము. ఈ దౌష్ట్యము పలుచబడినకొద్ది మానవత్వము బయటకు వచ్చును" అని రమణారెడ్డితోనే రాజశేఖరుడు పల్కినాడు. మానవత్వముపై నీతనికి గల అంచచల విశ్వాసము ఈ మాటలవలన తెలియుచున్నది.

నిజమునకు రాజశేఖరుడు సామ్యవాదము (Cummunism) లోని వ్యక్తి స్వాతంత్ర్యమును పూర్తిగా శంకించిన మానవవాది (Humanist). ఈషికమగు భౌతికసంపదతో మాత్రమే తృప్తిపడి కేవలపదార్థవాదిగా మిగిలిపోయిన సామ్య వాదిపట్ల రాజశేఖరుని కేమాత్రము సానుభూతిలేదు, ఆధ్యాత్మికమైన పరిపక్వత రానిదే భౌతికమైనఅభివృద్ధి యెంతవచ్చినను ప్రయోజనములేదు. సామ్యవాదములో మానవత్వము మలినముగనే యుండును. ఆత్మను దర్శింపలేని మానవునకు శాశ్వత సుఖము లభించు. అందువలననే ఆత్మ దర్శనమునకుగాని ఆధ్యాత్మిక విజ్ఞానమున కుగాని మానవవాదవిధానమే శరణ్యమని నమ్మినాడు.

రాజశేఖరుని వాదవిధానములో సనాతనాధునాతన భావములకు ఒక మధ్యేమార్గము ద్యోతితముగాగలదు. ప్రాచీనాచారములను సంప్రదాయములను ఆరోగ్యసూత్రములతోడను, సంఘవ్యవస్థతోడను సమన్వయించు నవ్యదృష్టి ఈతనిలో కన్పించును. ఈతని విశాలదృష్టిలో శాస్త్రద్రష్టలైన ఋషులకును సమాజశ్రేయమునకై శాసనముల సృష్టించిన రాజారామమోహనరాయ్, హర విలాస్ శారదావంటి సంస్కర్తలకును నంతగా భేదములేదు. కాలానుగుణముగా ధర్మములు సైతముమాఱిపోవునని వెంకటరెడ్డిగారికి రాజశేఖరుడునచ్చచెప్పినాడు

శాంతతో సంభాషించుచు వ్యక్తులశ్రేయస్సు, సౌఖ్యము ఆలోచింపని ధర్మ సూత్రములు ఎక్కువకాలము నిలువవనియు, వితంతువుల శీలపతనమే యిందుకు తార్కాణమనియు, అందువలననే ఏవిషయమైనను కేవలతర్కబలముమీద కాక అనుభవమీదనే నిర్ణయించుకొనవలెననియు చెప్పినాడు. ప్రాచీన సంప్రదాయ ములలో వితంతువునకు ముండనాదికమేర్పఱచుట వారిలో నింద్రియచాపల్యము నరికట్టుకేయనియు సమర్థించినాడు. వారిలో సంయమనములేనిచో పెండ్లిచేసి కొనుటే మంచిదని వాదించును. కాని యింద్రియవిజయము సాధింపగల్గినచో పాశ్చాత్యదేశములందలి నన్నులకు నర్సులకు (Nuns and Nurses) వలనే మన దేశములోని వితంతువులుకూడ మానవసేవయందు జీవితము ధన్యముగావించుకొన వచ్చునని మహోత్తమమగు మార్గమును సూచించినాడు.

తలచెడిన శాంత కీమార్గమే యనుసరణీయామైతోచినది. రాజశేఖరునిపై ఆమెకు భక్తిప్రపత్తులు కుదురుకొన్నవి రాజశేఖరుడుకూడ నామెశక్తిసామర్థ్యములు గ్రహించి పంచాయతీ పరిపాలనమునకామె నర్థ్యక్షురాలిని జేసినాడు "శుభమంటూ పంచాయితీ పెట్టి వైధవముండను ప్రెసిడెంటుచేశావే" అని వెక్కిరించిన పుల్లయ్య పంతులును ఒకటిరెండు మాటలుచెప్పి ఒప్పించినాడు. ఒకప్రక్క పంచాయతీ పాలనమువలన గ్రామస్థులలో పౌరత్వజ్ఞానము రేకెత్తించి మఱొకప్రక్క నానార్థ

సహకారసంఘములు (Multi purporse Societies) వల్ల ఆర్థిక సౌష్టవముసమకూర్చి వేములపల్లి గ్రామస్వరూపమునే మార్చివైచినాడు. కులమత భేదభావ నిర్మూలనము, హరిజనసేవ, మద్యపాననిషేధము, స్త్రీజనోద్ధరణము మొదలగు నెన్నింటినో ప్రవేశపెట్టి ప్రజలందఱను సంస్కారోన్ముఖులను గావించినాడు. యువకుల మెడలపై కాడి వైచినగాని గ్రామములు బాగుపడవని "స్వచ్ఛంద యువక సేవాదళము" నొకదానిని నిర్మించి ప్రజలకు కృషిగౌరవమన్న (DignitY of Labour) నేమిరో యర్థమగునట్లు చేసినాడు.

ఈ నవల యొక్కసారి చదివిచూచినచో గ్రామాభ్యుదయమునకు అనుసరింపవలసిన మార్గములేవియో, ద్వితీయపంచవర్ష ప్రణాళికనాటికి కాకపోయినను తృతీయ పంచవర్షప్రణాళిక నాటికైనను ప్రజలందఱకు చక్కగా నవగతము గాగలదు.

నిత్యకళ్యాణము పచ్చతోరణముగా కళకళలాడుచున్న వేములపల్లిగ్రామ దృశ్యము తలపున బాటినంతనే భారతదేశమునందలి గ్రామములన్నియు నిట్లున్నచో నింక కావలసినదేమి యని పఠిత విచారింపక మానడు.

## నవలశిల్పము

శిల్ప మనగా అనిర్వాచ్యమగు నేదోయొక బ్రహ్మపదార్థము గాదు. సాహిత్యపరముగా అర్థముచెప్పుకొనవలయునన్న "ఆ యా సన్నివేశములను, ఆ యా పాత్రలను ఆవరించియున్న రామణీయకము కన్నులకు గట్టినట్లు వ్యక్తీకరించుట" యనిచెప్పవచ్చును. నవల శిల్పమని (Technique of the Novel) చెప్పినపుడు కథాసూత్రము ముడివిప్పుట, పాత్రస్వభావ తారతమ్య నిరూపణకును, రసపర్యవసాయిత్వమునకును పరస్పర ప్రతియోగ ఘటన (action and counter action) కల్పించుట, పఠితను తుదముట్ట నొక్కబిగిని పట్టిచదివించుట మున్నగు వానియందు రచయిత ప్రదర్శించిన నైపుణ్యమని యర్థము. వీనిలో పఠితనుపట్టి చదివించుటయన్నది చాలముఖ్యమైనది. కథాకథనమునందు సందిగ్ధత (Suspense) యన్నదిలేనిచో పఠిత నాకర్షించుట కష్టము. ఈ యాకర్షణ మీ నవలలో నెక్కడను కొఱవడలేదు.

యుద్ధమునుండి తిరిగివచ్చిన రాజశేఖరుడు చిన్ననాటి నెయ్యమును స్మరించుకొనుచు శాంతతో తిరిగి ప్రణయకలాపము ప్రారంభించునా యన్నదే యిందలి కథలోనిసందిగ్ధత. ఈ యనుమానము పఠితకేకాక శాంతకుకూడ కలదు. ఇంద్రియ నిగ్రహము లేనప్పుడు వితంతువు వివాహ మాడుట తప్పులేదని రాజశేఖరుడు శాంతతో ప్రసంగించుచు "నీవు నిజముగా వితంతువైతివా" అని యడిగిన ప్రశ్న గుర్తునకురాగా నాతనిగూర్చి యామె కలతపడ జొచ్చినది. రాజశేఖరున కింకను తనపై వలపుగలదా! ఛీ, అట్టి పవిత్ర త్యాగమూర్తికా! తానెంత పొరపడెను.

నిజమునకు తనకుమాత్ర మాతనిపై నాసక్తిలేదా ? ఈవిధముగా నామె యాలోచనలు చిక్కుపడిన దారమువలె జరిగిపోయినవి.

శాంతారాజశేఖరుల జీవితరంగములో రమణారెడ్డి, అలివేణి క్రమముగా నడుగు వెట్టుటతో కథాసూత్రము కొంచెము పొడుగుసాగినది. గ్రామపునరుజ్జీవన నిర్మాణ కార్యక్రమమునుగుఱించి ప్రశాంతముగా నాలోచించుకొనుచు, నింటిలో గూర్చున్న రాజశేఖరునితో అలివేణి తనకాపురపుగుట్టంతయు జెప్పుచు 'చేతిలో చేయివేయు' మని యాతనితనుస్పర్శ కాంక్షించినది. అతడూపిరి సల్పుకొనకముందే "ప్రాంచద్భూషణబాహుమూలరుచులతో పాలిండ్లపొంగార" ఉప్పెనవలె పైబడి బంధించినది. ఆ బాహుబంధమునుండి ఎట్లోబైటపడి రాజశేఖరుడు జాగరూకతతో తానంతవఱకు కాపాడుకొనుచువచ్చిన బ్రహ్మచర్యమునకు మైల సోకెనని లోలోన కుమిలిపోయినాడు. అలివేణి అజ్ఞానమునకు జాలిపడినాడే కాని యామెను పల్లెత్తిమాటయైన ననలేదు. పైగా నామె అట్లు చేయుటలో తన తప్పు కూడ కొంతయున్నదని భావించి ఆకర్షకమగు తనరూపమంతయును మార్చి కావి గుడ్డలు కట్టుకొనుమ గడ్డము మీసములు పెంచుకొనినాడు. ప్రాచీనులు సన్న్యాసపద్ధతి నవలంబించి కావిగుడ్డలు కట్టుకొనుటలోగల యర్థమిదియే యనియు సమర్థించినాడు.

నిర్మాణకార్యక్రమ పురోగతికై రాజశేఖరుడొకప్రక్క - అతనిమార్గమవరోధించుటకై రమణారెడ్డి బృందమొకప్రక్క - నిలిచియుండుట నవలలో పరస్పర ప్రతియోగఘటన కనుకూలించినది. ఈ సందర్భమున అలివేణి రాజశేఖరునిపైగల వలపువలన నవలలో నద్భుతరసమునకు కారణభూతురాలైనది. రమణారెడ్డిబృందము రాజశేఖరు నంతమొందించుటకై పన్నిన కుట్రయంతయు విని యతనికే ప్రమాదము రాకుండ నేర్పాట్లన్నియు చేసినది అలివేణియే ! ఈ ఘట్టముననే కథ పరమోత్కర్ష (Climax)నందుకొన్నది.

ఆజానుబాహువును అస్ఖలితబ్రహ్మచారియు నగు రాజశేఖరుడు ఆలోచనాడోలికలలో నూగిపోవుచు గమనజ్ఞానమేలేక నడచివచ్చెడువేళ హఠాత్తుగా తన్ను చుట్టుముట్టిన హంతకులనుచూచి ఇంచుకయు చలింపలేదు. యుద్ధములో సైనికశిక్షణ పొందినతాను తలపడినచో వారినందఱను తఱిమికొట్టగల శక్తిమంతుడయ్యు చిఱునవ్వునవ్వుచు ఱొమ్ముమీది వస్త్రము తొలగించి "రండి ఇదుగో నాఱొమ్ము" అని నమస్కరించుచు పల్కినాడు.

శత్రువులోని క్రౌర్యమును క్షమించు సహనశక్తి మానవునకలవడుటయెట్లు ? ఏమో ! మానవమాత్రుడేయైనను సబర్మతీ సంయమి కది యలవడినది. ఏకలవ్యన్యాయమున నాతనిశిష్యుడైన రాజశేఖరునకు నది యలవడినది. వారిదృష్టిలో శత్రువులు శత్రువులే కారు. సన్నిహిత మిత్రులకంటె ఆప్తులు. మహానాయకులైనవారి కిది అసహజము గానేరదు. మహానాయకుల (Great Heroes) యొక్క తత్త్వము వ్యక్తీకరించుచు షెల్లీ ఇట్లే వ్రాసినాడు.

And if then the tyrants dare,
Let them ride among you thro
Slash, and stab and main and hew
What they like, that let them do,
With folded arms and steady eyes,
And little fear, and less surprise
Look upon them as they slay
Till thier rage has died away

అంజలిఘటించి నిశ్చలనేత్రములతో రాజశేఖరుడు మూర్తీభవించిన శాంతరసమై నిలిచినాడు. రాజశేఖరునిలో మహానాయకుని కుండవలసిన లక్షణము లన్నియు నున్నవి. అతడు శాంతశూరుడు. సత్త్వవీరుడు. ద్వంద్వాతీతుడు. నిష్కామ కర్మయోగి.

రక్తమాంసముల రుచిచూచిపోవలెనని వచ్చిన కఱకురక్కసుల కటికగుండెలను క్షణకాలములో మార్చి కరుణరసపు సోనలు జాలువాఱించినాడు.

రాజశేఖరుని ఉదాత్తస్వభావము అందఱకు తెలిసినది. శాంత పవిత్రస్వభావము నందఱు నెఱుగుదురు. వైదికతంతు లేని పెండ్లిలో చంద్రారెడ్డితో నామెకు సాప్తపదీనమైత్రియైన లేదు. కావున వీరిరువురు దంపతులైన చూచి యానందింపవలెనని గ్రామస్థులు ముచ్చటపడిరి "శాంతను చంద్రారెడ్డికిచ్చుటకు నిశ్చయించిన నాడే నేను జన్మాంత బ్రహ్మచర్యదీక్ష వహించితి" నని రాజశేఖరుడు సమాధానము చెప్పెను.

కాని శాంతా రాజశేఖరుల తనువు దాకని దాంపత్యములోని నిష్కామ ప్రేమఫలముగా వేములపల్లి అభినవరూపము దాల్చినది. తనువుతాకని దాంపత్యమన్న నేమో, నిష్కామప్రేమ యన్న నేమో యని గీతార్థసారమంతయు పిడిచి పిండనక్కఱలేదు. ఈనవలలో శాంతారాజశేఖరుల మనఃపరిస్థితుల నర్థము చేసికొన్నచో చాలును.

ఇక కథాకథనపద్ధతిలో రచయిత అశ్రద్ధవహించిన యంశములు ఒకటి రెండు గలవు. కథాప్రవాహము అప్రతిహతగతితో సాగిపోవు సందర్భములలో రచయిత తానై 'పాఠకుడా !' యని సంబోధించి యెడనెడ మాటాడుట వలన గల్గెడు ప్రయోజన మేమియు లేదు. పైపెచ్చు మనసుమఱచి ఒడలు తెలియక కథాగతితో కొట్టుకొనిపోవు పాఠకుని తట్టిలేపి జాగరూకుని గావించుటే యగును. ఈ లోపము వంగదేశమున నుత్పత్తియైన నవలలలో పెక్కింట గలదు. అనువాద సాహిత్యము మూలమున అది తెలుగునవలలలోకూడ ప్రాకిపోయినది.

అంతేకాక ఒకటిరెండు ప్రదేశములలో సహకారాది విషయభారము కథాశరీరము భరింపలేనంత ఎక్కువయగుటచే గమనవేగము కొంత తగ్గినది. ఈ విషయము రచయిత గుర్తింపకపోలేదు. కాని గ్రామపునరుజ్జీవన కార్యక్రమములో సహకారాదివిషయములు ముఖ్యములగుటచేతను, నవలరచనాలక్ష్యమే యది

యగుటచేతను ఆ యా విషయవివరణము సంక్షిప్తముగావించుట ఆతనికి [illegible]రింపలేదు.

## భాష - రచన

ఎంతటి శాస్త్రవిషయమైనను, ఆధ్యాత్మికవిషయమైనను చిన్నచిన్న పొడిపొడి తేట తెలుగుమాటలతో చెప్పగలచిత్రమైనశక్తిగలవాడు రచయిత. చెప్పెడు విషయముచిన్నదైనను పదాడంబరముతో నయోమయము చేయక సూటిగా హృదయమునకుపోయి తగులునట్లు చెప్పగల నిపుణుడు. శబ్దసంయోజనము విషయమునను రచయితకుకొన్ని వ్యక్తిగతమగు అభిప్రాయములుగలవు. "జిలిబిలి తెల్గు తేనియలచే పదునైన స్వచ్ఛమైన తెనుగుతెడదద" యీయనది. బారలుబారలైన సంస్కృత సమాసములతో పెనగులాడు పండితుడుగా డీయన. నిత్యము నుద్యోగజీవితమున నింగ్లీషుతో తప్ప తెనుగుతో సంబంధము లేనివాడైనను కలముపట్టుకొని వ్రాయుట ప్రారంభించినచో నెంతటి యగాధభావమునైనను సజీవమైన తెలుగులో స్పష్టముగా వ్యక్తకరింపగలడు. వీనియన్నిటినిమించి యీరచయితలో నొక విలక్షణమైనశక్తిగలదు. తెలుగులోచెప్పుటకు వీలులేని కొన్నికొన్నియాంగ్ల పదములందలి భావమును తేలికగా అర్థమగు తెలుగుమాటలలో నీయనచెప్పగలడు. Appointment order అనుటకు నియామకపు టుత్తరు వనియు Necktie అనుటకు కంఠబంధమనియు 'New model rectangular wrist watch' అనుటకు కొత్తనమూనాచతుష్కోణపు చేతిగడియారమనియు - ఇట్లే అనేక పదార్థములను తేట తెనుగులో వ్యక్తికరించినాడు. అనగా ప్రాతపదములనే నూతనార్థములకు మలచుటయన్నది యీయనలో గమనింపదగిన విశేషము.

ఈ నవలలో నుపయోగించిన భాషావిషయములో రచయిత యొకప్రత్యేక పద్ధతి యవలంబించినాడు. కథాకథనమంతయు శుద్ధగ్రాంథికములోనే నడిపి సంభాషణలు మాత్రము సహజత కొఱవడకుండుటకై వ్యవహారభాషలోనే జరిపినాడు. ఈనవలలో సంభాషణలలో నెక్కడప్రారంభించినను తీగసాగినట్లు సాగిపోతకు నెంతదూరమైన తీసికొనిపోగలశక్తియున్నది. ముఖ్యముగా రాజశేఖరుడూరి పెద్దలతో తర్కబద్ధముగా సంభాషించి వారినొప్పించెడి ఘట్టములలో రచయిత సంభాషణచమత్కృతి పరాయణము మట్టుచున్నది. ఇక గమణారెడ్డి ఎక్కడ తారసిల్లినను, సీమటపాకాయవలె పెటిలి పడుచు నెంతెంత దీర్ఘోపన్యాసము లిచ్చినను సంభాషణలో విసుగన్నది కలుగదు. శాంత రమణారెడ్డితో పల్కిన పల్కులన్నియు చంద్రకోలతో చఱచి కొట్టునట్లుగా చుఱుకు చుఱుకుగా ఘాటు ఘాటుగా నున్నవి.

వర్ణనముల విషయములో పల్లీదృశ్య వర్ణనమన్న రచయితకు పారవశ్యమెండు. పట్టణ వాతావరణమన్న నేవగింపుకూడ గలదు. చంద్రారెడ్డి, రమణారెడ్ల

స్వభావవర్ణనములో నీయంశము వివరించినాడు. శాంతా రాజశేఖరుల రూపవర్ణనమున రచయిత సిద్ధహస్తత కన్పించుచున్నది. రాజశేఖరుడు యుద్ధమునుండి తిరిగివచ్చుచు తియ్యనగు తనయింటిని చూచునప్పటి యాతని మనః పరిణామము యొక్క వర్ణనము పున్నయ్యగారిని ప్రౌఢరచయితలలో నొకనిగా నిల్పుచున్నది. రాజశేఖరుని తల్లిదండ్రుల విషాదానందముల వ్యక్తీకరించు ఈ ఘట్టమంతయు కరుణరసస్నిగ్ధమై పున్నయ్యగారి భావనాశక్తికి గీటురాయిగా నున్నది.

## హాస్యము

తెలుగు వాఙ్మయములో హాస్యమనగనే చాలమంది తలగోకుకొందురు. ఎచ్చటనైననున్నచో అది ఉదాత్తహాస్య (Genuine humour) మనుటకు వీలుగనుండదు. హాస్య మెప్పుడును పాత్రగతమైయుండుటకంటె సన్నివేశనిష్ఠమై యున్నచో బాగుండును. ఇట్టి యుదాత్తహాస్యమును సృష్టింపవలయునన్నచో రచయిత సహజముగా హాస్యరసోత్పాదకధాతువు (Humorous vein) ఉన్నవాడుగా నుండవలెను. పున్నయ్యగారితో పరిచయమేర్పడిన ప్రతివ్యక్తికి ఆయనలోగల హాస్యచతురత స్పష్టమే. అందువలననే ఆయనగారితో మాటాడుటకుకూర్చున్న వారికి అన్నపానముల తొందరగాని బాహ్యప్రపంచముతో సంబంధముగాని యుండదు. హాస్యమాడినను ఆయన ఎదుటివారి మనస్సుకొంచెమైన కందకుండ హాస్యమాడగలడు. ఈ నవలలో రాజశేఖరుడు పంచాయతీభవనమునకై, బండెడు కొంపలో నొంటరిగాపడియున్న తాతినేని వెంకాయమ్మ బుద్ధిని ధర్మదృష్టికి మరలించుఘట్టము చదువుచున్నపుడు వయసుమళ్లినయొక ధనలోభితో పున్నయ్యగారు చమత్కారముగా జరిపినయొక సంభాషణ గుఱుతునకువచ్చుచున్నది. నవల ప్రారంభమునందు వేములపల్లి చెఱువుకట్టపై జరిగెడు లోకాభిరామాయణము అలకించినచో సన్నివేశనిష్ఠమగు హాస్యమన్న నిట్లుండవలయునని స్ఫురింపకమానదు. పాత్రగతమగుహాస్యమన్నచో రమణారెడ్డిని కొంచెముకదిలించిచూచిన జాలును.

ఫ్రెంచినవల రచయితలలో మానవత్వముపై మహనీయవిశ్వాసము గల "విక్టర్ హ్యుగో" అన్నచో పున్నయ్యగారికి ఎంతోగౌరవము. లండనుభూగృహములలో చెమటోడ్చి పనిచేసెడి అమాయకుల జీవితములోని విషాదమును హాస్యముతో మెదిపి పవిత్రమగు సాహిత్యమును సంతరించిన ఛార్లెస్ డికెన్సన్నచో నీయనకు పరమప్రాణము. ఇక తెనుగునవల రచయితలలో శిల్పదృష్టియు, సంస్కరణాభిలాషయు గల బాపిరాజుగారన్నను ఉన్నవ, లక్ష్మీనారాయణగారన్నను నీయనకు మిక్కిలిప్రీతి.

## రచయిత చరమ జీవితము

నిజముగా పున్నయ్యగారు ఇంకకొంతకాలము బ్రతికి బట్టకట్టుటయే సంభవించిన ఆంధ్రవాఙ్మయమున కమూల్యమగు సేవజరిగియుండెడిది. ఉద్యోగవ్యా

వృత్తిలో ఒక్కక్షణమైన తీరిక లేకుండ నుండెడివ్యక్తి ముద్రణములో మూడువందల పుటలకుపైబడిన యుదాత్తమగు నీనవల సృష్టించినాడన్నచో నాశ్చర్యము గల్గక మానదు. ముప్పదిరాత్రులు కన్నులలో వత్తులిడుకొని మహాప్రయాసముతో చిత్తు కాగితములపై వ్రాసికొన్న నవలప్రతినెత్తి వ్రాయుటకైన వసతికుదురక నావంటి సన్నిహితుని సాయమపేక్షించినాడన్నచో నీరచయిత దయనీయస్థితి నూహించుకొనవచ్చును. అయినను నిస్పృహతో సాహితీసన్న్యాసము చేయక అలవోకగా నప్పుడప్పుడు వ్రాసికొన్న పద్యఖండికలే స్వప్నసందేశము, కళాతపస్వి, చెదఱుచినుకులు మొదలైన పద్యకృతులుగా రూపొందినవి. చివరిరెండు కృతులును ముద్రణభాగ్యమునకు నోచుకొనక నేటికి పురుగువట్టి యట్లేపడియున్నవి.

ఎంతటిచిన్న సంఘటనసైన-ఇట్టె సాహితీవిషయముగా మార్చగల మహత్తరశక్తిగలవాడీయన. మిత్రులెందరికో యీయన వ్రాసినలేఖలే యిందుకు తార్కాణము. ఉదాహరణముగా నాకువ్రాసిన సుదీర్ఘమగు లేఖలోని ఒక భాగము నిక్కడ పొందుపఱచుచున్నాను.

"ఒకసంగతి విన్నావ్రా? నేను ప్రస్తుతం వికలాంగుణ్ణి. ఈమధ్య ఒకరోజున డాబుసరిగా సూటూబూటూ వేసుకొని కలెక్టరు తెల్లదొరను చూచి వచ్చాను. అతగాడు ఏదో మాటలతో నన్నుకొంచెం పొంగవేశాడు. ఆపొంగుతో జిల్లాప్రొహిబిషన్ ఆఫీసరుతో కలిసి మాట్లాడాలని హడావుడిగా సైకిలెక్కి వెళ్తున్నాను. సైకిల్ నాదికాదు. ఇతరులది. దానికి పంపుపెట్టే ఒక కొక్కెం ఉన్నది. ముందుచూచుకోలేదు. అందులో పాంట్ కొసతగులుకొన్నది. కుఱ్ఱసన్యాసులు, గుమాస్తాలు, ఇనెస్పెక్టరులు పాంట్ పొడుగుగా ఉండాలని ఫాషన్ పేరుతో నన్ను మోసగించి పాదాలమీదపడేటట్లు పొడుగుగాకుట్టించారు. పాంట్ కొస సైకిలు కొక్కెంలో తగులుకొని పెడలు తొక్కడానికే వీలులేకుండాచేసింది. సైకిలుఎత్తుకు పోతున్నది. పెడలుతొక్కడంలేదు కాబట్టి బండిఆగిపోయింది. లాగు ఇరుక్కుని ఉండడంచేత దిగడానికికూడా కాలురాలేదు. కాబట్టి సారధిగారైన కోఆపరేటివ్ సబ్‌రిజిస్ట్రారుగారు బిళ్ళబీటుగా తారురోడ్డుమీద పడ్డారు ఎడమముంజేతి ఎముక ఫెళ్ళునవిరిగింది. కళ్ళు గిఱ్ఱున తిరిగిపోయినయ్. లేకపోతే యీ వయస్సులో సూటు దేనికి? సైకిల్ దేనికి? ఎందుకంతపొగరూ, గర్వం? The cycle served him right! సరే! వెంటనే డాక్టరుదగ్గర తయారు. యక్స్‌రేపరీక్ష. విరిగిన సంగతి నాకే తెలుసురా బాబూ అన్నప్పటికీ కాదుకూడదని పదిరూపాయలు పెట్టించి ఫొటోతీసి ఎముక విరిగిందన్నారు. బొమ్మ చూపించారు. ఇంతలో చెయ్యివాచింది. నాజన్మలో నాముంజేతికి అంతబలుపు ఎన్నడూలేదు. పెద్ద వస్తాదుచెయ్యిలాగాతయారైంది. తర్వాత Plaster of paris పట్టువేసి మోచేతినుండి వ్రేళ్ళవరకు తెల్లగా, మందంగా, భారంగా కట్టుకట్టారు. దానికొక గుడ్డ ఉయ్యాలకట్టి ఆ ఉయ్యాల నామెడకు తగిలించారు. నాలుగురోజులు కదలలేకపోయినాను. కాని తర్వాత యథా

ప్రకారం సంచారం చేస్తున్నాను. మా అమ్మాయి మంచినీళ్లు త్రాగిస్తుంది. మిగతా సంరక్షణంతా నాభార్య చూస్తుంది. రబ్బరుగాలిదిండుమీద యోధలక్షణ లక్షితమైన మదీయ వామహస్తరాజంబు నధిష్ఠింపంజేసి యథాప్రకృతికి భిన్నంబు రానీకుండు పగిది లేఖక కార్యంబు అవిచ్ఛిన్నంబుగా జరుపుచున్నవాడ! ఇంకొక మాసానికిగాని కట్టువిప్పరట ! కాబట్టి ప్రస్తుతం నేను వికలాంగుణ్ణి.

దెబ్బకు బాధపడ్డానుగాని దుఃఖపడలేదు. ఎడమచెయ్యకాక కుడిచెయ్యి విఱిగితే సుఖంగా సెలవు దొరికేది. పెన్షన్‌కూడా సులభంగా దొరికేది. ఏదో! ప్రాప్తమైనంత వరకే సంతోషపడాలి.

This is perhaps the first bell for the final call!
—15/16—2—1951 (రాత్రి గం॥ 12-1)"

పున్నయ్యగారికి భవిష్యత్తులోనికి తొంగిచూడగల దూరదృష్టియు దివ్య దృష్టియు గలవని నాకప్పుడప్పు డనిపించు చుండును. పై ఉత్తరములోని చివరి ఆంగ్లవాక్యము స్మరించుకొన్నకొద్దీ యీ అభిప్రాయము నాకు ధ్రువమగు చుండెడిది. నిజమునకు ఈ సైకిలు సంఘటనము తరువాతనే ఆయనగారి శరీర పరిస్థితి క్రమముగా తారుమారైనది. అప్పటికే పావుశబ్దమునకు పైబడి శక్తికిమించి పనిచేసి యుండుటచే శరీరములో జీవశక్తి యుడిగి క్రమముగా క్షీణింప దొడగినాడు. ఉద్యోగపు పని బాధ్యత, నానాటికి నెక్కువైన రాత్రులుకూడ మేల్కొన వలసి వచ్చుటచే నిద్రలేక ఇన్సామ్నియా Insomnia) యను వ్యాధితో బాధ పడ జొచ్చినాడు నరముల బలహీనత, జీర్ణశక్తి యుడుగుట, రక్తక్షీణత, కీళ్ళ నొప్పులు- మొదలగు భయంకర లక్షణము లేర్పడి ఆయనను మానసికముగా క్రుంగదీసినవి. పై ఉత్తరములో సరదాకు తాననుకొన్నట్లు ఎడమచేతికి కాక కుడిచేతికే వ్యాధిసంక్రమించినది. వ్యాధి యన్నచో నది సామాన్యమగు వ్యాధి కాదు. మానవమాత్రుడు సహింపరాని బాధ ! కుడిచేతి గూడలో ప్రారంభమై చేయియంతయు కొఱికి నమలివైచునట్లు, నొప్పులు పోట్లు. ఈ బాధకూడ ఒక గంట అరగంటకాదు; ఇరువదినాలుగుగంటలు నొకటే విధముగ చిత్రహింస. సమ్మెటలతో మోదినట్లు చేయియంతయు నరకబాధ ! వ్యాధి నివారణమునకై ఆంధ్రదేశమంతయు, విశాఖపట్నము మొదలు మదరాసు వఱకు కాలికి బలపము కట్టుకొని తిరిగినాడు. సుప్రసిద్ధులైన వైద్యులుకూడ మొగములు వ్రేలవైచిరి. తాత్కాలికోపశమనమునకై వైద్యులు సూచించిన సెడెటివ్స్ (Codopyrin) క్రమింగాక్రమింగా గుండె అంతయు బలహీనమై పోయినది.

ఇట్టి దుర్భరదుస్థితియందు గూడ తన సహజచమత్కారము పోనిచ్చెడి వాడు గాడు. ఎవరైన క్రొత్తవైద్యులువచ్చి 'ఇదివఱకెక్కడ మందుతిన్నా'రని ప్రశ్నించిన 'ఒకచోటేమిటి? అకలంకౌషధ సక్తేమ్ముందెలియ మాయా ద్వారకా

వంతి కాశీకురుక్షేత్రగయా ప్రయాగములు - ఇంకా—— ఆసేతుహిమాచలం చుట్టివచ్చా'నని సమాధానము చెప్పెడివాడు.

రానురాను వైద్యులన్నచో నాయనకు పరిహాసమైపోయినది. ఈ భావమునే కవిత్వములోకూడ నొలికించి చెప్పెడివాడు.

"అన్నమునకు నిబ్బడియైన యౌషధములు
మ్రింగుచున్నాడ భిషగాజ్ఞ మీఱకుండ.
"వారెంతటి మేధావులో,
వారొసగెడిమందు లెంత బలవంతములో,
నారోగము నానాటికి
భారతర మొనర్చినారు వైద్యులు దేవా!"

భయంకరమగు ఆ బాధతో కుడిచేయిపూర్తిగా అవశము కాకముందు ఆయన తనస్థితినిగూర్చి *వ్రాసిన లేఖలు చదివినచో హృదయమారక ద్రవించిపోవును.

"నాజీవితంలో మేలిభాగం నికృష్టంగా గడచిపోయింది. కూటికొఱకు రక్తంఓడ్చిపోశాను. పిప్పిమిగిలింది. ఈ స్వల్పావశేషం జీవనార్హంకాదు. చూడు ప్రకృతం ఈశరీరబాధ! కుడిపార్శ్వం దాదాపు అవశం అయిపోయింది. శరపరంపరగా జరిగిపోయే కలం కుంటువడ్డది. దానితో నేను జీవితంలో నిష్ప్రయోజకుడనై పోయినాను. వ్యాధికుదరకపోతే దాస్యవృత్తినుండి విరమించుకోవాలి. విరమిస్తే డొక్కాడదు. మితిమించిన శ్రమవల్ల శరీరం అకాలంలో జరాక్రాంతమైంది. నేనొక Spent up battery ని. నాబోటి వగ్గు రాలిపోతుందని నీవు పలుసార్లు విషాదచేతస్కత చూపుతున్నావు. అది అనవసరం. ముందుకాచిన కాయలు ముందుగా రాలిపోవడం ధర్మమే. బాగా తేరిపారచూస్తే మరణం ఆనందదాయకమేకాని విషాదకారకంకాదు. అందుచేతనే "మరణభయంబు నాకు అణు

---

* పున్నయ్యగారు మిత్రులకు వ్రాసిన లేఖలు వందలకు వందలుగలవు నాదగ్గఱనే దాదాపొక వందకు పైబడియున్నవి. ఈ ఉత్తరములలో నెన్నియో సాహిత్య విషయములు, భాషాశాస్త్ర విషయములు గలవు. ఇవి అన్నియు జాగరూకతతో 'ఎడిట్' చేసి ప్రచురించినచో పున్నయ్యగారి జీవిత విశేషములనేకము తెలియుటేకాక తెలుగుభాషలో లేఖాసాహిత్యము లేనికొఱతయు తీఱగలదు. పున్నయ్యగారి ఉత్తరములు పరిశీలింపగా, ఆంగ్లభాషలో Charles Lamb తనకు సన్నిహితులగు Coleridge, Wordsworth, Thomas Manning మున్నగు వారికి వ్రాసి లేఖలను తలపించుచుండును. "I had grown to my desk, as it were; and the wood has entered into my soul" అని గుండె ఱాయిచేసికొనిన Lamb నకును, పున్నయ్యగారికిని ఉద్యోగ జీవితమున చాలదగ్గర పోలికలు గలవు.

మాత్రము లేదు." మరి అంతవరకూ ఈ బాధ ఎట్లా భరించేదా అనేదే నాభయం. ఏమైనా మొత్తానికి టిక్కెట్టు పుచ్చుకోవడం బుద్ధికి లక్షణం అనిపిస్తూంది. కాకపోయినా, శరీరంమీద ఇంతవ్యామోహం దేనికి? బండి బాగా నడిచినంత వఱకే అందులో కూర్చోవాలి. మొండికిబడితే దిగిపోవాలి. అదీ నా సైకాలజీ. కాని బండి దిగిపోయేముందు నేను చెయ్యదలచుకొన్నది ఒక్కటే చెయ్యనందుకు విచారం. ఆంధ్ర ద్రావిడ భాషాసారూప్య నిర్ణయం - అందులో ముఖ్యమైనది. పింఛను పుచ్చుకొని చేయదలచాను. బ్రదకడం తప్పనిసరి అయితే ఆపని చేస్తా."

చావు బ్రతుకులమధ్య కొట్టుకొనుచున్న జీవుని యార్తి వేదన యంతయు ఈ ఉత్తరములో కన్పించుచున్నది. అంతటి వేదనమధ్యగూడ భాషాసేవయన్నచో తనకుగల తీరని తృష్ణను వెల్లడించుచునే యున్నాడు. నిరంతరము చేతిబాధ యనుభవించుచునే అప్పుడప్పుడనుచుండెడివాడు. 'ఈగండం గడిస్తే, ఈఅనుభవం అంతా ఉపయోగించుకొని, నవలలు, నాటికలు, కథానికలు ఎన్నో వ్రాస్తాను, నీవట్లా చూస్తూ ఉండు.'

నేనట్లే చూచుచునే యుంటిని. వ్యాధి దానిత్రోవనది ముదురుచునే యున్నది. దుర్భరమగు ఆ హింసకు తట్టుకొనలేక అనేకపర్యాయములు ఆత్మహత్యకుకూడ ప్రయత్నించినాడు. ఆ నరకబాధతో పెద్దపెట్టున బొబ్బలు పెట్టుచు కొంచెము స్తిమితము చిక్కినపుడు పడకకుర్చీలో నట్టేవ్రాలి ఆకాశమువంక నూరక చూచుకొనుచుండెడివాడు. రాత్రింబవళ్ళు గ్రుడ్లలోనీళ్ళు గ్రుడ్లలోనే గ్రుక్కుకొనుచు రెక్కలురాని ముద్దుల కుమారుడు, పెండ్లికెదిగినకూతురు, ప్రియసతియును చెంతచేరి సపర్యలు చేయుచుండ, వారినిచూచుకొన్నప్పుడెల్ల నాతడు నిలువున నీరైపోయెడివాడు. అప్రయత్నముగ నాతనికి దేవునిపై కోపావేశములు గల్గెడివి. అట్టి కోపావిష్టస్థితియందే - కవిగావున - పద్యరూపమున నేమేమో పలవరించుచుండెడివాడు.

"ఓరీ దేవుడ జన్మమిమ్మనుచు నేనొక్కప్పుడైనన్, నినున్
కోరన్ లే; దిక నీవె యేపనియు పంగున్ లేక సృష్టిక్రియా
క్రూర క్రీడ యొకందు నేర్చికొని నాకుం గూర్చితీ జన్మ; మ
య్యారే, అంతటబోక దారుణ వధవ్యాపారమేలా యిటుల్!

నీవే యిచ్చితివన్నమాట నిజమే, నే లేదు కాదంచు నీ
తో వాదింతునె? కోరుటే తడవు, సంతోషంబుగా నిత్తు నై
కోవయ్యా! ఎగవేసిపోదునను సంకోచంబుతో రోగపుం
దావాయేల? వసూలుగాక చను ప్రాణం బెయ్యెడన్ గంటివే!

నిమిసము నోటీసిచ్చిన
క్రమమున నీ సొమ్ము నీకు చెల్లింతుననక
యమయాతనయను డిక్రీ
అమలుపఱచెదేల ఇంత యన్యాయముగా

ఏమో నీ వ్యవహారమెల్లపుడు నింతే! ముక్కువేచిలకుక
సామాన్యుండవుగావు; తానొకటియెంచన్ దైవమింకొండనన్
మామూలేగదా! రోగహీనమగు నస్మత్ శుష్కదేహంబు ను
ద్దామవ్యాధికి తావొనర్చితి మహాత్మా, నీదె నేర్పన్నచో!

"నరక స్వర్గము లుత్తకల్పనము లన్నా, లేవు, లే" వంచు నె
త్తిఱి వాదింతును తాయిగ్రుద్ది; అవి సత్యంబంచు రూపింప నీ
వెరవూహించితె? హింసవెట్టి నను నొప్పింపన్ దలంపైన ఈ
శ్వర నీ కోటమి తప్పదోయి! తనువే చాలింప సంసిద్ధుడన్.

అకట! ప్రొద్దుగుంకె, యామినీరాక్షసి యిరుల ముసుగుతోడ నుఱికివచ్చె,
తెల్లవాఱువఱకు తినివేయు ప్రాణముల్, చావనీదు బ్రమకు సాగనీదు.

దర్భపోచవంటి తను, విందు కొంచెంత వాత మెట్లుహూర్పవలనుపడియె!
డొక్కనిండ తినని బక్కవాని కిదేల ఏనుగైన సైపలేని బాధ?

వాకొనరాని యీ నరక బాధకు పోలిక లెన్ని చెప్పినన్
నీ కవగాహనంబగుట నిక్కముగా, దొక నూఱుతేళ్లు నీ
కే కుడిచేతఁ గుట్టుట ఘటిల్లినచో విషమెల్ల చంకకున్
ప్రాకినచో గ్రహింతు; వడివాటిల; దీవుగ్రహింప వీశ్వరా!

కచ్చేరిమొగసాల కంగుకంగున మ్రోగు గంటలు నన్నేల కలతవెట్టు?
సినిమాల కేగివచ్చెడి జనానీకంపు పకపకల్ నన్నేల భంగ పఱచు?
కొక్కొరోకోయంచు కూయు కోళ్లివియేల విలపింపజేయునన్నులుకగొట్టి?
మెలతలింపుగ బాడు మేలుకొల్పులునాకు పరిహాసమైయేల బాధవెట్టు?

శ్రమ విషాద విముక్తమై సర్వజగము
హాయినిదురింప నేను హూ హూ యటంచు
మూల్గి ముక్కుచు నిసియెల్ల పొక్కనేల ?
చెప్పరాదోయి నాచేయు తప్పిదంబు ?

నా యీరోదన మభ్రవీధులను ఘంటానాదమై మ్రోగ నే
మోయీ వేల్పులోకంస్ర మేల్కొనరు! వారున్నార లేరాఅసల్ ?
ఆమైనన్ విలపించు నా విలపనారావంబునన్, నీమనం
బో యావంతయు మెత్తగిల్ల; దినుమా ఉక్కా దయాసాగరా ?

ఒక్కపగలు రాత్రి ఒక్కమాసముగాదు, నడచిపోయె నిట్లునాల్గునెలలు!
జీవశక్తియెల్ల శిథిలమై కాయంబు, కదలుచున్న శవము కరణిమిగిలె."

ఇట్టిచరమదశలో వైద్యులను నమ్మి ఊరుగాని ఊరిలో కన్నులు మూయ నేలయని పెండ్లముబిడ్డలను బండిలో నెక్కించుకొని స్వగ్రామము (దుగ్గిరాల, గుంటూరుజిల్లా) చేరుకొనినాడు.

పున్నయ్యగారు "తియ్యనగు తనయింటిని చూచుకొనెను. పట్టరాని యేదో భావోద్వేగమునకు లోనయ్యెను. అపరిమేయమగు బ్రహ్మాండ మంతయు దర్శింప దివురు తన హృదయమున కీప్రాతమండువా ఇంటి వొక్కదానిని చూచుటకీ యుద్వేగమేల? అనంతమగు కాలములో తనయింటిని చూడకుండ గడిపిన యీకొద్దికాల మెన్నవవంతు ? అనంతకోటి సంఖ్యాకమగు జీవరాసులలో మానవానీకములో తన యాప్తబంధువు లెంతమంది యగుదురు?" ఇట్టి భావోద్వేగములో నొడలు మఱచిన యాతనికి భయంకరమగు చేతినొప్పి యేమైనదో తెలియలేదు. శారీరకమగు నీబాధ లన్నియు గడచి యతౌకికానందము ననుభవించుచున్నాడు. అట్టి యానందానుభూతిలో మెల్ల మెల్లగా కన్నులు మోడ్చిన యాతని కీలోకపు బాధలే స్ఫురింపలేదు. అనిర్వాచ్యమగు నేదోయొక శాశ్వతశాంతి లభించినది.

ప్రక్కనున్న పెండ్లము బిడ్డలు గుండెలు బాదుకొనుచు లబలబ ఏడ్చిరి. శాశ్వతమగు తనశాంతి తాను చూచుకొని పున్నయ్య వారి కన్యాయము చేసినాడు. వారికే కాదు! సర్వ రసజ్ఞ లోకమునకును !!!

గుంటూరు
15-12-55

వా. వెం. ల. నరసింహారావు, M. A.
ఆంధ్రోపన్యాసకుడు
ఆంధ్రక్రైస్తవ కళాశాల.

# ప రి వ ర్త న ము

## I

## లోకాభిరామాయణము

తూరుపురేక లింకను దెల్లవారలేదు. పలుచపలుచని చీకటి పొర లింకను బ్రపంచము నావరించియే యుండెను. ఉండియుండి కృకవాకము "క్కొక్కొ_రోకో !" యని వేములపల్లికి సమయ ప్రబోధము సేయుచుండెను. నిదుర మేల్కాంచియుఁ జలి బాధచే లేవలేక యొక ముసలి యవ్వ—

మేలుకోరా చిన్నికృష్ణా, మేలుకోరా వెన్నదొంగా,
మేలుకో గోపాలబాలా, మేలుకో !

అని భూపాళరాగమున మేలుకొలుపులు పాడుచుండెను. "కృష్ణా" యను మనోహర శబ్దము విన్నంతనే పులకితగాత్రుఁడై కాఁబోలు నొక వృద్ధుఁడు—

సజల జలదనీలమ్, వ ల్ల వీ కే ళి లో ల మ్
శ్రి త సు ర తరుమూలమ్, విద్యుదుల్లాసచేలమ్,
సురరిపుకులకాలమ్, సన్మనో బి మ్బ లీ ల మ్
నత సుర మునిజాలమ్, నౌమి గోపాలబాలమ్ !

అని శ్రీకృష్ణకర్ణామృతము నోలకఁబోయుచుండెను. అది శీతకాల మగుటచే ముంగిళ్ళయందు దచ్చుటచ్చుట చేలిమంటలు కనిపించుచు, నుషస్సుందరి నీలిచీరెపై బంగరుబుటాపూలవలెఁ బ్రకాశించుచుండెను. మంటలపైఁ జేతులు గాచుకొనుచు, వెచ్చగిల్లిన యరచేతులతో మొగము లద్దుకొనుచు, చుట్టలు గాల్చుకొనుచు, నన్యోన్యసంబంధము లేని నానా ప్రసంగములు చేసికొనుచు మంటల నాశ్రయించినవారు కాలక్షేపము సేయుచుండిరి.

పుట్టింటి స్వాతంత్ర్య మనుభవించు నాడుబిడ్డలు దుప్పటులు తొలఁగకుండ బిఱ్ఱబిగిసికొని పండుకొనియేయుండ, అత్తల యదుపులలో నుండు క్రొత్త కోడండ్రు కసవూడ్చి, కలాపి చల్లుచుఁ గరకంకణనిక్వణ ములచేఁ బ్రభాత రామణీయకమును మఱింత మనోజ్ఞమొనర్చుచుండిరి. పని తొందర మీఁద బోవుచుండిన యొక పడుచు టెల్లాలిని చేలిగాచు కొనుచుఁ గూరుచుండిన డెబ్బదియేండ్ల బోసినోటి పుల్లయ్య పంతులు ఎగాదిగఁ జూచి,– "ముద్దు రాయంచ నడల సొంపులు దలిర్చు మంద గమనంబుతోడ నో మనుమరాల" యని పద్య ధోరణిలో నేమో యనఁబోవుసరికి నా యువతి "చాల్లే తాతా ! నీవూ నీ పదాలూనూ" అని లజ్జా కోపములతోపాటు లావణ్యము నెఱపు నొక వింత వాలక ముతోఁ జరచర నడచిపోయెను. "తాత నోటి కడ్డంలేద"ని యొకరును "చింత చచ్చినా పులుపు చావలే"దని మఱియొకరును నవ్వుకొనిరి. ఆ యువతికి సోదరుని వరుస యగు రామరాజు "తాతా, కీలుగుఱ్ఱపు కాళ్ళపోలిక పాతశేషదంతద్వయంబు నర్తనము సలుపునప్పుడు గూడ నీ చమత్కారం పోనియ్యవుగదా!"యని చిరునగవుతో మందలించెను.

పంతులు:– అబ్బే ! నామాట సాంతం వినకుండా నాపైన విఱుచుక పడ్డారు. అన్ని హంగులూ గల అమ్మాయికి అందెలు కడియాలు లేవని–

రామరాజు:– అమ్మాయిల కాళ్ళకు వెండి సంకెళ్లవలె అవి దేనికి తాతా ?

పం:– అబ్బాయిల కళ్లకు మాయ సంకెళ్లు వెయ్యడానికి !

రామ:– నీ పరిహాసాని కేమిలే !

పం:– పరిహాసంగాదురా ! ఆడవాళ్ళకు అలసగమనం ఒక అందాన్ని చేకూర్చుతుంది. పుట్టుకలోనే వాళ్ళకు అవయవ నిర్మాణం ఇందుకు అనుకూలంగా ఏర్పడుతుంది. వాళ్ళ జఘనాలు అంత బరువు గానూ విశాలంగానూ ఉండడాని కదే కారణం. శృంగార రసజ్ఞు లైన మన ప్రాచీనులు ఆడవాళ్ళ నింకా మందగమనలను జెయ్య డానికి వాళ్ళ కాళ్ళకు బరువుపాటి అందెలు, కడియాలు, వ్రేళ్ళకు

మట్టెలు, ఆభరణాలుగా కల్పించారు. అందువల్ల అలసగమనమే గాక అందంకూడా అమరేది. ఇంతకు చరణ మంజీర మంజులధ్వని లోని సౌభాగ్యమూ సారస్యమూ గ్రహింపలేని మీబోటి చేవట లకు ఏంజెప్పి ఏం ప్రయోజనంరా!

రామ:- అయితే, తాతా! ఆడవాళ్లు లంబాడి దయ్యాలలాగున గల గలలాడుతూ, భర్త్రీబండ్లలాగున కదలలేకుండా ఉంటేతప్ప అందంగా ఉండరా - మీ కళ్లకు?

పం:- ఔనురా! జింకపిల్లలలాగున చెంగుచెంగున గంతులేస్తూ జాగిలపు కుక్కలలాగున సడీ చప్పుడూ లేకుండ నడుస్తుంటేతప్ప మరి మీ కళ్ళకు వాళ్ళానందం కలిగించరుగదరా! దేవుడు మేలుజేస్తే, అసలు మీ కాలపు బోసినోటి పూవుబోళ్లకు అవయవసౌష్ఠవ మెక్కడిదిరా! సన్నగా, పీలగా, కఱ్ఱపుల్లలకు గుడ్డలు చుట్టినట్లు-

రామ:- అబ్బో! మీ కాలపు శృంగారమే చెప్పుకోవాలి! మీ శృంగార రసాభిరుచికి మీ ప్రబంధాలే సాక్షి. ఆడుదాన్ని మీరు పరాభవించినంతగా ఏ దేశంలోనూ, ఏ కాలంలోనూ, ఎవ్వరూ పరాభవించివుండరు! మీ ప్రబంధాలలోని పులినశ్రోణులను, రంభోరువులను, గజేంద్రగమనలను, కుంభకుచలను,- ఎవరెరుగరు? ఛీ! చెప్పడానికి కూడా సిగ్గు! ఒక మహానుభావుడు ఒకమ్మాయి "ఆము గవిసిన కుచకుంభ సీమ"ను గూడ చూపించాడు సిగ్గులేక!

పం:- కట్టెయ్యవోయ్ గుఱ్ఱాన్ని! ప్రాచీన నాగరికత, సంస్కృతి, వాఙ్మయమూ అంటే మీకాలపువాళ్లకు గిట్టదు. అందువల్ల వాటిని గుఱించి మీ యిష్టమొచ్చినట్లు వాగుతారు. మన పూర్వీకులు మీ రనుకున్నంత తెలివితక్కువవాళ్ళూ గాదూ, మొరటువాళ్ళూ గాదు. దేవుడుమేలుజేస్తే, శృంగారరసాధి దేవతయైన స్త్రీమూర్తిని వాళ్ళు మానసికంగా సాక్షాత్కారం జేసికొని వాక్కల్పసహాయంతో కావ్యాలలో చిత్రించి లోకానికి చూపించేవాళ్ళు. ఆ నేర్పులేని యీ కాలపు దద్దమ్మలు తమ కంటికి కనబడే సాధారణ స్త్రీమూర్తిని ఫోటోలు తీసి, చేతికివచ్చినట్లు బొమ్మలు గీసి, యితరులకు చూపు

తున్నారు. వాక్శిల్పాని కున్నంత సౌలభ్యం రేఖా శిల్పాని కెట్లా కుదురుతుంది? పైగా ప్రాచీన శిల్పికిగల నైపుణ్యం, నిష్ఠ, ఏకాగ్రత, నేటివాళ్ళకెట్లా కుదురుతై?

రామ:- ఇందులో శిల్పుల గొడవ దేనికిలే! కవులనుగానీ!

పం:- అదేనోయ్! దేవుడు మేలుజేస్తే, ప్రాచీనులు వాక్శిల్పంతో ఎటువంటి రమణీయమూర్తినైనా చిత్రించేవాళ్ళు. చూడు! "కచభార కుచభార కటిభారములచేత కాయంబు త్రైభంగికముగ నిలువ" అని ఒక స్త్రీమూర్తిని వర్ణించా డొక మహాకవి. మీ ఫొటోగ్రాఫు కవులకు వశమౌతుందా యీ మనోహర భంగిమ సృష్టించడం?

రామ:- నేటి కవులసంగతి తర్వాత విచారిద్దాం? మఱి ప్రాబంధికులు అసభ్య వర్ణనలుచేసి స్త్రీలను పరాభవించారా లేదా?

పం:- పరాభవించారట! ఏమిటా పరాభవించడం! ప్రాచీనులు స్త్రీలను పరాభవించారనడం నిజమయితే నవీనులు వాళ్ళకంటే వెయ్యిరెట్లు ఎక్కువగా పరాభవించారంటాను. సిగ్గూ నీతి లేకుండా మీ కాలపువాళ్ళు దిగంబరల ఛాయాచిత్రాలు తీసి, తమ నీచాభిలాషల ననుసరించి భిన్నభిన్న భంగిమలతో వాళ్ళను చిత్రించి పడక గదుల్లో దాచుకోనడం లేదూ; ఇంతకంటె ఆడవాళ్ళను ఎట్లా పరాభవించాలి! ప్రాచీనులు వాఙ్మయ శిల్ప సహాయంతో సున్నితంగా, మనోజ్ఞంగా, చిత్రించే అంగనాజన సౌందర్యాన్ని నవీనులు నగ్నంగా, అసభ్యంగా, చిత్రించి నైతిక పతనానికి దారి తీస్తున్నారు. ఛీ ఛీ.

రామ:- శాంతించు తాతా! ఇంతకూ ప్రబంధ స్త్రీవర్ణనలో అసభ్యత లేదంటావా?

పం:- ఏమిటోయ్! సభ్యతాసభ్యతలు! దేశ కాల పాత్రలనుబట్టి మారే వాటిని బట్టుకొని పెనుగులాడుతావు దేనికి? తాటాకూ, గంటమూ ముందువేసుకొని కవితావేదికపైన కూర్చునే ప్రబంధ కవితాశిల్పికి అర్థాలంకారాలు తప్ప చిత్రణ సామగ్రి యేదీ వుండేదికాదు.

ఆ సామగ్రితోనే తన నైపుణ్యంకొద్దీ దివ్యశిల్పాలు దిద్దేవాడు. అతని చిత్రణ అర్థంజేసుకొనడంలో నేర్పుండాలి. "రంభోరువు" అని అతడు స్త్రీని వర్ణిస్తే అరటికంబంలోని నునుపుదనాన్ని మాత్రమే అత డుపయోగించుకొన్నాడు. "పులినశ్రోణి" అనడంలో ఉన్నతినీ, వైశాల్యాన్నీ మాత్రమే గ్రహిస్తాడు. ప్రతి ఉపమానమూ ఇంతే. 'గజేంద్రగమన' అంటే స్త్రీ పెద్ద యేనుగువలె ఉన్నదని ఏరసికుడూ అర్థంజేసుకోడు. మెల్లమెల్లగా ఒయ్యారంగా నడిచేది అని ప్రతి వాడు గ్రహిస్తాడు. ఇంతకు దేవుడు మేలుజేస్తే కవితా చిత్రాన్ని అర్థంజేసుకొని ఆనందించడానికి లోకానుభవం, సహృదయత, రసజ్ఞత ఉండాలి. అదిలేకుండా ప్రతివాడూ నేను బండితుండనే అని కావ్యాలనూ కవులనూ పరిహసిస్తే చెల్లుతుందా ?

రామ:- ఈ పాండిత్యము నీకు దక్క మఱి యెందే గంటిమే.

పం:- నాకు గా, కీ పాపిష్ఠి నవీన శుంఠలకు మీా కేలాగురా ?

రామ:- ఆశుకవిత్వం కారిపోతుంది తాతా !

పం:- బస్తీలలో చేదివి చెడిపోయిన మీాకు కష్టంగాని మాకు కవిత్వం ఒక లెక్కలోనిది గాదు. నా దగ్గర కావ్యాలు చదువు కున్న శాంతకూడా కవిత్వం చెపుతుంది. నేర్చుకోండి పోయి.

ఈ మాట యనుసరికి విజయవాడనుండి వేములపల్లికి ఇల్లఱి కము వచ్చిన రమణారెడ్డికిఁ బాడుచుకొనివచ్చెను. అతఁడు బస్తీ నివాసి. కొంతవఱకు ఇంగ్లీషు చేదివినవాఁడు. పల్లెటూళ్ళన్న నతనికిఁ బరిహాసము. అతఁడిట్లనెను.

రమణారెడ్డి:- తాతా ! బస్తీ చదువంటే నీకు పరిహాసంగా ఉన్నది. బస్తీలో ఎంత ముసలివాళ్ళైనా, పండితులైనా, మై గుడ్‌గాడ్ ! నీ విందాక ఆ యంగ్ లేడీని - అంటే ఆ యువతిని - మాట్లాడినంత బార్బరస్‌గా - మొరటుగా - మాట్లాడతారా ? ఆమె టాలరేట్ చేస్తుందా ? సహిస్తుందా ?

పం:- మీా బస్తీ బండాలమే చెప్పవోయ్ ! చెప్పక చెప్పక. అయినా ఎవ రీ అబ్బాయి ? ఓహో, వీరారెడ్డిగారి అల్లుడుగాదూ ?

అట్లా చెప్తూ! అబ్బాయి, దేవుడు మేలు జేస్తే, నీవు పల్లెటూరికి ఇల్లరికం వచ్చావు గాబట్టి పల్లెటూరి విషయాలు కొన్ని ముందుగా నేర్చుకోవాలి. పల్లెటూరివాళ్ళ సంస్కారాలకు బస్తీవాళ్ళ సంస్కారాలకు చాలా భేదమున్నది. పల్లెటూళ్ళో ప్రజలందరూ ఒక పెద్ద సమిష్టి కుటుంబంగా కలిసి మెలిసి వుంటారు.

రమ:- దటీజ్ ఆల్ మూన్‌షైన్. అదంతా వుత్తది. పల్లెటూళ్ళు నేనూ ఎఱుగుదును.

పం.- నా మాట కడ్డం రావద్దు. విను పల్లెటూళ్ళో ఒక యింటి కష్టసుఖాలను ప్రతి యిల్లూ పంచుకుంటుంది. కులభేదాలు లేకుండా ఒకళ్ళ నొకళ్ళు వరసలు జేసుకొని ఆప్తబంధువుల మాదిరి చూచుకొంటారు. పల్లెటూళ్ళవాళ్ళ మనసులు అరామరా లేనివి. మాయా మర్మా లెఱుగవు.

రమ:- అదంతా పూర్వకాలపు మాటేమో! ఇప్పుడు చూస్తున్నాగా వేములపల్లి వ్యవహారం! ఎక్కడ చూచినా శిఖపట్ల గోత్రాలే! కులాల కులాలమధ్య తగాదాలు, వీధుల వీధులమధ్య తగాదాలు. మై గుడ్‌గాడ్! సమిష్టికుటుంబం అంటే ఇదేనా?

పం:- చిన్నచిన్న జగడాలకు పార్టీలకు ఏమిటిలే! అవైనా ఇటీవల ఒకటి రెండు తరాలుగా వచ్చినవే!

రమ:- సరే! నీవు చెప్పేదంతా ఒప్పుకున్నా! పల్లెటూరంతా ఏకకుటుంబం అనుకొన్నా ఆ యంగ్ లేడీని బట్టుకొని నీవు —

పం:- లేడీ లేదు జింకా లేదు. వినవోయ్! ఆ పిల్లతల్లి వెంకటలక్ష్మమ్మ మా పొరుగింట పుట్టి పెరిగింది. చిన్నప్పుడు నే నెత్తుకు తిప్పేవాణ్ణి. పెదనాయనా యని ఇప్పటికీ నన్ను తండ్రిమాదిరిగా చూస్తుంది. దాని కూతురైన ఈ "లేడీ"ని మనమరాలు వరస జేసుకొని యింతప్పటినుంచీ ఎగతాళి పట్టించడం నా కలవాటు. ఇది పల్లెటూరి ఆచారం. ఇందులో మావాళ్ళ కెవళ్ళకూ అసభ్యం కనిపించలేదు. బస్తీ బిడ్డవు కాబట్టి నీకు కనిపించింది. ఇదే నీకూ మాకూ గల భేదం.

రమ:- ఇన్నాళ్ళూ పల్లెటూళ్ళలో సివిలి జేషన్ - అంటే నాగరికత- లేకపోవడంవల్ల అవన్నీ చెల్లిపోయినవి. ఇకనైనా మార్చు కోవాలి - పట్నాలను జూచి.

పం:- భేష్ ! చాలా బాగుంది. మీ పట్నవాసాల సంగతి నేనూ ఎఱుగుదును. మొన్న ఒక వకీలు గారింట్లో ఒక చిన్న పిల్లవాణ్ణి చూచి "పంతులుగారూ! ఈ పిల్లవాడు మీ వాడేనా ? ఎన్నో వాడు ?" అని అడిగేసరికి ఆయన గుమస్తా "నీ కెందుకయ్యా ! వచ్చినపని చూచుకపోక !" అని నన్ను గద్దించాడు. "ఇక్కడే మాటన్నా తప్పుగా ఉన్నదే" అని ఔడుగరిచి ఊరుకొన్నాను.

రమ:- ఔను నీవు వకీలుగారి సంతానసంఖ్యను గూర్చి, ఆ పిల్లవాడు ఆయన పిల్లవాడేనా అని ఆయన వంశవృత్తాన్ని గూర్చి ఎంక్వయిరీ, విచారణ చెయ్యడం అధిక ప్రసంగం కాదూ !

పం:- ఔనోయ్ ! అక్కడన్నీ తప్పులే! బస్తీలో మనసు బిగపట్టలేక పోయినా, మాట బిగబట్టాలి. మనసులో మాలిన్యం. ముఖంలో నైర్మల్యం! అడుగడుక్కూ నమస్కారాలు, అకారణ మంద హాసాలు, ఎదటివాడికొంప ఎల్లా తీస్తామా అని ఎల్లప్పుడూ ఆలో చనలు: ఇదే బస్తీ నాగరికత, సభ్యత. మీ నీతీ మీ సంస్కృతీ నా దగ్గఱ చెప్పబోకు. దేవుడు మేలుజేస్తే, చెప్పవచ్చిన మాట మర్చిపోయినాను. ఆ వకీలు గుమస్తా నన్నంతగద్దించినా, నా పల్లె టూరి స్వభావం పోనీయకుండా మళ్ళీ యింకొక వాదం పెట్టు కున్నాను.

రమ:- బై ఆల్ మీన్సు ! అంటే అన్ని విధాల నీ వంతవాడవని అర్థమవుతూనే వుంది. మళ్ళీ ఏ విషయం కదిలించావు ?

పం:- ఆ చిన్నపిల్లవాడే వకీలుగారిని "నాన్నా !" అని పిలిచి ఏదో చెప్పబోయినాడు. పాపం పసివెధవ! వకీలు చటక్కున చెంపకాయ లాగాడు. వెంటనే గుమస్తా కుఱ్ఱవాణ్ణి ప్రక్కకు తీసుకొనిపోయి "నాన్నగారూ! అని పిలవమని యెన్నిసార్లు చెప్పలేదు నీకు ? పిలువు నాన్నగారూ !" అని అట్లాగే మళ్ళీ పిలిపించాడు. వకీలు

ముఖం ఇంతజేసుకొని "ఆఁ ఏమిటి" అని అనుగ్రహించాడు.
ఇదంతా చూచి నాకు శరీరం ఆపాదమస్తకం మండుకుపోయింది.

రమ:- పిల్లవాడికి డిసిప్లిన్ - అయ్ మీన్ - క్రమశిక్షణ నేర్పడంలో తప్పేముంది ? పల్లెటూరి బడుద్ధాయల మాదిరిగా పెరగనివ్వ లేదన్నా ?

పం:- అబ్బాకొడుకుల మధ్య ఈ మర్యాద లేమిటోయ్! వాళ్ళిద్దరి మధ్య ఉండవలసింది అవ్యాజమైన ప్రేమగాని అస్వాభావికమైన మర్యాదగాదు. దేవుడు మేలుజేస్తే, అసలు నాన్నా అని మనసార పిలవడంలో గల భక్తీ, ప్రేమా 'నాన్నగారూ' అనే గౌరవ సంబోధనలో ఏమున్నది ? అప్పా, నాన్నా అన్న పిలుపు సూటిగా పోయి తండ్రి హృదయానికి హత్తుకుంటుంది, "నాన్నగారూ" అనేది ఒక గజందూరంలో ఆగిపోతుంది. తండ్రికి బిడ్డకు మధ్య ఒక ఎడ మేర్పడుతుంది. తన శరీరంలోనుండి, తన ఆత్మలోనుండి ఉద్భవించిన బిడ్డను అంత దూరములో ఉంచడం ఏమి సభ్యత, ఏమి నాగరికత? తెనుగుమీరిన మన బస్తీ భాయీలు ఎక్కడినుండి దిగుమతి జేశారో ఈ నాన్నగారిని ? 'నాన్నగారూ' అని పిలిచే కుఱ్ఱవాడు పెరిగి పెద్దవాడైన తర్వాత "నాన్నగారిని" ఎట్లా చూడాలో అట్లాగే చూస్తాడు. అబ్బాయిగారూ అని పిలిపించుకుంటాడు. నా ఆస్తి నాకు పంచిపెట్టమని జుట్టు పట్టుకుంటాడు. మఱి వాడికి మొగమోటం ఎందుకుంటుంది ?

రమ:- మై గుడ్ గాడ్ ! నీవూ, నీ సిద్ధాంతాలూ మ్యూజియంలో గాని ఇంకెక్కడా పనికిరావు —

అని యింక నేమో చెప్పబోవుసరికి పుల్లయ్యపంతులు "నీతో వాగడానికి నా కిప్పుడు ఓపిక లే"దని చొప్పదంటు చేలిమంటలో వెలిగించి, ఆరిపోయిన చుట్ట ముట్టించి, పండ్లూడుటచేఁ బట్టుతప్పిన పెదవులతో లాగలేక లాగలేక పొగ లాగుచుఁ జెఱువుకట్టకు బయలుదేరి పోయెను. రామరాజు రమణారెడ్డి వీపుదట్టి "పుల్లయ్య పంతులు డొక్కశుద్ధి అయిన ఘటం. కాని పెంకె. పూర్వాచార పరాయణుఁడు.

పిడివాదానికి మొనగాడు. కాలక్షేపం కానప్పుడు కల్పతరువు వంటి వాడు. అయినా పాపం, పెద్దతనం వచ్చింది. ఎక్కువగా విసిగించ కూడదు." అని రమణారెడ్డిని లేపుకొని చెఱువుకట్టకు వెడలిపోయెను.

చెఱువుకట్టమీద మఱ్ఱిచెట్టు క్రింద రకరకములవారు చేరి మామూలు లోకాభిరామాయణము చేయుచుండిరి. చేలికంతము గట్టి చెట్టు మొదటఁ గూర్చుండియున్న లింగారెడ్డి, లింగారెడ్డి కనతిదూరములోఁ జుట్ట గాల్చుచు నిలుచుండిన బాపినీడును బిలిచి "కొంచెం చుట్ట ముట్టించి పో, బావా !" యని కోరెను. బాపినీఁ డొక చిరునవ్వు విసరి "కదిలిరాలేవు మాయరోగమా ?" యని పల్కెను.

నారాయణ:- పెద్దవాడైనాడు కాల్చి రారా !

బాపినీఁడు:- అంత శుభముహూర్తం వస్తే రెడ్డి కొడుకులు నన్నెందుకు ముట్టించ నిస్తారూ ?

లింగా:- చుట్ట ముట్టించలేని వాడవు కాడేం ముట్టిస్తావుగాని చలి దవడలు పడ్డయి ముట్టించవోయ్. నీ చతురులు తగలబడ !

రామిరెడ్డి:- "నా దగ్గఱ అగ్గిపెట్టె ఉన్నది. తీసుకో బాబూ" అని విసరివేసెను.

బాపినీడు:- ఎటు దిరిగీ దాయాదికే చిక్కింది. రెడ్డిని ముట్టించే పుణ్యం కాస్తా. ఈ మాట విని అందఱూ నవ్విరి.

జందెము చెవిపైన వేసికొని దంత ధావనము చేయుచుఁ గూర్చుండిన వెంకంభొట్లు సంభాషణ యందుకొని యిట్లనెను.

వెంకం:- ఇన్ని మాట లంటుంటే బెల్లంకొట్టిన ఱాయిలాగున ఊరు కుంటావేం లింగారెడ్డీ !

లింగారెడ్డి:- అననియ్యి బాబూ ! బావ మఱదులు బ్రతకగోరతారట! అన్న దమ్ములు చావగోరతారట ! ఏడ్చేవాళ్ళు దొరుకుతారు గాని, నవ్వేవాళ్ళు దొరకరుగా !

వెంకంభొట్లు:- బాపినీడూ ! వయసుమీరి పుట్టిన పిల్లలు లింగారెడ్డికి ఇంకా ఎక్కిరాలేదు పాపం. ఇంకా కొన్నేళ్ళు బ్రతకనియ్యి వయ్యా !

బాపినీడు:- పాతిక రూపాయలూ, బస్తాబియ్యం చేదా నీకు ? పైగా భూదానమూ గోదానమూ అంతో ఇంతో ముట్టచెప్పకపోరు. పౌరోహితుడివి, నీ మంచి నీవు చూచుకోపోతే యెట్లా మామా!

అని నవ్వుచుండఁగా మేనా సవారి యొకటి చెఱువుకట్ట క్రిందుగాఁ బోవుచు నందఱి దృష్టి నాకర్షించెను. మేనా నుండి బోయీల స్వరమును మించి యేదో మూలుగు వినవచ్చు చుండెను. "ఎక్కడికి మేనా ? ఎవరు లోపల ? మూలుగేమిటి ?" యని యొకరు ప్రశ్నింపఁగా లింగారెడ్డి "ఎవరేమిటి ? సాగి వెంకటరమణ రాజుగారి పెద్దమ్మాయికి నిన్నటినుండీ నొప్పులు; రాత్రంతా నిద్రలు లేవు. మంత్రసాని తనచేత గాదన్నదట. గుంటూరు అసుపత్రికి తీసు కెళ్తున్నారు" అన్ని వివరించెను. "అయ్యో ! పాపం." అని అందఱును సానుభూతి వెలిబుచ్చుచుండిరి. "కావడానికి అవతల పార్టీవాడేగాని వెంకటరమణరాజు పెద్దమనిషి. ఒకళ్ళు కష్టపడితే ఓర్చుకోలేడు. పాపం కష్టంలో పడ్డాడు." అని యొకరనిరి.

ఒకరు:- బస్తీ పది మైళ్ళలోగాని లేదు. ఈలోగా ఎట్లా వుంటుందో పాపం. మొదటి కానుపు గాబోలు.

ఇంకొకరు:- కారులో డాక్టరును తీసుకు రావడానికిగాని, కారులో వేసుకొని అమ్మాయిని ఆసుపత్రికి చేర్చడానికిగాని మనకు రోడ్డు లేదాయె. మన వూరి దౌర్భాగ్యం ఎప్పుడూ ఇంతే. లేచి వెళ్తే మంచి దనిపిస్తుంది.

అంకినీడు:- శ్మశాన వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం అంటారు పెద్దలు; ఇదే గాబోలు ! ఇటువంటి సమయాలలో తప్ప రోడ్డు లేని దురవస్థ మన కెప్పుడైనా తట్టుతుందా ?

వెంకంభొట్లు:- తట్టి మాత్రం ప్రయోజన మేమిటి ?

అంకి:- అవును. మనవూరి జనం మరీ మూర్ఖమై పోయింది. కొంచె మైనా ఆలోచన లేదు. మన వూరికి ఒక్క రోడ్డేమిటి ? ఏ హంగున్నది కనుక ?

రమణారెడ్డి:- మై గుడ్ గాడ్! మీ గ్రామం చాలా బ్యాక్ వర్డ్ అంటే వెనకబడి వుంది. మాబోటి వాళ్ళకు ఉండ దగిందిగాలేదు. ఇక్కడ కెందుకొచ్చి పడ్డానురా బాబూ! అని 'రిపెంటు' చేస్తున్నాను. అంటే పశ్చాత్తాప్పడుతున్నాను.

అని తన యసహ్యతను దెలుపుచుండఁగా, "ముడుపుకోసమో ముద్దరాలి కోసమో" అని యంతకు ముందే యచ్చటికిఁ జేరుకొన్న పుల్లయ్య పంతులు చుఱుక్కున జవాబు చెప్పెను. మగసంతానములేని పీసపాటి వీరారెడ్డిగారి నలుబది యెకరముల యాస్తినిబట్టి వారియింటి కిల్లఱికము వచ్చిన రమణారెడ్డి పంతులు జవాబులోని కటువైన సత్యమును విధిలేక మ్రింగి - పట్టరాని యాగ్రహము వచ్చినను బదులు పల్కుటకుఁ జేతఁగాక యూడుగఱచి మిన్నకుండెను.

అంకినీడు:- పుల్లయ్యతాత వేళాకోళానికేంగాని మన గ్రామం అధోగతిలో ఉన్నమాట వాస్తవం. బస్తీ పదిమైళ్ళలోగాని లేదు. ఆరు మైళ్ళు నడిస్తేగాని రోడ్డు చిక్కదు. ఏదైనా ప్రాణంమీదికి వచ్చినప్పుడు డాక్టరును తీసుకురావడానికి గాని ఆసుపత్రికి వెళ్ళడానికి గాని రాదారి లేదు. వర్షాకాలం రెండెడ్లబండి కూడా సాగదు. మేనాలు బోయీలు మొయ్యమంటున్నారు. మోసినా నలభైలు ఏభైలు అడుగుతారు. నిజమే పాపం! వాళ్ళదీ కష్టమే.

పంతులు:- తరతరాలనుండి ఎట్లా గడిపారోయ్, వేములపల్లి గ్రామస్థులు? నేటికి రోడ్లు లేవని ఉపన్యాసం చేస్తున్నావు!

అంకి:- తరతరాలుగా ఈ బాధ ఉండేదో లేదో మనకెందుకు? ఇప్పుడున్నది కాబట్టి అనుకోవాలి.

పం:- పూర్వం ఇన్ని రోగాలూ ఉండేవి గావు; అసుపత్రులూ ఉండేవి గావు. మీ నాయనమ్మకు పదముగ్గురు సంతానం. చల్లని తల్లి పనులన్నీ తీర్చుకుని కత్తి, పీటా తానే తయారుజేసుకొని మంత్రసానికి తానే కబురుజేసుకొని తీరికగా కూర్చొని కనేది.

రమ:- దటీజ్ ఆల్ రైట్. అట్లా సుఖంగా కంటే మంచిదే. బట్, ఏదైనా అడ్డం దిరిగి కనలేకపోతే దణ్ణంపెట్టి వూరుకునేవాళ్ళా; ఇంకేమైనా జేసేవాళ్ళా?

పం:- అడ్డం దిరగడం ఎన్నడూ లేదు. ఆ రోజుల్లో మనుష్యుల సత్తువ వేరు; వాళ్ళ తిండి వేరు; వాళ్ళ తీరిక వేరు.

రమ:- గతించిన కాలమంతా స్వర్ణయుగ మనడం మనవాళ్ళకు పట్టిన దీర్ఘరోగ మంటాను. అప్పుడు మాత్రం కాన్పులలో ప్రమాదా లుండేవి కావంటే - ఐ డోంట్ బిలీవ్ - నేను నమ్మను.

అంకి:- నేనూ నమ్మను. నే నెఱిగిన తర్వాతే ఈ వూళ్ళో లెక్క లేనంతమంది కనలేక చచ్చిపోయినారు.

పం:- నీవు ఇటీవలి మాట చెపుతున్నావు. నాజూకు బలిసి ఒళ్ళు దాయడం నేర్చి, తిండి నియమం మాని సూపరులాంటి ఎరువులతో పండించిన ఆహారం తినడం మొదలుపెట్టిన తర్వాత కాన్పు ప్రమాదాలే కాదు, తక్కిన రోగాలూ ఎక్కువైనాయి.

అంకి:- ఎందువల్లనైనా గానీ, ఎక్కువైన మాట ఒప్పుకున్నావు గదా! మఱి యిప్పటికైనా యేదో సాధనం చూచుకోవద్దూ? "అప్పిచ్చు వాడు వైద్యుఁడు, ఎప్పుడు నెడతెగక పారు నేఱును, ద్విజుఁడుం, జొప్పడిన యూర నుండుము చొప్పడకున్నట్టి యూరు సొరకుము సుమతీ!" అని నీవే చదివించావు గదా! మన గ్రామానికి వైద్యుడు లేడు. ఏ రోగం వచ్చినా గుంటూరు పరుగెత్తాలి. అది మహా ప్రయాస.

పం:- వైద్యుడు లేకపోవడ మేమిటి? నాగలింగయ్య కంటె వైద్యు డెందుకోయ్? వాళ్ళ నాయన మట్టి నలిచి మాత్ర జేసి పెటితే యెంతెంత రోగాలూ కుదిరి కూర్చుండేవి!

అంకి:- అది మీ రోజుల్లో మాటేమో! ఇప్పు డా పప్పు లుడకడం లేదు తాతా! రోగం నయమైతే నా మహత్తంటాడు. కాకపోతే నీ కర్మంటాడు నాగలింగయ్య. పైగా ఎక్కడలేని భేషజం.

రమ:- గట్టిగా సైన్సు చదువుకొని మాడరన్ మెథడ్సు ప్రకారంచేసే వైద్యం వైద్యంగాని —

పం:- మీ కాలపు వాళ్ళకు ఇంగ్లీషు వ్యామోహం దట్టంగా పట్టుకొన్నది. ఇంగ్లీషువైద్య మేమిటి ? ఇంగ్లీషు మట్టికూడా మంచి దనడం మీ కొక రోగం ! ఏం ? ఋషిప్రోక్తమై యుగయుగాల అనుభవంమీద పైకి వచ్చిన మన ఆయుర్వేదం అంత పనికిరాక పోయిందా ?

అంకి:- పనికిరాక పోదుగాని, తాతా ! మన వైద్యమైనా క్షుణ్ణంగా చదువుకొని చేసేదైతే మంచిదే. చదవడమే కాదు. అనుభవం కూడా ఉండాలి. అటువంటి అనుభవ వైద్యు లిప్పు డెక్కడున్నారు?

పం:- ఉంటే ఆదరించే దెవరు ? ఆ కిరస్తానీ నీళ్ళమీదా, ఆ సూది పోట్లమీదా ఉండే నమ్మకం మన కషాయాల మీదా, మన శీతాంకుశరసాల మీదా, చంద్రోదయాల మీదా లేదాయె ప్రజలకు !

అంకి:- ఇంగ్లీషుమందు పుచ్చుకోగానే రోగం తిరుగుముఖం అవుతుంది. అందువల్ల అటువంటి నమ్మకం కలిగింది. ఇంగ్లీషు వైద్యంలో శస్త్ర చికిత్స ఒకటి నిగ్గుతేలి ప్రజలను బాగా ఆకర్షించింది.

పం:- మనకు మాత్రం లేవటోయ్ శస్త్ర చికిత్సలు ?

రమ:- అబ్సర్డ్ !

అంకి:- శాస్త్రాలలో అన్నీ వుంటాయ్ ! మన అనుభవంలో ఒకటీ కన బడదు. ఇంగ్లీషువైద్యులు కడుపు చీలగోసి పింఢం బైటకులాగి మళ్ళీ కుట్తారు. ఈ నేర్పరితనం మన కెక్కడిది తాతా ?

పం:- కడుపు చీలగోసే అవసరం లేకుండా చేస్తుంది మన ఆయుర్వేదం.

అంకి:- నీ పెడవాదాని కేమిగాని ఏ వైద్యమో ఒక వైద్యం, గ్రామంలో శాస్త్రీయమైన వైద్యసహాయం వుండి తీరాలి జనం సుఖంగా ఉండాలంటే.

రమ:- వైద్య సహాయ మొక టేమిటి ? మీ గ్రామాని కేమున్నది గనుక ! హారిబుల్ ! రోడ్లు లేవు. లైట్లు లేవు. స్కూలు లేదు.

లైబ్రరీ లేదు, న్యూస్‌పేపరు లేదు, రేడియో లేదు. ఊరంతా వంకర టింకర సందులూ, గొందులూ, మోకాటిలోతు బురద, దోమలు, ఎక్కడచూచినా పెంటపోగులు, పశువుల రొచ్చుకంపు, కొంపల కానుకొనే మల విసర్జన. మరీ వానాకాలంలో ఉంటుంది వైకుంఠం! మానవమాత్రు లెవరూ మా ఊళ్ళో ఉండలేరు. నరకం ఇంతటికంటె నయమనుకుంటాను. ముఖ్యమైనది మరిచి పోయినాను. ఇంత పెద్ద గ్రామానికి పరాయి గ్రామస్తు లెవరైనా వస్తే గుక్కెడు కాఫీ తాగడాని కొక్క కాఫీహోటలైనా లేదు!

పం:- కల్లుదుకాణ ముందిగా! కాస్త చాటుగానైనా?

అంకినీడు:- కాఫీహోటలు కాల్చిరిగాని, రమణారెడ్డి చెప్పిన తక్కిన లోటులన్నీ ఉన్నమాట వాస్తవమే. సిరిసంపదలలో, జనసంఖ్యలో ఇంతకంటె తక్కువైన గ్రామాలు దీనికంటె ముందంజ వేసి బాగు పడుతుంటే మనగ్రామం ఇంకా అధోగతిలోనే ఉన్నది. ఈ పరి స్థితిని ఆకలించుకొని కుఱ్ఱవాడైనా మా రాజశేఖరం ఏ వేవో సంస్కారాలు చెయ్యాలని పార్టీలు కలపాలనీ పంచాయతీ, సహ కారం నెలకొల్పాలనీ నాతో తెగ చెప్పుతుండేవాడు పాపం!

రమ:- పాప మంటావు దేనికి? రాజశేఖరం ఎవరు? ఏ మైనా డిప్పుడు?

అంకి:- అదంతా ఒకగాథ. మా పినతండ్రి కుమారుడే వాడు. కాపురం పేదదైనా కష్టపడి ఇంటరు వరకూ చదివి యేదో ఒక కారణంవల్ల చెప్పకుండా యుద్ధంలోకి వెళ్ళాడు. నాలుగు రాళ్ళు సంపాదించాడు. తండ్రికి పంపాడు. ఉత్తరాలు రాస్తూ రాస్తూ మానేశాడు. అసలు పోయి ఇప్పటి కెనిమిదేళ్లు. ఉత్తరాలు నిలిచిపోయి మూడేళ్ళు. ఏమైనాడో తెలియదు. బ్రదికుంటే రాకుండా ఉంటాడా? ఎక్కడో దెబ్బతిని చనిపోయి ఉంటాడు.

రామరాజు:- రాజశేఖరమే బ్రతికుంటే గ్రామం ఇట్లా ఉండేదిగాదు. సంస్కారాలు చెయ్యాలని అతనికెంత ఉబలాటం, పాపం! చదువు కొనే రోజుల్లోనే ఏ వేవో కలలు గనేవాడు. హిందూ ధర్మాలలో,

మన సామాజిక జీవితంలో చాలా మార్పులు తేవాలని నాతో తర్కిస్తుండేవాడు. అతని మాటలిప్పటికీ నా చెవులలో మోగు తున్నట్లుంటాయి. దేశకాల పాత్రల ననుసరించి ధర్మాలు మారి పోవాలనీ, భావం మహా ప్రవాహం లాంటిది కాబట్టి ఒకేచోట ఆగి వుండదనీ, ఆగిపోతే పసరుపట్టిన నీటి మాదిరిగా పురుగులుపడి దుర్వాసన వేస్తుందనీ, కొత్తనీరు వచ్చి పాతనీటిని తోసివేసినట్లు కొత్త భావాలు వచ్చి పాత భావాలను పారదోలివేయాలనీ చెప్తూ తుండేవాడు.

పం:– ఏ కొత్తనీరు వచ్చినా, ఆ పాతనీరు పోయిన దారినే, – ఆ రెండు గట్ల లోగానే ప్రవహించి మళ్ళీ అదే సముద్రములోనే కలవాలి. అది తెలుసునా ?

రామరాజు:– ఆ! తెలియకేం ? రాజశేఖరం చెప్పేవాడు – ఆ రెండు గట్ల మధ్య ప్రదేశమునే సంస్కృతి అనవచ్చుననీ, ఆ సంస్కృతీ ఆ సాంప్రదాయాలూ మారకుండానే భావాలు మాత్రం మారు తుంటాయనీ, ఆ మార్పును పూర్వాచార పరాయణులు గుర్తింప రనీ. అతను చెప్పే ఒక వాక్యంమటుకు నాకు కంఠస్థమై పోయింది. "భూత వర్తమాన కాలాలను సమన్వయపఱచుకొని భవిష్యత్తును చూస్తూ పురోగమించడమే బాగుపడదలచిన యే జాతికైనా కర్తవ్యం" అని. పాపం! ఏ లోకాన ఉన్నాడో !

ఈ మాట లనుసరికి ఒక విధమగు విషాదచ్ఛాయ యందఱి నలముకొనెను. ప్రసంగ మంతటితో నాగిపోయెను "ప్రొద్దెక్కింది లేవం" డని లింగారెడ్డి లేవఁగా నందఱు లేచిరి. సిగరెట్టు ముట్టించి రమణా రెడ్డియు లేచెను. ఆరిపోయిన చుట్ట పారవేసి పుల్లయ్యపంతులు కూడ లేచెను.

# II

# భగ్న మనోరథము

ఎనిమిది సంవత్సరముల క్రిందట నింటిలో నెవ్వరికిఁ జెప్పకుండ యుద్ధములోనికి వెళ్ళిన రాజశేఖరుఁ డెవ్వరో మొట్టమొదట విపులముగఁ దెలిసికొన వలసియున్నది. రాజశేఖరుఁడెవరో గాదు! లచ్చినేని కోదండరామయ్యగారి జ్యేష్ఠ పుత్రుఁడు. వేములపల్లి గ్రామములోఁగల ప్రసిద్ధ కుటుంబములలో కోదండరామయ్యగారి దొకటి. బ్రదికి చెడిన కుటుంబము గావున నింగువ కట్టిన గుడ్డవలె సిరి తొలఁగినను వాసి తొలఁగనిది. సంప్రదాయములకు, నీతి నియమములకుఁ బేరెన్నిక గన్నది. కోదండరామయ్యగారి తండ్రి రాజయ్యగారు వారికాలమున నూరి పెత్తనదారులలో ముఖ్యులట. తగవులు దీర్చుటయందు మిక్కిలి న్యాయ దృష్టియు, నిష్పాక్షికతయుఁ జూపువారని వాడుక. అంతేగాక నిరతాన్న దాత. పేదలపాలిటి కల్పతరువు. కాని తమ తాహతును మించి ధర్మము సేయువారు. పాత్రత యెఱింగిన వారా యనునదికూడ సందేహామే. ఎటులైన నేమి? వారి యవసానమునకుఁ గాపురము చితికిపోయెను. పొలమంతయు నప్పులవారికిఁ గట్టి కొడుకుల కిరువురికిఁ జెఱియొక యైదెకరములు మాత్రము మిగిల్చి పోయిరి. అందుకు వారు కించిత్తైనఁ జింతించి యెఱుఁగరు. "లోకములో నందఱుఁ బెద్ద భూస్వాములై యుండవలయునా? మనుగడ కైదెకరములు చాలదా? శేషించిన యాస్తి నా కుమారులకుఁ జాలకపోవునా? నీతి తప్పక భగవంతుని యెడల విశ్వాసముంచి ప్రవర్తించినయెడల నదియే పదివేలు గాదా" యని సమాధానము చెప్పుచుండువారు. అంతటఁ దృప్తిచెందక యవసాన సమయమునఁ గుమారులను బిలిచి తాము జీవిత నియమములుగాఁ బాటించిన యన్నదానమును బీదలయెడఁ గనికరమును మఱువవలదని నొక్కి చెప్పుచుఁ బరమపదించిరట!

రాజయ్యగారి యిరువురు పుత్రులలో రామకృష్ణయ్యగారు ప్రథములు. కోదండరామయ్యగారు ద్వితీయులు. తండ్రి గతించిన

యనతి కాలములోనే వీరు వేరుపడి యెవరి సంసారము వా రీడుకొనఁ దొడఁగిరి. భార్యవైపునుండి వచ్చిన యాస్తితో రామకృష్ణయ్యగారు ఆర్థికముగఁ దమ్మునికంటె మిన్నయై క్రమక్రమముగఁ "స్థిరాస్తి"ని బెంపొందించుకొనిరి. తన్నుమాలిన ధర్మమొనరించి కాపురము జితుకఁ గొట్టిన తండ్రిగారి యవసానపుటానతిని వీరు లెక్కసేయక ధనార్జనయే జీవిత పరమావధిగాఁ బ్రవర్తింపఁ దొడఁగిరి. కోదండరామయ్యగారు మాత్రము తండ్రిగారి యాజ్ఞను శిరసావహించి పేదఱికము పెంచుకొనిరి.

కోదండరామయ్యగారి కైదుగురు సంతానము. ముగ్గురు కుమార్తెలు. ఇద్దరు కుమారులు. పెండ్లికెదిగిన కూతుళ్ళకు మనువులు కుదిరించుట కెంతయు శ్రమపడిరి. చెప్పుకోఁదగిన యే సంబంధము నమగఁబోయినను గట్నములేనిది కాలువెట్టనీయరైరి. సిరిసంపదల కలవాటుపడిన కోదండరామయ్యగారు పేదపలుకులు పలుకుట కిచ్ఛగింపక పెద్దకూతుళ్ళకుఁ జెఱియొక యెకరము నిచ్చి పెండ్లి గావించిరి. కడగొట్టు కూతురగు రుక్మిణమ్మ చిన్నదగుటచే నప్పటికిఁ దొందరలేక పోయెను. వివాహములకును, దక్కిన యనివార్యకార్యములకు నైన ఋణములు దీర్చుటకై మఱియొక రెండెకరము లమ్మివేసెను. మిగిలిన యెకరముతో సంసారము జరుగక పూవులమ్మిన వాడలలోఁ గట్టెలమ్మినట్లు ఒకప్పుడు విశాల భూస్వామియైన కోదండరామయ్యగారు క్రమక్రమముగాఁ బాలిపాలములు సేయుటకుఁ బాల్పడిరి.

పిత్రార్జితములో కోదండరామయ్యగారికి మిగిలిన దొక యెకరము పొలము. ఒక మండువా లోగిలి. అట్లయ్యును దండ్రియానతి విస్మరింపక పాలిపొలములలోఁ గష్టించి గడించిన ఫలసాయముతోడనే యతిథి సత్కారములు జరుపుచుఁ బేదసాదుల నాదరించుచు గుంభనగాఁ గాపురము సేయుచుండిరి. భార్య సీతమ్మగారును బతికిఁ దగిన సతి. పెద్దగాఁ బెట్టనేర్చిన చేయిగావునఁ గాపురము చితికిపోయినను, గలిగినంతలో లేదనక దరిద్రనారాయణార్చన సేయుచుండెడిది. తాను పస్తుండియైన నతిథులఁ దన్పునది. నల్లపూస, మంటిగాజు దక్క నింకే నగలు

లేకున్నను సీతమ్మగారు నుదుటఁ బెద్ద కాసంత దిద్ది ముంగిట నిలుచుం డినయెడల నన్నపూర్ణ భవానియే యట్లు రూపొంది నిలిచెనా యని యనిపించుచుఁజూచువారికిఁ జేయెత్తి దండమిడవలయునని యనిపించెడిది.

ఇరుగుపొరుగువారి కీ పుణ్యదంపతులు తలలోని నాల్కలు. ఇంటియెదుటి నల్లపాటి వెంకటరెడ్డిగారి కుటుంబమునకును వీరికి నత్యంత మైత్రి. తుల్యసంపదగల రోజులలో నెట్టి యన్యోన్యాభిమాన ముండె డిదో, అట్టి అభిమానమే నేటికి నీ కుటుంబములలో నిలచి యుండినది. ఒకరు కమ్మవారు, రెండవవారు రెడ్లు నన్న కులభేదము లోకమునకే కాని వారికిఁ గాదన్నట్లుండెను. రెడ్డిగారును కోదండరామయ్యగారు నొండొరుల "బావా" యని పిలిచికొందురు. రెడ్డిగారి భార్య లక్ష్మమ్మ గారు సీతమ్మగారిని "వదినె" యని, కోదండరామయ్యగారిని "అన్న" యని పిలుచును. సీతమ్మగారును రెడ్డిదంపతుల నదేవరుసతోఁ బిలుచును.

కోదండరామయ్యగారి యిద్దరు కుమారులలో రాజశేఖరరావు పెద్దవాఁడు, శ్రీరాములు రెండవవాఁడు. రెండవ కుమారుని వ్యవసా యములోఁ దమచేతి కండగాఁగొని పెద్దవాఁడగు రాజశేఖరున కెట్లేని జదువు చెప్పించి యుద్యోగము చేయింపవలయునని కోదండ రామయ్యగారు సంకల్పించిరి. లేని కాపురము. మితిమీరిన ఖర్చు. లేదనరాని వంశమర్యాద. పొక్కఁగూడని సంసారపుగుట్టు. ఈ పరిస్థితు లలో రాజశేఖరుని గుంటూరుపంపి యచ్చ టతనికి విద్యాభ్యాసవసతి నేర్పఱచుట కా మానవుఁడెంత శ్రమపడెనో భగవంతునికే యెఱుక. తండ్రి సంకల్పమును గుటుంబ పరిస్థితిని జక్కఁగా గ్రహించినవాఁడు గావున రాజశేఖరరావు బహు శ్రద్ధా భక్తులతోఁ జదువనారంభించెను. పట్టణవాసపు దురభ్యాసములకుఁ దోడి విద్యార్థుల దుందుడుకుఁ దనమునకు సుదూరముగా మెలఁగనేర్చెను. తప్పనిసరిగ నెంత వ్యయము గావలయునో యంతే చేయువాఁడు. ఒక్కపైసయైన దుర్వ్యయము చేసి యెఱుఁగఁడు. హోటలుఖర్చు, గది యద్దె, బడి జీతము, పుస్తకముల ఖరీదు తప్ప మఱి యే వ్యయము నత డెఱుఁగడు. కాఫీ హోటలులును, సినిమాలును నియమముగా విసర్జించెను. సహాధ్యా

యులు తమ డబ్బుతో నా వేడుకలకు రమ్మని బలవంతము చేసినను డబ్బులేక వానిని దాను విసర్జింపలేదనియు విద్యార్థిదశయం దది తన నియమ మనియు వారికి నచ్చఁజెప్పి తప్పించుకొనువాఁడు. నాల్గవ ఫారమునకు వచ్చినమీఁదటఁ జదువుఖర్చు పెఱుఁగుటచే హోటలులోఁ దినుటమాని సొంతముగా వంటజేసికొనువాఁడు. ఇంటినుండి యూరుగాయలు బచ్చడులు తెచ్చుకొని మజ్జిగ మాత్రము కొని స్వల్ప వ్యయముతో భోజనము జరుపుకొనువాఁడు. పేదఱికమువలనఁ దా నిట్లు చేయవలసి వచ్చినను జూచువారి కెవ్వరికిని దన గుట్టు తెలియనిచ్చువాఁడు గాఁడు. తన గదిని తానే యూడ్చుకొని చిఱుచాప పఱచుకొని తలగడదక్క మఱే శయన సౌకర్యములుఁ గోరక బ్రహ్మచర్యమన నిట్లుండవలయునుగదా యని యనిపించువాఁడు. జాగరూకుఁడై కాపాడుకొన్న యారోగ్యము; అందుచే నప్పుడే వికసించిన యరవిందమువలెఁ గళకళలాడుచున్న వదనబింబము, చిఱునగవుఁ బూఁతపూచిన గంభీర మానముద్ర, ఇన్నిటిచే నినుమడించిన సహజరూప వైభవము! రాజశేఖరుఁడు విద్యార్థి దశయందుఁ జూడముచ్చటఁగొలుపుచు సహాధ్యాయుల కాదర్శప్రాయుఁడై గురువుల వాత్సల్యముఁ జూఱఁగొనువాఁడు. మఱి యాశ్చర్యమా? ఆలస్యముగాఁ జదువునఁ బ్రవేశించుటచేఁ బదునేడేండ్లకుఁగాని స్కూలుఫైనలు తరగతికిఁ జేరలేకపోయినను బరీక్షయందు ప్రశంసాపాత్రమగు విజయ మొందెను. వెంటనే యుద్యోగమునఁ జేరుటకు వయస్సు చాలమిచే నప్పటి కా ప్రయత్నము మానుకొనవలసి వచ్చెను. మఱి యూరక యింటఁ గూర్చుండుటకంటె నింక రెండేండ్లపాటు కళాశాలయం దున్నతవిద్యాభ్యాసము సేయుట మంచిదని రాజశేఖరునకుఁ దోఁచెనుగాని, కాలేజీఖర్చు తండ్రి భరింపలేఁడని సందేహించెను. కుమారుని మనస్థితి నవగాహనముచేసికొన్న కోదండరామయ్యగారు "నాయనా, ఈ లేతవయస్సులో నీవు చేయగల ఉద్యోగంగానీ, వ్యాపారంగానీ లేదు. ఎట్లాగో ఇంకా రెండేళ్లపాటు శ్రమపడదాం. చదువు సాగనీ," అని తామే బలవంతముచేసి ఇంటరు రెండేండ్లను జదివించిరి. ఆ రెండు సంవత్సరములు డబ్బు పుట్టించు

కొనుటకుఁ దండ్రియు, వ్యయము తగ్గించుటకుఁ గుమారుఁడును బడిన బాధలు వారిద్దరికే తెలియును. ఎట్లైన నేమి? ఇంటరు పూర్తిచేసి రాజశేఖరుఁ డింటికిఁ జేరెను. పరీక్షయందు ప్రథమ శ్రేణిలో నుత్తీర్ణుఁడయ్యెను.

సహజముగ బుద్ధివైభవము విగ్రహరామణీయకముగల రాజశేఖరుఁడు విద్యాభ్యాసకారణమున మఱింత మెఱుఁగుదేరి సానఁబెట్టిన జాతిరత్నమువలెఁ బ్రకాశింపఁదొడఁగెను. తల్లిదండ్రులకేకాక యూరివారందఱికిఁగూడ నతఁడు కన్నులపండువయ్యెను. పరీక్షాఫలితములు తెలిసిన మఱునాఁడు సాయంకాలము ఎదురింటి వెంకటరెడ్డిగారు రాజశేఖరుని బిలిచి యరుగుమీఁదఁగూర్చుండఁబెట్టి లోకాభిరామాయణము సేయుచు నిట్లనిరి.

వెంకటరెడ్డి:– అయితే, రాజశేఖరం, నీ చదు వింతటితో పూర్తి ఐనట్లేనా?

రాజ:– చదువు పూర్తికావడం అనేది లేదు మామా! ఒక జన్మలో గాదు. అనేక జన్మలలో కూడా గాదు.

వెంక:– ఆ మాట సరే, నే నడిగిం దది కాదు. ఇప్పటిలో నీవు చదవదగినంత చదివినావా? అని.

రాజ:– లేదు. ఇంకా ఓపికుంటే బి. ఏ., యం. ఏ. చదవవచ్చు. కాని ఇప్పటికే పెటపెటలాడింది. నీకు తెలియం దేమున్నది మామా, మా కుటుంబ పరిస్థితి?

వెంక:– అవును. ఓడ బండి, బండి ఓడ అయిపోయింది. మనమేం చెయ్యగలం? మరి ముందు కర్తవ్యం? ఉద్యోగంలో ప్రవేశిస్తావా?

రాజ:– చదువుకోవడం ఉద్యోగం చేయడానికే అని అందఱితోపాటు నేనూ చదువులో ప్రవేశించాను. అదే వుద్దేశ్యంతో నాయనకూడా శ్రమపడి చదువు చెప్పించాడు. సంసార పరిస్థితిని చూచినా, ఉద్యోగం తప్పనిసరి అనిపిస్తున్నది.

వెంక:– అదేమిటోయ్, ఇంతగా చదువుకొని వుద్యోగం చేయక ఇంకేం చేస్తావ్?

ఈ మాట వినుసరికి రాజశేఖరునకు నవ్వు వచ్చెను. కాని నవ్వాపుకొని "ఏదైనా చెయ్యవచ్చు మామా!" అని బదులుచెప్పెను.

వెంక:- ఏంచేస్తావ్! వ్యవసాయమా, వ్యాపారమా ? ఇవిచేయడానికి చదువు లెందుకోయ్ !

ఈ ప్రశ్నకు జవాబు చెప్పుట సులభమైన పనికాదని రాజశేఖరుఁ డాలోచించుచుండఁగా "రా, నాయనా, రాజశేఖరం, నీవూ, మీ మామ ఫలాహారం చేద్దురుగాని" అని లక్ష్మమ్మగారు లోననుండి పిలిచి "శాంతా! ఉయ్యాలబల్లమీఁద బట్టలుతీసి సర్దవే" యని కూతునకు ముదల యిచ్చెను. వెంకటరెడ్డిగారు "రావోయ్, లోపలికి" అని రాజశేఖరునితో లోని కేఁగెను. ఇరువురు నుయ్యాలబల్లపైఁ గూర్చుండిరి. "ఇంతగా చదువుకొని ఉద్యోగంచేయ కింకేం చేస్తావు" అన్న రెడ్డిగారి ప్రశ్న రాజశేఖరుని హృదయకుహరములోఁ బ్రతిధ్వనించుచునే యుండెను. అందుచే నతఁడు పరధ్యానములో దిక్కులు చూచుచుండెను. రెడ్డిగా రింకేమైనఁ బ్రశ్న లడిగిరోయేమో, తానేమైనఁ బ్రత్యుత్తరము లిచ్చెనో యేమో, యతనికే తెలియకుండెను. ఇంతలో రెండు పళ్లెరములనిండ మినుపయుండలు, చక్కిలములు, అరటిపండ్లు తెచ్చి లక్ష్మమ్మగారు వారి ముందిడి "శాంతా, మంచినీళ్ళు పెట్టిపో అమ్మా," అని కూతును బిలిచి "కానియ్యి నాయనా, రాజశేఖరం, ఏమిటో ఆలోచిస్తున్నావ్; మా యిల్లు కొత్తా నీకు ?" అని హెచ్చరించెను. రాజశేఖరుఁడు తెచ్చికోలు మందహాసముతో "నాకేం క్రొత్త" యని జవాబు చెప్పుచు ఫలాహారము సేయఁదొడఁగెను. లక్ష్మమ్మగారు "శాంతా, ఇంకా మంచినీళ్ళు తేలేదటే" అని కూతును దిరిగి పిలుచునంతలోఁ బదునాలేండ్ల వడుచగు శాంతాదేవి రెండు కంచు చెంబులతో మంచినీరు తెచ్చి, వారికడ నుంచి యరిగెను. "బావ వుద్యోగం చెయ్యబోతున్నాడనా పలకరించకుండాపోతున్నావుశాంతా!" యని, తల్లి కూతును జిఱునగవుతోఁ బ్రశ్నించి "అయితే బాబూ, నీకేం పని వస్తుంది ? జీత మెంత చిక్కుతుంది ? ఏదోలే, కష్టపడ్డందుకు అక్కరకు వస్తున్నది. తొందరగా పనిలోచేరి నాయన కష్టం తీర్చు"

అని రాజశేఖరునితో సంభాషణకుఁ గడఁగెను. రెడ్డిగారు "రాజశేఖరం 'ఉద్యోగం చేద్దామా, వద్దా' అని ఆలోచనలోపడ్డాడు, తెలుసునా?" యని భార్య నడిగెను. "అదేమిటి నాయనా, ఇంత చదువు చదివి వుద్యోగం చెయ్యక ఇంకేం చేస్తావు" అని సాశ్చర్యముగాఁ బలికెను. తిరిగి అదే ప్రశ్న! ఈ మాటలు వినుచున్న శాంతాదేవి తలుపోరగా నిలుచుండి "చదువుకున్నవాళ్ళు ఉద్యోగానికి తప్ప మరిదేనికి పనికి రారా, అమ్మా!" అని మృదుమధుర కంఠముతో నమృతమొలకఁ బోసినట్లు ప్రశ్నించెను. కృతజ్ఞతాపూర్వకముగ శాంత దిక్కునకుఁ జూడ్కి పఱపి రాజశేఖరుఁడు "శాంతా, నీ చదువెంతలో ఉన్నది? పంచకావ్యాలు పూర్తి అయినవా? హిందీ ఎంతవఱకు వశమైనది" అని యుద్యోగప్రసంగము తప్పించి ప్రశ్నించెను. "చదువు కేమిలే బాబూ, నీవు తెచ్చిపెట్టిన పుస్తకాలు యావత్తూ చదివింది, నీవు సెలవులలో చెప్పిన పాఠాలు గట్టిచేసుకొని తరువాత తనంతట తానే కొత్తపాఠాలు చదువుకొంటూ శాంత చదువులో బాగానే యెక్కి వచ్చింది. కాని..." అని లక్ష్మమ్మగారేదో యసంతృప్తి ప్రకటించు నంతలో వెంకటరెడ్డిగారి కుమారుఁడు రాఘవరెడ్డి చరచర లోనఁ బ్రవేశించి ''రాజశేఖరునితో "ఏమోయ్, బావా, ఇంటర్ మెట్టు బలేగా ప్యాసయ్యావంటే, పెద్దపనోస్తే మమ్ముల మాట్లాడిస్తావో లేదో" యని పరిహాసములకు దిగెను. తిరిగి యుద్యోగ ప్రశ్నయే! పరీక్షాఫలితములు దెలిసిన క్రొత్తలో నతఁ డెచ్చట కేఁగిన నిదే ప్రసంగము. అతఁడు దాని నెంతగాఁ దప్పించుకొనఁదలఁచెనో యంతగా నది యెదురగుచుండెను.

తక్కినలోక మెట్లున్నను దండ్రిమాట రాజశేఖరునికి దురాయి ముడివంటిది. తండ్రియెడ నతని భక్తి యద్వితీయము; అచంచలము. తన విద్యాభ్యాసమునకుఁ దండ్రిపడిన బాధ లతని కాజన్మాంత స్మరణీయములు. చేదివి యుద్యోగముచేసి తనచేతి కండ కాఁగలఁడనియే గదా తండ్రి యంతగాఁ దనను జేదివించెను! కావున నుద్యోగమునందుఁ దనకెంత వైముఖ్య మేర్పడినను దండ్రితోఁ దన భావము దెలుపుటకు

భయపడెను. తన భావమెఱిగిన యెడలఁ దండ్రికిఁ గలుగు నాశాభంగము నూహించి రాజశేఖరుఁ డెట్టకేలకు నుద్యోగజీవనమే తన కవశ్యకర్తవ్యముగా నిర్ణయించుకొనెను. మానవసేవకై యుబ్బాఁతలూఁగు తన యంతరాత్మ నెట్లో సమాధాన పఱచుకొనెను.

ఉద్యోగ సంపాదన మెంత ప్రయాసకరమో రాజశేఖరునకు మొదటఁ దెలియదయ్యెను. సర్వీసెస్ కమీషన్‌వారుచేయు పరీక్షలలో నుత్తీర్ణుఁడైనఁగాని తన కుద్యోగము దొరకదు. కాని యాపరీక్షలింక నాలుగు మాసములకుఁగాని జరుగవు. ఆలోఁగాఁ దాత్కాలికోద్యోగ మేదైన లభింపదా యను నాశతోఁ బట్టణములోఁగల ప్రతి యాఫీసునకుఁబోయి దరఖాస్తుచేసెను. 'ఖాళీలే'దను జవాబుకన్న ఫలమెచ్చటను దక్కదయ్యెను. అధికారుల సందర్శించునపు డతనికిఁ బలుతావుల నాత్మగౌరవము భంగమయ్యెను. శిఫారసులున్నచోఁ దన యత్నము సఫలము గావచ్చునని వినెనుగాని యర్థించు టెఱుఁగని రాజశేఖరునకు శిఫారసు భిక్షాటన మిగుల నసహ్యమయ్యెను. దరఖాస్తు పుచ్చుకొని కొందఱు తలయెత్తియేనిఁ జూడరైరి. కొందఱు చిరాకు పడిరి. కొందఱు దర్శనమొసఁగుటకే యిచ్చగింపకపోయిరి. "ఉద్యోగాలు రాసిపోసి యున్నవా ? వెళ్లు, వెళ్లు" మని కొంద ఱనిరి. "రేపురా, మాపురా" యని కొందఱనిరి. "నీబోంట్ల కుద్యోగము దేనికయ్యా, వ్యవసాయం జేసుకోరాదా" యని కొందఱు ప్రశ్నించిరి. కొందఱు పరిహాసముచేసిరి. కొందఱు పరాభవించిరి. కొందఱు నిరుత్సాహపఱచిరి. ప్రపంచ మెఱుఁగని యా నిష్కల్మష యువక హృదయమునకు లోకవృత్త మెట్టిదో క్రమముగా బోధపడఁ దొడఁగెను.

తా నొల్లని పనియైనను దండ్రిని సంతృప్తిపఱచుటకును, దండ్రికార్థికసహాయము చేయుటకును దహతహపడుచుఁ బాప మతఁడు నాలుగు మాసములు వెఱ్ఱివానివలె నుద్యోగాన్వేషణ మొనర్చెను. కాని యతని ప్రయత్నము లన్నియు నిష్ఫలమయ్యెను. ఒక యాఫీసులో సుబ్రహ్మణ్యముగారను నొక వయసుమీరిన గుమాస్తా రాజశేఖరుని వృత్తాంతమంతయు విని యతనిపై నభిమానముగలిగి తాను రెండు

మాసములు సెలవుపెట్టి యాస్థానమున నతనిఁ బ్రవేశపెట్టుటకుఁ బ్రయత్నించెను. ఆయనకు సెలవు మంజూరయ్యెనుగాని యాస్థానము మాత్రము శిఫారసు బలముగల యింకొక యువకుని కీయఁబడెను. ఇందులకు రాజశేఖరుడు మిగుల వగచెను. తన కుద్యోగము రానందు లకుఁగాదు. తనయెడల సానుభూతి చూపిన సుబ్రహ్మణ్యముగారి సెలవు వృథాయైనందులకు! సుబ్రహ్మణ్యముగారును జాల విచారించి రాజ శేఖరునితో నిట్లనిరి. "అబ్బాయీ, గుమస్తాపని వాంఛనీయంకాదు. నీ బోటివాడు చెయ్యతగినదికాదు. అప్పటికి నీ పరిస్థితిని విని తాత్కా లికంగానైనా నీకు స్థానం కల్పించాలని నేను ప్రయత్నిస్తే విధి అడ్డు తగిలింది. భగవంతు డేదిచేసినా మన మంచికే అంటారు పెద్దలు! దేవు డీ ప్రయత్న మెందుకు భంగపరచాడో! మంచికే అని నా నమ్మకం. కాబట్టి నీవు విచారించవద్దు. నీబోటి యువకు లుద్యోగంలో చేరి మా మాదిరి చీకిచీకిపోవడంకంటే దేశసేవ, మానవసేవచేసి తరించా లని నా కోరిక. అందుకు భగవంతుడే దారిచూపిస్తాడు. అతడే నిన్ను పోషిస్తాడు. సేవాకార్యానికి పనికిరానివారు-ఉద్యోగానికి తప్ప దేనికీ కొరమాలినవారూ ఉద్యోగంలో చేరకతప్పదు; చేరుతారు. నీవాలకం, మనఃప్రవృత్తీ విచారిస్తే నీవు దేశాని కుపయోగించే వ్యక్తిలాగ ఉన్నావు. భగవంతుడు నీకు తప్పక తోడ్పడతాడు" అని యాశీర్వ దించెను. కృతజ్ఞతా పూర్వకముగా నాయనకు నమస్కరించి బదులు పలుకుటకు మాటలురాక రాజశేఖరుఁడు దిరిగివచ్చెను. తన హృదయ ములోనున్న భావమును సుబ్రహ్మణ్యముగా రెట్లు గ్రహించిరో యని యాశ్చర్యపడెను. తన మనమున నస్ఫుటముగఁ బొదలుచుండిన భావముల కాయన సూచన లొక ప్రస్ఫుటరూపము నొసంగెను. కాని తా నింకను నస్వతంత్రుఁడు. పితృఋణభార వినతుఁడు. తన యభిలాష నిప్పటిలోఁ దీర్చుకొనఁజూచుట తండ్రి కెగ్గుసేత. కావున నుద్యోగ ప్రయత్నము విరమింపఁజాలఁడయ్యెను.

ఇట్లుద్యోగమునకై నిష్ఫల ప్రయత్నములు చేయుచు నాలుగు మాసములు గడిపెను. అంతలో సర్వీసెస్ కమీషన్‌వారి పరీక్షలు

ప్రకటింపఁబడెను. రాజశేఖరుఁడు పరీక్షలోఁ గృతార్థుఁ డయ్యెను. చిత్తూరుజిల్లాలో స్కూళ్ళయిన్స్పెక్టరుగారి యాఫీసునందు గుమస్తాగా నతఁడు నియమితుఁ డయ్యెను. జీతము నెలకు ముప్పది రూపాయలు. రెండేళ్ళ కొక మూఁడు రూపాయలు వేతనాభివృద్ధి. అట్లు ఏఁబది యైదు రూపాయలవఱకు వృద్ధి యగునట. నియామకపు టుత్తరువు వచ్చినదని విని కోదండరామయ్యగారు మిగుల సంతసించిరి. నేటికిఁ దమ శ్రమయంతయు ఫలించెననియుఁ దన కుమారుఁ డుద్యోగియై గౌరవపదవికిఁ జేరి తనకు సహాయపడుననియు నుబ్బిపోయిరి. కాని దాని బాధలన్నియుఁ గుమారుఁడు చెప్పఁగా విని యుస్సురుమనిరి. చిత్తూరు చాలదూరము. రానుబోను రైలు ఖర్చులకే పన్నెండు రూపాయ లగును. రాజశేఖరుఁ డచ్చట నొంటరిగానుండి హోటలులలో భోజనము చేయవలయును. జీత మతని ఖర్చులకే చాలదు. ఉద్యోగమూ స్వల్పము. భవిష్యత్తులో రాఁగల యభివృద్ధి యేదియు లేదు. ఎన్నాళ్ళును గుమాస్తాగానే యుండవలయును. ఇట్టి యుద్యోగమునకై వందలకొలఁది మైళ్ళుపోయి తిప్పలు పడుట దేనికని కోదండరామయ్యగారే పెదవి విఱచిరి. దగ్గరలో నేదైన మంచిపని దొరకు నేమో ప్రయత్నింపుమని కుమారు నుద్బోధించిరి. అది సాధ్యమైన పని కాకపోయినను దండ్రి చెప్పినమేరకు రాజశేఖరుఁడు హృదయపూర్వకముగాఁ బ్రయత్నింపసాగెను. ఫలము శూన్యమనుట పునరుక్తియే !

ఇట్లొక సంవత్సరము గడచెను. రాజశేఖరునకుఁ గడచినకాలమంతయు నొక యెత్తు. ఈ సంవత్సర మొక యెత్తు. చదివిన ఫలమతని కే తీరునను దక్కదయ్యె. అటు తండ్రికి సాయపడలేకపోయె. ఇటు తన యభిలాష ననుసరించి ప్రజాసేవయుఁ జేయలేకపోయె. పైగా తా నింకను వృద్ధజనకుని సంపాదనపై నాధారపడవలసి వచ్చెను. సంపాదన లేక వృథా తండుల వ్యయ మొనర్చుచు నింటఁ బడియుండుట యతనికి నరకప్రాయమయ్యెను. అందుచే నూరివారికిఁ గూడ నతని యెడల గౌరవము తగ్గుచున్నట్లతఁడు శంకించెను. "ఇంకా ఉద్యోగంలో

చేరలేదా” యని పుల్లయ్యపంతు లప్పుడప్పుడు వేళాకోళముగూడ చేయుచుండెను. ఉద్యోగము చేయకున్న వ్యవసాయమునందైనఁ దండ్రికిఁ దోడు గాఁదలఁచెనుగాని చదువుకొన్న యువకునిచే సేద్యము చేయించుట గౌరవభంగమని తండ్రి యా పని కొల్లడయ్యెను. కుమారుని మనస్థితిని శీలమును బాగుగా గుర్తించినవారు గావున కోదండ రామయ్యగారు రాజశేఖరుని హృదయము నే మాత్రము నొప్పింపక భగవంతుఁ డొకప్పటికైన ననుగ్రహింపఁడా యని కాలము పుచ్చుచుండెను. తండ్రి యభిమతమునకు విరుద్ధముగా మంచిపనియైనఁ జేయకుండుట రాజశేఖరుని లక్షణము. అది యవలక్షణమని యతఁడు భావించినను దండ్రి యెడఁగల భక్తివలన దానిని జయింపలేకుండెను. ఇట్లతనికి నానాఁటికి హృదయభార మతిశయించుచుండెను. అన్నపానాదులయందు వైమనస్య మేర్పడెను. శరీరము కృశించెను. తల్లి కనిపట్టెనుగాని కర్తవ్య మెఱుఁగక మిన్నకుండెను. తానును దిగులు పడుచుండెను.

రాజశేఖరుని జీవితాకాశమున నిట్లు విషాద మేఘము లలముకొని యున్న కాలమున నొకనాటి యుదయము వెంకటరెడ్డిగారి యింటికెవరో క్రొత్త బంధువులు వచ్చిరి. వారికి మర్యాదలు చేయుటకై యింటివారు త్రొక్కులాడుచుండిరి. రాఘవరెడ్డి హడావుడిగ నిటునటుఁ దిరుగుచుండెను. తల్లియుఁ దానును దమ యింటి ముంగిటి యరుగుమీఁదఁ గూర్చుండి యీ సందడి చూచుచుండుటచే రాజశేఖరుఁడు రెడ్డిగా రింట్లో యేమిటమ్మా సందడి ? చుట్టాలెవరో మోపుగా వచ్చినట్లున్నారు ! పాత బంధువులుగా లేరే” యని తల్లి నడిగెను. సీతమ్మగారు రాఘవరెడ్డిని బిలిచి “ఏమిటినాయనా, యివ్వాళ మనయింట్లో ఆ చుట్టాలెవరు ?” అని ప్రశ్నించెను.

రాఘవరెడ్డి:- క్రొత్తచుట్టాలత్తా ! నీ వెరగవా యింకా ? శాంతమ్మకు ఎట్లాగైతేనేం సంబంధం కుదిరింది చివరకు. ఇవ్వాళే అమ్మాయిని చూడడాని కొచ్చారు.

సీతమ్మ:- ఏవూరు ?

రాఘు:- నరసారావుపేట. బాగా ఉన్నవాళ్ళట. పదెకరాలూ, పదివేలూ ఇస్తామనేవరకూ వొంగిరాలేదు.
సీతమ్మ:- పిల్లవాడు చదువుకున్నవాడేనా ?
రాఘు:- ఆ, బియ్యేవరకూ చదివాడంట. అదేంటో పోలీసు ఇనస్పెట్టరు మాదిరి దిరుసేస్తాడు, కల్లు సారాలమీద పనంట !
రాజ:- ఎక్సైజు సబిన్స్పెక్టరు కాబోలు !
రాఘు:- ఆఁ, ఆఁ, అదేపని.
సీతమ్మ:- పిల్లవా డందంగా ఉంటాడా ? నీవు చూచావా నాయనా ?
రాఘు:- నేను చూడ్డమేమిటి ? నీవూ చూడవచ్చు. ఇక్కడకొచ్చాడుగా, అతనుగూడ; అత్తా ! నిజానికి నాకతను నచ్చలేదు. నల్లగా, పొట్టిగా దుత్తలాగుంటాడు. నేను కాదన్నానుగాని 'ఒకటి కుదిరితే ఒకటి కుదరడంలేదు. ఇంతకన్నా మంచి సంబంధం దొరక'దని నాయన నన్ను అణిచిపెట్టాడు.
సీతమ్మ:- అంద చందాలకేమిలే, బాబూ ! కోసుకుతింటారా ? అందులో మగవాడెట్లావుంటేయేం ? చదువుకొన్నాడు. పెద్ద వుద్యోగం, పైగా కలవాళ్ళంటివి. బుద్ధి మంచిదైతే తక్కిన వెట్లా వున్నా ఫరవాలేదు.

ఇంతలోఁ దండ్రీ కేక విని రాఘవరెడ్డి వెంటనే యేదో పనిమీఁద వెడలిపోయెను. సీతమ్మగారు లోనికేగిరి. రాజశేఖరుఁడు "శాంత వివాహమా !" యని మాత్ర ముచ్చరించి యేదో యాలోచనలో మునిఁగిపోయెను.

రాజశేఖరుఁడు గంభీరుఁడు. వయస్సు చిన్నదయ్యుఁ బెద్దయాశయములు గలవాఁడు. ఉదాత్తములగు జీవిత నియమములను గల్పించుకొని వానిని బాటించుటలో నెన్ని కష్టములకైనఁ బాల్పడఁ దయారైనవాఁడు. పితృభక్తి యొక్కటే యతని యభిమతముల ననుసరించి ప్రవర్తించుట కాటంక మగుచుండును. చేదువు చాలించిన తరువాత నొక సంవత్సరము కాల మట్లే గడుపఁగలిగెను. కాని నాఁడు మాత్ర మేదో యపూర్వమగు వజ్రసంకల్పమొకటి యతని హృద

యము నావేశించినట్లు తోఁచెను. ఆ సంకల్పము పితృభక్తికంటె బలవత్తరమేమో! మొత్తముమీఁద రాజశేఖరుఁ డా నాఁడు మామూలుకన్న భిన్నముగను, వింతగను బ్రవర్తించెను. తన పెదతండ్రి కుమారుఁడగు నంకినీనితోఁ బ్రతిదినము సేయు ప్రసంగము లానాఁడు చేయఁజాలక యొంటరితనము నభిలషించెను. ఒక్కొక్క సమయమున విషాదము, నొక్కొక్క సమయమున నేదో యాందోళన, మఱియొక సమయమున దృఢసంకల్ప చిహ్నములు నతని వదనమున గోచరించు చుండెను. ఆనాఁ డెట్లో ప్రొద్దు గ్రుంకెను.

మరునాటి యుదయమున రాజశేఖరు డింట లేఁడు. మధ్యాహ్నమువఱకుఁ జూచిచూచి తల్లిదండ్రు లప్పటినుండి యాందోళన పడసాఁగిరి. ముందెన్నఁడు నట్లు చెప్పకుండ నెచ్చటికి నరిగినవాఁడు గాఁడు. వ్రేలెత్తి చూపుటకు వంకలేని సత్ప్రవర్తన; తండ్రి యభిమతమున కేసుంతయు విరుద్ధముగఁ బోవువాఁడుగాఁడు. తలిదండ్రు లాతనిఁ బల్లెత్తి మాట యనెడివారుగారు. మఱి యతని యంతర్ధానము వారి కాశ్చర్య విషాదములు గొలుపుటలో వింతయేమి? మూఁడురోజులు గడచెను. జననీజనకుల విషాద మతిశయించెను. రత్నమువంటి బిడ్డ! సిద్ధాన్నమువలె నక్కఱకు వచ్చినవాఁడు. ఎంత గంభీర హృదయులైనను దల్లిదండ్రు లాతని శోకము వాపోవకుండఁగలరా? వా రా మూఁడురోజు లన్నము నీరు ముట్టరైరి. వెంకటరెడ్డిగారు, వారి కుటుంబము, వీరి నోదార్చుట కెంతయో ప్రయత్నించిరి. వాస్తవముగ వీరి శోకమును వారు సమముగఁ బంచికొనిరి. రామకృష్ణయ్యగారు తమ్ముని నోదార్పవచ్చి రాజశేఖరుఁడు తమ నడిగి యైదురూపాయలు తీసికొనిపోయినట్లు వార్తయొకటి చెప్పిరి. ఏదో యొక వ్యూహము తోడనే యతఁ డిట్లు చేసియుండునని వా రూహించిరి. నాల్గవనాఁడు పోస్టు జవాను లచ్చినేని కోదండరామయ్యగారి కొక కవరు బట్వాడా చేసెను. ఉత్తరములు వచ్చు టెఱుఁగని కోదండరామయ్యగారు సంభ్రమాశ్చర్యములతో కవరు చించి ఇట్లు చదువుకొనిరి.

"పూజ్యులగు తండ్రిగారి పాదపద్మములకు నమస్కరించి కుమారుడు వ్రాసికొను విన్నపములు.

మీ అనుమతి లేకుండా, ఎవరికీ చెప్పకుండా హఠాత్తుగా ఇల్లు వదలి వచ్చినందుకు మొదట క్షమాపణ కోరుకొంటున్నాను. చదువు చాలించిన యీ సంవత్సరంనుండీ యింట్లో తిని కూర్చోనడం నాకు సహించరానిపని అయింది. వాత్సల్యంవల్ల మీరు నన్నెంత మన్నిస్తున్నా పెరిగి పెద్దవాడనై మీ కేమాత్రం సహాయం చెయ్యకపోగా, ఇంకా మీ కష్టఫలాన్నే అనుభవించడం నాకు ధర్మవిరుద్ధంగా తోచింది. ఉద్యోగం చిక్కనందున సేద్యంలోనైనా మీకు తోడ్పడదామని ప్రయత్నిస్తే అందుకు మీ రొప్పుకోలేరు. ఎట్లాగైనా ఆర్జనకు దిగి మీకు సేవ చెయ్యడమే నా పరమధర్మమని నా అంతరాత్మ నాకు బోధించింది. ఈ ధర్మాన్ని దృష్టిలో పెట్టుకొని నేనేది చేసినా నేరం కాదని నేను నిర్ణయించుకొన్నాను. ఉద్యోగం లేక, సంపాదనలేక పౌరుషహీనంగా జేసే జీవితంలో చెప్పడానికి వీలుగాని నా మనోరథం ఒకటి భగ్నమై పోయింది. ఇటువంటి బ్రదుకు భరింపలేక కనీసం పితృసేవా ధర్మమైనా నెరవేర్చే ఉద్దేశ్యంతో యుద్ధంలో చేరాను. ఇందులో నేను సంపాదించేది స్వల్పమే కావచ్చు కాని చంద్రున కొక నూలు పోగన్నట్లు మీ ఋణాన్ని అది కొంచెమైనా తీర్చుకొంటుందని నా ఆశ. మీరు నా కొఱకు భయపడవద్దు. నా యీ సాహసాన్ని మన్నించండి. సాహసంలోనే జీవితం రాణిస్తుంది. పాతభావాలనే పట్టుకు పాకులాడడం మంచిదికాదు. ఇట్లా చేయడంలో మిమ్మును నేను ఎదిరించిపోయిన వాణ్ణిగా అర్థం చేసుకోవద్దు. నా ఉద్దేశ్యం తెలుసుకొని నన్ను క్షమించండి. అమ్మకు ధైర్యం చెప్పండి. పెదనాయనవద్ద అయిదు రూపాయలు అప్పు తీసుకొన్నాను. వీలుచూచుకొని తీర్చండి. ఇప్పుడు నే నెక్కడికి వెళ్ళేదీ నాకే తెలియదు. గమ్యస్థానం చేరిన తర్వాతకూడా నా విలాసం మీకు వ్రాయదలచుకోలేను."

ఇట్లు నమస్కరించు,
మీ కుమారుడు
లచ్చినేని రాజశేఖరరావు.

ఉత్తరము చూచుచున్నంతసేపును కోదండరామయ్యగారి రెండుచేతులు వణకిపోసాగెను. శరీరమంతటను ముచ్చెమటలుపోసెను. ఉత్తరము సగమువఱకు బైటకు వినుపించునట్లు చదువఁగల్గెను గాని, ఆ తరువాత గొంతు పెగిలిరాలేదు. కొంతసేపటికి అక్షరములే కంటి కగపడక, అంతయు నలికినట్లు కన్పించెను. ఉత్తరము చేతఁబట్టుకొనియే కాళ్ళలో పట్టు దప్పిపోగా కోదండరామయ్యగా రూరక కూలఁబడిరి. అది చూచి లోపలినుండి సీతమ్మగారును, శ్రీరాములును గబగబ పరువెత్తుకొనుచు వచ్చి కోదండరామయ్యగారిప్రక్కఁ గూర్చుండి, కంట తడిబెట్టసాఁగిరి. శ్రీరాములు, తండ్రి నెట్లో జెక్క పట్టుకొని లోపలికిఁజేర్చి మంచముపైఁ గూర్చుండఁ బెట్టెను. సీతమ్మగారు పొంగి పొరలివచ్చు దుఃఖ మాపుకొనలేక గ్రుడ్లలో నీళ్ళు గ్రుడ్లలోనే క్రుక్కు కొనఁ దొడంగెను. ఇది యంతయు చూచుచున్న రుక్మిణమ్మ తల్లి యొడిలోఁ జేరి గగ్గోలుగా నేడువసాఁగెను. ఆ యేడ్పు చెవినిబడి యెదుటింటనున్న లక్ష్మమ్మగారు, శాంత వెంటనే వచ్చిరి. ఉత్తరము లోని విషయమంతయు తెలిసికొనిన పిమ్మట లక్ష్మమ్మగారు సీతమ్మ గారికి దగ్గరగావచ్చి "యుద్ధానికి పోయినవాళ్ళు ఎంతమంది తిరిగిరావ డంలేదు వదినా? నీ వెందు కంత కూలిపోతావు? మనవాడి కేం ఫరవా లేదు. నీవు గుండె నిబ్బరించుకో'' అని యామెకు ధైర్యము జెప్ప మొదలిడెను. చెప్పినకొలఁదియు సీతమ్మగారు రాజశేఖరుని గుణగణ ములు తలఁపునకుఁ దెచ్చుకొని కుమిలికుమిలి దుఃఖింపసాఁగెను. సీతమ్మగారి కోరికపై శాంత రాజశేఖరుని యుత్తరము నామెకుఁ జదివి వినిపించెను. చదువునప్పుడు శాంత కంఠము రుద్ధమయ్యెను. కనుదమ్ముల నీ రొలికెను. నుడువలేని హృదయబాధ యేదో యామెను బాధింపఁ దొడఁగెను. కాని తన విషాదము నేలకో యామె ప్రయత్న పూర్వకముగ దాఁచుకొనెను.

రాజశేఖరుఁడు చెప్పకుండ యుద్ధములోఁ జేరెనన్న వార్త వేములపల్లి గ్రామమంతటనే కాక, కోదండరామయ్యగారి చుట్టము లెక్కడెక్కడ నుండిరో యంతవఱకుఁ బాక్కిపోయెను. కోదండ

రామయ్యగారి కూతుం డ్రిరువురును ఈ విషయము తెలిసికొని చంటి బిడ్డలతోఁగూడ వెంటనే వేములపల్లికి వచ్చిరి. సీతమ్మగారు కూతుండ్ర నిరువురిని జూచి కౌఁగిలించుకొని భోరున నేడ్వసాఁగెను. ఒక్కొకసారి యూరిలోని వితంతువులందఱు గుంపుగాఁ గూడి కోదండరామయ్య గారి వాకిటివఱకు వచ్చి గడపదాటి లోపల నడుగుపెట్టగనే యొక్క సారి గగ్గోలుగా నేడ్వ మొదలుపెట్టెడివారు. వారందఱు సీతమ్మగారి వద్దఁ జేరి "సీతమ్మా, ఎవరికీ అన్యాయం చేసి ఎరుగవు తల్లీ, ఆ పరం ధాముడు నీకుమాత్రం అన్యాయం చేస్తాడా" అని కొద్ది మోతాదులో వేదాంతము మొదలిడి క్రమముగా శోకము పొడిగించెడివారు. అట్టి సమయములో సీతమ్మగారు చైతన్యముడిగిన బొమ్మవలె గ్రుడ్లప్ప గించి వెఱ్ఱిచూపులు చూచెడిది. దూరగ్రామములం దున్న బంధువులు గూడ కోదండరామయ్యగారి నోదార్చిపోవుట కొకరి తరువాత నొక రెడతెఱపి లేకుండ వచ్చిపోవుచుండిరి. ఊరిలోని పుల్లయ్య పంతులు కూడ ప్రతిదినము వచ్చి కోదండరామయ్యగారి ప్రక్కన గూర్చుండి తత్త్వబోధ సేయుచుండెడివాఁడు. "ఇదుగో, కోదండరామయ్యా, నీవు వెఱ్ఱివాడవు గాకపోతే, సుఖదుఃఖాలు మనుషులకురాక మాకుల కొస్తాయా? నీవు కాస్త మనస్సు చిక్కబట్టుకొని భగవంతుణ్ణి ధ్యానం చేసుకో- తెల్లవారే సరికి, నీ కొడుకు ఎక్కడున్నాడో వెదకి ఆ భగ వంతుడే తెచ్చి నీ ముందర పెడతాడు. ఇదంతా ఆ పరమాత్మ చిద్వి లాసం కాకపోతే మరేమిటి?"

పుల్లయ్యపంతులు పల్కులు వినివినకముందే కోదండరామయ్య గారు "మళ్ళీ మా నాయన నాకు కనబడతాడా" అని యుత్తరీయపు చెఱగు మొగమునఁ గప్పికొని కుమిలికుమిలి యేడ్చెడివాడు. "ఇదుగో, అట్లా ఆడుదానిమాదిరి లబలబ యేడిస్తే యెట్లా? పిల్లలుకూడా దిగులుపడితే, వాళ్ళు ఇక మనచేతికి దక్కుతారా?" అని యొకటికిఁ బదిసార్లు పంతులు ఓదార్చుచుండినను ఆ తండ్రి కన్నీరు మున్నీరుగాఁ బొగిలిపోయెడివాఁడు.

కోదండరామయ్యగారి దిగులెట్లున్నను రాజశేఖరరావు ఇల్లు విడిచిపోయిన వారము పదిరోజుల వఱకుఁ జుట్టముల తాకిడి మాత్రము దుర్భరమైపోయెను. అంత దిగులులోను సీతమ్మగారు వచ్చిపోయెడి వారికి వండి వడ్డించుటతో సతమతముగాక తప్పలేదు. చెమటోడ్చి చిన్నకొడుకుఁ దాను నా సంవత్సరము పాలిపొలములపై నార్జించి పాతరవోసికొన్న పుట్టెడు ధాన్యము పండుము వఱకు హరించుకొని పోయెను. ఎక్కడ చుట్టము లక్కడకు వెళ్ళిపోయిన తరువాత నిల్లంతయు భీకరావహముగ నుండెను. కోదండరామయ్యగారు భోజనమునకుఁ గూర్చుండినపుడెల్ల, సెలవులలో రాజశేఖరుఁ డింటికి వచ్చినపుడు తన ప్రక్కఁ గూర్చుండి భోజనముసేయుచు నా మాట యీ మాట చెప్పు నప్పటి దృశ్యము తలఁపునఁ బొడెడిది. ఒక్కొక్కసారి యా తండ్రి కన్నీటితో నన్నమంతయుఁ దడిసిపోయెడిది. ఇఁక నా నాఁడు సీతమ్మగారుపవాసమే యని వేఱె చెప్పవలయునా ? ఆ వేసంగిలో రాజశేఖరుఁడు, రెండ్లేండ్లెదిగిన కోడెదూడలకుఁ దానై స్వయముగ నల్లిన చక్కని మూతిచిక్కములు చూచినప్పుడెల్ల (శ్రీ)రాములు గుండె పగిలిపోయెడిది. ఇఁక రుక్మిణమ్మయన్నచో, ఇంటిలో నందఱికంటె నామె రాజశేఖరునకే యెక్కువ మాలిమి. ఎదిగెడి వయస్సులో చూడముచ్చట గొల్పుచున్న యా బాలిక యన్నదిగులుతో చిక్కి నరమైపోయెను. అది యేమిచిత్రమో, రాజశేఖరుఁ డిల్లు విడిచిపోయిననాఁడు లేగయాదూడ రుక్మిణమ్మ పరికిణీ కుచ్చెలలు నములుచుఁ దల్లి పొదుగైన ముట్టలేదు. ఆనాఁడు గోమాత కంటివెంటఁ గారిన నీరు కారినట్లే యుండెను !

ఇఁక నా వృద్ధ దంపతులకు శరీరబలముతోపాటు మనోబలము కూడ తగ్గిపోవుచుండెను. కాని శరీర బాధల కౌషధమువలె హృదయ బాధలకుఁ గాలము చికిత్సచేయును. దినములు గడచిన కొలఁది కోదండరామయ్యగారి కుటుంబము విధి నిర్ణయముతో సమాధానపడి కాలముపుచ్చ నేర్చెను. రాజశేఖరునినుండి యెడప దడప ఉత్తరములు వచ్చుచునేయుండెను. అతఁడు జమేదారు, తరువాత సుబేదారు పదవులకు నియమితుఁడయ్యెను. నెలనెలకు జీతము నింటికిఁ బంపుచునే

యుండెను. తన కుశలవార్తలుకూడ తెలుపుచుండెను. కాని తన విలాసముమాత్ర మేలకో యింటికిఁ దెలుపఁడయ్యెను. కొంతకాలమునకు రాజశేఖరుఁడు కెప్టెన్ పదవి కుద్ధరింపఁబడినట్లు తెలిపెను. అతడు నెలనెలకుఁ బంపు పైకమును దండ్రి జాగ్రతపఱచి క్రమక్రమముగా నాఱెకరముల పొలము గొనెను. పాలిపొలములలోని యాదాయమును, సొంతపొలములోని యాదాయమును జతపఱచి యింకొక మూఁడెకరములపొలముగొనెను. అవశేష పిత్రార్జితమగు నొక యెకరముతోఁగలిసి యిప్పుడు కోదండరామయ్యగారికి పదియెకరముల క్షేత్ర మేర్పడెను. కొంతయార్థిక సౌషవము కుదిరెను. పొలము కొనఁగలిగిరికాని యానందము కొనలేరుగదా! రాజశేఖరునుండి యుత్తరములు నిలిచిపోయెను. కారణము తెలియదు. ఏ యధికారులతో విచారణచేయవలసినదియు నెవ్వరికిఁ దెలియకపోయెను. కొంతకాలము కన్నులలో వత్తులువేసికొని చూచిచూచి కడకు నిరాశులైరి. అతడు యుద్ధహతుఁడయ్యెనని తేల్చుకొని కొన్నాళ్ళు విలపించిరి. క్రమముగా విస్మరించిరి! విధికృతికెవరేమి సేయఁగలరు?

## III

## అ బ ల

పెద్ద ప్రాకారము. నడుమఁ బురాతనపు మండువా లోగిలి. ముందు విశాలములైన గచ్చుటరుగులు. లోగిటి కెదుటఁ బొడుగైన పెంకుటి చావడి. అందు నాలుగు గాళ్ల నందివాహనములవంటి యెద్దులు, ఆవులు, గేదెలు – పాడివికొన్ని చూడివి కొన్ని. వన్నె వన్నెల కోడెదూడలు. ముద్దులు మూటగట్టు లేగదూడలు. చావడి కానుకొని పెద్ద గడ్డివాము. చుట్టును గందికంపతోఁ గట్టిన దడి. దాని పైనిఁ బూవులతోఁ గాయలతోఁ గళకళలాడు కాకరతీగె. వామిపైని దట్టముగా నల్లుకొన్న సొరతీగె; నవనవలాడు మూరెడు సొరపిందెలు. ఇంటికిఁ దాపునఁ జక్కఁగాఁ బూచిన రక రకాల పూలమొక్కలు. ఒకదరి దశవృద్ధైన పెద్ద వేఁపమ్రాను. ఈ భవనమే నల్లపాటి వెంకట రెడ్డిగారిది. లక్ష్మిది కూడ !

రెడ్డిగారు వేములపల్లి యందలి కండగల రైతులలో నొకరు. ఎనుబది యెకరముల భూస్వామి. పాతిక వేల కవిల. ఇంటినిండ, నొంటి నిండ బంగారము. వారిపని మూడుపూ లాఱు కాయలుగా నుండెను. వారి కొక్కఁడే కొడుకు; రాఘవరెడ్డి. ఒక్కతే కొమార్తె, శాంత. రాఘవరెడ్డి శాంతకంటె నాలుగేండ్లు పెద్ద. అతఁడు పుల్లయ్య పంతులు గారి వీధిబడియందుఁ గొన్నాళ్లు జదివెను. అతని మనస్సున కంటిన చదువుకంటె నొంటి కంటిన చుఱుకులే యధికమగుటచేఁ జదువుకంటె సాఁగే మేలని తొందరలో మేల్కొనెను. ఎదురింటి కోదండరామయ్య గారి కుమారుడు నితఁడు సమవయస్కులు. అతని చుఱుకుఁదనమున కితని మొద్దుతనమే ప్రమాణము. కాని యిది వారి నెయ్యమున కావంతయు నడ్డురాలేదు. వరుస కిద్దఱు బావమఱఁదులు. రాజశేఖరుఁ డితనితో నప్పుడప్పుడు సరసములాడువాఁడు. కాని యవి చెవిటికి శంకూదినట్లు నిష్ఫలము లగుచుండుటచే రానురా నట్టివానిని మాను కొనెను. కొడుకు చదువులో నెక్కిరాకుండుటకు రెడ్డి దంపతులు విచారింపకపోలేదు విచారించియుఁ బ్రయోజనములేదని గుర్తింపకయుఁ బోలేదు.

శాంత చక్కదనాల చేక్క. పదియాఱు వన్నె బంగారు మైచాయ. పాము కుబుసమువలె మిసమిసలాడు దేహలతిక. జేవజేవలాడు నడుము. చిర్నగవు వెన్నెలలుగాయు వదనబింబము. మీనములవలె సోగలైన విశాల నేత్రములు. కోఁతేరువలెఁ దీర్చి దిద్దిన ముక్కు. గండు తుమ్మెదలు బారులై గుంపులైనట్లు పిఱుదులు దిగబారు సందెడు కురులు. దోరపండువంటి పదునాలేండ్ల జవ్వనము. ఆమె నవ్విన నవరత్నములు రాలునందురు. నవరత్నములన్నఁ దొమ్మిది రత్నములు గావు; క్రొత్త రత్నములు! అమృతములో నూరవేసిన ద్రాక్షపండ్లవలె నామె పలుకులు కడు మధురములు; రుచ్యములు. ఆమె రసరామణీ యకముల యేకీకృతి; యేకాకృతి; ఆమె శాంతాదేవి.

రెడ్డి దంపతు లామె నల్లారు ముద్దుగఁ బెంచిరి. కెందమ్ముల వంటి యామె చరణములు కందునేమోయని లక్ష్మమ్మగా రామెను నడువ నిచ్చునదిగాదు. పదియేండ్ల ప్రాయము వచ్చువఱకుఁ దల్లియే యన్నము కలిపి తినిపించెడిది. సీతమ్మగారు, "వదినా! మీ అమ్మాయి నిట్లా పెంచుతున్నావు, రేపు అత్తవారింటి కంపి నీవు వెంట వెళ్తావా?" అని నవ్వుకొనుచుండెడిది. "మా తల్లికి తగిన సంబంధమే వస్తుంది. మా తల్లి చాకిరి చేయవలసిన అవసర మెందుకుంటుంది వదినా?" అని లక్ష్మమ్మగారి జవాబు. లక్ష్మమ్మగా రొక్కసారి "సంబంధ మెక్కడో చూడడం దేనికి వదినా? వజ్రంలాగా మన రాజశేఖరం ఇంటి కెదు రుగా ఉండగా? మా అమ్మను రాజశేఖరానికి చేసుకోండి! ఇక నాకు దిగులే వుండదు." అని నవ్వుకొనుటయు, "మా బోటి పేదవాళ్ళ కిస్తారా, యీ దొరసానిని?" అని సీతమ్మగా రనుటయు మామూలు.

శాంతకు బాల్యములో పుల్లయ్య పంతులుగారివద్దఁ జదువు చెప్పించిరి. ఆమె చదువులోఁ జర చర నెక్కి వచ్చెను. ఎంత కఠిన వచనమునైనఁ పద్యమునైనఁ గర్ణపేయముగ నన్వయించి చేదువునది. కోమల కంఠముతో శాంత భారత భాగవతములు చదువుచుండఁగాఁ దల్లి దండ్రులు పాలుఁబాయసము ద్రావినట్లు వినుచుండువారు. రుక్మిణీ

కల్యాణము చదువునప్పుడు చూడవలయు నామె రామణీయకము! రుక్మిణియే స్వీయగాథాపఠనము సేయుచుండెనా యనిపించునది.

రాఘవరెడ్డియు రాజశేఖరుఁడు నొకే యీడువారు. ఎదురుబడి యిళ్ళగుటచే బాల్యమున వారిరువురుఁగలిసి యాడుకొనుచుండువారు. శాంతయు రాజశేఖరుని తోఁబుట్టువులును వారితో గలిసి యాడుకొనుట మామూలు. రాజశేఖరుఁడు శాంత చుఱుకుఁదనమునకుఁ దెలివితేటలకు నామెను మెచ్చుకొనుచుండువాఁడు. చిన్నప్పుడు పొడుపుఁగతలు, నాటవిడుపుఁ బద్యములు నామెకు రానివానిని దాను జెప్పుచుండువాఁడు. శాంత బొమ్మల పెండ్లిండ్లు సేయుచు నాడుకొనునప్పుడు రుక్మిణీ కల్యాణములోని "వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు నబలలతోడ వియ్యంబులాడు" నను పద్యమును జదివి యామెను నవ్వించువాడు. ఇంకఁ గొంచె మూహాపోహలు కలిగిన తర్వాత నదే పద్యమును సార్థతాత్పర్యముగా నామెకుఁ జెప్పి రుక్మిణీకల్యాణ పఠనమం దామె కాసక్తి గలిగించెను. "ధన్యున్ లోకమనోభిరాముఁ గుల విద్యా రూప తారుణ్య సౌజన్య శ్రీ బల దాన శౌర్య కరుణా సంశోభితున్ నిన్ను నే కన్యల్ గోరరు?" అని శ్రీకృష్ణు నుద్దేశించి రుక్మిణీదేవి పల్కిన పల్కులను భావములను శాంత హృదయమున హత్తుకొనునట్లు జేసెను. తాను బస్తీకిఁ జదువ నరిగిన తరువాత సెలవులలో శాంతకుఁ దాఁ జదివిన పాఠములలోని విశేషాంశములను జెప్పుచుఁ దనకుఁ జేతనైనంతవఱకు గీర్వాణ హిందీ భాషలయం దామెకుఁ బ్రవేశము కల్గించెను. తాను చదివి ముగించిన పాఠ్యపుస్తకములు శాంత కిచ్చి చదివించుచుండువాడు. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభాది వార్తాపత్రికలు, భారతి, గృహలక్ష్మి మున్నగు మాసపత్రికలు దెచ్చియిచ్చువాఁడు. సంస్కృతవాఙ్మయమునం దామె కభిమానము మెండగుటచేఁ దరువాత పుల్లయ్యసంతులుగారియొద్ద కొంతవఱకా భాష నభ్యసించి మొత్తముమీదఁ గావ్యపంచకము పూర్తి జేసెను. హిందీ యామె కవలీలగా వశమయ్యెను. రాజశేఖరుఁడామెకుఁ గొంతవఱ కింగ్లీషుకూడ నేర్పెను. కుశాగ్రబుద్ధిగల శాంతాకుమారి తానే యున్నత పాఠశాలలలోఁ

జదువకున్నను స్వయంకృషిచేతను ముఖ్యముగా రాజశేఖరుని సహాయముచేతను ఆంధ్రాంగ్ల గీర్వాణ హిందీ భాషలలో నొకపాటి పరిచయము సంపాదించుటేకాక బాల్యము వెడలుసరికి లోకవృత్తము, రాజకీయ వాతావరణము, ఆర్థిక సామాజిక విశేషములు చక్కఁగా గ్రహింపఁగలిగెను. భారతీయ సంప్రదాయములు, యవన హూణాది వైదేశిక సంస్కారములు గుర్తించి 'కలగాపులగమైన యధునాతన పురాత నాచారములలో మంచియేదో, చెడ్డ యేదో గ్రహించు నేర్పు గడించెను. ఉన్నత పాఠశాల, కలాశాలయందుఁ దా నింతగాఁ జదివి సంపాదించిన విజ్ఞానము శాంత యింటఁ గూర్చుండి గడించినదే! యని రాజశేఖరుఁ డక్కజపడువాఁడు. పసిఁడికిఁ దావి యబ్బినట్లు సౌందర్యమునకు విజ్ఞానము తోడైన శాంతాదేవిపై రాజశేఖరున కభిమానము మెండుగాఁ దోడఁగెను. ఆ యభిమానమునకుఁ బునాది యవ్యాజమైన, అమాయికమైన పసినాటి నెయ్యము; కృతకమగు కులభేదము గణింపకున్నచో బాంధవ్యము కూడ! కాకున్న ముక్తకంఠముతో మనసార నోరార 'బావా!' యని తనను బిలుచునా, శాంత? ఎచ్చట దీ కుల భేదము?

రాజశేఖరునిపై శాంత కిట్టే యభిమాన ముదయించి దోహద మయ్యెనని వేఱుగా నుడువవలయునా? ఈ యభిమానము తన కూహారాని పసినాఁటి నుండి తనకుఁ దెలియకుండఁ బ్రవర్ధమానమైనది. వా రిద్ద రొకే యింటఁ బెఱిగినట్లు పెఱిగిరి. ఒకే కంచమునఁ దిని, యొకే మంచమునఁ బండిన తమ యవ్యక్త మధుర బాల్యదశ యామె స్మృతిఫలకమునఁ బ్రస్ఫుటముగాఁ జిత్రింపఁబడి యుండెను. తమతో నాడుకొను బాలురయం దెల్ల రాజశేఖరుఁడే తన హృదయమున కెక్కువ కూర్చువాఁడు. మాటలలో, ఆటలలో, నతనిదే పైచేయి. ఉప్పనఁబట్టెలలో, చెడుగుడులలో, కోతికొమ్మచ్చులలో నతనిదే విజయము. తనను దుంటరిబాలు రెవ్వరైన నేడిపించుచో, నతఁడు తనకుఁ దోడై వారిని శిక్షించువాడు. తనపై నతని కింత యభిమాన మేల? రాజశేఖరుఁ డాడుకొనుటకు రాకున్న వచ్చినవారందఱు నామెకు

రానట్లే! అతఁడు వచ్చిన యెడలఁ బదిమందియు వచ్చినట్లే! అతఁడేది చేసినను మంచిదే; ఏది చెప్పినను సత్యమే! చిన్నారి పొన్నారి చిఱుతప్రాయమున శాంత రాజశేఖరున కిట్లు వీరపూజ సేయునది. చేయుచున్నట్లు తనకుఁ దెలియదు. తరువాత నతఁ డామెకు విద్యాభ్యాసమున మార్గదర్శకుఁ డయ్యెను. తాను నేర్చిన దంతయు నతని మూలముననే; అతని సహాయము వలననే. అతడు లేకున్నఁ దనకు విజ్ఞానమే లేదు. పందిరిపైఁ బూలతీఁగెవలె నతనిపై నామె నెయ్యమట్లు అల్లుకొనిపోయెను. ఆ తీఁగె నెవ్వరు నాటంకపఱచువారు లేరు. ఆ రెండుకుటుంబముల నడుమ నట్టి యన్యోన్యత యుండెను. ఆ రెండు కుటుంబములు రెండు భిన్నకులములకుఁ జెందియున్నవను విషయము పెద్దవారికిఁ దెలిసియు మఱుగుపడియుండెను; పిన్నలకుఁ దెలియనే తెలియకుండెను. మఱి శాంతా రాజశేఖరు లన్యోన్యముగఁ బెంచుకొను ప్రణయవల్లరి కెవ్వ రాతంకము కల్పింతురు?

కృతకములగు సామాజిక మర్యాదల నతిక్రమించి మానవ హృదయము లొండొంటితో నెంత చేరువకుఁ జేరుచున్నను "కులము" లనునవి కనరాని గోడలవలె నైక్యమున కంతరాయము లగుచుండును. సమాజమే కులములను గల్పించినది. కాని యవి పురాతన వృక్షములవలె సమాజ క్షేత్రమున లోతుగా వేరులుపారి నిర్మూలన కసాధ్యములైపోయినవి. కాలక్రమమున స్వాభావికత్వముగూడ సాధించినవి. ఆ వృక్షములఁ బెకలింపఁజూచుట యెవ్వరికిని గిట్టనిపని. పెద్ద యపరాధముగూడ. ఆ వృక్షము లొకప్పు డేదో యొక ప్రయోజనమునకై తామే నాటి పెంచినవనియు, నెవ్వరికి గోచరింపదు. తాత్వికు లెవ్వరైన నట్లు సూచించినయెడల వారిని సమాజము బహిష్కరించును. కులతత్వ మంతగా సమాజ క్షేత్రమున నాటుకొనిపోయి రానురాను పెద్ద యరణ్యమై భయంకరమైపోయినది!

కోదండరామయ్యగారి కుటుంబమును వెంకటరెడ్డిగారి కుటుంబమును దమమటుకు తామేమాత్రమును గులభేదము గణింపక యన్యోన్యముగ నాప్తబంధువులవలెఁ బ్రవర్తించుచున్నను సమాజ

నియమములకు, మర్యాదలకు నెదురుపోవునంతటి ధైర్యముగలవికావు. సమాజము దృష్టిలో నొకరు కమ్మవారు. ఒకరు పంటకాపులు. అనఁగా రెడ్లు. ఈ కులభేదమునకు దృశ్యరూప మేదియులేదు. వారును వీరున నొకే యచ్చునఁబోసిన కృషీవలురు. వారికి వీరికి నొకే భాష. ఒకే సంప్రదాయము. ఒకే యాచారము. ఒకే వృత్తి. ఒకే మతము. ఒకే నీతి. అయిననేమి? వారు కమ్మవారు. వీరు రెడ్లు! తక్కిన సందర్భములలో నీ కులభేదము గణనకురాక మఱుగువడిపోయినను వివాహ సంబంధములలో మాత్ర మిదియొక పెద్ద పర్వతములవలె వచ్చి నిలువఁబడి వారిని వీరిని విడఁదీయును. కావుననే శాంతా రాజ శేఖరు లెంత యీడుజోడుగా నున్నను, వారి హృదయము లెంత పరస్పరానక్తములై యున్నను, శాంతకుఁ బెండ్లియీడు వచ్చినంతనే వెంకటరెడ్డిగారు రాజశేఖరుని పేరైనఁదలపక సంబంధముకొఱకెచ్చటో వెదుకఁ దొడఁగిరి. అది వారికేఁగాని వీరికేఁగాని వింతగాఁ దోఁచలేదు. అట్లుగాక శాంతను రాజశేఖరున కిచ్చు తలం పెవ్వరికైనఁ గలిగిన యెడల నదియొక పెద్ద విడ్డురమయ్యెడిది. మన సమాజము నానాకుల వికారమైపోయినది. కులవ్యవస్థ శతాబ్దముల కొలఁది పెట్టిగి కరడు గట్టికొనిపోయినది. అట్టి సమాజములో శాంతా రాజశేఖర వివాహ యోగ్యతను గూర్చిన తలఁ పెవ్వరికి నుదయింపనే యుదయింపదు. ఉదయించినచో సమాజ మొక పెద్దపులివలె వారిపైఁబడును. మానవుల కూడికచేతనే సమాజ మేర్పడినది. కాని మానవ భిన్నమైన యొక యున్నతస్థాన మేర్పఱచుకొన్నది. అనన్య సామాన్యమైన యొక అధికారము సంపాదించుకొన్నది. అందువలన మానవ హృదయము లపై, చర్యలపై నిరంకుశ పరిపాలన మొనర్చుచున్నది! ఆ నిరంకుశ త్వము నెవ్వరు నరికట్టలేరు. దాని కెవ్వరు జోహారు నేయమనలేరు. వ్యక్తికి సమాజములో స్వాతంత్ర్యములేదు. వ్యక్తి సమాజమునకు దాసుఁడు. శాంతా రాజశేఖరులు నట్లే దాసులు! నిస్సహాయులు!!

లోకవృత్తమును సమాజ మర్యాదల నెఱుఁగని యమాయక బాల్యదశయందు వారిరువురు నొండొరులఁ దమ వారిగనే భావించు

కొనుచుండిరి. ఒకరి నొకరు దక్కించుకొనుటకు వివాహ సంస్కార మొకటి యవసరమనియు నది తమ కసాధ్యమనియు వారప్పు డెఱుఁగరు. దాంపత్య ఫలములు వారూహించియుండరు; కాంక్షించియుండరు. అవ్యాజమైన నిష్కల్మషమైన ప్రాకృతిక ప్రేమ మాత్రమే యా చిఱుత హృదయములను బంధించి యుండెను. కాని వయసువచ్చి యూహాలు పెఱిగినకొలఁదియు వారు తమ తమ స్థితులు గుర్తింపఁగలిగిరి. ఒకరి కొకరు ఎడము గాఁదొడఁగిరి. సమాజ మర్యాద యను కావలివాని కటుకుఁ జూపు లవగతముజేసికొనఁగలిగిరి. ఆ కావలివా డేలయుండ వలయునని ప్రశ్నించుటకుఁగాని వానిని దిరస్కరించుటకుఁగాని వారికి ధైర్యములేదు. తిరిస్కరించుట ధర్మమని కర్తవ్యమని రాజశేఖరుఁ డెఱుగును. కాని యప్పటిలో నతఁడు తండ్రి చెప్పుచేతలలో నుండుటచే నస్వతంత్రుడు. సంపాదన కసమర్థుఁడై యుండుటచే వ్యర్థుఁడు. అతఁడు తననుగూర్చి యిట్లే భావించెను. "దమ్మిడీ యార్జింపకపోగా, నీ బెడద యొకటి నెత్తికిఁ దెచ్చితివా ?" అని తండ్రి యనిపోవునేమో యని యతని భయము. కావున రాజశేఖరుఁ డిం దేమియు జోక్యము గల్గించు కొనక యిన్నకుండెను. ఇఁక నాడుదియగు శాంత యేమి చేయఁగలదు ? అందును బల్లెటూరి పడుచు !

శాంతకుఁ బదునై దేఁడులు వచ్చినప్పటినుండియు వెంకటరెడ్డి గారు మనువులకొఱకు వెదుకసాఁగిరి. తమది సంపన్న కుటుంబము. సమాన సంపదలుగల వారితోనే వియ్యమందవలయును. శాంత తమ కేకైక పుత్త్రిక. కావున దాపుననే యామె కాపురము సేయవలయును. వియ్యాలవారు కయ్యాలవారు గాకుండఁ దమతోఁ గలిసిపోవలయును. వరుఁడు గోరు కట్నములు గానుకలు తమ తాహతునకు మించి పోఁ గూడదు. అబ్బా! వరాన్వేషణ మెంత దుష్కరకార్యము! ఇంతయుఁ జేసి వధువు నభీప్సితము నరయుటలేదు. తాము తయారుచేసి యుంచిన సిద్ధవస్తువే గదా యామె ! తాము గోరిన వారి కా వస్తువును దానము సేయవచ్చును. సమాజమర్యాద యనుసరణమునకు బదులుగా నామెను విక్రయింపవచ్చును. అవును విక్రయించుటలేదా! గేదెను విక్రయించుట

లేదా! అల్లి కన్యను. కుటుంబమర్యాదలకు సంప్రదాయములకుఁ గట్టుబడి యుండుటచే నామెయు గోవువలె నోరులేనిదే. కాని హృదయములేనిది కాదుగదా! అయిన నేమి? ఆమె నట్లు పరిష్కారము సేయుటే పరిపాటి. అది పూర్వాచారము. వంశమర్యాద. శాంత యెడలఁ దల్లిదండ్రుల కనురాగములేదా! కలదు. ఆమె వారి గారాబు బిడ్డ. ఏకైక పుత్రిక. తమ యసువులనైన నామె కిత్తురు. కాని వరనిర్ణయమునం దామె యభిమతము దెలిసికొనుట వారి కాచారము గాదు. ఆమె అభిమతమును మన్నించుట వారికి విడ్డూర మనిపించును. ఈ మర్యాద యిప్పటిదా? శతాబ్దములనాటిది! మఱియిప్పుడు మార్పేల?

శాంతకు జననీ జనకులయెడ నమితభక్తి. వారి కెన్నడు నెదురాడ నేర్చినదిగాదు. తనతోడి పల్లెపడుచులకన్న వివేకవతి. విద్యావతియు. పెండ్లియీడు వచ్చునప్పటికిఁ బ్రపంచము నర్థముచేసికొన్నది. దాంపత్య జీవితపు బాగోగుల నూహించుకొన్నది. తన వరుఁ డిట్లుండవలయునని సొంతముగ మనమున నొక చిత్రము వ్రాసికొన్నది. ఆ చిత్రములోఁ బోలిక లన్నియు రాజశేఖరునివే! కాని యతఁడు తన కలవిగాని వాఁడు. కులనిబంధన లవిగో, కొండలవలె! ఆ కొండమ తుమ్మెదకుఁ దా నొక సంపెఁగ పూవు. ఈ సత్యము నామె గుర్తించినది. తనలోఁ దాను కుమిలిపోయినది. ధీరస్వాంతకావున తన వంత పొక్కనీయక దాఁచుకొన్నది. సమాజ మర్యాదకు కులపుఁ గట్టుబాటులకుఁ దన యభిమతమును, ఆనందమును, సౌఖ్యమును బలియిచ్చుటకుఁ దయారైనది తన భావము నింకొక మానవ హృదయమునకుఁ దెలియనీయ లేదు. తానై రాజశేఖరునకుఁ గూడ తెలుపలేదు. ఆతఁడు గ్రహించియుఁ దనవలెఁ గుమిలిపోవుచుండుననిమాత్ర మూహించి ఖిన్నయైనది. ఎట్టకేలకుఁ దన కలవిగాని విధినిగూర్చి నమస్కరించి యెటులైనఁ గానిమ్మని మనస్సు తాయి జేసికొన్నది. రాజశేఖరున కంతకంతకు నెడ మెడముగా మెలఁగఁ దొడగినది.

వెంకటరెడ్డిగారు సుమా రొక సంవత్సర కాలము వరాన్వేషణ మొనర్చిరి. ఒకటి కుదిరిన మఱి యొకటి కుదురక, ఇదిగాదని యది,

అదిగాదని యిది వెదుకఁ దొడఁగిరి. వెదకి వెదకి వేసారి కడకు నరసారావుపేటలో నొక సంబంధమును నిర్ణయించిరి. నల్లపు కోటిరెడ్డిగారి కుమారుడు చంద్రారెడ్డి. కోటిరెడ్డిగారు వందయెకరముల భూస్వామి. ఆయన కుమారు లిద్దఱిలో చంద్రారెడ్డి పెద్దవాఁడు. బి. ఏ. వఱకుఁ జదివినాఁడు. ధనవంతుఁడగుటచేఁగాబోలు నొక్కొక్క తరగతి రెండు మూఁడేఁడులు చేదివి గట్టిజేసికొనుచు నిరువది నాలుగేండ్లకు బి. ఏ. వఱకుఁ బెటపెట లాగెను. బి. ఏ. పరీక్ష పూర్తియగువఱకు ముప్పదేడులు పూర్తియగు సూచనలు కన్పించుటచే నంతటితోఁ జదువునకు స్వస్తిచెప్పి నిర్ణీత వయస్సు – అనఁగా నిరువదియైదేండ్లు మించేక ముందే ఎక్సైజు సబిన్స్పెక్టరుగా నుద్యోగమునఁ జేరెను. ఇంత చదువు జదివి యుద్యోగము సేయకున్న గౌరవహాని యని యాతని యభిప్రాయము. కాకున్న నుద్యోగ మతనికేల? ఉద్యోగమునఁ జేరు వఱకు నుద్వాహము వలదని యిన్నాళ్ళు నవివాహితుఁడుగా నుండెను. అవివాహితుఁడేగాని బ్రహ్మచారియనుట కాధారములేదు! లక్ష్మీపుత్త్రుఁడు గావున బస్తీలోఁ దనివిదీరఁ జేదువుచు విచ్చలవిడిగ సంచరించినవాఁడు. అతని కాలేజీ చదువు మదరాసులో నగుటచే నతని శీలము పరామర్శించుట కిచ్చట నవకాశము లేదు. మనకేకాదు; వెంకటరెడ్డిగారికిఁగూడ! రూపమున చంద్రారెడ్డి చెప్పఁదగినవాఁడు గాడు. రంగు నలుపు. మేను పొట్టి. ఇంచుక గూనియున్నను గాదన రాదు. కన్నులు చిన్నవి. మునిబంట్లు కొంచె మెత్తు. కొంచెమననేల? రెండు పెదవులు గలియనంత; ముక్కులోఁ దీర్పు తక్కువ. ఇంచుక బల్లపఱుపుగానుండును. శరీరము నిండ రోమజాలము. మొత్తము మీద బలిష్ఠుఁడుగాఁ గన్పించును. పొడవుగా విస్తరింపక కుంచితమగుటచే శరీర మట్లు కన్పించునేమో! ఎట్లయిననేమి? ఘుమఘుమలాడు తైలములతో నున్నఁగా దువ్విన యెత్తైన క్రాపింగు. అస్తి నాస్తి విచికిత్సాహేతువైన ఫ్రెంచికట్టు మీసము. మొగమునిండ స్నో. దానిపైన క్యూటికూర్ పౌడరు. ఫెళ్ళున మండిపడు దుస్తులు. కనులకు బంగారు చట్టపుఁ జలువజోడు. టకటకలాడు పాదరక్షలు. ఇన్నిం

టితోఁ జకజకలాడుచు నతఁడు చరించునప్పుడు చూచువారిదృష్టి యతని యట్టహాసముపైననేగాని రూపురేఖలపైఁ బ్రసరించునా? అందును శ్రీమంతుఁడు. పై పెచ్చు ప్రభుత్వోద్యోగి. అతని కందము లోపించినదని యెవ్వరనఁగలరు? కోటిరెడ్డిగారు మంచి సంప్రదాయము గలవారు. విశాల భూస్వామి. కుటుంబ పరిస్థితులనుబట్టిచూడఁగా వెంకటరెడ్డిగారితోఁ గలసిపోవువారుగాఁ దోచిరి. చుట్టఱికము దిరుగ వేయఁగా నెచ్చటనో కలిసినవారుగూడ! నరసారావుపేట వేములపల్లి కెంతోదూరములేదు. చంద్రారెడ్డి బి. ఏ. యనిపించుకొన్నవాఁడు. పైకిఁబోవు మంచి యవకాశముగల యుద్యోగము. కట్న మెక్కువ కోరుటలేదు. పదియెకరములకుఁ బదివేలకు నెట్లో యొప్పుకొన్నారు. వెంకటరెడ్డిగారి తాహతున కది మించినదిగాదు. ఇన్నివిధముల నను కూలించినప్పు డొక్క యందమేగదా కొఱవైనది! అందును చంద్రా రెడ్డి వికలాంగుడా? ఎందరు నల్లనివారులేరు? ఎత్తు పండ్లలో నొక యందములేదా? తెగఁబెఱిగి తాఁగాడివలెనుండుట మాత్రము మంచిదా? కుదిమట్టసముగా నున్నచోఁ బొట్టివాఁడననేల? ఇంతకు నతనికి ఠీవి తక్కువా? ఇట్లు వితర్కించుకొని తనకుఁ దాను సమా ధానపడి వెంకటరెడ్డిగారు శాంతను చంద్రారేడ్డి కిచ్చుటకు నిర్ణయించిరి.

కోటిరెడ్డిగారు, వారి బావమఱఁదు లిద్దరు, చంద్రారెడ్డి కలిసి యొకనాడు కన్నెచూపునకై వేములపల్లి విచ్చేసిరి. వారికి మర్యాదలు చేయుటకై వెంకటరెడ్డిగా రానాడు బహు ప్రయాసపడిరి. నలుగురు జీతగాండ్రకు రాఘవరెడ్డికి నారోజు తీఱికయేలేదు. కాఁబోవు వియ్యాల వారు బస్తీవారు. తాము పల్లెటూరువారు. వరుఁడు పెద్ద చేదువు చదివినవాఁడు. గొప్ప యధికారి. వీరి కే మర్యాదలో నేమి లోపము జరుగునో యని వెంకటరెడ్డిగారు అడుగడుగున నులికిపడుచుండిరి. ఇంకొక యిబ్బంది. "గతికితే అతుకదు" అని పెండ్లియగువఱకు వియ్యాలవారు తమయింట భుజింపరు. కావున వారికి వేఱొక యింట స్నానపాన భోజనము లేర్పాటుచేయవలసివచ్చెను. ఇంకఁ జెప్పనదేమి?

చంద్రారెడ్డి వధువును జూచుటకంటెఁ దనను జూపించుటే పనిగా వచ్చినట్లు ముస్తాబై వచ్చెను. తెల్లని ట్రౌషరు, సిల్కుషర్టు, బ్లేషరుకోటు. ఈ సూటునకుఁ దగిన కంఠబంధము– అనగా– నెక్ టై, నిగనిగలాడు పేటెంటు లెదరు బూటు. పైన దొరటోపి. కోటు బయటి జేబులో నత్తరువులు సౌరభించు తెల్లని సిల్కు చేరుమాలు, బంగారు టోపీగల షీఫర్ ఫౌంటెన్ కలము. మణికట్టునఁ గ్రొత్తనమూనా చతుష్కోణపుఁ జేతిగడియారము, కనులకు రోల్డుగోల్డు చట్టముతోఁ జలువజోడు. నాసికా రంధ్రముల విస్తీర్ణమును మించక యుంచఁబడిన పొట్టిమీసాలు. స్నో బూసి పౌడరుచల్లిన ముఖము. కుడిచేత పేఁబెత్తము. ఎడమచేత గోల్డుఫ్లేక్ సిగరెట్ డబ్బా. అన్నింటినిమించి బలవంతముగ, సందర్భము ననుసరించి యాహ్వానింపఁబడుచున్న చిఱునవ్వు. ఇట్లు ముస్తాబై వచ్చిన చంద్రారెడ్డిని చూచుట కా పల్లెటూరివా రుబలాటపడిరన్న నాశ్చర్యమేమి ?

ఆ యుదయము ఫలాహారాదులైనతరువాత సాలంకృతయైన శాంతాదేవిని వరునకు జూపించిరి. మండువాలోని గదినుండి బైటకేగుచు నొక నిమేష శకల మామె యచ్చట నిలిచినట్లు నిలిచి మెఱుపుఁ దీవియవలె నదృశ్యయయ్యెను. చంద్రారెడ్డి హృదయము ఝల్లుమనెను ! పట్టణములలో నగరములలోఁ దా నెందఱినో యువతులఁ జూచినవాఁడు. వారి కృతకాలంకారములకు, నాగరక చిహ్నములకు మురిసి ముగ్ధుడైనవాఁడు. తాఁ జూడఁబోవు వధు విట్లే యుండునని యూహించెను. అట్టిచో శాంతామూర్తి యతని కనులకు మిఱుమిట్లు గొలిపెను. ఆమె నాపాదమస్తకము పరిశీలింప నతనికి ధైర్యము లేకపోయెను. రాసిపోసిన లావణ్యము, రూపుగొన్న మంజులత్వము. ఆమె చుట్టు ననిర్వచనీయమగు నొక పవిత్రత. అమాయకములయ్యు నామె చూపులలో నొక భావగాంభీర్యము. అందేదో చంద్రారెడ్డికి దుర్నిరీక్ష్యమగు నొక తేజస్సు. అతని కామె రూప మసాధారణము ! అదృష్టపూర్వము! ఔను. ఆమె నతఁడు చూడలేకపోయెను.

శాంతాదేవి యతనిఁ జూచెనా! చూచెను. తప్పదుగనుక ఆమెకుఁగూడ నొడలు ఝల్లుమనెను. రాజశేఖరుని దివ్యమంగళ సుకుమార మూర్తిని తన పునీత హృదయఫలకమునుండి తుడిచివేసి దానికిబదులుగాఁ దానందు చిత్రించుకొనవలసినరూప మిదియా యని చంద్రారెడ్డి యాకారముజూచి యామె కంపించెను. శాంత విదుషి. కేవలము బహిరాకారముచూచికాదామె కంపించినది. అతని వాలకమునం దేదో యపవిత్రత యామెకు గోచరించెను. అంతకుముం దతనితో నామె కేమాత్రముఁ బరిచయములేదు. అతని శీల మెఱుఁగదు. అతని గుణము లెఱుగదు. అతని పోకడ యెఱుగదు. హఠాత్తుగా నతనిని తన మనోనాయకునిగా స్వీకరింపుమన్నచో నామె మనస్సు చివుక్కుమనదా ? అనును. అన్నది. కాని పితృభక్తికి, సమాజ మర్యాదకు, వంశాచారమునకుఁ దన యభిమతమును, సౌఖ్యమును, బలియిచ్చి యాత్మార్పణసేయ సంసిద్ధయైనది. కావున తుపానువలె రేఁగు చున్న తన భావ ప్రభంజనమును హృదయ కుహరములోనే యణఁచి పైకి గంభీరముద్రవహించి నిలిచెను. త్యాగమన్న నింతకన్నఁ గలదా ?

హృదయవిదారకమగు నీ వృత్తాంతము నెంత సంక్షేపించిన నంత మంచిది. చంద్రారెడ్డికి శాంతాదేవి నిచ్చి పెండ్లిసేయుట కా యుభయులు నంగీకరించిరి. ఈ వ్యవహారము జరిగిననాఁడే రాజశేఖర రావు యుద్ధములోఁ జేర నిశ్చయించుకొని మరునాటి వేఁకువను జెప్ప కుండ వెడలిపోయెనని చదువరులకు జ్ఞప్తి యుండవచ్చును. తన దను కొన్న శాంతాదేవికి వరుఁడుగా నిశ్చయింపఁబడిన చంద్రారెడ్డిని రాజ శేఖరుఁడుకూడఁ జూచెను. అందుచే నతనికిఁ గలిగియుండు మనోవికార మును సులభముగ నూహింపవచ్చును. అతనిదారి నతఁ డట్లుపోయెను. సుమా రొక మాసము రోజులకు నతివైభవముగ శాంతావివాహము జరిగెను. వివాహవేదికపైని వధూవరులను జూచి "కాకి ముక్కున దొండపండు పెట్టిరి గదా !" యని లోలోన నుస్సురుమనని వా రొక్క రును లేరు.

పెండ్లిసంబరమునుగూర్చి చెప్పునదేమి గాని యొక విషయము మాత్రము మఱువరాదు. ఎదురుదెబ్బ తగిలినదని పెండ్లికొడుకు బొటన వ్రేలికిఁ గట్టుకట్టికొని యుండెను. ఆ కారణముచే నతఁడు కుంటి కుంటి నడచుచుండెను. మొత్తముమీఁద నప్పుఁ డతని శరీర మస్వస్థతగా నుండుటచేఁ బెండ్లిలోనే శోభనముచేయ వీలులేకపోయెను. శోభన మెప్పుడు జరుగునో!

---

## IV

# పునరాగమనము

బెజవాడ రైల్వేస్టేషను. రాత్రి ఒంటిగంట యైనది. బెజవాడ నుండి గుంటూరు మీఁదుగా హుబ్లీకిఁ బోవు మీటరుగేజిబండి కదలుటకు సిద్ధముగ నుండెను. బండి కూఁత వేసెను. గార్డు విజిలూదెను. మూడవ తరగతి తలుపు తెఱచి యొక పథికుఁడు లోనికిఁబోవ బ్రయత్నించుచుండెను. "ఇందులో స్థలములేదు; ఇంకొక పెట్టెలోనికిఁ బొ"మ్మని లోనున్నవారతనిని అడ్డగించుచుండిరి. "టైమైనది. మఱియొకచోటికిఁబోవుట సాధ్యముగాదు. నన్ను నిలువనిండు, చాలును." అని యతని వేఁడికోలు. ఇచ్చట కూర్చున్నవారికంటె నిలుచున్నవారే యెక్కువమంది యున్నారు. నిలుచు తావు మాత్ర మెచ్చటిది? 'పొమ్ము, పొ'మ్మని యతనికి జవాబు. అది వారి సొమ్ము! ఇతనిదిగాదు! ఒక్క నిముసము ముందుగా వచ్చుటచే వారి కా హక్కు గలిగెను. వారు బండిదిగి పోవువఱకు- అది యొకపావుగంటలో, నరగంటలో జరుగును- ఆ యా స్థానములపై వారి శాశ్వతమైన హక్కు లేర్పడినట్లు వారు భావింతురు! ఆ హక్కులకొఱకుఁ గయ్యములాడుదురు. స్థానభ్రష్టతగల్గినచోఁ దమ పుట్టిమునిగినట్లు విచారింతురు. ఇంతయు నొకయరగంటవైభవమే! ప్రపంచముగూడ నిట్టిరైలుబండియేగదా!...

బండి యింకొకసారికూసెను. ఆ ప్రయాణికున కేమియుఁ దోఁచక తిక్కిరిబిక్కిరి యగుచుండెను. ఇంతలో లోనఁ గూర్చుండియున్న యువకుఁ డొకఁడు"ఆయనను లోనికిరానివ్వండి నా స్థానమిస్తాను''అని యందరిని ప్రక్కకు సరిది యా పథికునకుఁ బ్రవేశము గలిగించెను. "రండి, ఇక్కడ కూర్చోండి. నే నిక్కడ నిలుచుంటాను" అని యతని నాహ్వానించెను. కృతజ్ఞతాభరమగు చిత్తముతో నతఁడు "థాంక్సు చాలా ఉపకారం జేశారు; నేనే నిలుచుంటాను. మీరు కూర్చోండి. నేను కోరింది యింత మాత్రమే! యని యువకుని బలవంతముగ నతని స్థానమునఁ గూర్చుండజేసెను. బండి కదలెను. ఠణ ఠుణ ధ్వని. ఎవరి యాలోచనలో వారు పడిరి. నిదురలోఁ గొందఱు! ధడ ధడ మను రైలు సవ్వ

డిలోఁ గొందఱు జోలపాటలు విందురు. ఊరెమెల యూపులవంటి యా యూపులకుఁ బసిబిడ్డలవలెఁ బథికులు నిద్రింతురు. రైలు కదలు వఱకు లోనికి రా నష్టపడిచిన వారినే కదలిన తరువాత నాత్మీయులుగాఁ దలఁచి యందఱు నెట్లో సర్దుకొందురు. ఒక్కరి కొక్కరి కే సంబంధము లేకున్నను, ఒకరి భుజములపై నొకరు తలలు విడియించి కూర్కు దీయుదురు...... ఆ నూతనాగంతుకుఁడు తన యుపకారి మొగము బరికించి చూడఁదొడఁగెను. ఆ యుపకారియు నతని మొగము నట్లె యెగాదిగ చూచెను. ఇరువురుఁ బూర్వపరిచితులు. స్నేహితులేమో! క్రమముగ మఱపుఁదెరలు విడిపోవుచుండెను. నూతనాగంతుకుని నయనములు విస్ఫారితము లయ్యెను. తన యుపకారిని గుర్తించిన ట్లతనికిఁ దోచెనుగాని యేలకో పేరెత్తి పిలుచుటకు సందేహించుచుండెను. కొంతసేపటి కతఁడెట్లో మనసు దృఢపఱచుకొని యించుక యనుమానముతోనే "మీ పేరేమిటి? నన్నెరుగరా" అనెను. ఆతడు "నీవు లింగమూర్తివి కావా?"

లింగమూర్తి:- లింగమూర్తినే. కాని నిన్ను గూర్చి నా కింకా సందేహం పోలేదు. నీవు రాజశేఖరానివా ?

అతఁడించుక మందహాసముగావించి "సందేహమెందుకకల్గింది? ఇంతలో మఱచిపోయినావటోయ్" అని లేచి కౌగలించుకొనెను.

లింగమూర్తి:- నాకు సందేహమింకా పోలేదోయ్! కూర్చో చెపుతా! నీవు యుద్ధానికి పోయినావనీ.........

రాజశే:- ఆమాట నిజమే.

లింగ:- అదికాదు......క్షమించు......జపాన్ ఫ్రంటులో చనిపోయినావనీ......

రాజశేఖరరావు నవ్వుచు "అదా? నీ సందేహం! నేను చనిపోవలేదు. ఈ మాట్లాడేది నీ క్లాసుమేట్; రాజశేఖరరావే. వాడి దయ్యంకాదు? భయపడబోకు!

లింగ:- చెప్పొద్దూ! అదే భయంసుమా! అమ్మయ్య! కాబట్టి యిన్నేళ్ళు బ్రదికుండే చచ్చిపోయినవాళ్ళలో జతపడ్డావన్నమాట!

యెంతమాట! యెంతమాట!......మఱి నీ కథంతా చెప్పవోయ్. మూడేళ్ళనుండి నీ కబుర్లే లేవట. ఏమయిపోయినావు? ఎప్పు డొచ్చావు?

రాజ:- నా కథ నిమ్మళంగా చెపుతాను. ముందు నీ సమాచారం చెప్పు. నేను కాలేజీ చాలించిన తర్వాత మనం మళ్లా కలుసుకోనే లేదు. తొమ్మిదేండ్లయిందనుకొంటాను. నాతోపాటు ఇంటరు పూర్తి జేసి నీవు బి. ఏ. లో ప్రవేశించావుగదూ! బి. ఏ. డిగ్రీ తీసుకొన్నావా?

లింగ:- ఆహా! తీసుకొన్నా! డిగ్రీకేమి కొదవ?

రాజ:- ఇప్పుడేంచేస్తున్నావ్!

లింగ:- సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో గుమస్తాగిరి.

రాజ:- ఏం? బి. ఏ. డిగ్రీ ఉండి అంతకంటె మంచిపని చిక్కించుకో లేకపోయినావా?

లింగ:- సర్వీసెస్ కమీషన్‌వారి దయ. ఇందుకు సెలెక్టుచేశారు. ఈ ఆరేళ్ళనుండి ఇందులోపడి చీకిపోతున్నాను.

రాజ:- లింగమూర్తీ! నీవు కవిత్వంకూడా వ్రాసేవాడవు కావూ?

లింగ:- ఔను; విద్యార్థిదశలో.

రాజ:- తర్వాత?

లింగ:- చెప్పేదేమున్నది? "దానాదమన వినిమయ విక్రయాది సర్వాధి కారాలతో" సబ్రిజిస్ట్రారు ఆఫీసు వాల్యూములు కప్పగించాను.

రాజ:- అయ్యో! నీ సామర్థ్యానికి, నీ అభిరుచికి ఈ దస్తావేజులు నకలు వ్రాసేపని యెక్కడ దాపురించిందోయ్!

లింగ:- పరీక్షపేపర్లలో నేనెక్కడా వ్రాయలేదు – నేను భాషాభిమాని ననీ, కవిత్వం వ్రాస్తాననీ! మఱి కమీషన్‌వారెట్లా కనిపెట్టారో నన్ను నకళ్లువ్రాసేపనికే సెలెక్టుచేశారు. బి. ఏ. లో గణితశాస్త్రం నా అభిమాన విషయం. అది కూడా చాల ఉపయోగిస్తున్నది నా ఉద్యోగంలో.

రాజశేఖరరావు నవ్వుచు "అదెట్లా ఉపయోగించిందోయ్" అని అడిగెను.

లింగ:- తుడుపులిన్ని, కొట్టివేతలిన్ని, 'ఈ లాగు' లిన్ని-అని కచ్చితంగా లెక్క వేసి నకలులో వ్రాయడానికి!

రాజ:- చాలా బాగున్నది! కాని యిటువంటి ఉద్యోగంలో నీవు చేరడం దేనికోయ్? పరీక్షకు వచ్చే వారందరి యోగ్యతలనూ పరిశీలించి యెవరి యోగ్యతలకు తగిన పదవులు వారికి వెదకి యివ్వడం కమీషన్‌వారికి మాత్రం సాధ్యమౌతుందా? వారి ననడమూ ధర్మంకాదు.

లింగ:- మరి కమీషన్ వారిచ్చిన ఉద్యోగం కాక యింకొక దానికి పోవడానికి వీలు లేదుగదా!

రాజ:- వీలులేకపోతే మానుకో! నీ అభిరుచికీ సామర్థ్యానికీ తగిన యింకొకవృత్తి చూచుకో.

లింగ:- ఇంత చదువూ చదివి ఉద్యోగం గాక యింకేం చేస్తాం? ఏం చెయ్యగలం?

రాజశేఖరునకీ ప్రశ్న యాశ్చర్యము గలిగించెను. చదువు కొననివారే కాదు; చదువుకొన్నవారు, పట్టభద్రులుగూడ నిదే ప్రశ్న యడుగుటయా? అయ్యో! దౌర్భాగ్యము! ఉద్యోగమునకుఁ దప్ప నీ చదువింక దేనికిఁ బనికిరాదా? లేక వీరి కింకొక వృత్తిలో జీవనము సంపాదింపలేమన్న యధైర్యమా? స్వాతంత్ర్యోదయమైన తరువాత గూడ నిదియే పరిస్థితియా? ఈ విషయము లింగమూర్తితో వాదించుట కతఁ డిష్టపడలేదు. లింగమూర్తి యొక మార్గమునఁ జాలదూరము గమించినాఁడు. అతని కింకొక మార్గము కనిపించేదు. ఇతరులు చూపించినను ప్రాతమార్గమును వదలుట కతనికి ధైర్యము చాలదు. రాజశేఖరుఁ డీ యాలోచనలోఁబడి మౌనముదాల్చి కూర్చుండెను.

లింగ:- నా కథ విన్నావు. మరి నీ సమాచారం చెప్పు. అందులో నీవు చచ్చి బ్రతికివచ్చినవాడవు. కాబట్టి నీ కథ విచిత్రంగా ఉండితీరాలి.

రాజ:- రైలు నంబూరుస్టేషనుదాటి వచ్చింది. గుంటూరులో దిగిన

తర్వాత చెప్పుకోవచ్చు. అయినా నా కథలో పెద్దవిశేషాలేమీ లేవు.

ఇట్లనుచుండఁగనే గుంటూరు సమీపించెను. బండి స్టేషనులో నిలిచెను. కాని ఎక్కువారికంటె దిగువారి హడావుడి యధికమగుటచే మన మిత్రు లిరువురు వెంటనే బండి దిగలేకపోయిరి. లింగమూర్తి ముందు దిగి రాజశేఖరుని పరుపుచుట్ట, తోలుపెట్టె కిటికీలోగుండ నందికొనెను. వాని నొక కూలివాని తలపైఁ బెట్టి యిరువురు లింగమూర్తి యింటికి బయలుదేరిరి. త్రోవలో రాజశేఖరుఁడు తన కథ చెప్పసాఁగెను.

రాజ:- నన్ను కెప్టెన్ పదవికి ప్రమోట్ చేసిన తరువాత ఆరుమాసాలకు బర్మా రంగానికి పంపారు. అప్పుడు జపాన్‌వాళ్ళు బాగా విజృంభించి ఉన్నారు. మా సైన్యం నామ మాత్రమే కాని జపాన్ వాళ్ళతో తలపడదగినంత లేదు. మన సైన్యమంతా ఆ సమయంలో ఇంకెక్కడో కేంద్రీకరింపబడి వున్నది. జపాన్ వాళ్ళ నాపలేమనీ అపజయం తప్పదనీ తెలిసిన వెంటనే ఇండియా కమాండువాళ్ళు మాలో వున్న సైనికులను ముందుగా ఇండియాకు చేర్చుకొని భారతీయులమైన మమ్ము మాత్రం అచ్చట ఉండమన్నారు. మాకు ఆయుధసరఫరా లేకపోగా చివరకు తిండి కూడా చేర్చలేక పోయినారు. సైనిక క్రమశిక్షణకు లోబడిన మేము ఇందుకేమీ అనలేక పోయినాము. మరి జపాన్ సైన్యం మా మీద బడ్డప్పుడు తెల్ల జెండా లెత్తక ఏం జెయ్యగలం? మా దళం మొత్తం పట్టుబడ్డది. అందరమూ యుద్ధఖైదీల మైనాం. అప్పుడు మేం బడ్డ పాట్లు భగవంతుడికే తెలుసు. ఇంతలో నేతాజీ సుభాసు చంద్రబోస్ స్వతంత్ర భారత సైన్యం నిర్మిస్తూ మమ్ములనుగూడా అందులో చేరతారా అని అడిగాడు. మాలో చాలామంది చేరతామన్నారు. నేనూ చేరాను.

లింగ:- అట్లా చేరడం దేశద్రోహ మనిపించలేదు నీకు?

రాజ:- దేశద్రోహం కాదు, రాజద్రోహం అనిపించింది. కాని రాజు

దేశాని కరిష్టదాయకుడైనప్పుడు రాజు కెదురు దిరగడమే ప్రతి దేశీయుని కర్తవ్యం అని నేతాజీ ఉద్బోధ. నాకూ అట్లాగే తోచింది.

లింగ:- మొత్తంమీద బోసు సైన్యంవాళ్ళు మటుకు చాల కీర్తి సంపాదించారు.

రాజ:- అర్థ్వమైన కీర్తే సంపాదించారు. బ్రహ్మాండంవంటి బ్రిటిషు సైన్యాన్ని ఎదుర్కొనడం. మాకేం సామార్థ్యం ఉన్నది ? మా సైన్యానికి ఏం శిక్షణ ఉన్నది? బోసు సైన్యంలో చేరడమే ఒక పెద్దసాహసం ! నిష్కల్మషమైన దేశభక్తి, త్యాగం తప్ప అందుకు కారణం ఏమీలేదు. మేము విజయం సాధించలేమని మాకు తెలియకకాదు. కాని దేశ దాస్య విముక్తికై ఆత్మార్పణజేసి తరించాలని మా యువకుల కందరికి తోచింది. జపానువాళ్ళు మాకు సహాయం చేస్తామన్నారు. కాని నేతాజీ ఒప్పుకోలేదు. స్వయంశక్తివల్ల సంపాదించిన స్వాతంత్ర్యం నిలుస్తుందిగాని ఒకళ్ళు దానం జేసేది మూడోనాటికి పోతుందని మా అభిప్రాయం. పులి బోయి గిలి పట్టినట్లు బ్రిటీషువాళ్ళుపోయి జపాన్‌వాళ్ళు వచ్చే వాళ్ళు. సరే ! ఈ కథంతా చెపితే చాలా వున్నది. కొన్నాళ్ళు తంటాలు పడ్డాం. చివరకు మళ్ళీ బ్రిటీషువాళ్ళకే చిక్కాం. వార్తా పత్రికలు చూస్తూ ఉండేవాడికి నీకు చెప్పేదేమిటి, లాల్‌ఖిల్లాలో ఖైదీలైన స్వతంత్రభారత సైనికుల వృత్తాంతం ? దేశంలో అలజడి మెండు కావడంవల్ల, ఆ మహానుభావుడు భూలాభాయి దేశాయి ప్రయత్నాలవల్ల ఉరికంబందాకా పోయిన మేము చివరి కెట్లాగో తప్పించుక బయటపడ్డాం— జీవచ్ఛవాల లాగున.

లింగ:- ఇది జరిగికూడా చాలారోజులైనదే. ఇన్నాళ్లూ ఎక్కడున్నావు ?

రాజ:- అదేకథ. యుద్ధంలో చేరినప్పటినుండి ఎఱ్ఱకోటనుండి బయట పడేవరకు నేను పొందిన వివిధానుభవాలు నాలో ఒక పరివర్తన కలిగించినవి. నా చేతులార ఎన్నో జీవాలు తీశాను. వీనుగ గుట్టల

మీాదుగా నడిచిపోయినాను. మారణ యంత్రాలను ప్రయోగించాను. మృత్యువుతో ముఖాముఖి నివాసం చేశాను. వెంట్రుక వాసిలో ఫిరంగిగుండ్లు నన్ను తప్పుకపోయినరోజులున్నవి. ఎఱ్ఱకోటలో ప్రతిరోజూ కొరడాదెబ్బలు తిన్నాను. నా రక్తం నా కళ్ళతో చూచుకొన్నాను. ఉరికంబం రోజులలోదేగాని తప్పేది కాదని యెదురుచూస్తూ కాలంగడిపాను. మృత్యువు చీప్పరించి నన్ను బయటికి ఉమిసివేసింది. ఈ అనుభవం కలిగిన తరువాత నా కొక్కటే మార్గం మంచిదని తోచింది – మహాత్ముడు బోధించిన సేవామార్గం. భగవంతుడు నన్ను మృత్యుదంష్ట్రలలోనుంచి తప్పించింది సంసార సుఖాలనుభవించమనికాదు; మానవసేవ చెయ్యమని! నా అంతరాత్మ నన్ను ఈ మాదిరి ఉద్బోధించింది. అందువల్ల యావజ్జీవ బ్రహ్మచర్యం వ్రతంగా పెట్టుకొని, మానవ సేవ చెయ్యడానికి ముందు ప్రపంచం చూచి రావలెనని చాల దేశం పాదచారినై చూచివచ్చాను. నేను చేసే మానవసేవకు నా తొలిరంగం నా జన్మగ్రామమే కావలెనని సంకల్పించి నేటికి స్వగ్రామం చేరుకున్నాను.

లింగ:- రాజశేఖరం! పెద్ద ఆదర్శం పెట్టుకున్నావు. చాల సంతోషం. కుక్షింభరత్వంలో జీవితం వృథాచేస్తున్న మాబోటివాళ్ళకు నిన్ను చూస్తే నిజంగా సిగ్గు. నీ ఉద్యమం బాగా సాగిరావాలని భగవంతుణ్ణిగూర్చి ప్రార్థిస్తాను. మరి, ఇవ్వాళ ఇంటికి వస్తున్నట్లు ముందుగా కబురుజేశావా ?

రాజ:- లేదు; మూడేళ్ళనుండి యింటికి ఉత్తరమే వ్రాయలేదు.

లింగ:- ఎఱ్ఱకోటలోనుండి బయటపడ్డ తర్వాతగూడా ?

రాజ:- లేదు. నేను బ్రతికివున్నట్లు మావాళ్ళ కింకా తెలిసివుండదు. బంధవిముక్తుడనైనతర్వాత ఇంటికి కబురుచేస్తే నేను ఇంటికిరాలేదు గదా అని క్రొత్తదిగులొకటి పెట్టుకుంటారు. కబురుచెయ్యకపోతే ఈ మూడేళ్ళుగా అలవాటుపడి, మాసిపోయిన పాతదిగులుతోనే

వుంటారు. అందువల్ల యింటికి కబురుచెయ్యకుండానే దేశసంచారం జేసి యివ్వాళ చేరుకుంటున్నాను.

లింగ:– చాల గట్టిగుండె నీది! ఈ దీక్ష, పట్టుదల, కార్యశూరత, నైతిక ధైర్యం నీకు విద్యార్థిదశలోనే ఉండేవి. నీవు తప్పక విజయి వౌతావు.

ఇంతలో లింగమూర్తి ఇల్లు సమీపించెను. రాజశేఖరుఁడు తన పెట్టె, పఱుపుచుట్ట యొక గదిలోపెట్టి తన యూరికిఁ బోవుదునని సెలవడిగెను. లింగమూర్తి యాశ్చర్యపడి "ఇప్పుడేంవెళ్తావు, రాత్రి మూడుగంటలసమయంలో ? తెల్లవారిపోవచ్చు – పండుకో, ఆ మంచం నీకోసమే వేశాను" అని యతనిని నిలుపుటకుఁ బ్రయత్నించెను. "నేను మొదట బయలుదేరినది తెల్లవారుఝాముననే. తిరిగి తెల్లవారు లోగానే యిల్లుచేరాలి. ఈ వెన్నెలలో పదిమైళ్ళు నడవటం నా కొక లెక్కగాదు. వందలకొలది మైళ్ళు నడిచాను. కష్టంలోని సౌఖ్యాన్ని బాగా అనుభవించఁగలను" అని రాజశేఖరుఁడు లింగమూర్తికి చిరునగవుతో జవాబు చెప్పి యా వేఁకువనే యేకాకిగ నింటికిఁ బయనమయ్యెను.

ఇప్పటి కెనిమిదేండ్లనాఁడు స్వగ్రామమువదలి వెడలినాఁడు. ప్రపంచములో వివిధ ప్రదేశములు చూచినాఁడు. వివిధ విషయానుభవములు పొందినాఁడు. తాను యుద్ధసేవ కేఁగక మున్నతని పరిసర ప్రపంచమునకు మాత్రము బద్ధమైయున్న యతనిదృష్టి యీ యెనిమిదేండ్లలో విశాలమై పెఱిగి యావత్ప్రపంచము నలముకొన్నది. హృదయమునందు సంకుచితత్వమునకుఁ దావులేకుండఁబోయినది. సర్వమానవ సౌభ్రాతృత్వమే మానవున కేకైక మతము గావలయునని విశ్వసించినాఁడు. ఏకలవ్య సూత్రమున గాంధీ చరణసేవానిరతుఁడైనాఁడు. నెహ్రూ బోధామృతపాయి యైనాఁడు. అతని కిప్పుడొక కులములేదు. వర్ణములేదు. జాతిలేదు. గ్రామములేదు. రాష్ట్రములేదు. అతఁడు విశ్వప్రపంచపౌరుఁడు. పంజర విముక్తమైన రామచిలుకవలె విశ్వవీధులలో విశృంఖల విహారముచేయుచు మానవ కల్యాణ కేళీ

విలాసమునఁ దన్ను దా మఱచి యఖిలమైన, యఖండమైన, యనిర్వాచ నీయమైన మహాశక్తిలో, పరంజ్యోతిలో లీనముగాఁదలఁచినాఁడు. అతని హృదయ మిప్పుడు సుప్రశాంతము. చిదానంద కందళితము. అతని కిప్పుడు కష్టసుఖములు, ఆనంద విషాదములు, ఇహపరములు – అభేదములు. అతని కిప్పుడు మానవసేవయే జీవిత ప్రయోజనము; మోక్షసాధనము. అతఁడొంటరిగాఁ బోవునప్పు డీ తేజోమయ పరివర్త నమే యతని హృదయాకాశమునఁ బ్రకాశించుచుండెను.

చిదానందానుభూతిచే మానవత్వము దివ్యత్వమును సమీపించు చుండును. కాని ప్రాకృతవాసనాబలము తనపని తాఁ జేయకమానదు. రాజశేఖరుఁడు తా నెంత విశ్వప్రపంచ పౌరత్వము దెసగమించుచున్నను "జననియు, జన్మభూమియు స్వర్గముకన్న మాననీయము"లను ప్రపంచ ధర్మమున కవశుఁడు గాలేకపోయెను. కావుననే తా నొనర్పఁదలచిన మానవసేవకుఁ దన గ్రామమునే ప్రథమరంగము సేయఁదలఁచెను. ఇంటగెలిచి రచ్చగెలువుమన్న లోకోక్తియు నతనకిఁదోడయ్యెను. తిరిగి తిరిగి యెట్టకేలకు జన్మభూమికే, జన్మస్థలమునకే చేరుకొనుచున్నాఁడు.

ఆ తరపి వెన్నెలలో నేకాకియై యతఁడు స్వగ్రామమునకు నడచి పోవునప్పుడు పూర్వస్మృతులన్నియు నతని హృదయాకాశమున దృశ్యమానములై యతనికి భావవికారము గల్గించుచుండెను. ప్రాకృత వాసన బలమైనదిగదా! తన బాల్యము, విద్యార్థిదశ, జనకునిశ్రమ, కౌటుంబిక వ్యవహారములు, శాంతాప్రణయము, మిత్రవర్గము, ఉద్యోగ ప్రయత్నములు, తానుబద్ధ బన్నములు – ఒకటేమి? – తన పూర్వ జీవితమంతయు సినిమా తెరపైఁ గన్పించు కథవలె నతని స్మృతిపథమున వెలయఁదొడఁగెను.

షుమారైనున్నర గంటల కతఁడు వేములపల్లి పొలిమేర జేరు కొనెను. జన్మభూమి యెడఁ దనకుఁగల భక్తి ప్రేమ లొక్కుమ్మడిఁ బైకొని యతని హృదయమును బాలవలెఁ బొంగించెను. అప్రయత్న ముగా నతఁ డొక్కచోఁ గూలఁబడి యా నేలను దన కన్నుల కద్దు కొనెను. తనకుఁ దెలియకుండగనే తన కన్నుల బాష్పవర్షము కురియు

చున్నదని యప్పుడు తెలిసికొని యుత్తరీయముతోఁ గనులు తుడిచికొనెను. తన హృదయ దౌర్బల్యమున కించుక సిగ్గుపడి వివిధ భావ పరంపరాభరమగు చిత్తముతో నూరిలోనికిఁ బ్రవేశించెను. పరిచితములగు నిళ్ళ నొక్కొక్కదానిని గడచిపోవుచు నందలి మానవపాత్రలను స్మరించుకొనుచు నూరిలో నడువసాఁగెను. ఈ యెనిమిదేండ్లలోఁ దన యూర నే మార్పు రాకుండుట కించుక యచ్చెరువందెను. ఊరి నుండి బయటికేగువారిలోఁ గొందఱి నతఁడు గుర్తించినను వారి నప్పుడు పలుకరించుట మంచిదిగాదని యెవ్వరితోడను మాటలాడక తన యింటి దెసకుఁ జనుచుండెను. ఆ వేఁకువ మసకలో నతని నెవ్వరు గుర్తింపలేరు. రాజశేఖరుఁడను వ్యక్తి మృతుఁడయ్యెననిగదా గ్రామములో నమ్మకము! మఱి యితఁడే యపుడట్లు వచ్చుచుండెనని యెవరు శంకింపఁ గలరు?

రాజశేఖరుఁడు తియ్యనగు తన యింటిని చూచెను. తిరిగి పట్టరాని యేదో భావోద్వేగమునకు వశుఁడయ్యెను. తా ననుకొన్నంత హృదయదార్ఢ్యము తనకులేదని గుర్తించెను; విచారపడెను. అపరిమేయమగు నీ బ్రహ్మాండమంతయు దర్శింపఁ దివురు తన హృదయమునకీ ప్రాతమండువా యింటి నొక్కదానిని జూచుట కీ యుద్వేగమేల? అనంతమగు కాలములోఁ దన యింటిని జూడకుండఁ గడిపిన యీ యెనిమిదేండ్లెంత? అనంతకోటి సంఖ్యాకమగు జీవరాసులలో, మానవానీకములోఁ దన యాప్తబంధువు లెంతమంది యగుదురు? వారి పునర్దర్శనమున కింత భావోద్వేగ మేల? రాజశేఖరుఁడు సిగ్గువడెను. తన గమ్యార్థమును జేరుటకుఁ దా నింకను శ్రమపడవలయును. తా నింకను సాధకదశయందే యున్నాఁడు. తన కింకను ఆత్మదర్శనము గాలేదు. తా నింకను బామరుఁడే?

భావసంకులమగు చిత్తముతో రాజశేఖరుఁడు తన యింటి మొగసాలఁ జేరెను. ఇంటి కెదురుగా వెంకటరెడ్డిగారి ముంగిట నెవ్వరో శ్వేతాంబరధారిణి యగు యువతి వంగి ముగ్గులు వెట్టుచుండెను. ఆమె యతనిని చూడలేదు. అతఁ డామెను జూచెను. కాని నెలవ్రుంగి మసక

యేర్పడి యుండుటచే నతఁ డామెను గుర్తింపలేదు. ఆపాదమస్తకము తెల్లని యుడుపులు ధరించిన యా పడఁతి పుణ్యస్త్రీ కాదా ? యనుశంక యాతని హృదయమునఁ బ్రవేశించెను. కాకున్న మఱియెవ్వరా యన్న జిజ్ఞాసయు పోలికలనుబట్టి శాంతయా యను సందేహము నంతటితో నొక విధమగు భయంకర మనోవికారము నొక క్షణమాత్ర మతనిని బాధించెను. ఆ వికారము నెట్లో జయించి తన యింటిముంగిటికేఁగి "అమ్మా!" యని పిలుచుచుఁ దలుపు తట్టెను!

"అంబా!" యని తనకై యఱచు వత్సమును గోమాత యెంత చీఁకటిలోనైన గుర్తించును. ఇంక మానవమాతనుగూర్చి చెప్ప నేల ? రాజశేఖరుని కంఠస్వరమును జననీ జనకులు వెంటనే గుర్తించిరి. కాని గుర్తించినంతగా నమ్మలేకపోయిరి. ఆ పిలుపు స్వర్గమునుండియా? వారు స్వప్నమునందున్నారా ? లేకున్న మూఁడేండ్లనాఁడు పరలోక గతుఁడయ్యెననుకొన్న తమ బిడ్డడు తమను బిలుచుటెట్లు ? ఏమో! అతఁడు మృతుఁడయ్యెనన్నమాట నిజముగాదేమో! ఇన్నియూహాలు నొక్కత్రుటిమాత్రలో వారి హృదయముల కెగఁబ్రాఁకెను. వెంటనే తలుపులు దీసిరి. ఎదుట రాజశేఖరుఁడు! పులినాకి విడిచినదూడ! మృత్యుదేవత బుగ్గలలో నానివచ్చిన మర్త్యుఁడు. ఎనిమిదేండ్లుగాఁ గన్నులకుఁ గంపకొట్టిపోయిన తొలుచూలి కొడుకు! యుద్ధరంగములో దిక్కులేనిచావు చచ్చెనని, తిరిగిరాడని యాసలు వదలిన తమ యనుఁగు బిడ్డ! తమకండ! తమనెత్తురు! అబ్బా! ఆ రంగమును జిత్రించుటకుఁ గాళిదాసులు దిగిరావలయును. ఊహాకందియు రచనకురాని భావము లిట్టియెడలనే తటస్థించును. హృదయముగల పాఠకుఁడా! ఊహించు కొనుము. మా కలమునకు బలము చాలదు!

రాఁడనుకొన్న కొడుకు తిరిగివచ్చినందుల కానంద మొందవలయును గాని యీ విలాపమేల ? ఆ యాలింగనములో నార్తి దేనికి ? ఆ బాష్ప వర్ష మెందుకు ? ఒక మేర మీఱిన మీఁదట ఆనందవిషాదము లేకమై పోవునా ? ఆనందము విషాదజన్యమా! విషాద మానందజన్యమా! ఏమో! కోదండరామయ్యగారి యింటఁ గొంచెము తొంగిచూడుడు!

సముద్రమున కాటుపోటులువలె మానవ హృదయములకు ఆనంద విషాదాతిరేకములు స్వాభావికములు. సముద్రమువలెనే యాటుపోటులు విరమించిన మీఁదట హృదయములును బ్రశాంతము లగుచుండును. రాజశేఖర పునరాగమనమువలని భావోద్రేకమును వారి కుటుంబమువారు త్వరలో వశపఱచుకొని యాతని యనుభవము లను కష్టసుఖములనుగూర్చి మెల్ల మెల్లఁగాఁ బ్రశ్నింప మొదలిడిరి. రాజశేఖరుఁడు చిఱునగవుతోఁ జిన్నిచిన్ని సమాధానములు చెప్పుచుఁ దనలోని పరివర్తనము అప్రయత్నముగ వారికిఁ దెలియఁజేయుచుండెను. ఇంతలో నిరుగుపొరుగువారు, ముఖ్యముగా నెదురింటి వెంకటరెడ్డిగారి కుటుంబము నీ వార్త విని కోదండరామయ్యగారి యింట గుమిగూడిరి. తెల్లవారునప్పటికీ వార్త గ్రామమంతయుఁ బొక్కెను. విధి విరామము లేకుండ వారును వీరును రాజశేఖరుని జూచిపోవుచుండిరి. అతనిని జూచుటకంటె నతని తల్లి దండ్రుల నభినందించుటే యెక్కువయ్యెను. "సీతమ్మతల్లీ! నీ కడుపు చల్లనిది. అయిపోయినాడనుకొన్న బిడ్డడు మళ్ళీ తిరిగివచ్చాడు. ఎవరికీ అన్యాయం చేసి యెరుగవు. దేవుడు నీ కన్యాయంచేస్తాడా? స్వర్గంలోనుంచి నీ బిడ్డను నీకు తెచ్చి అప్పగించాడు. అదృష్టవంతురాలవు తల్లీ!" అని వయసుతిరిగిన అమ్మలక్కలు సీతమ్మగారి నదేపనిగ నభినందింపఁదొడఁగిరి. రాజశేఖరున కిది యంతయు నొక వినోదముగ నుండెను. అలపైన వచ్చు నలవలె నొకరు విడిచిన నొకరిట్లు ప్రొద్దెక్కువఱకు వచ్చుచు నతని కూపిరి సలుపనీయ రైరి. వారు తనయందు చూపు ననురాగమునకు ముగ్ధుఁడగుచుఁ దన కృతజ్ఞత దెలుపుచుఁ గూర్చుండెను.

ఈ సందడి కొంతవఱకు శమించుదనుక నతఁడు తన హృదయాగ్రమున నుండిన శాంతాదేవిని గూర్చి యెవ్వరి నడుగుటకు వీలు లేకపోయెను. వెంకటరెడ్డిగారును, లక్ష్మమ్మగారును, దనను జూడ వచ్చిరి. అందఱివలె వారును దన్నభినందించిరి. కాని వారి ముఖము లలో నేదో యొక విషాదచ్ఛాయ యలముకొనియున్నట్లతఁడు గమనించెను. అది కాలప్రభావమై యుండునని మొదట సమాధానపడెను.

కాని యతని హృదయ మంతటితో తృప్తి పడలేదు. శాంత తనను జూడ రాలేదు. ఎట్లు రాఁగలదు ? అత్తవారి యింట నున్నది కాఁబోలు! శాంత విషయము నలుగురిలోఁ దల్లిదండ్రులనుగాని, రెడ్డిదంపతులనుగాని యడుగుటకుఁ బూర్వసందర్భములనుబట్టి యతనికి మన సొప్పలేదు.

జనసంకులత కొంత విరమించిన తరువాత శాంతయే కోదండ రామయ్యగారి యింటికి వచ్చెను. తలవాకిట రాక, దొడ్డి వాకిటఁ బ్రవేశించి రాజశేఖరుఁడు కూర్చుండియున్న వసారా వాకిటి తలుపు చాటున నిలువఁబడెను. సీతమ్మగారు "శాంత యిదిగో నాయనా! నిన్ను చూడ మొగం చెల్లక యిక్కడ నిలువబడ్డది." యని రుద్ధ కంఠముతోఁ జెప్పుచుఁ గన్నీరు తుడుచుకొనెను. రాజశేఖరుని శరీర మప్పుడేదో యొక విద్యుత్ప్రభావమునకు లోనైనట్లు తోఁచెను. వేఁకువను దాఁ జూచిన శ్వేతాంబరధారిణి శాంతయే యగునా? యని చటుక్కునఁ దోచెను. అశుభమును శంకించెను. తల్లిమాటలలోని విషాద ధ్వని యతని సందేహమును బలపఱచెను. కాని యతఁడు నమ్మలేకపోయెను. అతని సందిగ్ధావస్థను తల్లి గ్రహించెను. "తల చెడ్డది నాయనా! శాంత", యని యామె పిడుగువంటి సత్యము వెలి బుచ్చెను. "ఆఁ" యని యతఁడు వెనుకకుఁ దిరిగి శాంతను జూచెను. తల వంచుకొని బొటనవ్రేల నేల రాయుచు మూర్తిగొన్న విషాదము వలెఁ దెల్లని యుడుపులతో నామె యతనికిఁ గన్పించెను. తల యెత్త కయే శాంత యతనిని చూచెను. ఒక్క క్షణ శకల మాతని హృదయము తుపానుగాలిచేఁ గంపించు భూరుహమువలె నూగిపోయెను. కుండ నిండిన నీరు తొణఁకదు. హృదయము నిండిన దుఃఖము పైకుబుకదు. ఒకరి నొకరు చూచుకొనుటకన్న వా రేమియుఁ జేయఁజాలక పోయిరి. వాక్కునకు వా రశక్తులైరి. గిఱ్ఱునఁ దిరిగిన కన్నీటిని దుడుచుకొనుచు శాంత వంటయింటిలోనికిఁ బోయెను. తలఁపులుపొదలని హృదయముతో రాజశేఖరుఁడు ప్రక్కనఁ బడియున్న నులకమంచముపై నుస్సురుమనుచుఁ గూర్చుండెను. అయ్యో! శాంత కెంత పనియైనది?

కొంతసేపటికిఁ బ్రసంగవశమునఁ దమ్ముఁడు శ్రీరాములు శాంతా పరిణయ విషాదగాథ రాజశేఖరునికిఁ దెలియఁజెప్పెను.

శాంత పెనిమిటి పెండ్లినాఁడే కుంటినడకలు నడచుచున్నట్లు మనము చూచియుంటిమి. అతని యస్వస్థతచేఁ బెండిలిలో శోభనము జరుగలేదు. అతని యస్వస్థత యిట్టిదని యొరులకుఁ దెలియక దాఁచినను దానిపని యది చేయక మానునా? పసుపుబట్టలు మాయకముందే యతఁడు గుంటూరులో శస్త్రచికిత్సకులగు డాక్టరు పరుచూరి వీరయ్యచౌదరిగారి వైద్యశాలకుఁ జేరవలసివచ్చెను. శస్త్రచికిత్సకింకను సమయము రాలేదు. కొన్నాళ్ళుండవలయునని డాక్టరుగారు నిలిపిరి. రెండువారములున్నతరువాత జాడ్య స్వభావమునుబట్టి శస్త్రచికిత్స సఫలము గాఁగలదను ధైర్యము తమకు లేదనియు, మద్రాసు జనరలాసుపత్రికిఁ గొంపోయినచో నచ్చ్యేడ నవీనములగు శస్త్రోపకరణములు, చికిత్సా విధానము లభ్యమగుననియు, సలహాచెప్పిరి. అట్లే చంద్రారెడ్డిని మద్రాసు కొంపోయిరి. కాని ప్రయోజనమేమి? పెండ్లియైన నెల తిరుగకముందే యతఁ డాసుపత్రియందు మరణించెను.

లోకోత్తర సౌందర్యవతి. సుగుణరాశి, శాంతా జీవితమున వసంతకాల మిటు ప్రవేశించుటయు, నామె జీవితేశ్వరుఁ డటు పరలోకగతుఁ డగుటయు నొకేసమయమున జరిగెను. హారి, హారి! ఔను! హారి హారి యనుటకన్న నెవరేమి చేయఁగలరు? కంటికిఁ గడివెఁడై లక్ష్మమ్మగా రేడ్చిన నేమిప్రయోజనము? తలపైఁ జేతులుమోఁదుకొనుచు వెంకటరెడ్డిగారు నిలువున గూలిపోయిన నేమి ప్రయోజనము? అనాఘ్రాత పుష్పము. మగనిఁ దాకనైనలేదు; వైదిక తంత్రములేదు. కాన వారికి సాప్తపదీన మైత్రియైనఁ గలుగలేదు. మఱియింకొక పెండ్లియేలచేయరాదు? అమ్మయ్యో! పూర్వాచారమో! సమాజనీతియో? వంశమర్యాదయో! హిందూమత శాస్త్రములో? ఇవియన్నియుఁ బెద్దపులులవలె మీఁదఁబడవా? పడును! కావునఁ గర్తవ్యము? కర్మానుభవమే? తరతరాలుగఁ దయారైయున్న జవాబు. సులభమైయున్న జవాబు. అవును. కర్మమనుభవింపకతప్పదు! శాంత అనుభవింపఁ దొడఁగెను. అనుభవించుచున్నది.

# V

## స మా జ ము

రాజశేఖరుఁ డింటికిఁ జేరిన నాటిసాయంకాల మతఁడు వెంకట రెడ్డిగారి యింటికిఁ బోయెను. "రా! నాయనా! కూర్చో" యని లక్ష్మమ్మగా రయ్యాలబల్లమీఁద సర్దెను. వెంకటరెడ్డిగారు రాఘవ రెడ్డి యచ్చట సమావేశమైరి. శాంత కనిపించలేదు. ఇరువదియేండ్ల యువతి యింక నెవ్వరో కనిపించెను. ఆమెనుజూపి "యీయమ్మాయి రాఘవరెడ్డి భార్య. తాయారమ్మ. కన్నవారిది గారపాడు" అని పరిచయముచేసి లక్ష్మమ్మగారు తాయారమ్మతో "నీ కన్నయ్య బౌతా డమ్మా. రాజశేఖరం" అని వరుస చెప్పెను.

"శాంత దుర్గతి యింటికి చేరేవరకు తెలియదుగా బాబూ! నీకు?" అని లక్ష్మమ్మగారు కన్నీరువెట్టసాఁగెను. రెడ్డిగారు విషాద క్లిన్నమైన ముఖము నావల త్రిప్పుకొనిరి. రాఘవరెడ్డి "అసలు నా కా సంబంధం యిష్టమేలేదు" అని యేదో అనఁబోవుసరికిఁ దల్లి "ఇప్పు డనుకొని లాభమేమిటినాయనా! నొసట రాసిపెట్టింది తప్పుతుందా? రాత అట్లావుంటే ఇంకొక మను వెందుకు కుదురుతుంది?" అని చీది వేసెను. "రాతా లేదు, గీతాలేదు, ఎకరాలున్నాయని, వుద్యోగం చేస్తున్నాడని ఎవడినో ఎరగనివాడిని పట్టుకొచ్చి........" అని రాఘవరెడ్డి మరల మొదలుపెట్టెను. "ఊరుకోరా" యని తండ్రి గద్దించెను. రాఘవరెడ్డి మొగము చిట్లించుకొని పశువులశాలలోనికిఁ బోయెను. రెడ్డిగారు "మనుష్యులకురాక మానులకు వస్తాయా, కష్టాలు; అమ్మాయి పూలపూజ చేసుకోలేదు. నిప్పులపూజ చేసు కున్నది. అనుభవిస్తున్నది. మనకడుపున బుట్టింది కాబట్టి మనమూ ఆ కష్టమనుభవిస్తున్నాము" అని తత్వబోధ చేయుచునే యలవిగాని దుఃఖావేశమునఁ గ్రుంగిపోయిరి. ప్రక్కగదియందే కూర్చుండియున్న శాంతాదేవి యీ ప్రసంగము విని "నాయనా! నేను మీరనుకొన్నం తగా కష్టపడడంలేదనీ, నాకోసం మీరు కుమిలిపోవద్దనీ, ఎన్నిసార్లు చెప్పనూ? మళ్ళీ మళ్ళీ మీ రిద్దరూ అట్లా కరిగిపోతూంటే నేను

చూచి భరించలేకుండా వున్నాను. మఱచిపో నాయనా, ఆ కథంతా" యని గదివాకిట నిలువఁబడి పలికెను. రాజశేఖరుఁ డామెను తేరిపారఁ జూచెను.

శాంత యిప్పు డిరువదినాలుగేండ్ల యువతి. పండువంటి పాల మీఁగడవంటి జవ్వనము. అనాస్వాదిత మధువు. వైదుష్య లలిత మగు వదనము. ఉదాత్తభావ భాసురములగు నేత్రములు. మూర్తి గొన్న పావిత్ర్యము. ఆపాదకంఠము పరిశుభ్ర ధవళాంబరములు. ఆమె హృదయ నైర్మల్యమున కవిసూచకములా? మెడపైని నల్లని పెద్ద జుట్టుముడి. సంయమితములగు నామె కోర్కుల కవి చిహ్నమా? ఏమో! ఆమె వితంతువనుటకు నోరాడదు. నిర్మల నీల సరోవరములోని తెలితామరపూవువలె నామె ప్రకాశించుచుండెను. ఆమెకు మనో వికారములు లేవుసరికదా! ఆమెను జూచువారికిఁగూడ వికారములు గలుగని శాంతిపుంజ మేదో యామె నావరించియుండెను. రాజశేఖరు నుదయము జూచినప్పు డామెలోఁ బొడమిన విషాద మిప్పుడు లేదు. రాయిపాటునలేచు తరగలు శమింపఁగాఁ దేరుకొన్న సరస్సువలె నామె సుప్రశాంతముగా నుండెను. విషాదాంతమగు తన పరిణయగాథ జరిగిపోయిన యీ యెనిమిదేండ్లలో నామె యింకను విజ్ఞానమార్జించి బుద్ధి సంపదఁ బెంచుకొన్నట్లామె వాలకము సూచించెను. విధి కృతముతోఁ జక్కని సమాధానము గుదిరించుకొన్న ట్లామె ముఖలక్షణములు తెలుపుచుండెను. రాజశేఖరుఁ డామెలోని యీ పరిణామము గ్రహించెను.

రాజశేఖరుని శాంతకూడ తేరిపారఁ జూచెను. ఎనిమిదేండ్లకు నిప్పటికిఁ గల వయోభేదము దేశాటన ఫలము. వివిధానుభవములు నతని ముఖమునందు ముద్రింపఁబడి యుండెను. అతఁడు తొలుతటి కంటె గంభీరుఁడు. ఆ గాంభీర్యములోఁ గార్యదీక్ష, విషయదూరత, త్యాగశీలము, పవిత్రత ప్రతిఫలించుచుండెను. శాంత యతనిలోని యీ పరిణామము గ్రహించెను.

రాజశేఖరుఁడు శాంతతో నిట్లనెను. "శాంతాదేవి! చదువు

కొన్నందుకు ఫలంగా నీ వీ దురవస్థ నెట్లాగో భరిస్తున్నావు. కాని పామరులైన తలిదండ్రులు తమ యేకైక పుత్రిక యొక్క వైధవ్యాన్ని చూచి భరించడం కష్టం గదా!

శాంత:- అది నే నెఱుగనిది గాదు. కాని కాలం గడచినకొలది గతాన్ని మర్చిపోవాలి. అంతే అమ్మకూ నాయనకూ నేను చెప్పేది.

లక్ష్మమ్మ:- మర్చిపోవడం ఎట్లా తల్లీ! పూచిన తంగేడులాగ కాపరం జేయవలసిన యీడులో మోడువై యీ మాదిరి మా యెదుట కన్పిస్తూంటే మరుపెట్లా వస్తుంది?

శాంత:- రోజూ చూస్తున్నదే గాబట్టి అలవాటై పోవాలి. మనస్సును వశం చేసుకుంటే మన కీ దుఃఖాలుండవు.

రాజ:- అంతేకాదు. కలకాలం కుళ్ళికుళ్ళి మీరు చేసేదేమైనాఉందా?

శాంత:- లోకంలో నే నొక్కదాన్నే యిట్లా వితంతువు నైనానా? అందరూ యిట్లా కృశించిపోతున్నారా?

లక్ష్మమ్మ:- అందరి సంగతి మనకెందుకే తల్లీ!

శాంత:- అదే పొరపాటమ్మా! లోకంలో యింకా ఎంతమంది ఎటువంటి దుఃఖాలకు కష్టాలకు పాలౌతున్నారో ఒకసారి పారజూస్తే మనం నిజానికి వాళ్ళల్లో చాలామందికంటే అదృష్టవంతులమని తోస్తుంది. ఎక్కడి కక్కడికి తృప్తి కలిగించుకొంటే తప్ప మన శ్శాంతి ఉండదు. అదీగాక అమ్మా! ప్రపంచంలో ఉన్న ఆడవాళ్ళందరూ కాపురాలుజేసి పిల్లల గనవలసిందేనా? నే నీ మాదిరి తరించిపోతే ప్రపంచం కూలిపోతుందా? రాజశేఖరంగారూ! తెల్ల వాళ్ళల్లో కొందరాడవాళ్ళు పెళ్లే జేసుకోరట నిజమేనా?

రాజ:- నిజమే! కాని ఆ దేశాల్లో మనకుండే సాంఘిక నిబంధనలు లేవు. పెండ్లి అంటే మనకు బ్రహ్మవ్రాతవంటి సంస్కారం. దానికి తిరుగులేదు. భర్త చనిపోతే భార్య ఎంత బాల్యంలో వున్నా తిరిగి పెండ్లి చేసుకోరాదు. వాళ్ళ కా యిబ్బంది లేదు. మళ్ళీ చేసుకోవచ్చు. అంతేగాదు. దాంపత్యం సుఖంగా లేనప్పుడు భార్యాభర్తలు వివాహం రద్దుచేసుకొని ఎవరికివారు మళ్ళీ పెళ్ళిచేసుకోవచ్చు.

వాళ్ళకు పెళ్ళి మనమాదిరి పవిత్రమైన సంస్కారంకాదు. శాసన సమ్మతమైన వ్యవహారం.

వెంకటరెడ్డి:- వాళ్ళజాతివేరు. వాళ్ళ నీతి వేరు. మనకూ వాళ్ళకూ పోలిక ఎక్కడ?

రాజ:- మననీతికూడా ఎప్పటికప్పుడు మారుతూంటూంది. కాలాన్ని బట్టి నీతి మార్చుకోవడం అవసరంకూడా. మన దేశంలో ఒకప్పుడు మగవాళ్ళకంటే ఆడవాళ్ళసంఖ్య ఎక్కువగా ఉండేది. అప్పుడు ఒక్కొక్కమగవాడికి నలుగురైదుగురు భార్యలను గట్టేవారు. అట్లాంటి కాలంలో వితంతువులకు తిరిగి పెళ్ళిచేయడం కుదిరేది కాదు. పెళ్ళికానివాళ్ళకే భర్తలు దొరకనప్పుడు ఒకసారి పెళ్ళైన వాళ్ళకుకూడా ఎక్కడ దొరుకుతారు? అందువల్ల వితంతు వివాహనిషేధం ధర్మమైపోయి వుండవచ్చు. మరొక కాలం — మరొక దేశంలో అనండి – ఆడవాళ్ళకంటె మగవాళ్ళు ఎక్కువగా వుండేవాళ్ళు. అప్పుడు ఒక్కొక్క ఆడుదానికి నలుగురైదుగురు భర్తలను చేసేవాళ్ళు. నలుగురైదుగురు అన్నదమ్ములుంటే అందరికి ఒకే ఆడుదాన్ని భార్యను చేసేవాళ్ళు.

లక్ష్మమ్మ:- ఛీ! అంత పాపకర్మం ఎక్కడైనా వుంటుందా నాయనా!

రాజ:- మరి ద్రౌపది కథ ఏమిటి? పంచపాండవులందరికీ ఆమె పెండ్లామే కదా!

వెంక:- ఆ యుగంవేరు. ఆ మనుష్యులువేరు. ఆ ధర్మాలువేరు. ఐదుగురు పాండవులకు ద్రౌపది భార్యకావడాన్నిగురించి ఏదో కథ చెప్తారు గదా!

రాజ:- అదంతా కవిత్వం. ఇంతకూ నేను చెప్పదలచిందేమంటే–మన ఆచారాలూ, నీతులూ, నియమాలు దేశకాలపాత్రలనుబట్టి మారిపోతూ ఉంటాయి. ఎక్కడికో పోవడందేనికి? మొన్న మొన్నటివరకూ బ్రాహ్మలు తమ పిల్లలు రజస్వలలు కాకముందే పెళ్ళిచేయాలని నియమముండేది. ఆ నియమం ఎప్పుడు పుట్టిందో ఎందుకు పుట్టిందో ఇప్పుడు నిక్కచ్చిగా చెప్పడం కష్టం. బహుశా

మహమ్మదీయ యుగాలలో అవివాహితలైన పిల్లలను మహమ్మదీయులు దొంగిలించుకొనిపోయి 'నిఖా' చేసుకోవడం ప్రబలంగా వుండినందువల్ల ఈడురాకముందే పిల్లలకు పెళ్ళిచేసి ఆ ముప్పు కొంతవఱకు తొలిగించుకొని వుండవచ్చు. బ్రాహ్మణ వితంతువులకు తలలు గొరిగించడంకూడా ఇందుకే ఏర్పడి వుండవచ్చునని కొందరంటారు. అదట్లుండనివ్వండి. బాల్యవివాహాలు సాంఘికజీవనంలో అవసరమనిపించగానే అందు కనుకూలంగా శాస్త్రాలు వ్రాసిపెట్టారు. రానురాను వాటి వుద్దేశ్యం మరిచిపోయి మూడేళ్ళ పసిబిడ్డలకు కూడా పెళ్ళిళ్ళుచేయడం పరిపాటి ఐపోయింది. అందులో చాలా మంది రజస్వలలుకాకముందే వితంతువులుకావడం ముక్కుపచ్చలారని పసితనంనుంచీ యావజ్జీవం మోడులులాగా వితంతువులై వుండడం తటస్థించింది. ఏమాత్రం ఊహరాని వయస్సులో ఎవడికో ఒకడికి అంటగట్టడంవల్ల వయస్సువచ్చినమీదట వధూవరులకు సఖ్యత కుదరక కొన్ని దాంపత్యాలు విషాదాంతాలయ్యేవి. వితంతువులలో కొంతమంది మనస్సులు నిలుపలేక దురాచారాలకు దిగి అపకీర్తికి పాలుగావడం మనమెరిగిన విషయమే. ఈ అపాయాలన్నీ చూచి హరవిలాస్ శారదా అనే ఒక సంస్కర్త పద్నాలుగు సంవత్సరాలు వచ్చేవరకూ ఆడపిల్లలకు వివాహాలు చేయకూడదని ఒక శాసనం చేయించాడు. చేస్తే అపరాధమని కఠినశిక్షలు విధిస్తూ తర్వాత ఇంకా కొన్ని శాసనాలు చేయించారు. అంతకు ముందు రజస్వలానంతర వివాహాలు చేస్తే మతమంతా మండిపోతుందనేవారందరూ ఇప్పుడు నిర్భయంగా రజస్వలానంతర వివాహాలు చేస్తున్నారు. మన ఆచారాలూ, నియమాలు అన్నీ ఇటువంటివే.

వెంక:– మన శాస్త్రాలన్నీ పూర్వం ఋషీశ్వరులు వ్రాసేవాళ్ళటగదా ! వాళ్ళు తపస్సుచేసి మనకేది మంచిదో ఆలోచించి శాస్త్రాలు వ్రాశారు. కొన్నివేల సంవత్సరాలుగా అవి చెలామణి అవుతున్నవి. వాటిని మార్చడం తప్పుకాదంటావా ?

రాజ:- మన శాస్త్రాలు ఋషీశ్వరులు వ్రాసినమాట వాస్తవమే. ఆ కాలంలో ప్రజల అభిప్రాయాలూ, అవసరాలు, తెలిసికోనడానికి ఇప్పటిమాదిరి శాసనసభలుండేవికావు. ఋషులే ప్రజాభిప్రాయాలు అర్థంచేసుకొని వాటి కనుకూలంగా శాస్త్రాలు వ్రాసి రాజులచేత వాటిని చెలామణిచేయించేవారు. రాజులకు ఋషులు గురువులు. ఋషుల మాటలకు రాజు లెదురుతిరిగేవారుకాదు. ప్రభుత్వాలకు గురువులు శాసనసభలు. ప్రజాభిప్రాయాలు అవసరాలు, గుర్తించి హరవిలాస్ శారదావంటి సంస్కర్తలెవరో శాసనాలు చేయమని శాసనసభలకు చెపుతారు. ఆ సభలు చేసే శాసనాలే మనకిప్పుడు శాస్త్రాలు. శాస్త్రం అంటేకూడా శాసించేది, శాసనం అనే అర్థం. శాసనాలు చేయించే సంస్కర్తలు, శాసనసభ్యులు - వీరే మన కిప్పుడు ఋషులు. హరవిలాస శారదా మనకొక ఋషి. అనుకోవలసిందే సహగమనము - అనగా చనిపోయిన భార్యను బ్రతికున్నప్పుడే దహనంచేయించే ఘోర దురాచారం మాపుచేయించిన రాజా రామమోహనరాయలు ఒక ఋషే మనకు. కొన్నితరాలు గడిస్తేతప్ప ఇటువంటివారిని ఋషులంటె ప్రజలు నమ్మరు.

వెంక:- అదేమిటోయ్! అంత సులభముగా అందర్నీ ఋషులంటున్నావ్! ఋషులంటె అరణ్యాల్లో తపస్సులుచేసె గొప్ప గొప్ప మహిమలు సంపాదించినవారుగదా! వాళ్ళూ, మనకాలపు మన వంటి మనుష్యులు అందరూ ఒకటేనా!

రాజ:- పూర్వకాలపు ఋషులు వీరికంటె మహిమలు కలవారుగావచ్చుకాని, వారు సాధించేదీ వీరు సాధించేదీ ఒకటే ప్రయోజనం- లోకశ్రేయస్సు; ప్రపంచ కల్యాణం. ఆ విషయంలోమాత్రం అందరూ ఒకమాదిరివారే; తపస్సులంటే - టూకీగా చెపితే - ఆలోచన. ఇప్పటి సంస్కర్తలుకూడా ప్రాచీన ఋషులమాదిరి లోక కల్యాణంకోసం దూరదృష్టితో ఆలోచించిగాని ఎటువంటి శాసనం చేయించరు. పైగా శాసనంచేయకముందు శాసనసభా సభ్యులందరు తాము చెయ్యబోయే శాసనాన్ని గూర్చి దీర్ఘంగా తర్కి

స్తారు. చర్చిస్తారు. ఎంతోమందియొక్క ఆలోచనకు ఫలంగా గాని ఏ శాసనమూ తయారుగాదు. కాబట్టి మన సంస్కర్తలూ ఒక విధంగా ఋషు లనుకోవడంలో తప్పులేదు. ఇంతకూ నా అభిప్రాయ మేమిటంటే మన నీతులు, నియమాలు, ధర్మశాస్త్రాలు, కాల పరిణామాన్నిబట్టీ ప్రజాభిప్రాయాల అవసరాన్నిబట్టీ మార్చుకోవాలి. అట్లా మార్చుకోవడంలో తప్పులేదు.

వెంక:- నేనడిగినదాని కింకా జవాబుచెప్పలేదు. ఇన్నివేల సంవత్సరాలుగా పాటిస్తూవచ్చిన ధర్మశాస్త్రాలు మార్చవచ్చునా ? మన పూర్వీకులు ఆలోచనలేకుండా అనుభవంలేకుండా వ్రాశారావాటిని?

రాజ:- వాళ్ళు వ్రాసినప్పటి పరిస్థితిలో అవి బాగా అన్వయించి వుండ వచ్చు. ఇప్పటి పరిస్థితిలో మార్పు గావాలి. నిజానికి మనశాస్త్రా లెప్పటికప్పుడు మారుతూనే వచ్చినవి. ఏ శాస్త్రమూ పుట్టినది పుట్టినట్లుగా ఉండదు ఒక ఉదాహరణ – భవభూతి అనే సంస్కృత కవి వ్రాసిన ఉత్తరరామచరిత్రనుబట్టిచూస్తే. ఒకముని ఇంకొక మునీశ్వరుని ఆశ్రమానికి అతిథిగా వెళ్ళినప్పుడు కపిలగోవు మాంసంతో ఆతిథ్యం ఇస్తూవుండినట్లు కన్పిస్తుంది. ఇప్పుడే బ్రాహ్మణుడైనా అది ధర్మం అంటాడా? మాంసం తింటాడా? అందులోనూ ఆవుమాంసం! ఆ కాలంలో మాంసంతిని బాహు బలం పెంచుకుంటేతప్ప శత్రువుల నెదిరించి ఎవరి రాజ్యాలను వారు ఎవరి ఆలుబిడ్డలను వారు రక్షించుకొనడానికి వీలుండేదికాదు. కొంతకాలానికి రాజే యీ రక్షణకార్యం చేస్తూ వుంటంవల్ల ప్రజలకు ఆ యవసరం పోయివుంటుంది. బుద్ధునికాలానికి అహింసే పరమధర్మం ఐపోయింది. ఆ మహానుభావుడు మాంసాహారం నిషేధించాడు. హింసాత్మకములైనవి గాబట్టి యజ్ఞాలనుకూడా నిషేధించాడు. బౌద్ధమతం అవైదికమని శంకరాచార్యులు ఖండించి మనదేశంలో దాన్ని రూపుమాపాడు. అప్పటినుంచీ మళ్ళీ మాంసాహారం ఆచారంలోనికి వచ్చింది. కాని బాహుబలం ఉపయోగించవలసిన జాతులకు మాత్రమే మాంసాహారం అంగీక

రించి తక్కినవారికి నిషేధించారు. చూచారా ? కాలానుగుణంగా మన ధర్మాలు ఎట్లా మారిపోతూవచ్చినవో ! కాబట్టి ప్రాచీనమైనంత మాత్రాన ధర్మశాస్త్రాలను ముట్టుకొనడానికి వీలులేదని భావించ కూడదు.

శాంత:- రాజశేఖరంగారూ ! మీరు చెప్పేది యుక్తంగాఉన్నది. నేనూ అంగీకరిస్తాను. కాని మన ధర్మాలు మన హిందూమతానికి అనుగుణంగా ఉన్నవి. పాశ్చాత్యులకు మనకూ ఒక పెద్దభేదం కన్పిస్తున్నది. మనకు ఆధ్యాత్మికదృష్టి ఎక్కువ. వారికి అధిభౌతిక దృష్టి ఎక్కువ. మనం అస్థిరమని తిరస్కరించేవాటిని వాళ్ళు స్థిరమైనవానినిగా భావిస్తారు. మాటవరసకు వివాహ సంస్కారం చూడండి. మనకు ఐహికసుఖంమీద దృష్టితక్కువకాబట్టి వైవాహిక జీవితఫలం భంగమైపోతే మన మంతగా లెక్కచెయ్యక పారిమార్థికఫలం ఆలోచిస్తాము. వాళ్ళు అట్లా వూరుకొనక వైవాహికజీవితం ఎంతకాలము ఎంత సుఖవంతముగా వుండడానికి వీలుందో అంతవరకూ ప్రయత్నించి చూస్తారు. అందుకే అనుకుంటాను—మనం విధవావివాహాలనిషేధించడం, వాళ్ళు ఆమోదించడం.

రాజ:- నీ వాదంలో కొంత బలంలేకపోలేదు. కాని నేను సంపూర్ణంగా నీతో ఏకీభవించను. సామాజిక పరిస్థితులనుబట్టి వితంతు వివాహం అసాధ్యమైనప్పుడు మనవాళ్ళు వితంతువులకు ఆధ్యాత్మిక చింత పట్టించి వుండవచ్చు – లేకపోతే సమాజం చెడిపోతుందని. కాని అందరు ఆధ్యాత్మికచింతగలిగి మనఃపరిణామము తెచ్చుకోలేరు గదా ! అటువంటి పరిణామము రానివాళ్ళకు పునర్వివాహం ఒప్పుకొన్నది మన సమాజం. అందువల్లనే కొన్ని జాతులలో పునర్వివాహంచేస్తారు వితంతువులకు. మనఃపరిపాకం విచారించే కుండా అందరికీ ఒకే నియమం కల్పించి బలవంతంగా దానిని అమలుజరపడం అవివేకమైనదని. వ్యక్తుల శ్రేయస్సు, సౌఖ్యమూ, ఆలోచించని ధర్మసూత్రాలు ఎంతకాలం నిలువగలవు. వితంతు వివాహ నిషేధం అటువంటిదే !

శాంత:– ఏ ధర్మసూత్రమూ సర్వజనాంగీకారము పొందలేదు. సమాజం యొక్క సాముదాయిక శ్రేయస్సుకొరకు వ్యక్తులు తమ సౌఖ్యాన్ని కొంత త్యాగంచెయ్యాలి. అటువంటి త్యాగభావాన్ని దోహదం చేసే ప్రచారం ప్రజలలో జరగాలి. ప్రజలలో పారమార్థిక చింత ప్రబలకపోతే ప్రతివ్యక్తికి స్వార్థపరత్వము పెటిగిపోయి క్రూరమృగ భీకరమైన అరణ్యం లాగున తయారౌతుంది సమాజం.

రాజ:– నిజమే. ఐతే ఏ ధర్మసూత్రం ప్రజల సాముదాయక శ్రేయస్సు కల్గిస్తుందో, ఏది కల్గించదో విచారించకుండా పూర్వాచారాన్ని ఆధారంచేసుకొని ప్రాచీన ధర్మాలన్నింటినీ మార్పులేకుండా ఆచరించాలంటె మార్గం పెడతిరుగుతుంది. దేశకాల పాత్రలనుబట్టి ధర్మాలు మార్పుచెందాలని మళ్ళీ మొదటికొచ్చాం.

శాంత:– మార్పు అవసరమో కాదో అనే ఆలోచనలేకుండా, కాలం మారింది కాబట్టి ధర్మాలు మారాలనడంకూడా ప్రమాదమే కాదండీ!

రాజ:– అదీ నిజమే! కాని మార్పు ఆవసరమో కాదో, అనే విచక్షణ లేకుండా పూర్వాచారంగదా యని ఎటువంటి అయోగ్య ధర్మాలకైనా దాసోహమ్మనే ప్రజాసామాన్యానికి విజ్ఞానం కల్గించి వారికి సంస్కరణాభిలాష పుట్టించి వారి జీవితశ్రమ తొలగించడం విజ్ఞుల కర్తవ్యం. అవివేకమైన ప్రజాసామాన్యం మార్పులు కోరనంత మాత్రాన మార్పులనవసరం అనడం పొరపాటు.

శాంత:– మీ రనుభవజ్ఞులు. విజ్ఞాన సంపన్నులు. మీ వద్ద నేర్చుకొన వలసింది నాకు చాలా వున్నది. మీతో నేను వాదించలేను. వివాహ సంస్కార విషయంలో నాకు క్రొత్త క్రొత్త భావాలు రేకెత్తించారు. కేవలం తర్కబలంమీద ఏ విషయమూ నిర్ణయించుకోకూడదు. అనుభవంమీద తేల్చుకోవాలి. వితంతువుల విషయంలోమాత్రం మన ప్రాచీనాచారాలను ధర్మాలను తరచి చూస్తే నాకో సూచన కన్పిస్తోంది. పాశ్చాత్య సమాజంలో సన్యసించి మతప్రచారంచేసే 'నన్నులూ' ఆస్పత్రులలో స్వల్ప

వేతనంమీాద రోగులకు సేవజేసే 'నర్సులూ' మొదలైనవారికి పర్యాయంగా హిందూసమాజంలో వితంతువులు సంఘసేవకోటకు ఉద్దేశింపబడ్డారని నా బుద్ధికి తోస్తున్నది. మానవసేవకంటే ఉత్తమమైన తరణోపాయంలేదు. అల్పవయస్సులో వైధవ్యం సంప్రాప్తించిన స్త్రీకి సన్యస్తజీవితం అభ్యాసంచేసి యింద్రియ సంయమనం అందుకనుకూలంగా సాత్వికాహార నియమం, లోకసేవావ్రతం, ఏర్పఱచి వుండవచ్చు మన ప్రాచీనులు.

రాజః– వితంతువులు వితంతువులుగానే ఉండవలసిన సామాజికావస్థ ఏర్పడ్డతర్వాత యిటువంటి ఉపాయాలు ఆలోచించి వుండవచ్చు కాలుపోతే కొయ్యకాలు వేసినట్లు. మంచికాలు వెయ్యడానికి వీలున్నప్పుడు కొయ్యకాలుతోనే ఉండాలనడం తప్పంటాను నేను. నీవు చెప్పిన లోకసేవా విధానం నేను కాదనను. కాని ఇంద్రియ విజయం సాధించకలవాళ్ళే ఈ ధర్మాన్ని పాటించగలవారు. ఆ ధర్మాన్ని అందరికీ అన్వయింపజేస్తేనే వచ్చే ప్రమాదం. వాళ్ళ వాళ్ళ మనఃప్రవృత్తులనుబట్టి వ్యవహరించాలి. మనస్సును వశం చేసుకొని మానవసేవాభిలాష గలిగించుకొన్న వితంతువులను సేవా వ్యవస్థలో చేర్చుకోవచ్చు.

శాంతః– మొదట ధర్మబోధచేసికదా! వాళ్ళ వాళ్ళ మనఃప్రవృత్తులను గమనించేది; నేను మన గ్రామంలో ఆ పనికి పూనుకొంటాను. ధర్మబోధకంటే తార్కాణం మంచిదికాబట్టి నేనే మొదట ఆ సేవా కార్యక్రమం ప్రారంభిస్తాను.

రాజః– మంచిది. ఇతరులకు మార్గదర్శకురాలవై నీ ధర్మాన్ని నీవు నెరవేర్చు – శాంతా! నీ వందుకు తగినదానివి. నీ నిశ్చయం నాకు చాలా సంతోషం కలిగించింది. దేశదేశాలు తిరిగి మానవసేవా వ్రతంలో తరించిపోవాలని సంకల్పించి నేనూ మన గ్రామం చేరుకున్నాను. ఆ సేవ యెక్కడెక్కడో చేయడంకంటె మన గ్రామంలోనే చేయాలని, ఇక్కడ కృతకృత్యుడనైతే మరొకచోట చెయ్యవచ్చునని నిర్ణయించుకొన్నాను. ఇప్పుడు నీవు చెప్పినమాటలను

బట్టి నీవు నాకు చాలా సహాయం కాగలవని ధైర్యం కలిగింది. నీవు మొదట మహిళాజనంలో విద్యావ్యాప్తికి ప్రయత్నించు. వితంతు ధర్మోపదేశంగూర్చి నేను నీకేం చెప్పనవసరంలేదు. నీ అభిప్రాయాల ననుసరించి ప్రయత్నించి చూడు. కొంతకాలం గడచిన తర్వాత అప్పటి పరిస్థితినిబట్టి ఈ విషయం మళ్ళా ఆలోచించవచ్చు.

ఇంతలో రాజశేఖరుని చెల్లెలు రుక్మిణి వచ్చి "అన్నయ్యా! నీకోసం అంకినీడన్న వచ్చాడు. అమ్మ రమ్మంటున్న"దని చెప్పెను. అతఁడా సంభాషణ యంతటితో ముగించి యింటికేఁగెను. శాంతాదేవి హృదయ మిట్లు పరిపక్వమగుచున్నదని తల్లిదండ్రులు గుర్తింపలేదు. ఆమె పరిణామమునకు రాజశేఖరుఁడే యచ్చెరువందెను. తా ననుకొన్నట్లు శాంతకుఁ దాఁ జేయవలసిన సహాయమేమియుఁ గనఁబడలేదు. తన సేవాకార్యక్రమములో నామెయే తనకుఁ దోడుకాఁగలదని గ్రహించి మిక్కిలి సంతోషించెను. తనను ఒకప్పుడు "బావా!" యని పిలుచు ముగ్ధబాలిక "రాజశేఖరంగారూ!" యని సంబోధించి తనతో ధర్మసిద్ధాంతాలు తర్కించుటకు వచ్చినదన్నచో నామె హృదయమెంత పరిపక్వమైనదో సుబోధకమగుచుండెను. ఆమె వితంతువయ్యెనన్న సంతాపముతో ఇట్లుదాత్త సంస్కార పరిపాకము బొందెనన్న సంతోషము సమానమై యతని హృదయమును శాంతపఱచెను.

# VI

# కర్తవ్యము

స్వగ్రామము చేరిన తరువాత షుమారిరువదిరోజులు రాజశేఖరుఁ డింటనేయుండి శ్రమ తీర్చుకొనెను. ఎనిమిదేండ్లు పరదేశ పరరాష్ట్రములలోను, యుద్ధజీవితములోను, కారాగారమందునుండి వచ్చుటచేఁ దన పల్లెటూరు తనకే కొంత క్రొత్తగాఁ దోఁచెను. ఈ యిరువదిరోజులలో నతఁడు స్వీయ జాతీయ వాతావరణములో మరలఁ గలసిపోయెను. తన పెదతండ్రి కుమారుఁడగు నంకినీనితోడను సహాధ్యాయుఁడగు రామరాజుతోడను గలిసి యతఁ డూరియందు మిత్రులను బరిచితులను ముఖ్యముగాఁ దన బాల్యగురువగు పుల్లయ్యపంతులను సందర్శించి తన పూర్వ పరిచయమును బునరుజ్జీవింపఁజేసికొనెను. తన మిత్రులకుఁ దన యనుభవములను జెప్పి వారి దృష్టిని విశాలపఱచెను. వారితోఁ దా నెంతకలిసి తిరుగుచున్నను వారికిమాత్ర మతఁడు క్రొత్తగానే తోఁచుచుండెను. అతని మాటలలో, నతని భావములలో నొక వింతధోరణి వారికి గోచరించెను. సత్యవ్రతము, స్వార్థత్యాగము, నిరాడంబరత, నమ్రత, సేవాదీక్ష - ఎంతవఱకు నివియే యతని లక్షణములు. అతనితోఁ దిరుగు మిత్రులకుఁగూడ నివియే పట్టుబడుచుండెను. పట్టుబడనివారి కతని మైత్రి యననుకూలమగుచుండెను. అనివార్యమగు నొక శక్తి, యొక తేజస్సు, నతనియందు గోచరించుచు నంతంతమాత్రమువారికి నతఁ డందుబాటులో నుండకపోయినను అందరికి గౌరవనీయుఁడగుచుండెను.

రాజశేఖరుఁడును రామరాజును గలిసి యొక వారమురోజులు గుంటూరు, తెనాలి, బెజవాడ పట్టణములు తిరిగి తన సహాధ్యాయుల ననేకుల సందర్శించి తాను యుద్ధసేవ కేఁగిననాటినుండి యప్పటికి దేశములోఁ గలిగిన యార్థిక, సాంఘిక, రాజకీయ, పరిణామములను గూర్చి విపులముగాఁ దెలిసికొనెను. దేశము నెదుర్కొన్న విషమ సమస్యలను దీర్చుటకు జాతీయప్రభుత్వము తీసుకొనుచున్న చర్యలను

గూడ నవగాహన జేసికొనెను. దేశములో శాంతి సౌఖ్యములు నెలకొల్పవలయునన్నచో, గ్రామములన్ని విధముల స్వయంపరిపోషకములు, స్వయంపరిపాలితములు నగుట యత్యవసరమని సారాంశము దేల్చుకొనెను. అతి దుష్కరములగు నా సంస్కారములను దొలుతొల్త స్వగ్రామమునందే నెలకొల్పుటకు మార్గము లాలోచింపఁదొడఁగెను. ఈ సంస్కారములను జయప్రదములుగా నెలకొల్పుటకుఁ బ్రజలయందు స్వార్థపరత, పరస్పర ద్వేషము, అసూయ, లోభము నశించి పారమార్థికదృష్టి యేర్పడవలయును. సమాజ వలయములోఁ దమ హక్కులకన్న బాధ్యతలను విధులనే వారు ముఖ్యముగఁ బాటింపవలయును. ఈ యసాధారణ పరివర్తన మీ కాలమున సాధ్యమా ! యని యతఁడు సందేహింపలేదు. ప్రయత్నములు మానవులవి. ఫలాఫలములు భగవంతునివి. రాజశేఖరుఁడు, రామరాజు పట్టణ పర్యటన ముగించుకొనివచ్చిన మరునాడు వారిరువురును, అంకినీఁడును, వేణుగోపాలస్వామి కోవెలలో సమావేశమై గ్రామసేవా విధానమునుగూర్చి దీర్ఘాలోచనకుఁ దొడఁగిరి. గ్రామము బాగుచేయుటకు మొట్టమొదటి యాతంకము కక్షలు; గ్రామములోఁ గక్షలు రూపుమాపినగాని యే యుద్ధరణకార్యము కొనసాఁగదని వారు నిర్ణయించుకొనిరి. ఈ ప్రసంగము జరుగునప్పుడు పుల్లయ్యపంతులా దిక్కునఁ బోవుచు వారిని జూచి యచ్చటికిఁ జేరుకొనెను. పంతులును సగౌరవముగాఁ గూర్చుండఁబెట్టి తా మప్పుడు చర్చించు విషయ మాయనకు సంక్షేపించి తెలిపి రాజశేఖరుఁ డిట్లనెను.

రాజ:- తాతా ! గ్రామములో పార్టీలు కలిపితేగాని ఏ పనీ సాగదు. కలపటం ఎట్లాకుదురుతుందీ ? నీవు అనుభవజ్ఞుడవు. నీ సలహాలు మాకు కావాలి.

పంతులు:- దేవుడు మేలు జేస్తే, మనవూళ్ళో పార్టీలీ నాటివి కావు. నా చిన్నతనంనుంచీ వున్నవే యీ పార్టీలు. ఇప్పుడు కలపబోతే కలుస్తాయా ?

రాజ:- ఇంతవఱకూ కలపటానికి ప్రయత్నం జరుగలేదుగదా! ప్రయత్నిస్తే కలవకపోతాయా!

పంతులు:- ఇన్నేళ్లుగా ఉన్నవాటిని కలపడంమాత్రం మంచిదా? ఆనాడు పార్టీలు పడ్డప్పుడు ఎందుకు పడ్డాయో ఏమో!

రాజ:- అదేమిటితాతా! పార్టీలెందుకైనా పడివుండవచ్చు. వాటివల్ల గ్రామానికి చేటేగాని మంచిదిగాదుగదా! అవి ఎందుకుపడ్డాయో తెలియనంతమాత్రాన వాటిని మాపుచేయకుండా ఆచంద్రస్థాయిగా వుంచడం మంచిదంటావా? ఇక గ్రామం ముందుకొస్తుందా?

పంతులు:- పాతవాటిని వేటినీ కదిలించకూడదనే సిద్ధాంతంతో నేను చెప్పాను.

రామరాజు:- నీ మాటకు నాకు నవ్వొస్తున్నది. పాతదిగదా! అని రోగం నయంచేసుకోకుండా ఎవడుంటాడు?

పంతులు:- చేతగానప్పు డేంచేస్తాడు?

రాజ:- ప్రయత్నంచెయ్యందే చేతగాదని అనుకోవడ మెట్లా? నిజానికి మన గ్రామంలో పార్టీలుండటానికి కారణమే కనపడదు. మనం నడుంకట్టుకుంటే కలిపివేయగలం. పాతవికాబట్టి కలుపకూడదనే సిద్ధాంతం నే నొప్పుకోను.

పంతులు:- దేవుడు మేలుచేస్తే.........

అని యేదో చెప్పఁబోవుసరికి రమణారెడ్డి యెచటినుండియో యూడిపడి సిగరేట్ పొగతోఁ జిన్న మేఘమును గల్పించుచు "మై గుడ్‌గాడ్! వాటీజ్ ది కాన్స్పిరేసీ హియర్! ఏమిటీ కుట్రచేస్తున్నారిక్కడ!" అని తన పరిహాస చాతురికిఁ దానే పకపక నవ్వఁదొడఁగెను. అంతట రామరాజు కూర్చో! రమణారెడ్డీ" అని రాజశేఖరునిజూపి "ఈయనే కోదండరామయ్యగారి కుమారుడు రాజశేఖరరావు. యుద్ధంలో పనిజేసివచ్చాడు" అని రమణారెడ్డికి రాజశేఖరరావును బరిచయముజేయుచు రాజశేఖరరావుతో నిట్లనెను. "ఈయన పీసపాటి వీరారెడ్డిగారి అల్లుడు. పందిపాటి రమణారెడ్డి. ఇల్లిటంవచ్చాడు మన వూరికి. ఇక మనగ్రామస్తుడే." అంతట రాజశేఖరుఁడు రమణారెడ్డి

వంకకుఁ దిరిగి "మీా పరిచయమైనందుకు సంతోషం" అని యతనికి నమస్కరించెను.

రమణా:- హల్లో! కెప్టెన్ రాజశేఖర్! మిమ్ము గూర్చి చాలా విన్నాను. అయామ్ సో ప్లీజ్డ్ టు మీాట్ యు. మిమ్ము కలుసుకోనటానికి చాలా సంతోషం. బట్,

పంతులు:- బట్టో వస్త్రమో తర్వాత చూద్దాం. ముందా నోట్లో కాగడా పారేయవయ్యా! రమణారెడ్డీ! దేవుడుగుళ్లో కూడా సిగ రెట్టు కాలుస్తారా ?

రమణా:- మై గుడ్ గాడ్! యు వార్ హియర్! నీ విక్కడున్నావా, తాతా! అయినా, నీవు కాల్చే ఘాటైన నంబూరు పొగాకు పొగ భరించలేడేమోగాని దేవుడు, నా కత్తెరమార్కు సిగరెట్ పొగ భరించగలడు. స్వీట్ ఫ్లేవర్! కమ్మని సువాసన! సాంబ్రాణిధూపం . కూడా వద్దంటాడు నా సిగరెట్ పొగ తగిలితే.

పంతులు:- నాస్తికుడంటే నీవే!

రామరాజు:- మనం కూర్చున్నది గుడి అవరణేగాని గుడికాదు. కాబట్టి పెద్దప్రమాదంలేదు. అయినా, రమణారెడ్డీ! పారెయ్య గూడదూ, ఆ సిగరెట్టు కాస్తా!

రమణారెడ్డి:- "బై ఆల్ మీాన్స్! అసలు ఐ పోయింది కూడా" అని పల్కుచు సిగరెట్టు పారవేసెను.

అంకినీడు:- తాతకూ, రమణారెడ్డికీ. ఈ సరసా లెప్పుడూ వుండేవే! ఇక మన పని కానిద్దాం. ఊళ్లో పార్టీలు కలపడానికి మనం భగీరథ ప్రయత్నం చెయ్యాలి. అందుకు ఇవ్వాళ పెద్దతలకాయ లన్నింటినీ ఒకచోట చేర్చి ముచ్చటిస్తే మంచిదని నా అభిప్రాయం.

పంతులు:- ఈ మాత్రం మొనగాళ్ళు ఇంతకుముందు లేకనేనా, యిన్ని సంవత్సరాలనుండీ పార్టీలు కలవకుండా ఉండడం ?

రాజ:- లేకనే అని నా నమ్మకం.

పంతులు:- గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించడం అంటే ఇదే! నిన్నగాక

మొన్న గోచిపెట్టారు, అప్పుడే పెద్దమొనగాళ్ళైనారు! వీరట! పార్టీలు కలుపుతారట!

రాజ:- ఎందుకు కలపలేం, తాతా! 'పార్టీలు కలవాలి, వూరు బాగు పడాలి' అని పరిశుద్ధమైన సంకల్పం పట్టుదల వుంటే పార్టీలు కలప డం పెద్ద పనిగాదు.

పంతులు:- ఊఁ! కానీ, చూస్తాం. దేశాలు తిరిగి నీ వేదో కొత్తవిద్య నేర్చుకొచ్చినట్లున్నావు!

అని పల్కుచు పంతులు లేచిపోయెను.

అంకినీఁడు:- ఏ పనికీ ఈ ముసలాయ నెవరే! ఈయనతో సంప్ర దించడం మొట్టమొదట మనదే పొరపాటు.

రాజ:- కాదన్నా! మనకు రెండు మూడు తరాలు ముందటివాడు పుల్లయ్యతాత. ఆయన అనుభవాలు మన ముపయోగించుకు తీరాలి. ఆయన కఠినంగా మాట్లాడితే మనం సహించాలి. నిజానికి మనం అనుభవం చాలనివాళ్ళం. కాబట్టి తప్పటడుగులు వేయ వచ్చు. ఆయన సలహాలు మనకు ఉపయోగించవచ్చు. ఆ సలహాలు మనం ఆలోచించి అనుకూలంగా ఉంటే అనుసరిద్దాం. లేకపోతే తిరస్కరిద్దాం. అంతేగాని ఆయనతో సంప్రదించకపోవడం తప్పు.

రమణా:- ఐ డోంట్ అగ్రీ! నే నొప్పుకోను. అసలు ఈ ఓల్డుహ్యాగ్సు- అంటే - ఈ ముదివగ్గుల నందర్నీ తరిమి పారేస్తేతప్ప దేశం బాగు పడదు. వీళ్ళకు "ముసలిస్థాన్" అని వేరే ఒక దేశం భాగించి యివ్వడం 'ప్రాక్టికల్ పాలిటిక్స్' అనిపించుకొంటుంది. ఐ హేట్ దిస్ పుల్లయ్యపంతులు ఇన్‌పర్టిక్యులర్ - అంటే - ప్రత్యేకించి ఈ పుల్లయ్యపంతులంటే నాకు సరిపడదు. ప్రతిదానికీ - వాట్ డు యుసె ఇన్ తెలుగు - ఆఁ - పానకంలోపుడకలాగా తయా రౌతాడు. బట్, మైడియర్ కెప్టెన్, అసలు మీ ప్లానేమిటి? మీరు రిటర్న్ అయీ కాకముందే ఏదో సీరియస్ బిజినెస్ పెట్టు కున్నట్టుందే? పార్టీలేమిటి, కలవడమేమిటి? వాటీజ్ ఆల్ దిస్! ఏమిటిదంతా?

అని పల్కుచు మరల సిగరెట్టు ముట్టించెను.

రాజ:- ఆ సంగతి తర్వాత ముచ్చటిద్దాం ఇప్పటికే ఫొద్దెక్కింది. వెళ్దాం లేవండి.

అని తాను లేచి యితరులను లేపుచు రామరాజు నుద్దేశించి "భోజనానంతరం ఊరిపెద్దలను సందర్శించాలి. నేనూ అంకినీడన్నా కలిసి మీ యింటికి వస్తాం, నీ వెక్కడికీ వెళ్ళక యింట్లోనే వుండు." అని యతనిచే నొప్పించుకొనెను.

రమణా:- కెప్టెన్ రాజశేఖర్! జస్టెవర్డ్! ఒక్కమాట.

రాజ:- రమణారెడ్డిగారూ! నేను యుద్ధసేనలో వున్నప్పుడు కెప్టెన్ పదవిలో నున్నమాట వాస్తవమేగాని, ఆ సేవ మానుకొని వచ్చిన తర్వాత కెప్టెన్ అని పిలిపించుకోటానికి నాకు కుతూహలమూ లేదు; ఇష్టమూ లేదు. ఆ బిరుదు ఉపయోగించి నేనేమీ సాధింపఁ దలచిందీ లేదు. కాబట్టి నన్ను దయచేసి కెప్టెన్ అని పిలువవద్దు.

రమణా:- ఐ నో టిట్ - గ్రహించాను. బట్.

ఆ మాటకు రాజశేఖరుఁడు మందహాసముచేయుచు నతనితో నిట్లనెను. "మరొకమనవి. నేను నూటికి నూరు తెలుగువాడను. తెలుగుతోనే మాట్లాడండి నాతో. మీకూ, శుభ్రంగా తెలుగు తెలుసు, నా మాదిరి తెలుగువారే గనుక! మొదట ఇంగ్లీషులో, తరువాత అదే భావాన్ని తెలుగులోనూ చెప్పి మీరు శ్రమపడడం దేనికి?

రమణా:- దటీజాల్ రైట్. సరే! తర్వాత మాట్లాడదాం లెండి.

రాజశేఖరుఁడు "చిత్తం, సెలవు" అని, అంకినీఁడు, రామరాజులతోఁ గలిసిపోయెను.

రాజశేఖరుని మాటలు రమణారెడ్డికి నొప్పిగల్గించెను. అతఁడా పల్కులు సగౌరవముగానే పల్కెను. కాని పూలతో నలంకరించినంతమాత్రమున కఱ్ఱదెబ్బ తగులకుండ నుండునా? రాజశేఖరుఁడు వెడలిపోవఁగనే "బ్రూట్! ఇంటరు చదివాడు. మిలిటరీలో యేడ్చాడు. మానర్సే లేవు. ఆఖరికి ఇంగ్లీషు కూడా మాట్లాడలేడు" అని రమణారెడ్డి

తనలోఁ దానేమో గొణుగుకొనెను. చనిపోయెననుకొన్న రాజశేఖర రావు సజీవుఁడై యింటికిఁ దిరిగివచ్చినప్పటినుండియు నతనిపై రమణా రెడ్డి కసూయ రగుల్కొనుచుండెను. అతఁడు రాకమున్ను వేముల పల్లెలోఁ దానొక్కఁడే ఇంగ్లీషు వచ్చినవాఁడు. తాను పెద్ద విద్యాధికుఁడ ననియు, నన్ని విషయములు దెలిసినవాఁడననియు నా పల్లెటూరివారిని నమ్మించి వారి భక్తిగౌరవములు సంపాదించెను. రాజశేఖరుఁ డూరికిఁ దిరిగివచ్చిన తర్వాతఁ దనమీఁదికంటె నతనిమీఁదఁ బ్రజలభిమాన గౌరవములు చూపుచున్నట్లు కనుపెట్టెను. అంతేకాదు. రాజశేఖరుని నిరాడంబరత, వినయము, సత్యశీలము, సేవాపరాయణత, తనకు గిట్టలేదు. అతఁడు తనవంటి సాధారణ వ్యక్తి యనియు, మిలిటరీ జీవితమునందు 'పైలా పచ్చీసు'గాఁ దిరిగియుండినవాఁడనియు భావించి యతనితో నాంగ్ల సంస్కారానుగుణముగాఁ గాలక్షేపము సేయవచ్చు నని రమణారెడ్డి మొదటఁ దలపోసెను. కాని రాజశేఖరుఁ డట్టి నెయ్య మునకుఁ దగినవాఁడు గాలేకపోవుటే, కాక తన వెలితి తనమును బయటపెట్టువాఁడుగా తనకుఁ దొందరలోనే కన్పించెను. అందుకుఁ దగినట్లు నేఁడు తన యాంగ్ల పదప్రయోగమును సరసాలాపమును రాజశేఖరుఁడు సున్నితముగా నిరసించెను; కావున రాజశేఖరుఁ డన్న రమణారెడ్డికి ద్వేష మంకురించెను. తన ద్వేషమును గప్పిపుచ్చఁగల సామర్థ్యమే యతనిలో విశేషము. ఆ సామర్థ్యమే ప్రమాదకరము.

మధ్యాహ్నము భోజనానంతరము రాజశేఖరరావు పెదతండ్రి రామకృష్ణయ్యగారింటికిఁబోయి అంకినీనిఁ దీసికొని రామరాజు నింటికిఁ జేరెను. తలవని తలంపుగా రమణారెడ్డి యచ్చటికి వచ్చియుండెను.

రామరాజు:- రమణారెడ్డిగూడా మనతో వస్తాడు. ముగ్గురుపోతే ముక్కచెక్కలౌతుందంటారు, ఏపనికైనా; రెడ్డికూడా రావటం మంచిది.

రాజ:- అందుకభ్యంతరం దేనికి? రెడ్డిగారుకూడా మన గ్రామస్థులైనారు. పైగా విద్యాధికులు. మన కార్యక్రమంలో వారు పాల్గొనటం చాల అవసరంకూడాను.

రమణా:- బై ఆల్ మీన్స్! అన్నివిధాలా నేను తోడ్పడుతాను. మీా కార్యక్రమాన్నిగూర్చి రామరాజు చెప్పాడు. బాగావున్నది. వుయ్‌మస్ట్ ఇంప్రూవ్ ది విలేజ్!- మనం గ్రామం బాగుచేసితీరాలి.

రామరాజు:- పెద్దవాళ్ళను చూచిరావడానికి ఒక ఇబ్బంది కన్పిస్తోంది. మనమందరం ఒకపార్టీకి చెందినవారమే. రెండోపార్టీవారి ఇళ్ళకు ఎట్లా వెళ్ళడం?

రాజ:- మనం ఒకపార్టీకి చెందినవారమని యితరు లనుకొనడమేకాని మన కా భావం లేదుగదా! మనం నిర్మల హృదయంతో అందర్నీ సమంగా చూడగలం. కాబట్టి మనం వాళ్ళ యిళ్ళకెళ్ళటానికి సందేహం దేనికి?

రామరాజు:- మనం నిష్పాక్షికంగావున్నా, వారు పాక్షికభావంతోనే మనను చూడవచ్చు. తిరస్కరింపవచ్చు, అగౌరవపరచనూవచ్చు.

రాజ:- అస్వార్థమైన కార్యానికి మనం వెళ్ళినప్పుడు ఒకవేళ మనను వారు అగౌరవపరచినా మనం లక్ష్యపెట్ట నవసరంలేదు. ప్రజా సేవకు దిగినప్పుడు మనం వ్యక్తిగౌరవాన్ని మరచిపోవాలి. ఇంతకూ మనం భయపడ్డంతగా వారు మనల్ని అగౌరవపరచరని నా కొక నమ్మకం. ఈ పార్టీలు మన తరానికి చెందినవిగావు. మనలో ఎవరమూ ఎలాంటి ద్రోహమూ వారికి చేసినవాళ్ళము కాము. వారూ మనకు ద్రోహం చేయలేదు. పార్టీలుకూడా ఒక పూర్వా చారంక్రిందకు వచ్చి సాంఘిక జీవితంలో నిలిచిపోయినవేగాని నాకు చూడగా పార్టీభావానికి మన గ్రామంలో కారణమే లేదు. ఈ పరిస్థితులలో వారు మనను అగౌరవపరచరని నా ధైర్యం.

అంకినీడు:- పార్టీభావం లేకపోలేదు, గ్రామంలో. సాముదాయకంగా ఏ కార్యం తలపెట్టినా, ఒక పార్టీవారు తలపెట్టిన కార్యానికి రెండవపార్టీ వా రడ్డం తిరగట మిప్పుడు కన్పిస్తూనే ఉంది. పార్టీలు బలపడటానికి ఇటీవలకూడా కొన్ని కారణాలు కనబడ్డాయి.

రాజ:- తీర్చవలసిన మార్గాన తీర్చకపోవడం వల్లనే ఈ సమస్య యింకా నిలిచి వున్నది. నిష్పాక్షిక హృదయంతో, పవిత్ర సంక

ల్పంతో పార్టీలు కలపడానికి ప్రయత్నించే మనబోటి వాళ్ళకు తప్పక జయం కల్గుతుంది. లేవండి వెళ్దాం.

అని బయలుదేరెను. నలుగురుఁ గలిసి యా సాయంకాలము వఱకు గ్రామములో నిరువాగులలోని పెద్దల నందఱిని సందర్శించి సంప్రదించిరి. పార్టీభావము గ్రామములోఁ గరడుకట్టుకొని యున్నమాట వాస్తవమే. ఎదురుపార్టీవారికంటెఁ దమపార్టీవారే వీరిని మిక్కిలి పరాభవించిరి. "ఓరి, పోరా! పిచ్చోడా! నీవూ, నీ వేదాంతం ఇక్కడ పనికిరావు. పార్టీలు కలవాలంటే మాటలా? అదొక చెంబు నీళ్ళూ, ఇదొక చెంబునీళ్ళూ! యింకొక పెద్దచెంబులోపోసి కలపడానికి? నిన్నగాక మొన్న కళ్ళు దెరచావు. నీకేం తెలుసు, అరవకుండా పో!" అని పెద్దపారు ఆసాములు కొందఱు రాజశేఖరునిఁ బరిహసించిరి. ఇరువాగులలోఁ గొందఱు మన యువకబృందమును దిరస్కారభావముతోఁ జూచి యగౌరవపఱచిరి. కాని రాజశేఖరుఁ డట్టి సంఘటనవలనఁ గుపితుఁడు గాలేదు సరికదా! నవ్వుకొనసాఁగెను. "వారు కళ్ళకు రంగుటద్దాలు పెట్టుకొని ప్రపంచమంతా రంగుగా నున్నదని భ్రమపడుతున్నారు. అద్దాలు తీయించి స్వాభావికస్థితి వారికి చూపించడమే మన కర్తవ్యం." అని తన సహచరులకుఁ జెప్పుచుఁ దన ప్రయత్నము సాయంకాలము వఱకు సాఁగించెను. రమణారెడ్డి మాట లొక్కొక్కచోఁ గార్యభంగము గల్గించునట్లు కనిపించుటచే నతఁడు తమతో రాకుండనున్నచో బాగని వారికిఁ దోఁచెను గాని యట్లనుట మఱియుఁ గటువుగానుండునని యుపేక్షించిరి. సాయంతనము వఱకుఁ దిరిగి తిరిగి వారు సాధించిన దేమియులేదు. కాని రాజశేఖరరావు తాను దేశాంతరములు తిరిగి సంపాదించిన యనుభవములను గూర్చి యా రాత్రి వేణుగోపాలస్వామి కోవెలలో నుపన్యసింతు ననియు, నా సమావేశమునకైనఁ బెద్దలు విచ్చేయవలయుననియు నతఁడు కోరఁగా నందఱును సమ్మతించిరి.

గ్రామ పర్యటనము ముగిసిన తర్వాత రాజశేఖరాదులు

కోవెలలోఁ గొంతసేపు కూర్చుండిరి. కాళ్ళు నొచ్చుటచే రమణారెడ్డి యుస్సురుమనుచుఁ గూలఁబడెను.

రమణా - మై గుడ్‌గాడ్! డిసీక్ - పొరపాటు - ఇదంతా వృథా ప్రయాస! వీళ్ళు కలిసి చావరు.

రాజః- వృథాప్రయాస కాదని నా మనవి.

రమణాః- ఎందువల్ల ?

రాజః- సంవత్సరాలకొద్ది వున్న పార్టీలు ఒక్కసారి కలిసిపోతాయా!

రమణాః- ఒక్కపూటగాదు, ఎన్నిపూటలు మనం ప్రయాసపడ్డా, వీళ్ళతత్త్వాలు మారవు, అయామ్ స్యూర్!

రాజః- ఇప్పటికే కొంత ఫలం కలిగిందని నా అభిప్రాయం. నే నెఱిగిన తరువాత వూళ్ళో అందరూ కలిసి ఒకచోట సమావేశం కాలేదు. ఈ రాత్రికి అందరూ కోవెలలో సమావేశమౌతామన్నారు. ఇది ఫలం కాదా ?

రమణాః- అది ఫలమో, గిలమో తరువాతగదా! తెలిసేది. అక్కడికి చేరినవాళ్ళు, వచ్చిన మాదిరిగా పోక చేతులూ కాళ్ళూ విరగ కొట్టుకొని పోరని గ్యారంటీ ఏమిటి?

రాజః- అట్లాంటి అవాంతరాలేమీ జరగవని నాకు ధైర్యం వున్నది. ఇంతవఱకు మనం వాక్శక్తినిమటుకు ఉపయోగించాము. దానికంటె గొప్పది ఇంకొక టున్నది. అవసరమైనప్పుడు దాన్నికూడా వినియోగిద్దాం.

రమణాః- నా కర్థంగాలేదు.

రాజః- ఇప్పుడర్థంగాదులెండి. పదండి రాత్రికిక్కడేసమావేశమౌదాం.

అని చెప్పుచు నందఱిని లేపెను. రాజశేఖరుఁ డొంటరిగా నింటి కేఁగెను. అంకినీడు, రామరాజు వెనుకఁబడిరి.

రామరాజుః- రాజశేఖరం తహతహపాటు చూస్తుంటే జాలికూడా వేస్తున్నది. కాని ఈ మూర్ఖప్రజతో ఇతడేంచెయ్యగలడా అని నాకు సందేహం. అయినా చూస్తాం కొన్నాళ్ళు మనశక్తివంచన లేకుండా మనమూ తోడ్పడదాం

ఈ మాటలకు లంకెసీ్ూ తలయూ్ెపెను. రమణారెడ్డి "హి యీాజ్ ఎ మ్యాడ్ కాప్! ఇత నుత్త పిచ్చివాడు" అని వెకిలి నవ్వు నవ్వెను. ముగ్గురు నెవరిళ్ళకు వా రేఁగిరి.

రాత్రి సుమారెనిమిదిగంటలకు భోజనములైన తరువాత నిరు వాగులలోని పెద్దలందఱును, మునసబు శంకరరెడ్డి, కరణం సీతా రామయ్యతోసహా వేణుగోపాలస్వామి ఆలయములో సమావేశమైరి. శుక్లపక్షము గావున చల్లని వెన్నెల గాయుచుండెను. ఆలయపు టావరణలో మెత్తని పచ్చికపఱుపులపై నందఱును విడిసిరి. ఒకపార్టీ వారు మఱియొక పార్టీ వారితో మాత్రము గలియక వేరు వేరు స్థాన ములలోఁ గూర్చుండిరి. ముఖ్యులందఱు వచ్చిన తరువాత రాజశేఖర రావు ఉపన్యాసపూర్వకముగాఁ గాక ప్రాసంగికముగాఁ జాలతడవు తన విదేశానుభవములను గూర్చి వారికిఁ జెప్పుచు వా రడుగు ప్రశ్న లకు జవాబు లిచ్చుచు వారి కెంతయు నానందము గలిగించెను. కడ కిట్లు నుడివెను.

"నా అనుభవా లన్నిటినీ చెప్పడాని కొకరాత్రి కాదు. ఒక నెలకూడా చాలదు. అన్నీ ఒకసారి చెప్పడంకూడా కుదరదు. సందర్భం వచ్చినప్పుడల్లా చెపుతూ వుంటాను. మనం వారాని కొక పర్యాయ మైనా యీ మాదిరి సమావేశమై లోకాభిరామాయణం జరుపు కోవాలని నా కోరిక. ప్రపంచంలో అనేకపరిణామాలు జరుగు తున్నాయి. వాటినిగూర్చి మను అప్పుడప్పుడు తెలిసికోవడం చాలా అవసరం. అట్లా తెలిసికోవడానికి ఈ సమావేశాలు చాలాఉపయోగం.

ఈ సమావేశం ముగించేముందు ఒక్కమనవి చేస్తాను. నేను చాలా దేశాలు చూచాను. చాలా గ్రామాలు తిరిగాను. మన తెలుగు దేశంలోనే చాలాఊళ్ళు చూచాను చూచి చూచి నే నొక్క విషయం కనిపెట్టాను — మన వూరున్నంత హీనస్థితిలో ఏ వూరూ లేదని! మన గ్రామంలో ఏడువందల యిళ్ళున్నాయి. సుమారు మూడువేల అయిదువందల జనాభా ఉన్నది. దాదాపు రెండువేల యెకరాల ఆయకట్టు. పన్నెండువేల డౌలు— అనగా- శిస్తుభూములు మంచివి.

పశుసంపదకు తక్కువలేదు. చాలమంది మోతుబరులు వున్నారు. ఉండే చోట డబ్బు మూలుగుతున్నది. జనమంతా కష్టపడి పనిచేసుకునేవారే. కాని గ్రామం మాత్రం తక్కిన గ్రామాలకు చాల వెనకబడి వున్నది. మనవూరునుండి ఏ వూరికి పోవడానికి రోడ్డులేదు. ఆరుమైళ్ళు నడిస్తే గాని గుంటూరు రస్తా చిక్కదు. వానకాలం బళ్ళునడవవు. ఏ ప్రమాదం వచ్చినా చచ్చినట్లు నడవవలసిందే కాని వేరే ఉపాయం లేదు. ఇంతవఱకూ, మోటారు కారు మన గ్రామానికి వచ్చి యెరుగదు. గ్రామములో డాక్టరులేడు. ప్రమాదస్థితిలో ఉన్నరోగులను గుంటూరు ఆస్పత్రికి చేర్చడానికి మేనాలు పెట్టుకోవాలి. మేనాలుమోసే బోయీలు ఇప్పుడు దొరకడంలేదు. దొరికినా చాలా అడుగుతున్నారు. ఇంతాచేసి వాళ్ళు రోగిని సకాలంలో ఆస్పత్రికిచేర్చలేకపోవచ్చు. రోడ్డులేకపోవడం వల్ల బయటిప్రపంచానికీ మనకూ సంబంధం కష్టమైపోయింది. మన ఆచారాలూ, పద్ధతులూ, భావాలూ, ఇంకా ప్రాచీనంగానేఉన్నాయి. కాల పరిణామాన్నిబట్టి రాదగిన మార్పులు మన కింకా రాలేదు.

రాధారి సౌకర్యం లేకపోవడంవల్ల మన గ్రామంలో ఉత్పత్తి యైన ధాన్యాన్ని సులభంగా మార్కెటుకు చేర్చలేకపోతున్నాం. అందువల్ల వాటికి క్రమమైన ధర రాక రైతు కష్టానికి దగ్గ ఫలం దక్కడంలేదు. అంతేకాదు. బయటినుంచీ సరకు దిగుమతి కావడానికి సౌకర్యం లేనందున ప్రతి దినుసు ఎక్కడలేని ధర పెట్టి కొనవలసి వస్తున్నది. బక్కరైతులూ, పాటకపు జనులూ ఇందువల్ల చాల దెబ్బ తింటున్నారు.

రైతుకు ఋణభారం పెరిగిపోతున్నది. అప్పుపెట్టిన షావుకారు రైతు నెట్లా మ్రింగుదామా అని చూస్తాడేగాని తేల్చే ఉపాయం చూడడు. ఎన్ని చెల్లు లిచ్చినా వడ్డీకే జమపడతాయిగాని అసలు కదలనే కదలదు. తీరా పంటసమయానికి పొలంలోనే తయారై అప్పుకుగాను ధాన్యం తనకు కట్టమని గొంతుమీద కూర్చుంటాడు. తాను చెప్పినప్రకారమే ధర కట్టి యివ్వమంటాడు. ఇక దిక్కులేక ఆ ప్రకారమే యిచ్చి రైతు తల గోక్కుంటాడు.

ఇదిట్లా ఉన్నది. భూమి చూడగా నానాటికి సారంతగ్గి రైతు ఎంత శ్రమపడ్డా తగినంత పంట పండటంలేదు. బలమైన ఎరువులు వేసి కొనడానికి రైతుకు శక్తిలేదు. చెరువు కొంచెం కట్టతెగి రానురాను ఉపయోగంలేకుండాపోయింది. దాని క్రింద మాగాణీపైరయ్యే మూడు వందల ఎకరాలూ మెట్టగా మారిపోయింది. ఇంకొక విపత్తు. తరాలు గడిచినకొద్దీ భూములు చీలికలు చీలికలై కొన్నికొన్ని కయ్యలలో కాడి తిరక్కుండాపోయింది. ఒకరైతుకున్న నాలుగెకరాల పొలమూ ఆరుచోట్ల ఉంటుంది. ఇక అతనికి సేద్యంసాగడం ఎంతకష్టమో మీకే తెలుసు.

అమితంగా ధరలు పెరిగిపోవడంవల్ల కూలీజనానికి ఎంత యిచ్చినా పొట్టలు పూడక సేద్యపుకూలి మానుకొని పట్నవాసాలలో మిల్లుపనులకు పోతున్నారు. అందువల్ల గ్రామంలో వ్యవసాయం కష్టకార్యమైపోతున్నది. కండగలరైతు కష్టపడడంలేదు. భూమి బాగుచేసికొనడంలేదు. బక్కరైతు కష్టపడ్డా ఫలం దక్కడంలేదు.

రైతులలో మూర్ఖత్వం పెరిగి పిచ్చిపిచ్చి జగడాలుపెట్టుకొని కోర్టులపాలై దివాలాలు తీస్తున్నారు. తగాదాలు పెంచి అందువల్ల బాగుపడేవారు బాగుపడుతూనే ఉన్నారు.

ఇక గ్రామంచూడండి. రాయి, కలప, వగైరా చేర్చుకొనడానికి రాధారిలేక కొత్తయిళ్ళు తయారుకావడంలేదు. ఉన్నఇళ్ళు ఏనాడు వేశారో. ఇక్కడొక కొన్ని, అక్కడొక కొన్ని ఒక వీలూచాలూ లేకుండా పడివున్నయి. వీలూచాలూ లేకుండా వీధులూ ఒక్కొక్కచోట సన్ననిసన్నని గొందులు ఒక్కొక్కచోట ఎడారులవలె ఖాళీలు వీధులలో గోతులు మిట్టలూ,పల్లాలూ, రాళ్ళూరప్పలూ వానలుకురిసినప్పుడు పల్లాల్లో నీళ్ళునిలిచి రాకపోకలకు ఇబ్బంది. ఆకూ అలమూ పడి నీళ్ళు మురిగి దోమలు. ఇళ్ళల్లో నేలకు తేమఎక్కి ఎప్పుడూ జలుబులూ పడిశాలూ, చలిజ్వరాలూ. చాలాచోట్ల పెంటపోగులు, పశువుల కొట్టాలు ఇళ్ళకానుకునే. ఇంకా కొన్నిచోట్ల ఇళ్ళదాపునే మలవిసర్జన. ఇందువల్ల ఎడతెగని అనారోగ్యమూ. వీధులు మట్టంగా

లేక మిట్టలూ పల్లాలుగా వుండడంవల్లనూ పంచాయతీ గ్రామాలలో మాదిరి లాంతర్లు లేనందువల్లనూ రాత్రిళ్ళు వీధులలో నడవటం ప్రమాదం. ముందుకువచ్చిన ఏ గ్రామంలోనూ ఈ ప్రమాదంవుండదు.

గ్రామానికి ఇంకా చాలా లోటుపాట్లున్నాయి. ముఖ్యమైనది పాఠశాల లేదు. వీధిబడిలో ఏ కొంచెం చదవడం వ్రాయడంవరకో, ఏ కొద్దిమంది పిల్లలో చదువుకోనడం, తక్కినవాళ్ళు ఆ మాత్రంకూడా చదవలేకుండా వుండడం పరిపాటైపోయింది. చదువులేకపోతే జనానికి బుద్ధి వికసించక మూర్ఖులైపోతారు. ఏ తెలివిగల పనికీ ఉపయోగించరు. తక్కిన గ్రామాలలో విద్యావ్యాప్తి చాలా విరివిగా జరుగుచున్నది. మన గ్రామం చూస్తే నాకు చాలా అవమానకరంగా ఉన్నది. ఒక మిడిల్‌స్కూలైనా మన గ్రామంలోలేదు. అంతేకాదు. పెద్దవాళ్ళకు కూడా కొంత చదువు నేర్పాలి. అదే వయోజనవిద్య అంటారు. అజ్ఞానం విరగాలంటే ఈ వయోజనవిద్య అత్యవసరం. తరువాత గ్రామంలో ఒక గ్రంథాలయం ఉండాలి. దాన్నే లైబ్రరీ అంటారు. జ్ఞానాభివృద్ధిచేసే పుస్తకాలు చేర్చి అందులో ఉంచాలి. అదే పఠన మందిరంకూడా. అక్కడికి వార్తాపత్రికలు తెప్పించి చదువుకునేవాళ్ళు చదవటం చదువురానివాళ్ళు వినటం జరగాలి. అందువల్ల ప్రజల్లో విజ్ఞానాభివృద్ధి అవుతుంది. ఈ విజ్ఞానాభివృద్ధికి ఒక రేడియో అవసరం. ప్రతి పెద్ద గ్రామంలోనూ ఈరోజుల్లో రేడియో వుంటుంది. అది యెప్పటివార్తలప్పుడు మనకు వినిపిస్తుంది. పైగా మనస్సుకు ఆహ్లాదం కల్గించే మధురమైన సంగీతం హరికథలూ విజ్ఞానంకల్గించే బుర్రకథలు ఉపన్యాసాలూ వినిపిస్తుంది. ఈమాత్రం ఆనందంకూడా లేకపోతే జీవితం కష్టంగా ఉంటుంది. కాని యింతవరకూ మన గ్రామములో స్కూలుగాని లైబ్రరీగాని రేడియోగానీ నెలకొల్పే వుద్దేశం ఎవ్వరికీ కల్గలేదు. ఒక్క వార్తాపత్రికకూడా మన గ్రామానికి రాదు. ఒక్క చిన్న ఆస్పత్రికూడా లేదు. కాన్పులలో ప్రమాదాలు జరిగినప్పుడు లబలబలాడడంతప్ప తర్వాత ఆ విషయం ఎవ్వరూ పట్టించుకోరు. గ్రామం మురికికూపంలాగావుంటే అందులోనే పడివుంటున్నారుగాని

బాగుచేసుకొందామని ఎవరూ ముందుకురావడంలేదు. రైతు నాశన మౌతుంటే ఒక్కరూ ఆ జోక్యం పట్టించుకొనడంలేదు.

ఈ లోటుపాటులన్నీ తీర్చుకొనడానికి రెండు దివ్యసాధనా లున్నాయి. మొదటిది గ్రామపంచాయతి. రెండవది సహకార సంఘం. కాని యీ రెంటినీ మన గ్రామములో నెలకొల్పడానికి ప్రబలమైన ఆటంక మొకటున్నది. అదే పార్టీలనేది. ఇప్పు డిక్కడ సమావేశ మైన పెద్దలందరికీ నమస్కరించి వినయపూర్వకంగా వారిని నేనడిగే దేమిటంటే గ్రామాన్ని నరకప్రాయంగా ఎన్నాళ్ళూ ఈ రూపంలోనే ఉంచడమా, లేక కక్షలు కలుపుకొని పంచాయతీ సహకారాలు నెల కొల్పుకొని తక్కిన గ్రామాలతోపాటు మన గ్రామమునుకూడా బాగు చెయ్యడమా – అని. నేను మీకంటే చిన్నవాడనుగదా అని నా మాటలు త్రోసిపుచ్చక నేనుచెప్పినది యథార్థమో కాదో విచారించండి.

అని ముగించి రాజశేఖరుడు కూర్చుండెను. సభలో జనులు మొగమొగములు చూచుకొనుచు గుసగుసలకు దిగిరి. కొంతసేపటి కీ క్రింది సంభాషణ జరిగెను.

ఒకరు:– పార్టీలు కలవకపోతే పంచాయతీ సహకార సంఘాలు పెట్ట టానికి వీలులేదా ?

రాజ:– వీలులేదు. పెట్టినా వాటివల్ల లాభంలేకపోగా ఇంకా కక్షలు పెరిగి అనర్థాలు కల్గుతాయి.

పుల్లయ్యపంతులు:– పార్టీ లిప్పటి కెట్లాగో కలిపి ఆ సంస్థలు పెడతా మనుకో. తరువాత మళ్ళీ పార్టీల కక్షలు రావని యెట్లాచెప్పగలవు?

రాజ:– ఆ సంస్థలు నడపటంమీద ఆ విషయం ఆధారపడి వుంటుంది. పార్టీలుండకూడదనే నియమంతో సంస్థలు నెలకొల్పుతూ ఉన్న ప్పుడు మళ్ళీ పార్టీలు పుట్టవని నా నమ్మకం. అందుకుకొంత ప్రచారం గావాలి. మనస్సులు మారి పట్టుదలవుంటే ఆ మనఃపరివర్తన మనం తెచ్చుకోగలం.

మునసబు:– రాజశేఖరం ! నీవు చెప్పేది చాలా బాగావున్నది. అర్థంలే

ఈ పార్టీలు కలిసిపోతే గ్రామం బాగుపడుతుంది. పార్టీలు కలవాలనే నా అభిప్రాయం.

కరణం:- మునసబువారు మెరకవీధి పార్టీవారు. కలవారు. పార్టీలు కలిస్తే వారికే మంచిది. పల్లపువీధివారు లేనివారు కావడంవల్ల తమ చెప్పుచేతల్లో పడివుంటారు. ఇది గుర్తించి పల్లపువీధివారు మేం కలవమంటున్నారుకాదు సూరయ్యా! ఊరుకుంటావేం చెప్పు నీ మనసులోమాట. మధ్య నా కెందుకూ?

సూరయ్య:- కరణంగారు చెప్పింది నిజమే.

రాజ:- ఈ కలిమి లేముల భేదాల్లు లేకుండా అందరూ సుఖంగా ఉండడానికి, అందరూ సమా నగౌరవం పొందడానికే పంచాయితీ సహకారాలు నెలకొల్పబడలేది. ఆ సంస్థలు రెండూ గ్రామపరిపాలన చేస్తూంటె భాగ్యవంతులు పేదవారిని హీనముగా చూడడానికి వీలుండదు. మనస్సులో భేదభావం పోయితీరుతుంది. ఏదో ఒక పిచ్చి అనుమానంవల్ల కలిగినవేగాని వాస్తవానికి మనగ్రామములో పార్టీలుండడానికి కారణమేమీలేదు. అందరమూ ఒక్క కుటుంబంగా మెలగడానికి అవకాశమున్నది. ఒకప్పుడు మన గ్రామం అట్లావుండేదని పెద్దలు చెప్పగా విన్నాను. మధ్యవచ్చిన యీ దిక్కుమాలిన పార్టీలను మానుకొని యధాప్రకారం సుఖంగా కాలక్షేపంచేద్దాం. అందుకుగాను పంచాయతీ సహకారాలు పెట్టుకుందాం.

ఒకరు:- నువ్వు చెప్పేదంతా తియ్యగా ఉన్నది. కాని తీరాచూడబోతే ఏమౌతుందో అని నా అనుమానం.

రాజ:- అనుమానమే పెద్ద రోగమన్నారు. క్షమించండి సామెత ఉన్నదున్నట్లు చెప్పినందుకు. ఆ అనుమానం లేకుండా నిష్కల్మష హృదయాలతో ముందుకు పోతే మన కే చిక్కూరాదు.

ఇంకొకరు:- మొగమోటం దేనికయ్యా! ఇతను మటుకు ఆ పార్టీ వాడు కాడూ? ఈ ఎత్తు దేనికో! ఎవడికేం తెలుసు. మనం కలవవద్దు.

కరణం:- అబ్బాయి, వెంకయ్యా! నీవ్వూ, ఆలోచించి మరి చెప్పు.
ఇది నీ వొక్కడి అభిప్రాయమా? లేక మీ అందరి అభిప్రాయమా?
అందర్నీ ఆలోచించుకోనియ్యి.

వెంకయ్య:- మా పార్టీ అందరితరఫున నేను చెప్పేశాను. మేము కలవ
గూడ దనుకొన్నాం. అసలీ ప్రసంగం వస్తుందని చెపితే మేము
వచ్చేవాళ్ళమే కాము, ఇక్కడికి.

ఇంకొకరు:- వాళ్ళు కలవవచ్చుననుకొంటే మాత్రం మేం కలుస్తామా?

వెంకయ్య:- కలవమని బ్రతిమిలాడిం దెవడయ్యా!

ఈ ధోరణిలో మాటలు పెరిగిపోవుచుండెను. రాజశేఖరుని సలహా లెవ్వరికి నెక్కినట్లు లేవు. కలహములు మానుకొని గ్రామము బాగుచేయుట మంచిదేయని యిరుపక్షములలోను కొందఱు బుద్ధిమంతులు మెత్తగిల్లిరి కాని పెడదారితీయువారి సంఖ్యయుఁ బ్రభావము మిక్కుటమగుటచే వారి కోరిక ఫలింపలేదు. అంతకుముందు గుసగుసలుగా జరుగు పరస్పర విరుద్ధప్రచారము లంతకంతకు బాహిరముగా జరుగుచుండెను. పెద్దజాతులన్నియు నొక్కటైయున్నచో నల్పసంఖ్యాక జాతులకుఁ జేటు మూడుననియు, పెద్దవర్ణములలోఁ జీలికలుండుటే యూరికిఁ మంచిదనియుఁ గొందఱు ప్రచారము సేయఁదొడఁగిరి. ఈ సందర్భమును జూచి పుల్లయ్య పంతులు "రాజశేఖరం! పార్టీలెంత వరకు కలిసినయ్యోయ్" అని యుపహసించుచుండెను. రమణారెడ్డి "మై గుడ్ గాడ్! నే నన్నట్లు వీళ్ళింకా శిఖపట్ల గోత్రాలవరకూ రాలేదు. ప్రొద్దుపోకముందే ఆ పనికూడా అవుతుందేమో చూచి పోదామంటే యింకా కాలేదు." అని సిగరెట్టుపై సిగరెట్టు ముట్టించుచుండెను. రాజశేఖరుని పెదతండ్రి రామకృష్ణయ్యగారు "వీడి కెందుకీ లేనిపోని దుగ్ధ!" యని యాక్షేపించుచుండిరి. రాజశేఖరుఁ డంతట సభ్యులందఱ నుద్దేశించి యిట్లనెను.

"నికృష్టస్థితిలో ఉన్న గ్రామం బాగుజేసి ప్రజాజీవితం సుఖవంతం చేయాలనే వుద్దేశ్యంతోనే పార్టీలు మానుకొనమని ఎంతగా మిమ్ముల్లను ప్రార్థేయపడ్డాను? ఉదయంనుండి యింటింటికి తిరిగి పెద్దల నంద

రినీ వేసుకొన్నాను. కాని మీ మనస్సు లింకా తిరగలేదు. కారణం నా సంకల్పలోపమో, శక్తిలోపమో ఏదో దోషం నాలోనే ఉన్నట్లు నాకు తట్టింది. నాకు మానవసేవే జీవితప్రయోజనం. అందుకే ఉద్యోగాది యితరవ్యాపృతులు మానుకొన్నాను. బ్రహ్మచర్యదీక్ష పుచ్చుకొన్నాను. నేను చేయదలచుకొన్న మానవసేవకు నా జన్మగ్రామమైన ఈ గ్రామమే ప్రథమ రంగం. నా జన్మగ్రామంలోనే నేను అపజయం పొందితే, ఇంకా ఎక్కడ జయం పొందగలను? కాబట్టి నా ఆత్మలోని మాలిన్యాన్ని తుడిచివేయటానికీ, నా ఆత్మశక్తి నభివృద్ధిపరచుకొనటానికీ నేను రేపటినుండి నిరశనవ్రతం చేయదలచుకొన్నాను. మీ మనస్సుల్లో మార్పుగలిగి పార్టీలు మానుకొన్ననాడు నా ఆత్మ శుభ్రమై శక్తివంతమైనదని భావించి నిరశనవ్రతం ముగిస్తాను. ఆ లోగా నా ఆయువు తెగిరిపోయినా నేను జయించిన వాడనే అవుతాను. మానవహృదయాలలోని కాలుష్యం కడగడానికి మానవరూపంలో ఉన్న భగవంతుణ్ణి సేవించడానికీ నా జీవితం అర్పించడంచేత నా జన్మ ధన్యమౌతుంది. మానవసేవా వ్రతం అవలంబించిన నా బోటి వాళ్ళకిదే తరణోపాయం.

ఈ మాటలు పల్కి రాజశేఖరుఁ డందఱికి నమస్కరించుచు నింటికిఁ బోయెను. సభలో నప్పుడే యలజడి బయలుదేరెను. "ఈ బెదరింపుల కేంలే" యని కొందఱును, నక్కనుజూచి పులి వాతలుబెట్టుకొన్నట్లు గాంధీగారిని జూచి యితనూ ఉపవాసాలు చేస్తాడట" అని కొందఱును, "వీ డొక పిచ్చివాడులాగున్నాడే" యని కొందఱును, "వీడి వాలకం చూస్తే చెప్పినంతా చేసేటట్టున్నా" డని కొందఱును ఎవరికిఁ దోచినట్లు వారు పలుకసాగిరి. "మొత్తము మీద వాడు చెప్పేదంతా మన మంచికే, మనం కూడా మతం మార్చుకోవాలి"అని కొందఱు బుద్ధిశాలు రాలోచింపఁ దొడఁగిరి. జరిగిన దానికి సంతుష్టుఁడై పుల్లయ్య పంతు లింటికిఁ జేరెను. తాను జరుగునన్నంత జరుగలేదుగదా! యని యసంతుష్టుఁడై రమణారెడ్డి సభ వీడిపోయెను. ఆ రాత్రి సభ యట్లు ముగిసెను.

# VII

# ప్రథమ విజయము

ఆత్మశక్తి ఆటంబాంబుకంటెను గొప్పది. రెండును ప్రయోగదుష్కరములే. ఈ శతాబ్దమున గాంధీమహాత్ముఁ డొక్కఁడే యాత్మశక్తిని సులభముగాఁ బ్రయోగింపఁ గలిగినవాఁడు. తపశ్శాలురకుఁ గానియది సాధ్యముగాదు. మహాత్ముని బోధనలచే హృదయ స్పందన మొందినవా రనేకు లాయనచూపిన మార్గమునఁ బోవఁ బ్రయత్నము చేయుచున్నారు. రాజశేఖరరావు వారిలో నొకఁడు. కేవలము హింసాత్మకమగు యుద్ధసేవలో బహుకాలము జీవితము గడిపిన రాజశేఖరుఁ డహింసాత్మకమగు నీ సత్యాగ్రహ మహాయుధము నెట్లు వశపఱచుకొనెను ? అతఁడు మృత్యు కింకరులతోఁ జెలిమి సలిపినవాఁడు. ప్రళయ భీకరములగు మారణాస్త్రములను బ్రయోగించినవాఁడు. లాల్‌ఖిల్లాలోఁ దానే బహుకాలము మృత్యుదంష్ట్రలలో బందీకృతుఁడైనవాఁడు. హింసయు, దౌర్జన్యము మానవులను జయింపఁగలవేమో కాని మానవ హృదయమును జయింపలేవని ప్రత్యక్షముగాఁ గనుపెట్టినవాఁడు. సూర్యుఁ డస్తమింపని బ్రహ్మాండమగు నాంగ్ల సామ్రాజ్యమును నాత్మశక్తిచే నుక్కిరిబిక్కిరిగావించి జయించిన గోచిపాతరాయనిఁ గన్నులారఁగాంచినవాఁడు. అతని దివ్యబోధామృతము దనివిదీరఁ గ్రోలినవాఁడు. తానును సత్యాగ్రహయోగి యైనాఁడు. భరతఖండమున కిది వినూతన తారుణ్యము. రాజశేఖరునివంటి యువకు లా తారుణ్యమునకు దృశ్యమాన తార్కాణములు.

శాంతాదేవి యొక్కర్తుకే రాజశేఖరుని నిరశనవ్రతములోని పవిత్రభావమును, ఆతని యుదాత్తాశయమును జక్కఁగా గ్రహింపఁగల్గినది. నాఁటినుండి యతనిని దొలుతటికంటె మిన్నగా నారాధింపఁ దొడఁగినది. మిలిటరీ జీవితమున కభ్యాసపడి భారత సంప్రదాయములలో, ధర్మములలో, సంస్కారములు చేయదలఁచు రాజశేఖరుఁ డట్టి యార్ష ప్రవృత్తికిఁ గడఁగునని యామెయుఁ దలఁచియుండకపోవుటచే

నతని నిరాహార వ్రతముగూర్చి విన్నప్పుడు కొంచె మాశ్చర్యచకిత యయ్యెను. కాని యతఁడు నిరాడంబరుఁడుగావున నతని సామర్థ్యము నిగూఢమైయుండుటలో వింతలేదని తనలోఁ దానే సమాధానపడెను.

రాజశేఖరుని నిరశనవ్రతములో నైదవరోజు ప్రవేశించెను. డస్సినట్లుండుట తప్ప అతని యారోగ్యములో నెట్టి మార్పును రాలేదు. వదన మెప్పటివలెఁ బ్రకాశవంతముగానే యుండెను. సహజలక్షణమగు దరహాసరేఖ యా మనోజ్ఞవదన మండలముఁ బాయలేదు. చుఱుకుఁదనము, దీక్ష, పవిత్ర భావస్ఫూర్తియు, నెప్పటియట్లే యుండెను. అనిర్వాచ్యమగు క్రొత్త తేజస్సేదో యతని నావరించియుండెను. అతఁడుతికిన మడుగులుగట్టి తనయింటి వసారాగదియం దాసీనుఁడై నిమీలిత నేత్రములతోఁ దపోనియతి పాటించుచుండెను. మొదటి రెండు రోజులు నతనిని వారును వీరును జూచిపోవువారేగాని యెవ్వరును బలుకరింపలేదు. ఆప్తబంధువులుగూడఁ దన్ను బలుకరింపవలదని యతని మనవి. జననీ జనకు లతని దీక్షకు భయపడిరి. కాని యతని స్వభావ మెఱిఁగిన వారగుటచే నతని దీక్ష యచంచలమని గ్రహించి భగవంతునిపై భార ముంచి యిన్నకుండిరి. ఉదయము సాయంకాలము శాంత యతనిని జూచి పోవుచుండెను. ఆమె యెంగిలిపడుచుండెనేగాని యామెయు నిరాహారయై యుండెనన్న నసత్యము గానేరదు. అతని యాశయము నెఱవేరునని మాత్ర మామె కేలకో మొదటి నుండియు ధైర్యము.

శరీరములను శరీరములు తాఁకుటకుఁ బ్రతిబాధకములఁ గల్పింప వచ్చునుగాని యాత్మలను ఆత్మలు దాఁకుట కెట్టి ప్రతిబంధకములు కల్పింపలేరు. పరమాత్మ స్వభావమును గుర్తించిన యద్వైత సూత్రజ్ఞుల కిది వింత కానేరదు. రాజశేఖరుని తపస్సు, అతని యాత్మశక్తి క్రమముగా నూరివారల యాత్మలను గదలింపసాఁగెను. అతఁడు నిరశన వ్రతము ప్రారంభించిన యైదవనాఁటికి, నంతవఱకు నౌదాసీన్యము వహించిన పెద్దలందఱు నతని విషయము తీవ్రముగా నాలోచింపఁ దొడఁగిరి. "ఈ హత్య మనకు చుట్టుకుంటుందా?" అని కొందఱు,

"ఇంతలోనే ప్రాణత్యాగం చేస్తాడా ? ఏదో బెదిరింపులే" యని మఱి కొందఱు. "అతని పోకడ చూస్తే పట్టినపట్టు వదిలేవాడుగా లేడు, చావడానికికూడా తయారైనట్లు కనపడతాడు ఇదేం కర్మమో!" అని కొందఱు. "ఇంతకూ రాజశేఖరం పట్టుదల ఎవరి మంచికి ? ఇందులో తాను కోరేదేముంది ? గ్రామం బాగుచేయడానికే గదా ! మనకు మాత్రం మూర్ఖపు పట్టు దేనికి ?" అని మఱికొందఱు. "ఇక నీ పూని కతో గతిస్తే నిజంగా మన కందరికీ అతని వుసురు కొటుతుంది. మన కోసం తన ప్రాణాలు అర్పించిన వాడౌతాడు. ఇక మన వూరివాళ్ళను చూస్తే ప్రతివాళ్ళ కొక విధమైన అసహ్యమేర్పడుతుంది. 'వీళ్ళు మూర్ఖులు,కర్కోటకులు, వజ్రంలాంటి కుఱ్ఱవాణ్ణి నిలువునా చంపారు' అనబోతారు" అని మఱికొందఱు. ఈ విధముగా గ్రామీణులలో సంచలనము బయలుదేరెను. ఇది కేవలము వారి పామరత్వమని మన మూహింపవచ్చునుగాని రాజశేఖరుని యాత్మశక్తియే దీనికి నిజమైన హేతువు

అయిదవనాటి యుదయమున నెదురు పార్టీలోని యువకులు కొందఱు, బుచ్చినాయడు, ధర్మారావు మొదలైనవారు రాజశేఖరుని పవిత్ర సంకల్పమును గుర్తించి తమలోనే పెద్దల మనస్సులు త్రిప్పఁగడఁగిరి. ఇటు రామరాజు, అంకినీఁడు మున్నగు యువకు లదే పనిసేయసాఁగిరి. బుచ్చినాయఁడు. ధర్మారావు ప్రభృతులకును రామ రాజు, అంకినీఁడు ప్రభృతులకును నాటి యుదయమున మాటలు కలిసెను. వా రిట్లు మాటలాడుకొని యెన్నేళ్ళాయెనో ? వా రందఱుఁ గలిసి యిరువాగులలోని పెద్దలందఱిని సందర్శించి గ్రామమంతయు నొక్కటి కావలయుననియు, రాజశేఖరరావు సూచించిన యభ్యుదయ విధాన మవలంబించి గ్రామము బాగుపఱచవలయుననియు వారిచే నొప్పించిరి. ఈ యువకులును, ఆ పెద్దలును గలిసి కోదండరామయ్య గారింటికి వచ్చిరి. పార్టీ భేదములేకుండ వారినందఱిని సమానముగ గౌరవించి కోదండరామయ్యగా రిట్లు పలికిరి.

'మనతరం గడిచిపోతున్నది. తెలిసో, తెలియకో మనమింతవర

కొక మార్గాన నెట్టుకొచ్చాం, కుఱ్ఱవాళ్ళెక్కివచ్చారు. పాతపద్ధతులు మార్పు జేసి గ్రామ మభివృద్ధిచేస్తామని వాళ్ళు ముందుకొస్తున్నారు. భవిష్యత్తు వాళ్ళదేగాన మనం వాళ్ళకడ్డం నిలుచుంకటం దేనికి ? వాళ్ళ యిష్టప్రకారం కానివ్వడమే మంచిదనుకొంటాను. ఇంతా పారఁజూస్తే మనం యిన్నేళ్ళుగా పట్టుకొచ్చిన యీ పాపిష్ఠి కక్షులకు కారణమే లేదు'.

ఈ మాటలందఱు నంగీకరించిరి. తలలూపిరి. అందఱును గలిసి రాజశేఖరుని గదికేఁగి "బాబూ ! రాజశేఖరం, నీ పట్టే నెగ్గింది. లేచి యివ్వేళైనా ఎంగిలిపడు. ఇదుగో ! ఇటుచూడు ! ఇక్కడెవ్వ రెవ్వరం ఉన్నామో" యని పలికిరి. రాజశేఖరుఁడు కనులు తెఱచి యిరువాగుల నాయకులను గమనించి భక్తిపూర్వకముగా కృతజ్ఞతా సూచకముగా వారి కందఱికి నమస్కరించుచుఁ దపస్సు చాలించెను. అతని నయనము లానందబాష్పపూరితము లయ్యెను అతని యాప్తులు, అభిమానులు సంతోషపరవశులైరి. "నేటినుండి వేములపల్లి కొత్త రూపం ధరిస్తుంది". యని యచ్చటనేయుండిన శాంతాదేవి పలికెను. "సర్వే జనాస్సుఖినో భవంతు" అని జనార్దనశాస్త్రి యాశీర్వదించెను. ఆ యుదయము పదిగంటలకు రాజశేఖరుఁ డాహారము తీసికొనెను.

పాఠకుఁడా ! ఇది యసంభవమని సందేహింపకుము. దృఢమైన సంకల్పముతో పవిత్రమైన హృదయముతో నిద్రాణమైయున్న నీ యాత్మశక్తిని మేల్కొల్పుటకుఁ బ్రయత్నింపుము. రాజశేఖరునివలె నీవును జయమందఁగలవు.

తాను సంకల్పించిన సౌధ నిర్మాణమునకుఁ బునాదివంటిదగు వివిధపక్ష సామరస్యమును రాజశేఖరుఁ డిట్లు సంపాదించెను. ఇఁక ధైర్యముతోఁ బురోగమింపుమని తన కెవరో వీపు తట్టినట్లతనికిఁ దోఁచెను. ఆ నాటికి విశ్రాంతి తీసికొనుచు నింటియందే యుండెను. శాంతాదేవి యతనిని చూచుటకు వచ్చి యతని విజయమున కభినం దించెను. అందుల కతఁ డిట్లనెను, "ఇందులో నేను సాధించిన దేమీా లేదు. యుగధర్మం ఏదో ఒక రూపాన ఎవరి ద్వారానో ఒకరిద్వారాన

బయలుపడి తన పని తాను చేస్తుంది. నేను గాకపోతే ఇంకొకరైనా ఇప్పటికి కార్యం చేయవలసివున్నది. ఎందుకంటే గ్రామపరిస్థితి చాలా విషాదకరంగా ఉన్నది. ప్రజ లెంత ఔదాసీన్యం వహించినా కాలాన్ననుసరించి రావలసిన పరిణామం, సంస్కారం వచ్చితీరుతుంది. అందు కెవరో ప్రయత్నించి తీరుతారు. నేను నిమిత్త మాత్రుడనే".

శాంత:- మీరు నిరాడంబరులు. స్వార్థరహితులు. వినయ శీలురు. కాబట్టి మీరు కేవలం నిమిత్తమాత్రుల మనుకొంటారు. అప్పటికీ మీరు చెప్పుకోదగినవారే గదా! అ దట్లా వుండనివ్వండి. ముందు కర్తవ్య మేమిటి?

రాజ:- గ్రామ పంచాయతీ వ్యవస్థాపన. సహకారసంఘ వ్యవస్థాపన. ఇవి రెండూ కఠిన కార్యాలే. ఈ రెండు సంస్థలూ రెండు చక్రాలుగా సుధించి పునరుజ్జీవన శకటాన్ని నడపాలి. ఇదీ టూకీగా కార్యక్రమం.

శాంత:- నాకు బాగా అర్థంగాలేదు. ఈ రెండు సంస్థలతోనే కార్యక్రమం అంతా నడుస్తుందా?

రాజ:- నడుస్తుంది. వివరాలు సావధానంగా చెపుతాను. మన కార్యక్రమానికి ఇంకా కొన్ని ముఖ్యాంశాలు చేర్చుకోవలసి వున్నవి. హరిజనసేవ, మద్యపాన నిషేధం, నిషేధ బాధితులకు, ఇతర నిర్వ్యాపారులకు పని కల్పించడం, సంఘ సంస్కారం.

శాంత:- అబ్బా! చాలా ఉన్నదే కార్యభారం. ఇదంతా మీరొక్కరే మోయగలరా?

రాజ:- మోయలేను. అందరి సహకారమూ గావాలి. ఇందుకుగాను సేవాదీక్షగల యువకుల నందరినీ 'స్వచ్ఛందయువక సేవాదళము'గా ఏర్పాటుచేసి అందులో ముఖ్యులైనవారిపైన చాల కార్యభారం వెయ్యాలి. ప్రాథమికావస్థలో చాల కష్టపడాలి. తరువాత ఇనుప కమ్ములమీద రైలుబండివలె కార్యక్రమం సాగిపోతుంది.

శాంత:- మానవసేవకే నా జీవితమూ అర్పిస్తున్నానని మీకు తెలుసు. ఈ పవిత్రకార్యక్రమంలో నాకు కూడా ఏదైన పాత్ర కల్పిస్తారా?

రాజ:- నీవు అడగకపోయినా నీ సేవ కోరదలచాను. శాంతాదేవీ! నీవు చేయవలసినపని చాలా ఉన్నది. ఇప్పటికే నీవు మహిళా విద్యా వ్యాప్తి ప్రారంభించావు. మహిళాజనంతో బాగా పరిచయం కలిగించుకో. వాళ్ళకు విద్యాగంధం బాగా పట్టించాలి. స్త్రీలు కూడా పౌర సమస్యల్లో పాల్గొనాలి. పూర్వకాలపు మంకుతనం పోయి వారుకూడా ప్రపంచ పరిణామాన్ని అర్థంజేసుకొని పుర పరిపాలనలోనూ, ధర్మాచరణలోనూ, పురుషులకు తోడ్పడాలి. ఈ సంబంధమైన ప్రచారం నీ పైన వదలుతాం. వితంతు స్త్రీలకు నీ వుద్దేశించిన ప్రకారం సేవాధర్మం బోధించి వాళ్ళ జీవితాలు కూడా వీలయినంతవఱకు బాగుపరచాలి.

శాంత:- నా శక్తివంచనలేకుండా ఆ పని నేను చేస్తాను. చేస్తున్నాను కొంతవరకు.

రాజ:- నీవు అనుకొన్నదానికంటె పెద్దపనే ఉన్నది నీకు.

శాంత:- ఏమిటది? ఇప్పుడు చేసేదేనా?

రాజ:- ఇంకాఉన్నది. తర్వాత చెపుతాను.

శాంత:- నేను మీ దాసీననుకోండి. ఏ విధంగా నేను లోకాని కుపయో గిస్తానో ఆ విధంగా నన్నుపయోగించుకోండి.

రాజ:- నాకు దాసీవంటే కుదరదు. నేనే లోకదాసుణ్ణి. నీవూ లోక దాసిననుకో. మానవసేవ మన యిద్దరికీ వృత్తి. ఇందులో ఒక రెక్కువ ఒకరు తక్కువ లేరు. ఇద్దరం సమానులమే.

శాంత.- మిమ్మల్ని చూచినప్పుడూ మీ ఆదేశాలు విన్నప్పుడూ నా కెక్కడలేని ఉత్సాహం కలిగి యెటువంటి కఠినకార్యం చెయ్య డానికైనా శక్తిపుట్టుతుంది. మీ పరోక్షానైనా మిమ్ముల్ని స్మరిస్తే నాకు ఉత్సాహం కల్గుతుంది. మరి నాలోలేని ఒక విశేష శక్తి మీలో ఉండబట్టేకదా నా కిటువంటి అనుభూతి కలగడం? ఇద్దరం సమానులమెట్లా అవుతాం?

రాజ:- సమాన సంస్కారాలూ సమాన మనఃప్రవృత్తీ గల వ్యక్తుల మధ్య యిటువంటి అనుభూతి స్వాభావికమే. శాంతాదేవీ, నీ సేవా

దీక్షా, త్యాగబుద్ధీ, పవిత్రశీలం తలచుకొన్నప్పుడు నాకూ అట్లాగే ఉత్సాహం కలుగుతుంది. నేను మొన్న నిరశనవ్రతం పూనుకొన డానికి నీ వెంతకారకురాలవో నీకు తెల్సియను.

శాంత:- నేను కారకురాలనా! ఆశ్చర్యం. ముందుగా ఆ విషయం నాతో చెప్పనుకూడాలేదు మీరు? చెపితే మిమ్మలను ప్రోత్సహించకపోవడం అట్లుంచి నిరుత్సాహపరచేదానను. మీ మాటలు ఆశ్చర్యంగా ఉన్నాయి నాకు.

రాజ:- ఆశ్చర్యపడనవసరంలేదు. పంపువంటి నీ జవ్వనమూ, ఉజ్జ్వల మైన నీ జీవితమూ అంతా మానవసేవకై సమర్పింపదలచిన నీ అఖండ త్యాగమే, నా త్యాగానికి నా నిరశనవ్రతానికి కారణమైనది.

శాంతాదేవి యీ మాటలువిని, యించుక సాధ్వసముతో నిట్లనెను. "వైధవ్యం తప్పనిసరిగా తటస్థించిన తర్వాత మానవసేవకు సంసిద్ధురాలనైనానుగాని సేవకొఱకు వైధవ్యం, త్యాగం తెచ్చుకొన్న దానను కానుగా నేను! మీ రట్లా కాదు. వివాహమాడి సుఖంగా సాంసారిక జీవితం సాగించగల స్థితిలో ఉండికూడా త్యాగంచేస్తున్నారు. మీ త్యాగానికీ నా త్యాగానికీ పోలికలేదు.

రాజ:- ఇక ఇది పరస్పర స్తోత్రమౌతుంది. కాని, ఒక్కమాట! నీవు నిజానికి వితంతువైనావా?

శాంత ఆశ్చర్యచకితయై చూచుచుండెను. ఆమె మారుపలుకు లోఁగా చెంగటనే లోకాభిరామాయణము జరుపుచుఁ గూర్చుండిన సీతమ్మగారు లక్ష్మమ్మగారు నా వంకకుఁ దిరిగిరి.

అంతట లక్ష్మమ్మగారు రాజశేఖరునితో నిట్లనెను. "బాబూ! ఊళ్ళో ఎక్కడచూచినా నీ పేరే చెప్పుకుంటున్నారట! అందరికీ అబ్బురంగాఉన్నది నీవుచేసినపని."

రాజ:- అబ్బురం ఏమున్నదత్తా! నేను గాకపోతే యింకొకరైనా కాలానికి తగినట్లు ఈ పని చేయవలసిందే.

లక్ష్మ:- కాదులే, నాయనా! ఇన్నేళ్ళుగా ఎవ్వరూ తలపెట్టనికార్యం నీవు తలపెట్టావు, నెగ్గావు. అన్నీ బాగానేవున్నాయిగాని పెళ్ళి

చేసుకొని ఒకింటివాడవు గాలేదనే మా చింత. ఈ చిన్నతనంలోనే ఎట్లా పట్టుకొన్నది నాయనా, యీ వైరాగ్యం, నీకు ? ఇంకొకదుట శాంతకు ఆ రాత రాయనే రాశాడు దేవుడు ? తప్పక మోడై పడివున్నది. నీవైనా ముచ్చటగా పెళ్ళిచేసుకొని కాపురం చేస్తుంటే చూద్దామనుకున్నాం. ఏ కారణంలేకుండా నీవూ మోడుమాదిరి తయారైనావు.

రాజశేఖరుఁడా మాటలకు, చిఱునవ్వు నవ్వుచు లక్ష్మమ్మ గారితో నిట్లు పల్కెను. "అందరూ పెళ్ళిచేసుకోవాలా ? తమ్ముడికి చేస్తాంగా ! నేను చేసుకోపోతే ప్రపంచం మునిగిపోతుందా, అత్తా ! పెండ్లిచేసుకొని గుదిబండ మెడకుకట్టుకొని అవస్థపడడంకంటె బ్రహ్మచారిగావుండి వారికీ వీరికీ అందరికీ సేవచేస్తుంటే ఎంత హాయిగా ఉంటుంది ? ఈ సుఖం ఇట్లాంటిదని చెప్పిన అర్థంకాదు మీకు !

లక్ష్మమ్మ:- మాకు అర్థంగానిమాట నిజమే బాబూ ! నీతో వాదించడానికి మాకు చేతగాదు. పెంచి పెద్దవాళ్ళను చేశాం. చివరకు శాంతా నీవూ ఇద్దరూ ఇట్లా అయినందుకు చీదివెయ్యడంతప్ప మాకు చేతనైనదేమీ లేదు.

అని గద్గదికస్వనముతోఁ బలుకుచుఁ గ్రమ్ముకొని వచ్చుచున్న కన్నీటితో లక్ష్మమ్మగారింటికిఁ బోయెను. ఆమెవెంట శాంతయు బయలుదేరెను.

మరునాటి యుదయము రామరాజు, అంకినీఁడు, ధర్మారావు, రమణారెడ్డి, రాజశేఖరునింట సమావేశమైరి. రాజశేఖరరావు గ్రామ సముద్ధరణ కార్యక్రమము వారికి టూకీగాఁ దెలిపెను. వారందఱు నంగీకరించిరి. మొట్టమొదట గ్రామపంచాయతీవ్యవస్థాపన కావలయు ననిరి. ఆనాఁటి సాయంకాలము రాజశేఖరుఁడు గుంటూరుపోయి జిల్లా పంచాయతీ ఆఫీసరుగారితోఁ జాలతడవు ముచ్చటించి, అవలంబింప వలసిన విధానము సమగ్రముగాఁ దెలిసికొనివచ్చెను. మరునాఁటి రాత్రి కోవెలలో గ్రామస్థుల సమావేశము జరిగెను. గ్రామములోఁ గక్షలు మఱచిపోయి అందఱు సోదరభావముతో మెలఁగుట కంగీక

రించినందులకు ధన్యవాదము లర్పించి తర్వాత పంచాయతీ ప్రస్తావన చేసెను. "పంచాయతీ ఎందుకవసరమో మొన్నటి సమావేశంలోనే మీాకు మనవిజేసుకొని వున్నాను. ముఖ్యంగా రోడ్లు వేసుకొనడానికి, వీధులు బాగుచేసికొనడానికీ, ఆరోగ్యం పెంపొందించడానికీ విద్యా వ్యాప్తికీ పంచాయతీ అవసరం. మీారందరూ అంగీకరిస్తే యిప్పుడే ఒక మహజరు తయారుజేసి జిల్లా పంచాయతీ ఆఫీసరుగారికి పంపు కొందాం" అని సభ్యుల అభిప్రాయము తెలిసికొనఁగోరెను.

పుల్లయ్యపంతులు:- పంచాయతీ వస్తుందని కులకడంగాదు. పన్నుల సంగతి విచారించుకోండి. ఇళ్ళకు పన్ను, వాకిళ్ళకుపన్ను, బళ్ళకు పన్ను, నేలకుపన్ను, గాలికిపన్ను, వృత్తికిపన్ను, కుక్కకుపన్ను, పందికిపన్ను – ఓః – ఇక అంతుండదు పన్నులకు.

రాజః- తాతగారు చెప్పినన్ని పన్ను లెన్నడూ పడవు. అవైనా మన మందరం వేసుకుందామని వేసుకునేవేగాని వాటంతటవి మీాద పడవు. ఆ పడేపన్నులైనా ఎవరో వసూలుచేసుకొని తినిపోరు. అన్నీ మనసౌకర్యానికే వినియోగించుకుంటాం. పన్నులంటే ఏమిటోకాదు. మన వీధిలో పెద్ద గుంటపడి రాకపోకలకు కష్టమైన దనుకోండి. దాన్ని పూడ్చడానికి తలా ఒక నాలుగురూపాయలు చందా వేసుకుంటామనుకోండి. అట్లా వసూలైనపైకం ఎవరు తింటున్నారు ? గుంట పూడ్చుకోవడానికి మనకు మనమే వుపయోగించుకుంటున్నాము. ఆ చందాయే పన్నుఅనుకోండి. గ్రామసౌకర్యం కొఱకు సాలీనా గ్రామస్తు లివ్వ నిర్ణయించుకొన్న చందానే "పన్ను" అంటారు. ఎంతపన్ను ఇవ్వవలెననేదీ మనమే నిర్ణయించుకుంటాం. వసూలైన మొత్తం ఎందుకుగాను ఉపయోగించేదీ మనమే నిర్ణయించుకొంటాము. కాబట్టి పన్నులు పడతాయని భయపడనవ సరంలేదు.

ఒకరు:-అర్థమయింది బాబూ! ఊరు బాగుపడాలంటే మరి తలాకాస్తా వేసుకుతీరాలి. అందులో తప్పేముంది ? ఎవరి తాహతుననుసరించి వారు వేస్తారు. పంచాయతీ అవసరమే. మహజరు పెట్టండి.

పుల్లయ్య:- ఎన్నికలలో వచ్చే తగాదాలుకూడా విచారించుకోవోయ్. ఇన్నాళ్ళూవున్న పార్టీలు ఉన్నా లేనట్లే కనబడేవి. ఈ ఎలెక్షన్ వెఱ్ఱి ఎక్కితే తప్పదాగినవాళ్ళకంటే అసహ్యంగా దెబ్బలాడు కుంటారు. పంచాయతీ గ్రామాలు ఎన్నిచూడడంలేదు మనం? అందువల్లగదా మనం యిన్నాళ్లూ పంచాయతీ పెట్టుకోనంది?

రాజ:- స్వార్థంకోసమూ, దర్జాకోసమూ, నిలబడేవారికి తగాదాలు వస్తాయిగాని, కేవలం ప్రజాసేవకోసం నిలబడేవారికి తగాదాలు రావు. మన గ్రామంలో తగాదాలు రావడాని కిక వీలులేదు. తత్వం అర్థంజేసుకొని గ్రామకల్యాణమే మనస్సులోపెట్టుకొని వ్యవహరించాలని మనం సంకల్పించాము. అందుకేకదా మొట్ట మొదట పార్టీలు కలిపింది? ఇంకా ఎన్నిక తగాదాలు మన కెందుకువస్తాయి? ఆ భయం పెట్టుకోవద్దు.

ఇంకొకరు:- "ఎందుకేడుస్తావురా?" అంటే "మా అమ్మ ఎల్లుండి కొడతానన్నది" అన్నాడట, ఒక అబ్బాయి! అట్లా ఉన్నది తాత చెప్పేమాట. ఎన్నిక తగాదాలు రావచ్చునని యిప్పటినుంచే అంగలార్చిస్తే యెట్లా? వస్తే రావచ్చు. వచ్చినపుడు సందర్భాను సారంగా సర్దుకోవలసి వుంటుంది. అంతేకాని ఆ భయంవల్ల అసలు పంచాయతీ మానుకోనడమా?

ఈ అభిప్రాయముతో సందఱు నేకీభవించిరి. అంతకుముందే వ్రాసి తెచ్చియుంచిన మహాజరు నప్పుడు రాజశేఖరుఁడు చదివి విని పించి యందఱిచేత సంతకములు నిశానీలు చేయించెను. ఆ రాత్రికి సభ ముగిసెను. మఱునాఁటి యుదయమే యా మహాజరును రాజశేఖర రావు స్వయముగా జిల్లా పంచాయతీ ఆఫీసరుగారికి దాఖలుచేసి వీలయినంత త్వరగా వారు వేములపల్లికి విచ్చేసి పంచాయతీ వ్యవస్థాపన చేయవలసినదని ప్రత్యేకించి కోరెను. అతని యుత్సాహమునకుఁ గార్య దీక్షకు పంచాయతీ ఆఫీసరు సంతోషించి "ప్రతి గ్రామములోనూ యిటువంటి పట్టుదలగల యువకులుంటే మా పనులుగూడా సులభంగా జరుగుతాయి. మీ గ్రామం యివ్వాళే వస్తాను పదండి" అని యా

సాయంకాలమే వేములపల్లికి వచ్చెను. గ్రామములో, వారు ముఖ్యముగా విచారించినది రెండు విషయములు. మొదటిది గ్రామములో కక్షలున్నవాయని. రెండవది పంచాయతీ నిర్వహింపఁగల వ్యక్తులున్నారాయని. కక్షలిటీవలనే యదృశ్యములయ్యెనని తెలిసికొనెను. రాజశేఖరుని సత్యాగ్రహమువలన తాత్కాలికముగా నవి సమసిపోయినను తిరిగి తలయెత్తు నవకాశమున్నదని పుల్లయ్యపంతులుగారు వారితోఁ జెప్పిరి. "అదే సత్యాగ్రహం తిరిగి తలయెత్తిన కక్ష లణఁగి పోగలవని నాకు విశ్వాసం గలిగింది. ఈ గ్రామ పరిస్థితి చూడగా యిక్కడ పంచాయతీ వుండితీరాలని నా అభిప్రాయం. గ్రామం పెద్దది. జనసంఖ్య మూడువేలకు మించి వున్నది. రాగల ఆదాయం స్వల్పం గాదు" అని సెలవిచ్చిరి. నిర్వాహకుల విషయమునఁగూడ పుల్లయ్య పంతులు "కుఱ్ఱవాళ్ళలో కొందరు చురుకైనవాళ్ళున్నారు గాని పెద్దవాళ్ళందరూ మూర్ఖులూ చదువురానివాళ్ళుండీ! మరి యీ కుఱ్ఱకుంకలేమి నిర్వహిస్తారు పంచాయతీ?" యని నీళ్ళు నమిలెను. పంచాయతీ ఆఫీసరుగా రా అభిప్రాయముతోఁగూడ నేకీభవింపక ఇట్లనిరి. "కుఱ్ఱవాళ్ళే ఏ సంస్కారానికిగాని, సౌకర్యానికిగాని పనికివస్తారు. రాజశేఖరరావు మంచి పట్టుదలగలవ్యక్తిగా కనిపిస్తాడు. చదువుకొన్నవాడు. మర్యాదస్తుడు. ఈ మాత్రం యువకులుంటే పంచాయతీ నడపటం కష్టంగాదు" మునసబు కరణములతోఁగూడ నీ విషయము సంప్రదించి పంచాయతీ ఆఫీసరుగారు మరుసటి యుదయము గుంటూరుచేరి గ్రామస్థుల మహజరును లోకల్ బోర్డుల ఇన్‌స్పెక్టరుగారికిఁ బంపుచు వేములపల్లెలో పంచాయతీబోర్డు అత్యవసరమనియు, నది యచ్చట జయప్రదముగాఁ బనిచేయఁగలదనియు గట్టిగా సిఫార్సుచేసిరి. ఇరువది రోజులకు ఫోర్టు సెంటుజార్జి గజెట్టునందును, గుంటూరుజిల్లా గజెట్టునందును వేములపల్లె పంచాయతీ నిర్మాణమైన విషయము ప్రచురింపఁబడెను. మెంబర్ల ఎన్నిక అధ్యక్షుని యెన్నిక యైననేగాని పంచాయతీ వ్యవస్థాపన పూర్తిగాదు. దానికిఁ గొంతతడవు పట్టును.

ఎన్నికల విషయములో రాజశేఖరరావు మిత్రులతో నాలోచనలు సేయఁదొడఁగెను. మెంబరులను అధ్యక్షుని ఎన్నుకొనినఁగాని పంచాయతికి·కృత్యాద్యవస్థ తీరదు. ఈ యవస్థయే ప్రమాదకరమైనది. సమసిపోయిన కక్షలు మరలఁ బొడసూపుట కిచ్చులే యవకాశమున్నది. ఈ యవకాశమును రమణారెడ్డి యూరకఁబోనీయఁగూడదని తన శక్తి వంచనలేకుండ రహస్యముగాఁ బ్రయత్నించుచుండెను. ఇది ఎట్లు పరిణమించునో ముందు చూతము.

---

•

# VIII

## పంచాయతి

రాజశేఖరు నాదేశము ననుసరించి శాంతాదేవి గ్రామములో మహిళాజనమునందు విద్యావ్యాప్తి చేయఁగడఁగెను. విద్యయన్నఁ గేవలము చదువుట వ్రాయుటగా నామె తలపోయలేదు. జ్ఞానోదయము సేయు నే విధానమైనను విద్యయే. వైధవ్యము సంప్రాప్తించిన తరువాత నిప్పటి కెన్నఁడు నిల్లువెడలని యా యువతి క్రమముగా నీ యింటికి నా యింటికిఁ బోయివచ్చుట యలవాటుచేసికొనెను. చదువుకొను నీడులోనున్న బాలికలను దనయింటికిఁ జేరఁబట్టి వారికిఁ జదువు సెప్పఁ దొడఁగెను. ఉబుసుపోకకుఁ దమ యింటికి వచ్చెడు నమ్మలక్కలకుఁ గథలు జెప్పినట్లు చెప్పుచుఁ బ్రపంచ వ్యవహారములు వారి తలల కెక్కింప మొదలిడెను. ఆమెచెప్పు విషయములు సాంతము వినకుండ నెవరును బోలేరు. చెప్పుటలో నామె కంతనేర్పు కుదిరెను. జానపద నారీలోకములో వాడుకగానుండు పాఠములనే వారికిఁ దానును శ్రవణపేయముగాఁ జదివి వినిపించుచు నందలి భావమును జెప్పుచు గ్రామీణజీవితమునందలి మాధుర్యమును తెలుఁగు సంప్రదాయములను గృషీవల సౌభాగ్యమును వారికిఁ గనులఁగట్టించుచుండెను. మెల్ల మెల్లఁగా నిరక్షరాస్యులగు స్త్రీలకుఁ జదువను వ్రాయను నేర్పదొడఁగెను. తొలుదొలుత వారు సిగ్గుపడిరి. కాని క్రమముగా నభ్యాసపడిరి. యువతులగు వితంతువుల కామె ప్రత్యేక శ్రద్ధతోఁ జదువు చెప్పుచుండెను. ఇట్టి వ్యాసంగమును గనీ వినీ యెఱుఁగని యా పల్లెటూరి మహిళాలోకమునకు మొట్టమొదట నిది విడ్డూరముగాఁ దోఁచెను. తరువాత వినోదమయ్యెను. రానురాను అందలి వింత పోయి చాలమంది స్త్రీలు, ముఖ్యముగా, యువతీ వితంతువులు శాంత యొద్దఁ జదువుకొన మొదలిడిరి. కూతునకిది మంచి కాలక్షేపమని యామె తల్లిదండ్రులు సంతసించిరి. మండువాలో నొక భాగమునకు నొకదడిగట్టి యా భాగములో నీ మహిళాపాఠశాల యవిచ్ఛిన్నముగా

జరుగుట కేర్పాటుచేసిరి. శాంతాదేవికి గ్రామములో నీ కారణమున మంచి గౌరవ మేర్పడుచుండెను.

శాంత వదినెయగు తాయారమ్మకు మాత్ర మేలకో యీ పాఠశాల యన్నను శాంత యన్నను నచ్చలేదు. భర్తయగు రాఘవరెడ్డితో "చెల్లెలికి పంతులమ్మ యుద్యోగ మెక్కడన్నా దొరుకుతుందేమో, చూడగూడదా, యీ బాధకంటె !" యని పరిహసించుచుండును. "పంతులమ్మగారూ !" యని శాంత నెగతాళిచేయుచుండును. అత్త మామలన్న నమిత భయముగావున వారితో మాత్ర మా ప్రస్తావన ఎన్నఁడును దెచ్చెడిదిగాదు. తాను యువతియైనను బల్లెటూరఁ బుట్టిపెఱిగినది గావున స్త్రీ విద్య యామెకు హాస్యాజనక మాయెను. అందుకుఁదోడు తలచెడి యింటఁ జేరిన యాఁడుబిడ్డయన్న నిరసనభావము. తనకంటె నామెయే మిక్కిలి గౌరవింపఁబడుచున్నందుకు నసూయయు! శాంతమాత్రము తాయారమ్మ యాడిపోతలను నపహాస్యములను లెక్కసేయక తన ధర్మము దాను జక్కఁగా నిర్వహించుచుండెను.

వితంతువులకు ధర్మబోధసేయుటలో శాంత మఱింత శ్రద్ధ చూపుచుండెను. వైధవ్యము అందఱికిఁగాక యేకొందఱికో భగవంతుఁడు నిర్ణయించుటలో నతఁ డట్టివారికి సులభమగు తరణోపాయము జూపినట్లు భావింపవలయుననియు వైధవ్యము నింద్యము గాదనియు వైధవ్యమునందే స్త్రీలు మానవసేవ చేయుట కెక్కువ యవకాశ ముండుననియు, నట్టి యవకాశమును వమ్ముసేయక వసతిగలవారెల్లరు మానవసేవ చేయవలెననియు నామె యుద్బోధ. కష్టజీవనము, సాత్వికబుద్ధి, తృప్తి, యింద్రియ నిగ్రహము, జీవకారుణ్యము, నిరాడంబరత, వినయశీలము, సత్యవాఙ్నిరతి- వీనిని బెంపొందించుకొన్నఁగాని వారు మానవసేవ చేయఁజాలరనియుఁ, దరించిపోలేరనియు, మాటిమాటికి వారిని హెచ్చరించుచుండెను. వారి సందేహములకు, ననుమానములకుఁ దనకుఁ దోఁచినట్లు జవాబులు చెప్పుచు వారికిఁ గ్రమక్రమముగా విజ్ఞానాభివృద్ధి సేయుచుండెను.

ఒకనాఁటి యుదయము రాజశేఖరుఁడు వెంకటరెడ్డిగారియింటికి వచ్చి యరుగుమీఁదఁ గూర్చుండి శాంతతో ముచ్చటించుచుండెను. 'వితంతు ధర్మబోధ ఎట్లున్నద'ని యామె నడిగెను. తాఁ జేయుచున్న దంతయు నామె యిట్లు చెప్పెను.

శాంత:- చాలమందికి సేవాభావ ముదయించింది. ఇతరులకు సహాయం చేయడం గౌరవకార్యమని వారికి బోధపడింది. తీరికగలవారు చుట్టుపట్ల యిండ్లకుపోయి అవసరమైన సహాయం చెయ్యడాని కలవాటుపడ్డారు. ముఖ్యంగా రోగులకు వీరు సేవ చేస్తున్నారు. కార్యపుపట్ల, గృహిణులు జబ్బుగా ఉన్నప్పుడూ, వంటపనికూడా చేసి ఆ యా కుటుంబాలకు సహాయపడుతున్నారు. ఇతర దిక్కు లేని బాలింతలకు వీరిసేవ, సహాయం అమూల్యమనిపిస్తున్నది. కాని సాంఘిక మర్యాదలు కుటుంబపు కట్టుబాట్లు కొన్నిచోట్ల ఈ సేవా కార్యానికి అడ్డువస్తున్నాయి. కాలం గడిచినకొద్దీ, ఈ అడ్డంకులు కూడా పోవచ్చు.

రాజ:- ఇంతవఱకూ బాగానే ఉన్నది. మఱి నీ ధర్మోపదేశం ఎంత వఱకు అర్థంజేసుకొన్నారు ?

శాంత:- కొంద ఱర్థంచేసుకొన్నారు. కొందఱు చేసుకోలేదు. అర్థం చేసుకున్నవారిలోకూడ చాలమంది ఇంకా నాతో ఏకీభవించడం లేదు.

రాజ:- ఏ విషయంలో ?.

శాంత:-వితంతు వివాహ విషయంలో. యౌవనం ఉన్నప్పుడు సంతానం లేనప్పుడు మరీ కన్యావైధవ్యం సంభవించినప్పుడు వివాహం చేసుకొనడమే మంచిదని వాళ్ళ అభిప్రాయం.

రాజ:- ఇంద్రియ నిగ్రహం లేనప్పుడూ, మానవసేవామార్గాన తరించి పోయే ఉద్దేశ్యం లేనప్పుడూ అదే మంచిపద్ధతి అని నేను మొద టనే చెప్పానుగదా ?

శాంత:- మరి సమాజ నియమాలో !

రాజ:- అవి మనచేతుల్లోవే. సమాజ నియమాలకు భయపడే ఇంత మందీ బలవద్వైధవ్యం అనుభవిస్తున్నారుగదా!

శాంత:- సమాజ నీతికూడా ఒక ప్రయోజనం సాధించడానికే యేర్పడ్డప్పుడు మరి వీళ్ళు ఆ నీతిని పాటించవద్దూ?

రాజ:- ఈ విషయం మనం మొదటనే తర్కించుకొన్నాం. వ్యక్తి సౌఖ్యానికీ పురోభివృద్ధికీ ఎక్కువగా అడ్డపడే సామాజిక నీతిని మార్చుకోవాలి. మార్చకపోతే ఆ నీతివల్ల బాధపడేవాళ్ళు కొంత కాలానికి ఆ నీతిని ఉల్లంఘించి సమాజ దృష్టిలో నేరంచేసిన వాళ్ళవుతారు. అటువంటి నేరాలు చేయించడంకంటె కాలాన్ననుసరించి నియమాలే మార్చి నేరాలు లేకుండా చేయడమే మంచిది గదా!



శాంత:- అట్లాగే అనిపిస్తుం దొక్కొకసారి. కాని ఇన్ని శతాబ్దాలు చెక్కుచెదరకుండా నిలిచివున్న ఈ ధర్మాలు మార్చడం మంచిదేనా? అని మళ్ళీ సందేహం.



రాజ:- మళ్ళీ మొదటికివచ్చావు. ఆ ధర్మాల కిప్పటిలో అవసరమూ లేదు. కాలపరిణామాన్నిబట్టి అవి సమంజసమూగావు. ఇంతకూ నీకు తెలియకుండా నీ మనోంతరాళంలో ఉన్న దేమంటే – ప్రాత ధర్మాన్ని వదలి క్రొత్తధర్మాన్ని చేపట్టడానికి అధైర్యం. దీన్నే పూర్వాచార పరాయణత అంటారు. క్రొత్త ధర్మం మంచిదనీ న్యాయమైనదనీ నీకూ తెలుసు. కాని దాన్ని అనుష్ఠించడానికి భయం. నీకేకాదు. చాలామందికి.

శాంత:- ఏమో, తేల్చుకోలేకుండా ఉన్నాను. ఇంకా తరచిచూస్తాను. నేను మొదట నిర్ణయించుకొన్నట్లు ఇంకా కొన్నాళ్ళు వీళ్ళకు ధర్మబోధ చేస్తాను. కొందరైనా సంపూర్ణంగా నాతో ఏకీభవించక పోతారా! అని నా ధైర్యం.

రాజ:- తప్పక యేకీభవిస్తారు, కొందరైనా – అంతే! అందులోకూడా కొందరు నీ తర్కబలానికి లొంగిపోతారు. కొందరు సొంతంగా ఆలోచించుకొనే శక్తిలేక లొంగిపోతారు. కొందరు నీ మీద

మొగమోటపడి లొంగుతారు. కొందరు నీతో నిజంగా ఏకీభ విస్తారు. కాని త్యాగమూ, ఇంద్రియ నిగ్రహమూ, సేవాభావమూ ఏ కొద్దిమందికో ఉంటాయి. ఈ కొద్దిమందికిగాను ప్రాచీనధర్మాన్ని మార్చకుండావుంచి అధికసంఖ్యాకులకు ఇబ్బందికల్గించడం మంచిది కాదు. త్యాగశీలం కలవాళ్ళకు ధర్మంమార్చినా ఒకటే మార్చక పోయినా ఒకటే.

ఈ విషయమునుగూర్చి ముచ్చటించునపుడు "నీవు నిజంగా వితంతువైనావా ?" యని యిటీవల రాజశేఖరరావు తన్నడిగిన ప్రశ్న శాంతకు జ్ఞప్తికివచ్చి యా ప్రశంస తెచ్చుటకుఁ బ్రయత్నించుచుండెను. అంతలో రామరాజు, రమణారెడ్డి, ధర్మారావు మొదలగువారు తన కొఱకు వాకిట వేచియున్నట్లు రాఘవరెడ్డివచ్చి రాజశేఖరునకుఁ జెప్పెను. రాజశేఖరుఁడు బయటికేఁగఁజూచుచుండఁగాఁ దటాలున రమణారెడ్డి లోనికివచ్చి "హల్లో! కెప్టెన్! మనవాళ్ళంతా మీకోసం వెయిట్ చేస్తున్నారు, కమాన్" అనుచు శాంతాదేవిని దేరిపారఁ జూచెను. అంతకుముందు రమణారెడ్డి యామెను జూచియుండలేదు. నిర్మలమైన యామె సౌందర్య మతనిని ముగ్ధునిఁ జేసెను. ఆ పల్లె టూరిలో నట్టి నిరుపమాన లావణ్య ఖని గుప్తమైయున్నట్లతఁడెఱుఁ గఁడు. వచ్చినపని మఱచిపోయి యామె వదనసౌందర్య మధువును గన్నులతోఁ ద్రావుచు నతఁడు మైమఱచెను. శాంతకు నొడలిపైఁ గాళ్ళజెఱ్ఱులు ప్రాకులాడినట్లుండెను.

అంతవఱకు శాంతాదేవియు, రమణారెడ్డియు నొకరి నొకరు చూచియుండకపోవుటచే, రాజశేఖరరావు శాంతవంకకుఁదిరిగి "శాంతా! వీరారెడ్డిగారి యల్లుఁడు రమణారెడ్డిగారు, వీరే!" యని యామె కాతనిని బరిచయము చేసెను. మర్యాద ననుసరించి శాంతలేచి రమణా రెడ్డికి నమస్కరించెను. రాజశేఖరరావు, రమణారెడ్డితోఁగూడ శాంతను చూపుచు "ఈమె శాంతాదేవి" యని చెప్పెను. అంతట రమణారెడ్డి తన కలనుండి తేరి "ఆ, విన్నాను ఈమెనుగూర్చి. నా వైఫ్ చెపుతూఉంటుంది. ఊళ్ళో లేడీస్‌ను ఎడ్యుకేట్ చేస్తుందట.

చాల మంచిపనిచేస్తున్నారమ్మా మీరు" అని పలికెను. శాంత "సెలవు" అని లోనికేఁగెను.

నాటి సంఘటన శాంతాదేవి హృదయమునఁ గొంత కలఁత కలుగఁజేసెను. రాజశేఖరుఁ డెంతవఱకును వితంతు వివాహసంస్కారముమీఁదనే యభిలాష చూపుచుండెను. అతని యభిప్రాయమేమి? తనపై నతని కింకను వలపుగలదా? తన నతఁ డింకను వివాహమాడఁ దలఁచుచున్నాఁడా? ఇందులకా యతఁడు తనను వితంతూద్వాహము నకుఁ బ్రేరేచుట? ఈ శంక యామె హృదయములో నొక త్రుటికాలము దయించి యంతలోనే సమసిపోయెను. అట్టిశంక తన కుద యించినందులకుఁ దనలోఁ దాను చింతించెను. ఛీ! పవిత్ర త్యాగ మూర్తి. మానవసేవ దక్క నింక నే యితర జీవితాశయములేనివాఁడు. గ్రామ కల్యాణమునకై యసువు లర్పింప సంసిద్ధుఁడైనవాఁడు; రాజ శేఖరునకా యిట్టి కాముకత్వము? తా నెంత పొరపడెను! మఱి వితంతూద్వాహ సంస్కారముపై నతనికేల యభిమానము? ప్రపంచ కల్యాణార్థమే. అందతనికి స్వార్థములేదు. తన జవ్వన మడవిఁగాచిన వెన్నెలయై పోవుచున్నందు కతని జాలిగుండె కరగిపోవుచున్నదేమో! అయినఁ దనకులేనిబాధ యతనికేల? ఇట్టి యాలోచనలతో నామె హృదయము వ్యాకులమగుచుండెను. మఱికొంత యాలోచన. ఇంచుక యాత్మపరీక్ష. తనకుమాత్ర మతనిపై వలపులేదా? లేదనుకొని యెంత వాదించినను గలదని తన యంతర్వాణి యే మూలనుండియో నదిం చుటలేదా? ఇంతయుఁ బారఁజూడఁ దనబోటి యువతులు వివాహ మాడుటయే మంచిదని రాజశేఖరుఁడు వాదించుటలో సత్యములేదా? ఏమో! ఆమె హృదయమునఁ బరస్పర విరుద్ధములుగా ధ్వనులు! ఇంతలో రమణారెడ్డి కామగ్రహావిష్ట దుర్భర దుర్మార్గావలోకనములు. తాను "అనాథ"యై యుండుటచేతనేగదా! యతఁడు తన్నట్లు నిర్భయ ముగాఁ జూచుట! ఇట్టి సమాజములోఁ దనబోటి యువతులు పెండ్లి చేసికొనుటయే నిరపాయ పద్ధతియేమో! ఏమో!! చిక్కువడిన దారమువలె నామె యాలోచన జరిగిపోవుచుండెను.

రమణారెడ్డి, రాజశేఖరరావు తక్కిన మిత్రులతోఁ గలిసి కోవెలకుఁబోయిరి. వారు వెడలిపోయిన వెంటనే తాయారమ్మ తన భర్త రాఘవరెడ్డిని బిలిచి యిట్లనెను.

తాయా:–నే నేదన్నా ఓర్వలేక అన్నానంటారు, మీ అమ్మా నాయనా. ఒక్కగాను ఒక్క ఆడబిడ్డ తలచెడి యింటజేరితే అన్నభార్య ఆడిపోస్తున్నదని అమ్మలక్కలు నన్నే అంటారుకాని మీ శాంతమ్మ గారి వ్యవహారం శ్రుతిమించి రాగాన పడుచున్నది.

రాఘవ:– ఏమిటే నస!

తాయా:–ఔను! నే నేదిచెప్పినా నసగానే ఉంటుంది. ఏదెట్లాతగలబడితే నాకెందుకూ? పోనియ్యి.

రాఘవ:– మళ్ళా అంతలోనే బిగదీసుకొంటావుదేనికి? చెప్పూ, చెప్ప దలచుకొన్న దేదో.

తాయా:–చెప్పడానికేమున్నది? నీవు చూడ్డంలేదా – చెల్లెలు ఆ వరసన గంటలకొద్దీ పరాయి మొగాళ్ళతో మాట్లాడుతూ కూర్చుంటే?

రాఘవ:– రాజశేఖరంతోటేగా? అతనూ మేమూ చిన్నప్పటినుంచీ ఒకింట పెరిగినట్లు పెరిగాం. మా యింట్లో పిల్లలూ వాళ్ళింట్లో పిల్లలూ కలిసి తినేవాళ్ళం, పడుకునేవాళ్ళం. అందువల్ల రాజశేఖ రానికి మా యిల్లు పరాయిల్లుగా వుండదు. శాంతకు చిన్నప్పుడు చదువుకూడా చెప్పేవాడు. అతను పరాయివాడెట్లా అవుతాడు.

తాయా:– పరాయివాడు కాకపోతే యిచ్చి కట్టకపోయినారా?

రాఘవ:– ఛీ! నోరు ముయ్!

అని తల్లిదగ్గఱకుపోయి "శాంతను కొంచెం అదుపుచెయ్యాలి. ఇంకా గారాబం పెట్టుకుంటే మర్యాదపోతుంది" అని కొంచె మావేశ ముతోఁ జెప్పి, తల్లి మారుపలుకుట కవకాశ మియ్యకుండ నెచ్చటికో వెడలిపోయెను. ఈ మాటలు తాయారమ్మ విని తాను వేసిన విత్తు నాటుకొనుచున్నట్లు భావించి సంతసించెను.

శాంత పవిత్రశీలము గలదియని తాయారమ్మకుఁ దెలియక పోలేదు. కాని యామె "తన" యింటఁజేరి తినుచుండుట యామెకు

గిట్టలేదు. అంతేకాదు. అందరికిఁ దలలోని నాలుకవలె మెలఁగుచుఁ దనయింటికి శాంతయే జీవమైనట్లుండుట తన గృహిణీత్వమునకు లోపముగా నామెకుఁ దోఁచెను. ఎల్లని శాంత కుద్యాసము చెప్పుటగాని కనీస మొకమూలఁ బడియున్నట్లు చేయుటగాని యామె కోరిక. ఈ యుద్దేశ్యము లోనఁబెట్టుకొని యమాయకుఁడగు తన భర్తహృదయమును గ్రమముగా విఱువఁదొడఁగెను. శాంతనుగూడ "సూటీ పోటీ"లకు గుఱిసేయుచుండెను.

రాఘవరెడ్డి తనతోఁ గఠినముగాఁ బలికిన పలుకులకు లక్ష్మమ్మగారు ఆశ్చర్యపడి తాయారమ్మను బిలిచి "ఏమిటమ్మా! అబ్బాయి అనేది, నాకర్థంగావడంలేదు" అని యడిగెను. "నాకేం తెలుస్తుంది. మీకూమీకూ ఉండే తగాదాలలో మధ్య నాకెందుకు?'' అని తాయారమ్మ విసరుకొనుచు దొడ్డిలోనికిఁ బోయెను. లక్ష్మమ్మగారాలోచనలోఁబడెను. ఇంటిలో నేదో రాఁజుకొనుచుండెనని యామె శంకించుచుండెనుగాని, యింతవఱకు నేదియు బయటకు రాలేదు. తాయారమ్మ పరాయిపిల్ల. అంతకుముం దెచ్చటను గలిసిన సంబంధము గాదు. కాపురమునకు వచ్చి నాలుగేండ్లయినది. వచ్చిన మఱునాఁటి నుండియు నంతయుఁ దనదేయని, తానే యింటికి రాణి ననియు భావించుచుఁ దదను గుణముగాఁ జిన్నిచిన్ని జగడములు పెట్టుకొనుచుండెను. అత్తమామలు భారీగుణము గలవారగుటచేతను, శాంత సుగుణరాశి యగుటచేతను, తాయారమ్మ తగాదాలు పెద్దవికాకుండా సమసిపోవుచుండెను. రానురా నామె యాగ్రహమంతయు శాంతపైఁ దిరుగుచుండెను. ఈ విషయము కనుపెట్టిన లక్ష్మమ్మగారికి శాంతా వైధవ్య ఖేదమునకుఁదోడు మఱియొక మనోవ్యాధి యేర్పడెను. రాఘవరెడ్డి ప్రవర్తన నేఁడా వ్యాధి నినుమడింపఁజేసెను. శాంత గ్రహించెనో, లేదో?

రాజశేఖరరావు మిత్రబృందముతోఁ గోవెలలోనికేఁగి పంచాయతీ నెలకొల్పఁబడినది గావున మెంబరుల ఎన్నిక విషయమై యాలోచింపఁదొడఁగెను. ఎన్నికలు లేకుండ మెంబరుల నేర్పాటుచేయుట

యుత్తమ మార్గమనియు, ఎన్నికలు పెట్టినచో నోడిపోయినవారికిఁ దిరిగి స్పర్థ భావములు గలిగి వ్యవహారమంతయు మొదటికి వచ్చు ననియు నందఱు నంగీకరించిరి. చట్టము ప్రకారము వేములపల్లి పంచాయతీబోర్డునకు పన్నెండుస్థానము లుండవలయును. అందుఁలో మూఁడు స్థానములు – మహమ్మదీయుల కొకటి, హరిజనులకొకటి, క్రైస్తవుల కొకటి ప్రత్యేకింపవలయును. తక్కిన స్థానములు సాధారణ స్థానములు. ఈ పన్నెండు స్థానములకు పన్నెండు వార్డులు వేరుగా విభజింపక గ్రామమునందలి ఓటరులందఱు ప్రతి మెంబరును ఎన్నుకొనునట్లును ఎన్నిక బాలెటుపద్ధతినిగాక సభలోఁ జేతులెత్తుట మూలముగా జరుగు నట్లును – పంచాయతీ ఆఫీసరుగారితో మొదటనే సంప్రదించి ఏర్పాటు చేసియుండిరి. పెద్దగ్రామమగు వేములపల్లిలో నిట్టి విధానము కష్టమే కాని తమ గ్రామ మితర గ్రామముల కాదర్శప్రాయముగ నుండవలయు నని యువకులు – ముఖ్యముగా రాజశేఖరరావు పట్టుదలతోఁ బని చేయుచుండుటచే నెట్టి కష్టములేకుండ నీ విధానము నమలుజరుపుట కవకాశము కనిపించెను.

పంచాయతీ ఆఫీసరుగారు ఎన్నిక తేదీ నిర్ణయించి తెలుపక ముందే యే యే వ్యక్తులను మెంబరులనుగా నిలుపవలయునో గ్రామస్థులే నిర్ణయించుకొన్నయెడల నెన్నికపని సులభముగా తేలిపోవునని మన యువకబృందము నాఁడు గోష్ఠిలోఁ జర్చించుచుండిరి. ఏ యే వర్గములకు బోర్డులోఁ బ్రాతినిధ్యమిచ్చుట సమంజసమో, యవసరమో వారాలోచించి యా యా వర్గములవారికి "పోటీలేకుండ మీ ప్రతినిధిని మీరు నిర్ణయించుకొని తెలియజేయండి; ఆ ప్రతినిధినే గ్రామమంతా పోటీలేకుండా ఎన్నుకుంటుంది" అని తెలియఁజేసిరి. "అట్టి ప్రతినిధి నిర్ణయం చెయ్యడంలో ఏ మాత్రం మోమోటాలకు పోకుండా, గ్రామానికీ తమ వర్గానికీ నిజమైనసేవ ఎవరు చెయ్యగలరని మీకు విశ్వాసమున్నదో వారిని నిర్ణయించుకోవాలి. ఆ ప్రతినిధి కూడా తనకు నిజంగా సేవాభావం, దీక్ష, ఉంటేనే తాను మెంబరుగా ఉండ నిశ్చయించాలిగాని. కేవలం పేరుకోసం, దర్జాకోసం నిలువ

కూడదు. మెంబరు పదవిలో నిజానికి దర్జాకంటె బాధ్యత ఎక్కువ వున్నది. దర్జాకోసమే మెంబరుపదవి కాశించేవారు గ్రామానికి ద్రోహంచేసినవా రౌతారు." అని రాజశేఖరుఁడు నొక్కినొక్కి చెప్పు చుండెను. రెండుమూడు రోజులలో గ్రామస్థులు తమలోఁ దాము సంప్రతించుకొని మెంబరులను నిర్ణయించుకొనిరి. వెంటనే పంచాయతీ ఆఫీసరుగారిచే ఎన్నికతేదీ నిర్ణయము చేయించుకొని యా తేదీన ఎన్నికసభ యేర్పాటుచేసిరి.

మెంబరులుగా నిర్ణయింపబడినవారిలో నొక స్త్రీ కూడ నుండ వలయునని రాజశేఖరుఁడు వాదించెను. మహిళాజనముకూడ పౌర పరిపాలనలోఁ బాల్గొనవలయుననియు, నందువలన కనీస మొక్క స్త్రీ యైనఁబంచాయతీబోర్డులో నుండవలయుననియు నతని వాదము. వలదనికొందఱు ప్రతిఘటించిరి. అందువలన నొకనాటి సాయంకాలము కోవెలలో మామూలు సమావేశ మేర్పాటుచేసి యందీ విషయము చర్చించిరి. అందీ సంభాషణ జరిగెను.

పుల్లయ్యపంతులు:- ఇంటిపనులు చక్కగా సర్దుకొని, వేళకింతకూడు వండితగలేస్తే చాలు ! ఆడవాళ్ళు; వాళ్ళకెందుకు ఈ పంచాయతీ గొడవలు. అయినా మగవాళ్ళతో కలిసి సిగ్గులేకుండా వాళ్ళు ఎట్లా వస్తారు మీటింగులకు ? మరీ తెనుగుమీరిపోతున్నది వ్యవహారం !

రాజ:-తాతా ! కాలంమారినసంగతి మాటిమాటికి మరచిపోతున్నావు. ఆడవాళ్ళ నంత నీచంగా, చులకనగా చూడడం తప్పు.

పంతులు:- ఇన్నియుగాలు లేని తప్పు ఇవ్వాళ ఎక్కడనుంచి వచ్చిందోయ్ !

రాజ:- తాతా ! ప్రాచీనకాలంలో స్త్రీకి చాల స్వాతంత్ర్యం ఉన్నట్లు మన వైదిక సాహిత్యం, కావ్యసాహిత్యం చూపుతున్నది. స్త్రీ కేవలము పురుషుని భోగవస్తువు గాదనీ, వంటలక్క, ప్రాచిపని మనిషీ కాదనీ, ప్రాచీన సాంఘిక రాజకీయ వ్యవస్థలలో ఆమెకు ఒకస్థానం ఉండేదనీ పెద్దలందరూ ఒప్పుకుంటున్నారు. రుద్రమదేవి

వంటి తెలుగు నారీమణులు రాజ్యాలు చేశారు. మొల్లవంటివారు కావ్యాలు వ్రాశారు. తరిగొండ వెంకమాంబవంటివారు ఆధ్యాత్మికంగా మార్గదర్శకులైనారు. ఎటుతిరిగీ మహమ్మదీయయుగంలో సాంఘిక పరిస్థితులు తారుమారై స్త్రీని గడపదాటనీయకుండా ఉంచవలసి వచ్చింది. ఆ అవాంతరం గడిచిపోయినతర్వాత ఆమె స్థానం ఆమెకు ఇవ్వవలసివున్నను పూర్వాచారాన్ని పురస్కరించుకొని ఆమెను ఇంతవరకూ అణచిపెడుతున్నాడు పురుషుడు. బ్రిటిషు యుగాంతంలో క్రమంగా స్త్రీవిద్య ప్రబలి మహిళామణులు పూర్వంమాదిరి సాంఘిక రాజకీయ వ్యవస్థలలో తమ స్థానం తాము ఆక్రమించుకొంటున్నారు. శాసనసభలో – మద్రాసులోనేకాదు – ఢిల్లీలోకూడా పాల్గొంటున్న తెలుగు నారీమణులున్నారు. ఈ కాలంలో జిల్లాబోర్డు అధ్యక్షపదవిని జయప్రదంగా నిర్వహించిన తెలుగు మహిళలు ఉన్నారు. పురుషునికంటె చురుకైన బుద్ధివిశేషం చూపిస్తున్న స్త్రీ లెంతోమంది కన్పిస్తున్నారు. అట్టి సందర్భాలలో నీవు మళ్ళీ పూర్వాచారంపేరిట వాళ్ళను వంటిళ్ళకు, పడకటిళ్ళకు బంధించాలనడం అభ్యుదయపద్ధతి కాదు.

పంతులు:– దేవుడు మేలుచేస్తే, అబ్బాయీ, మన కుటుంబ వ్యవస్థలో మన పూర్వులు స్త్రీ కొకవిధి పురుషునికొకవిధి నిర్ణయించారు. ఇల్లుకనిపెట్టుకొని వుండి లోపలి వ్యవహారమంతా చూచేపని స్త్రీది అన్నారు. బయట కష్టపడి పనిచేసి యిల్లుగడవటానికి కావలసిన ధనార్జన, సంబార సముపార్జన పురుషుని పని అన్నారు. రాజకీయ వ్యవహారాలూ, సాంఘిక వ్యవహారాలూ పురుషునికే యిచ్చారు.

రాజ:– పురుషుడు తీసుకొన్నాడను, ఎవరో ఇచ్చారనడంకంటె.

పంతులు:– సరే! అట్లాగేఅనుకో. గృహంలో స్త్రీకి సంపూర్ణ యాజమాన్యం ఇచ్చారు. గృహానికి ఆమె రాణి అన్నారు. "కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ" అనే శ్లోకం ఎరుగుదువుగా! ఇంతకాలం ఈ వ్యవస్థ సంతృప్తికరంగా జరుగుతూంది. నీవు చెప్పే మార్పు

వల్ల ఎవరిపని వారు చేయటానికి వీలుండక అశాంతి యేర్పడు తుంది. స్త్రీ బయటికిపోతే కొంప ఎవరుచూచుకుంటారు ?

రాజ:- నేను సూచించే మార్పువల్ల స్త్రీ తన విధ్యుక్త కార్యాలు మానుకొని బయటికి వెళ్ళవలెననికాదు. తనపని తాను చేసు కుంటూనే విజ్ఞానం ఆర్జించి పురుషునికి ఆలోచనలో తోడ్పడవలె ననీ వీలున్న యెడల బయటికికూడా పోయి పౌర రాజకీయాది వ్యవహారాలలో పాల్గొనాలనీ నా అభిప్రాయం. గృహానికి స్త్రీ రాణి యనేది మంచిభావమేకాని ఆచరణలో అటువంటిది కనిపిం చటంలేదు. కారణం అవిద్య. పురుషుడూ, స్త్రీ ఇద్దరూ అవిద్యలో పడిపోయినారు. "కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ !" అనే శ్లోక భావాన్ని విద్యావిహీను లెవరు అర్థంచేసుకొంటారు ? అందు వల్లనే స్త్రీనికూడా విద్యావిలసితను జేసి పురుషుని కన్నివిధాల తోడ్పడేలాగు చూడాలి. స్త్రీకి విద్యలేకపోయినా విజ్ఞానం లేక పోయినా, ఇల్లంతా విద్యావిహీనమైనదే అనుకోవాలి. చదువు కొన్న తల్లి బిడ్డలకు పసితనమునుంచీ చక్కని శిక్షణ యిస్తుంది. మంచి భావాలు కలుగజేస్తుంది. వాళ్ళను మంచి పౌరులుగా తయారుచేస్తుంది. పురుషుని ఆలోచనలో తోడ్పడి అతని భారం కొంత పంచుకొంటుంది. అతను తప్పుదారినపోతూంటే దిద్దుతుంది. అన్ని విషయాలలోనూ సలహాయిస్తుంది. విద్యావిహీనయైన స్త్రీ ఎంత చక్కనిదైనా కేవలం భోగ్యవస్తువుగా ఉపయోగపడుతుందే గాని, గృహరాజ్య నిర్వహణలో ఏ మాత్రమూ పనికిరాదు. పురుషుడు చదువుకొన్నవాడై స్త్రీ చదువురానిదైనప్పుడు పురుషుని కొంప అడవిగా వుంటుంది. సాంసారిక జీవితంలో కొందరికి అసం తృప్తి కలగడానికి ఇదొక కారణం.

పంతులు:- సరే ! స్త్రీకూడా చదువుకొని విజ్ఞానం ఆర్జించాలంటే కొంతవరకు ఒప్పుకుందాం. దేవుడు మేలుచేస్తే, మరి ఆవిడను పదిమందిలోకి లాక్కురావడం దేనికయ్యా ! ఆడదాన్ని కొంపలో

బంధించినప్పటికీ అవినీతిని అరికట్టలేకుండా ఉన్నాము. ఇక విచ్చల విడిగా తిరగనిస్తే—

రాజ:- అదే పెద్దపొరపాటు. అవినీతికి స్త్రీకంటే పురుషుడే కారణం. పురుషుడికి బుద్ధి చలించకుండా వుంటే స్త్రీ యేమీ చేయలేదు. అసలు స్త్రీని కనబడకుండా దాచడంవల్లనే అనర్థం కలుగుతుంది. కనబడే వస్తువుమీదకంటే కనబడకుండా దాగినవస్తువుమీదనే ఎవరికైనా వాంఛ ఎక్కువ. స్త్రీలుకూడా బయట తిరుగుతూ పురుషుల కళ్ళకు మామూలు దృశ్యాలైనప్పుడు పురుషుల దృష్టి వారిమీదకి పోదు. ఎప్పుడూ కనబడే వస్తువు రమ్యమైనదైనా పరిచితి కారణంగా ఆకర్షణ గుణాన్ని కోల్పోతుంది స్త్రీ కూడా అంతే.

పంతులు:- "కొంగైన తాకితే కోటిలాభా"లనే మనవాళ్ళలో స్త్రీలు తిరిగితే బాగుపడతారటరా బాబూ!

రాజ:- సాధారణ పౌరునికి భోగవాంఛకు మించి ఉదాత్తవాంఛలు గాని జీవితోద్దేశ్యాలుగాని లేనంతవరకూ నీవు చెప్పే అపాయం కొద్దో గొప్పో ఉంటుంది. అంత భోగవాంఛాపరులైన పురుషులున్న సమాజం చాలా వెనుకబడి వున్నదనుకోవాలి. మానవుడింకా మృగప్రాయుడై జీవితంలోని సున్నితమైన ఆనందం అనుభవించ లేకుండా ఉన్నాడని ఇందువల్ల అర్థమౌతుంది. కాని దీనికి ముఖ్య కారణం స్త్రీని పెట్టెలో పెట్టి దాచడం అంటాను. స్త్రీకూడా సాధారణ వ్యక్తిగా దృష్టిపరిచితమైనకొద్దీ యీ అపాయం తగ్గి పోతుంది. మన సమాజ పరిస్థితులను అంతవరకైనా బాగుచేయ లేకపోతే మన సభ్యతా, మన నాగరకతా, మన సంస్కృతీ అన్నీ ఉత్తమాటలౌతాయి.

పంతులు:- సరే! మాటవరసకు, అంతవరకూ ఒప్పుకుందాం మరి. దేవుడు మేలుచేస్తే, రాజకీయాలలోనూ పౌరకార్యాలలోనూ స్త్రీలకు భాగమెందుకు? పురుషులు చాలరూ?

రాజ:- స్త్రీలకూ పురుషులకూ సమాన ప్రతిపత్తి ఒప్పుకొన్నప్పుడు

అన్నివ్యవహారాలలోమాత్రం వాళ్ళకు పాలెందుకు ఇవ్వకపోవాలి? బుద్ధికుశలత, వ్యవహార దక్షత పురుషుని సొమ్మేనా? స్త్రీకి లేదా? ఇటువంటి విషయాలలో ఆడ మగ భేదాలు పనికిరావనుకుంటాను. శ్రీమతి విజయలక్ష్మి రష్యాకు అమెరికాకు భారత ప్రభుత్వ రాయబారిగా వెళ్ళడం, ఆమెకున్న బుద్ధికుశలత పురుషులలో లేకపోవడమే అనుకోవాలి. రాజకుమారి అమృతకౌర్ బ్రహ్మాండమైన భారత ప్రభుత్వంలో ఆరోగ్యశాఖా మంత్రిణిగా పని చేయడం అంతమాత్రం ఘటం పురుషులలో సద్యఃకాలానికి దొరకకపోవడం వల్లనేకదా! కేవలం స్త్రీలైనంతమాత్రాన దేశకళ్యాణకరమైన వాళ్ళ యోగ్యతను సామర్థ్యాన్ని మనము ఉపయోగించుకోన డానికి సందేహించకూడదు. స్త్రీకికూడా ఇటువంటి బాధ్యతగల వ్యవహారాలలో స్థానం ఎప్పుడిస్తామో అప్పుడు గుప్తంగా, రాణింపుకు రాకుండా ఇంతవఱకూ నిరుపయోగాలై, వాళ్ళలో దాగియున్న మహాశక్తులు స్త్రీ జనంలోనుండి బయటకు వస్తాయి. దేశ సౌభాగ్యం, ప్రస్తుతం మన గ్రామసౌభాగ్యం పొందాలంటే స్త్రీలకుకూడా పౌరపరిపాలనలో ఉచితస్థాన మివ్వాలి.

ఈ సంభాషణ విన్నమీఁదట సభ్యులలో నధికసంఖ్యాకులు రాజశేఖరునితో నేకీభవించుచుఁ దమ యభిప్రాయమును ప్రకటించిరి. "మనకేదో పూర్వాచారమని యిన్నాళ్ళూ ఆడవాళ్ళను ఎక్కిరానివ్వడం లేదుగాని, రాజశేఖరం చెప్పినప్రకారం చేస్తే కొంపలు కళకళలాడు తుంటాయి. ఆడా మగా భేదం ఇంత వుండకూడదు" అని వారిలో వారనుకొనిరి. కడకు వేములపల్లి పంచాయతీబోర్డులో నొక స్త్రీకి స్థానమిచ్చుట కెల్లరు నంగీకరించిరి.

ఆ స్థానమున కెవ్వరర్హులా యన్న యాలోచన వచ్చెను. అప్పటిలో వ్యవహారజ్ఞానముగల స్త్రీ వ్యక్తి శాంతాదేవికన్న నెవ్వరు లేరనియు, నన్నివిధముల నామెయే యోగ్యురాలనియు రామరాజు ప్రతిపాదించెను. "అవునవు" నని యందఱు తలలూపిరి. సభాంతమున నింటికిఁ బోవుచు నొక్కొక్క రొక్కొక్క విధముగాఁ దలపోసిరి.

ఒకరు:- రాజశేఖరం ఏదో ఒక వింత తెచ్చిపెట్టుతుంటాడుసుమా !
ఇంకొకరు:- కాని ఏది తెచ్చినా మంచిదే తెస్తాడు.
ఇంకొకరు:- ఇదొక నాటకం. చూద్దాం, కానివ్వండి.

* * * * * *

రమణారెడ్డి ఇంటికిఁబోవుచు రాజశేఖరునితో నిట్లనెను. "దిస్ అరేంజిమెంట్జ్ డామ్‌నైస్. ఈ యేర్పాటు భలే బాగున్నదండీ!"
అంకినీఁడు:- నీ ఇంగ్లీషుకూతలు పోనియ్యవైతివే !
రమణ:- అయాం సారీ ! చదువుకున్నదోషం.
అంకి:- బాగాచదువుకున్నవాళ్ళకుకూడా లేదు ఈ మాయరోగం. పద వెళ్దాం.

ఆరాత్రి సభ యట్లు ముగిసెను.

మఱునాఁటి యుదయము చెఱువుకట్టమీఁద రమణారెడ్డి రాఘవరెడ్డితోఁ గలిసి చాలసేపు ముచ్చటించుచుఁ గూర్చుండెను. తిరుగవేయఁగాఁ దిరుగవేయఁగా వారిద్దరికి నెచ్చటిదో చుట్టఱికము గలిసెను. రాఘవరెడ్డి భార్య తాయారమ్మ రమణారెడ్డి పినతండ్రి (పెదతాత కుమారుఁడు) వదినె (భార్య సోదరి) గారి తోడికోడలికిఁ జెల్లెలి కూతురఁట. అనఁగాఁ దాయారమ్మ రమణారెడ్డికిఁ జెల్లెలి వరుస. రాఘవరెడ్డి బావమఱఁది వరుస. ఇంతకు సారాంశము, శాంతాదేవి రమణారెడ్డికి మఱఁదలు.

రమణా:- భలే! ఎవరో అనుకొన్నానోయ్! ఇన్నాళ్ళూ! మై గుడ్ గాడ్ ! నీ భార్య నాకు చెల్లెలే సుమా ! చుట్టరికం తిరగవేయక పోవడం పొరపాటే" అని రాఘవరెడ్డి వీపు తట్టుచు నతనితోఁ గలసి వెంకటరెడ్డిగారి యింటికి వచ్చెను.

రాఘవరెడ్డి భార్యతోఁ దాను క్రొత్తగాఁ బరిశీలించి తేల్చిన బాంధవ్యము నామెకుఁ జెప్పుచు రమణారెడ్డికిఁ జుట్టపు మర్యాదలు చేయించెను. తాయారమ్మయు రమణారెడ్డి బాంధవ్యమునకు సంతోషించి "మా నాయన నా కెప్పుడో చెప్పినట్లు జ్ఞాపకం. ఫలాని వీరారెడ్డిగారి అల్లుడు మనకు బంధువే. వేములపల్లికి ఇల్లటం వెళ్ళాడు -

అని ఇన్నాళ్ళూ కనుక్కోలేకపోయినాను" అని కానిస్టేబుల్లమీఁద బాగు జేసి "కూర్చో, అన్నయ్యా! అప్పుడప్పుడు వస్తూవుండు. వదినెనుకూడా నేను బాగా ఎఱుగుదును. మా శాంతమ్మవదినె దగ్గరకు చదువుకోడానికి వస్తుంటుంది. సాయంత్రం మీ యింటికి వస్తానులే ఆమెతో" అని సంభాషణ ప్రారంభించెను. రమణారెడ్డి కొంచెము తడవచ్చట కాలక్షేపముచేసి దడి కావల శాంతాదేవి కూర్చుండి యుండుట గమనించి యచ్చటికేఁగి యామెతో నిట్లనెను.

రమణా:- కంగ్రాచ్యులేషన్సు! శాంతాదేవీ! అభివందనాలు. చాలా అభివందనాలు.

రమణారెడ్డి వచ్చినతోడనే శాంతాదేవి లేచి నిలువఁబడి యించుక విసుగుదల సూచించెను.

రమణా:- పంచాయతీబోర్డులో వుమన్ సీటుకు – అంటే – స్త్రీలస్థానానికి రాత్రి మనవాళ్ళంతా నిన్ను సెలెక్టుచేశారు. ఇంకా నీకు తెలియ లేదేమో! కావలసిన క్వాలిఫికేషనులు – అంటే – యోగ్యతలు అన్నీ నీకు ఉన్నాయని నేను చాలా సపోర్టుచేశాను" అని పల్కి శాంతను ఎగాదిగ జూడ మొదలుపెట్టెను.

శాంత:- నన్నుగురించీ, నా యోగ్యతను గురించీ మీకేమీ తెలియ కుండానే అట్లా చేశారంటే నాకు చాలా విచారంగా ఉన్నది.

రమణా:- నిన్నుగురించి నాకు తెలియకపోవడమేమిటి?

శాంత:- నన్నుగురించి మీకేమాత్రము తెలియదు. తెలిస్తే మీ రిట్లా మాట్లాడరు.

రమణారెడ్డి యామె పల్కులకు జవాబుచెప్పుటకుఁ దోఁచక యదేపనిగ చూచుచు "ఆఁ ఆఁ" యని నీళ్లు నములఁజొచ్చెను.

శాంత:- క్షమించండి నాకు పని వున్నది.

అని చుఱుకుగా లోనికేఁబోయెను. రమణారెడ్డి పరాభూతుఁడై ఇంటితోవఁ బట్టెను. ఈ సంభాషణ వినుచున్న తాయారమ్మ రెడ్డితో బయటి వాకిటివఱకుఁబోయి "యిష్టంకాకపోతే ఆవిడ అట్లాగే పెడస రంగా మాట్లాడుతుంది, అన్నయ్యా!" యని యతని నోదార్చెను.

మధ్యాహ్నం శాంత కోదండరామయ్యగారి యింటికిఁ బోయెను. రాజశేఖరరావు శాంతతో నామెను పంచాయతీబోర్డు మెంబరుగా నిలువఁబెట్టు విషయముగూర్చి క్రిందటిరాత్రి జరిగిన నిర్ణయమును వివరముగాఁ జెప్పెను.

శాంత:- నా కర్హతలేని యీ పదవికి నన్నెందుకు నిర్ణయించారు ?

రాజ:- నీ అర్హత నిర్ణయించేది నీవు గాదు – ఇతరులు.

శాంత:- ఆ పదవికి నేను చాలనని భయంగా ఉన్నది. నాతో సంప్రతించి చేస్తే బాగా వుండేదికదా !

రాజ:- "నేను మీ దాసీ ననుకోండి! నేను లోకాని కే విధంగా ఉపయోగిస్తానో ఆ విధంగా నన్నుపయోగించుకోండి" అని నీవేకదా మొన్న నాకు అనుమతి యిచ్చావు.

శాంత:- అవును, నిజమే, కాని ఇంత బాధ్యతగల పని నేను చేయ గలనా ? అని నా అనుమానం.

రాజ:- ఇదేకాదు. ఇంతకంటే బాధ్యతగల పనికికూడా నీకు సామర్థ్యం ఉన్నది. ఆ పనిలోనే నిన్నుపయోగిస్తాము.

శాంత:- ఇదికాక ఇంకేమిటి ?

రాజ:- పంచాయతీబోర్డు ప్రసిడెంటుపదవి.

శాంత:- అమ్మయ్యో ! ఏమిటిది, రాజశేఖరంగారూ ! మీ ప్రతిపాదన నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది. నా మీద మీకుండే అభిమానం మీ దృష్టిని అడ్డగిస్తున్నట్లు నా కనుమానం కలుగుతున్నది. ప్రజా సేవలో ఇటువంటి అభిమానాలూ, పాక్షికభావాలూ, పనికిరావని నేనా మీకు చెప్పవలసింది ?

రాజ:- ఇందులో పాక్షికభావం ఏమీలేదు శాంతా! పార్టీలుంటే గదా పాక్షికభావం ! ఇక అభిమానమూ, ఉన్నమాట వాస్తవమే గాని నిన్ను ప్రసిడెంటుచేయదలచడంలో ఆ యభిమానంకాదు పనిచేసింది. నీ యోగ్యతలే, నీ సామర్థ్యమే. ఈ గ్రామంలో నీ మాత్రము చదువుకొన్నవాళ్ళూ, విజ్ఞానం గలవాళ్ళూ, మరెవ్వరూ లేరు – మగవాళ్ళల్లోకూడా.

శాంత:– ఆశ్చర్యం! నాకంటే ఎవ్వరూ లేరా? మాటవరుసకు లేరన్నా ఆడదాన్ని ఇటువంటి పదవులలో ఉంచడం ఎక్కడైనా ఉన్నదా?

రాజ:– నీమాత్రం యోగ్యతకలవాళ్ళు ఎవ్వరూలేరు. సందేహంలేదు. అందుకు ఆశ్చర్యపడనవసరంలేదు. ఇక నీవు స్త్రీవికదా అని. నీవు స్త్రీవి అయినంతమాత్రాన గ్రామ కల్యాణానికి ఉపయోగించే నీ సామర్థ్యం ఉపయోగించకుండా వమ్ముచెయ్యడం దేనికి?

శాంత:– మరి లోకం ఏమనుకుంటుందో ఆలోచించారా?

రాజ: నిజం గ్రహించలేని లోకం ఏదైనా అంటుంది. లోకం అనే మాటలకు అన్నిటికీ భయపడితే ప్రజాసేవకులు ఏ పనీ చేయలేరు శాంతా?

శాంత:– మీతో వాదనవల్ల లాభంలేదు. అయినా ఇంకొక సందేహం. పంచాయతికి మీ రెందుకు ప్రెసిడెంటుగా ఉండకూడదూ?

రాజ:– నే నింతకంటె బాధ్యతగల సంస్థకు, సహకార సంఘానికి బోధకుడుగా ఉండవలసి వస్తుంది – ప్రెసిడెంటుగాగానీ ఆపదవి లేకుండాగాని, అది కేవలం ఆర్థిక వ్యాపారసంస్థ. అనేక శాఖలూ, అనేక ప్రణాళికలూ అందులో ఉంటాయి. దాన్ని నిర్వహించడం నాకూ సులభమైన పనిగాదు. కాని ప్రస్తుతం నేనే దానికి బాధ్యత వహించాలి. ఈ పంచాయతీ సంస్థకూడా కేవలం నీ భుజాలమీదనే ఉంచడంలేదు. సమర్థుడైన వైస్‌ప్రెసిడెంటు ప్రక్కనే ఉంటాడు. పైపైన నేనూ చూస్తుంటాను. నీవు సందేహించక అంగీకరించు.

శాంత:– తప్పనప్పుడు అంగీకరిస్తాను. కాని భారం మీదే. ఇందువల్ల గ్రామ సౌభాగ్యం చేకూరుతుందనే ఆశ ఒక్కటే నా సాహసానికి కారణం.

రాజ:– అని నాకు చెప్పనవసరంలేదు. తెలియని వాళ్ళకు చెప్పవచ్చు. ఇందువల్ల ఇంకొక ప్రయోజనంకూడా ఉన్నది. పౌర కార్యాలలో స్త్రీలుకూడా అగ్రస్థానం వహించ వచ్చుననీ, వహించగలరనీ మహిళాజనానికి తేటపడి వారికి మరింత ప్రోత్సాహం కలుగుతుంది.

ఈ సంభాషణ ముగించి యానాఁడే రాజశేఖరరావు గుంటూరిలో పంచాయతీ ఆఫీసరును గలిసికొని పదునైదు దినముల గడువుతో పంచాయతీ మెంబరుల యెన్నిక తేదీ నిర్ణయము చేయించి వారివద్ద నుండి తాఖీదు పుట్టించుకొని వచ్చెను. ఎన్నికలఁగూర్చి గ్రామములో టమటమా మున్నగు ప్రచురణ జరిగెను. ఎన్నిక తేదీనాఁడు పంచాయతీ ఆఫీసరుగారు వేములపల్లి వచ్చి నోటీసులో నమోదైన వేణుగోపాలస్వామి కోవెల యావరణలో ఎన్నికసభ జరిపెను. ఎన్నికలకుఁ బోటీ లేదు. అందులకు ఆఫీసరుగా రెంతయు సంతసించి పోటీలేకుండఁ బ్రతిపాదింపఁబడిన యీ క్రింది పండ్రెండుగురు మెంబరులుగా నెన్నుకొనఁబడినట్లు ప్రచురించిరి.

1. శ్రీ బందరు రామస్వామి నాయుడు (తెలగ)
2. ,, నల్లబోయిన వెంకటాద్రి ... (యాదవ)
3. ,, సాగి రామరాజు ......... (క్షత్రియ)
4. ,, రావు రంగారాయణింగారు ... (వెలమ)
5. ,, చివుకుల వెంకటరామశర్మ... (బ్రాహ్మణ)
6. ,, స్వర్ణ వీరభద్రయ్య ... ... (విశ్వబ్రాహ్మణ)
7. ,, మహమ్మద్ ఫరీద్ ఖాన్ ... (మహమ్మదీయ)
8. ,, రాజనేని వెంకటరామయ్య... (కమ్మ)
9. ,, శాంతాదేవి ... ... ... ... (రెడ్లు)
10. ,, జాలాది నాగభూషణం ... (హరిజన)
11. ,, మంగళగిరి రామదాసు ... ( ,, )
12. ,, మొండితోక యాసాకు ... (క్రైస్తవ)

ఈ పేరులు చదివిచెప్పుచు పంచాయతీ ఆఫీసరుగారు గ్రామస్థుల నెంతయు నభినందించిరి. పోటీలేకుండ నెన్నికలు జరుగుటయుఁ బ్రతి కులమునకుఁ బ్రాతినిధ్యమిచ్చుటయు, హరిజనులకుఁ గ్రైస్తవులకుఁ గలిసి మూఁడుస్థానము లిచ్చుటయుఁ జాల చెప్పుకోఁదగిన విషయములని ప్రశంసించిరి. ప్రతి గ్రామమున నిట్లు జరిగినయెడల దేశము త్వరలో ముందుకు రాఁగలదనిరి.

అంతట సభలో నొక వృద్ధుఁడులేచి "అంతా బాగానే ఉన్నది. అసలువాడు రాజశేఖరరావేడీ, మెంబర్లలో ?" అని ప్రశ్నించెను. "ఔను, నేనూ మరచి పోయినాను. అయనెందుకులేడు పంచాయతీలో?" అని ఆఫీసరుగా రడిగిరి. తాను పంచాయతీలో లేకున్నను దానిని సక్రమముగా నడుపుటకు బాధ్యత వహింతుననియుఁ దన కింతకన్న బాధ్యతగల సహకార సంఘము గలదనియు రాజశేఖరుఁడు సభవారికిఁ జెప్పి యొప్పించెను.

ఆ మరునాఁడే అధ్యక్ష, ఉపాధ్యక్షుల ఎన్నికలుఁగూడ జరిపింప వలయునని మెంబరులు పంచాయతీ ఆఫీసరుగారిని గోరిరి. వా రంగీక రించి రాత్రి కచ్చటనే యుండిరి.

రాజశేఖరుఁ డా రాత్రి పంచాయతీ మెంబరులను దనయింట సమావేశపఱచి ప్రస్తుత పరిస్థితులలో శాంతాదేవిని ప్రెసిడెంటుగా నెన్నుకొనుట యుత్తమ పద్ధతియని వారిచే నొప్పించెను. సాగి రామరాజును వైస్‌ప్రెసిడెంటుగా నెన్నుకొనుటకుఁగూడ వా రంగీక రించిరి. మరుసటి యుదయము పదిగంటలకు పంచాయతీబోర్డు మీటింగు సమావేశమయ్యెను. ఆఫీసరుగారు మెంబరు లందఱిచేత దేశభక్తి ప్రమాణము చేయించినతరువాత మెంబరులు ఏకగ్రీవముగా శాంతాదేవిని ప్రెసిడెంటుగాను సాగి రామరాజును వైస్‌ప్రెసిడెంటు గాను ఎన్నుకొనిరి.

ప్రెసిడెంటు ఎన్నిక గ్రామములోఁ గొంత యలజడి కలిగించెను. కాని రాజశేఖరుని యాధ్వర్యవమున జరుగుచున్న యే పనికి నెవ్వ రెదురాడలేదు. అతని యం దట్టి విశ్వాసము కుదిరెను. కావున యలజడి తొందరలోనే సమసిపోయెను.

నాటి సాయంకాలము రాజశేఖరరావు మెంబరులకుఁ దన యింట నల్పాహారపువిందు జేసెను. పుల్లయ్యపంతులు, రమణారెడ్డి కూడ నా విందున కాహ్వానింపఁబడిరి. పంచాయతీ ఆఫీసరుగారు మెంబరుల కర్తవ్యమును జక్కఁగా వివరించి చెప్పి శాంతాదేవికి నామె మొట్టమొదటఁ జేయవలసిన కార్యములనుగూర్చి కొన్ని సల

హాలు వ్రాసియిచ్చెను. శ్రీ కంచుకూరి విశ్వనాధముగారను పంచాయతీ ఆఫీసరుగారు వ్రాసిన "పంచాయతీ పరిపాలనము" అను గ్రంథమును వెంటనే తెప్పించుకొనుటకు విలాసము వ్రాసియిచ్చి తొందరపని యుండుటచే వారు వెంటనే గుంటూరునకుఁ బయనమైపోయిరి.

రమణారెడ్డి, "కంగ్రాచ్యులేషన్సు, శాంతాదేవీ" యని కరస్పర్శ చేయఁబోయెను. ఆమె నిరాకరించి "నమస్తే" యని మర్యాదననుసరించి కృతజ్ఞత దెలిపెను. ఆ తెలుపుటలోఁ గొంత చులుకుఁదనముండెను. అది రెడ్డిని బాధింపకపోలేదు.

అందఱును వెడలిపోయినతరువాత పుల్లయ్యపంతులు "రాజశేఖరం, శుభమంటూ పంచాయతీపెట్టి తొలిగా వెధవనుండను ప్రెసిడెంటు చేశావేమిటోయ్ ?" అని యాక్షేపించెను. రాజశేఖరుఁడు "తాతా ! ఆమె వైధవ్యమనేది మన భావాలలో ఉన్నది. ఇంకెక్కడా లేదు. అయినా, ఇదంతా ఒక క్రొత్తప్రపంచం. మీకు సులభంగా అర్థంగాదు. చూస్తూ ఊరుకొనడమే మంచిపద్ధతి అనుకొంటాను" అని చిఱునవ్వుతోఁ బ్రత్యుత్తర మిచ్చెను, "అంతకంటే మేం చెయ్యగలిగేదికూడా ఏమీ కనబడడంలేదు ! ఇదంతా ఒక మహాప్రవాహంగా ఉన్నది" అని తలయూపుచు నింటికిఁ బోయెను.

---

# IX

## పొగలు - తీగెలు

"జ్ఞాతి శ్చే దనలేన కి" మ్మను నానుడి యూరక పుట్టలేదు. దాయాది మాత్సర్యములో నిప్పే కాదు; పాము విషమువంటి విషము కూడ గలదు. పాము విషమునకు మందుగలదు; దీనికి లేదు. వెంకటరెడ్డిగారికిఁ బినతండ్రి కుమారుల రూపమున నిట్టి విషబాధ యేర్పడి యుండెను.

పాపిరెడ్డి, హనుమారెడ్డి ఇద్దరును వెంకటరెడ్డిగారి పినతండ్రి కుమారులు. వీరి తండ్రు లిరువురును విభాగములై ముప్పది వత్సరము లైనను భాగములలో నేదో యన్యాయము జరిగినదను నెపముమీఁద పాపిరెడ్డి సోదరులు వెంకటరెడ్డిగారిపైఁ దీరని ద్వేషము గలిగియుండిరి. అందుకుఁ దగినట్లు వెంకటరెడ్డిగారు తన తండ్రి యిచ్చిన యేఁబది యెకరములను ఎనుబది వఱకుఁ బెంచుకొనుటయు, పాపిరెడ్డి సోదరులు తమకుఁ దమ తండ్రి యిచ్చిన యేఁబది యెకరములను ముప్పదివఱకు దించుకొనుటయే కాక చెఱియొక పదునైదెకరములుగాఁ బంచుకొనుటయు సంభవించెను. లేనిపోని వ్యాజ్యములు పెట్టుకొని కోర్టులకు వకీళ్ళకు వారు ధనము తగులవేసిరి. అప్పులపాలయిరి. వెంకటరెడ్డిగారికిని దమకును సంపదయందుఁ దారతమ్యము పెద్దదైనకొలఁదియు వారిపైన వీరికి ద్వేషము హెచ్చు కాఁదొడఁగెను. అజ్ఞానజన్యమగు మాత్సర్యము! ఈ రోగమునకుఁ జికిత్సలేదు. గ్రామములోఁ గక్షలన్నియుఁ గలిసిపోయినను వెంకటరెడ్డిగారిపైఁ గారణములేని వీరి పగ మాత్రము శమింపదయ్యెను. కాని రెడ్డిగారిని దామేమియుఁ జేయఁ జాలక యూరక యసూయాగ్ని కింధనములై వ్యయమగుచుండిరి.

శాంతాదేవికి బాల్యవైధవ్యము సంభవించినప్పుడు పాపిరెడ్డి సోదరులు తమకు బంగారు కొండలు లభించినట్లు సంతోషపడిరి. కాని యా సంతోష మెన్నాళ్ళుండును ? రెడ్డిగారికి మఱియొక విపత్తువాటిల్ల లేదే యని వారు ఖిన్నపడుచుండిరి. ఇట్టి సందర్భములలో శాంతాదేవి

ప్రజాసేవ చేయుటయుఁ బూర్వ మర్యాద లతిక్రమించి యూరిలోఁ దిరుగుటయుఁ, బంచాయతీ మెంబరుగాను, ప్రెసిడెంటుగాను ఎన్నుకొనఁ బడుటయు వారికొక యాయుధమయ్యెను. "తాడుదెగిన వెధవముండ కొంపలో పడివుండక మగరాయుడుమాదిరి రచ్చకెక్కింది. కూతురు బజారులో తైతక్కలాడుతుంటే సిగ్గులేకుండా తాళంవేస్తున్నా"డని వెంకటరెడ్డిగారి నాక్షేపింపఁదొడఁగిరి. రమణారెడ్డి మామగారు వీరారెడ్డిగారికి పాపిరెడ్డిసోదరులు పోషకించినవారు. రమణారెడ్డి వేములపల్లికిఁ జేరినతరువాతఁ గ్రమముగా నతనికి వీరికి నెయ్యము కుదిరెను. వెంకటరెడ్డిగారిపై వీరుచేయు దుష్ప్రచారము రమణారెడ్డి కేలకో యింపు గొల్పెను. మానవత్వము విచిత్రమైనది. కొందఱికి సచ్చింత ప్రియము. కొందఱికి దుశ్చింత ప్రియము. దీనికిఁ గారణము దురూహము. సంస్కారఫలమని తాత్త్వికులు వాదింతురు. అంతకన్నఁ జెప్పఁదగిన కారణము కనిపించువఱకు నా వాదమే యొప్పుకొనవలయును. రమణారెడ్డికి దుశ్చింత జన్మతోఁ గలిగినది. ఒకరు మంచివారన్నచో నతనికి గిట్టదు. ఒకరు చెడ్డవారన్నచోఁ జెవియొగ్గికొని వినును. పాపిరెడ్డి సోదరులు వెంకటరెడ్డిగారి నాడిపోయుట మఱి రమణారెడ్డికిఁ బ్రియమగుటలో నాశ్చర్యమేమున్నది?

పంచాయతీబోర్డు ఎన్నికైన మరునాఁడు రమణారెడ్డి పాపిరెడ్డిగారి యింటికిఁ బోయెను. పోవుచునే యిట్లనెను.

రమణా:- కంగ్రాచ్యులేషన్సు; పాపిరెడ్డి! అంటే అభినందనాలు.

పాపి:- అభినందనాలన్నా నాకు అర్థంగాలేదు. కూర్చో! ఏమిటివిశేషం?

రమణా:- ఏదైనా సంతోషకరమైనపని మీకు జరిగినప్పుడు అభినందించడం జరుగుతుంది. అందుకు ఇంగ్లీషులో "కంగ్రాచ్యులేషన్సు" అంటారు. తెలుగులో అభినందనాలంటారు?

పాపిరెడ్డి యాశ్చర్యముతో "మాకేంజరిగింది - సంతోషించడానికి?" యని యడిగెను.

రమణా:- మై గుడ్ గాడ్! అన్నకూతురు శాంతాదేవి పంచాయతీబోర్డు

ప్రెసిడెంటు కావడమేమిటి? సంతోషించడానికి మాకేం జరిగింది అనడమేమిటి?

పాపి:- ఓశ్! ఈ భండాలమటయ్యా! చాలా సంతోషించాం! మళ్ళా ఆ వూసు నాతో యెత్తవద్దు. వాడు నా అన్నాగాడు. ఆ ముండమోపి నా అన్నకూతురూ గాదు.

రమణా:- నాన్‌సెన్స్! తీసేసుకుంటే పోతుందా?

పాపి:- ముప్పయి యేళ్ళనాడే తీసేసుకున్నాం-ఇప్పుడేమిటి? ఈ బజారు ముండ ఫలానివాళ్ళమ్మాయంటే సిగ్గుచేటు?

రమణా:- ఎంతగౌరవం. ఎంతహోదా! మీ వంశంలో ఎన్నడైనా వున్నదటయ్యా! ఇంతగౌరవం? సిగ్గంటావేమిటి? పంచాయతీ ప్రెసిడెంటుగిరి!

పాపి:- సంతోషించాం, ఊరుకోవయ్యా! ఆ బరాచోరుగాడు రాజశేఖరం ఒకడు దొరికాడు, ఊరు నాశనంచెయ్యడానికి! నీబోటివాళ్ళు పోగయినారు వాడిచుట్టూ కొంతమంది. వాడు పెట్టాడు ఈ తద్దినం - పంచాయతీబోర్డు - అని. ఊరు బాగుచేస్తాడట సన్యాసి! ఏడ్చేవాడు తానే యేడవక ఆడకుంకను బయటికిలాగడం దేనికి?

రమణా:- అందులోనే ఉన్నది తమాషా అంతా!......

పాపిరెడ్డి:- ఏం దగలబడ్డదో, పోనియ్యి. మా కెందుకు?

రమణా:- మీకు గాకపోతే ఇంకెవళ్ళకు మాకా?

రమణారెడ్డి ఈ మాటలనుసరికి, పాపిరెడ్డి కొంచెమాలోచనలోఁబడి "అందుకని యేం చెయ్యమంటావు?" అని కొంచెము విసుగుతో వనెను.

రమణా:- కులమూ మర్యాదా నాశన మవుతుంటే ఏం చెయ్యాలో అదే చెయ్యాలి. పౌరుషముంటే ఏదైనా చెయ్యవచ్చు!

అని జవాబు రాకముందే సిగరెట్టు ముట్టించుకొని తనదారిని దాఁబోయెను. తరువాత వీధిలోఁ గొంత తడవు పెత్తనముచేసి యేదో పనియున్నట్లు రాజశేఖరుని యింటికిఁ బోయెను.

అచ్చట రామరాజు, శాంతాదేవి, అంకినీడు, ధర్మారావు మొదలగువారు పంచాయతీ విషయ మాలోచించుచుండిరి. పంచాయతికిఁ గావలసిన పుస్తకములు జాబితా వ్రాసి తన సొంతడబ్బు కొంత యిచ్చి తమ్ముని గుంటూరు పంపుచు పంచాయతీ ఆఫీసరు గారిని దర్శించి వారి సలహా ప్రకారము పుస్తకములు వగైరాలు తీసికొని రావలసినదని రాజశేఖరుఁడు చెప్పుచుండెను.

రాజ:_ పంచాయతీ ఆఫీసు పెట్టడానికి అత్యవసరంగా ఇల్లొకటి కావాలి. ఖాళీ ఇల్లు ఎవరిది దొరుకుతుందా! అని ఆలోచిస్తున్నాను.

ధర్మారావు:- నే నొక ఉపాయం చెప్తాను. చెరువుకట్టదగ్గర ముసలమ్మ నెరుగరూ? - తాతినేని వెంకాయమ్మను? ఆమె యిల్లు పెద్ద లంకంత! దీపంపెట్టే దిక్కే లేదు. ఆమె ఎక్కడో పడివుంటుంది ఒకమూల! ఈ పల్లెటూళ్ళో అద్దెకుగాదుగదా ఊరికినే ఉండ మన్నా ఎవ్వరూ ఉండరు. ఆ యింట్లో మనం ఉచితంగా ఆఫీసు పెట్టుకోవచ్చుననుకొంటాను.

రామరాజు:- నిజమేనయ్యా! ఇంతవరకూ మనకీ ఆలోచన తట్టనే లేదు. ఆమెకూ 'నా' అన్నవాళ్ళెవళ్ళూ లేరు. ఇల్లు తప్పక యిస్తుంది.

రాజు:- ఔను, తప్పక యిస్తుంది. ఇప్పటికేకాదు; ఎప్పటికీగూడా! ఆమెను మనం అడగడంలో ఉంటుంది అంతా.

శాంతా:- అయితే కానివ్వండి. 'శుభస్య శీఘ్రమ్' వెళ్ళిరాండి ఒకసారి- ఇప్పుడే!

శాంతాదేవితప్ప తక్కినవారందఱు వెంటనే బయలుదేరి వెంకాయమ్మ యింటికిఁ బోయిరి. ఇంతమంది తనయింటికి ఒక్కసారి వచ్చుట కామె యాశ్చర్యపడి "దేనికి బాబుల్లారా! ఈ దిక్కులేని ముండను చూడవచ్చారు?" అని ప్రశ్నించి రెండు చాపలు పఱచి "కూర్చోండి" యని మర్యాద చేసెను.

రాజ:- దిక్కులేకపోవడమేమిటి నాయనమ్మా! మే మందరం దిక్కు గాదూ?

వెంకా:- అంతేలేనాయనా! అయినా, కాలుపడ్డా, చెయిపడ్డా, "నా" అన్నవాళ్ళెవళ్ళూ వచ్చి చూచేవాళ్ళు లేరుగదా! నా పనీ అయిపోయింది. లంకంతయిల్లు, దీపంపెట్టే దిక్కు లేకుండా పోతుంది. నేను పోయేలోగా యిల్లమ్మి దేవుడికి, వేణుగోపాలస్వామికి వొంటినిండా బంగారం దిగేసి పోదామనుకొంటున్నాను. ఇల్లుకొనేవారెవరైనా చూడండి బాబూ!

రాజ:- నీకు బిడ్డలు లేరనిగదా, నాయనమ్మా! నీ విచారం. ఊళ్ళో వాళ్ళంతా నీ బిడ్డలయ్యే ఉపాయం చెపుతాను విను. ఇల్లూ, ఆ మూడెకరాల పొలమూ వాళ్ళకు రాసియిస్తావా?

వెంకా:- వూళ్ళోవాళ్ళంతా నా బిడ్డలెందుకవుతారురా! నీ తాత చమత్కారం పోనియ్యావు నీవు! ఎవళ్ళ తల్లులు వాళ్ళకేఉన్నారు. దేవుడే నా బిడ్డడనుకొంటాను.

రాజ:- కాదు, నాయనమ్మా! వీధులలో వాళ్ళంతా కలిసి వీధులలో గుంటామెరకా చదునుచేసి, రోడ్లువేసి రోగాలు రాకుండాచేసి, జనమందరికీ చదువూ, జ్ఞానం కలుగజేయడానికి పంచాయతీబోర్డు అనే ఒక సమాజంగా ఏర్పడ్డారు..

వెంకా:- ఆఁ. విన్నానురా; ఏమిటో మీటింగులు గీటింగులు జరిగినయ్యని! దానికంతా నీవే నడుంకట్టుకున్నావనికూడా చెప్పుకుంటున్నారు. వెంకటరెడ్డిగారమ్మాయిని, తలచెడ్డ ఆడపిల్లను దానికి పెద్దనుచేశారనికూడా విడ్డూరంగా చెప్పుకుంటున్నారు.

రాజ:- నిజమే. ఆ పంచాయతీ పనంతా సాధించడానికి పన్నెండుమంది పెద్దలను ఏర్పాటుచేశారు. ఆ పెద్దలు కూర్చొని సభలు చెయ్యడానికి, వ్యవహారమంతా నడపడానికి ఒక ఇల్లు కావలసివచ్చింది. నీ యిల్లిచ్చావా, చాలా వసతిగా ఉంటుంది. నీకు కావలసినంత నీవు వాడుకో. తక్కినదిమాత్రమే పంచాయతీ వాడుకుంటుంది. ఇక చూడు, నాయనమ్మా! నీ యింటికి వచ్చేపోయే జనానికి అదీ అంతూ ఉండదు. ఊళ్ళోవాళ్ళంతా ఇందువల్ల బాగుపడతారు. కాబట్టి వాళ్ళంతా నీ బిడ్డలే అవుతారు. ఏమంటావు?

వెంకా:- దేవుడికిస్తే ముక్తి కలుగుతుందికాని వీళ్ళకిస్తే ఏంవొస్తుందిరా?
రాజ:- నాయనమ్మా, దేవుడంటే ఎవరు ? మనుష్యులే. దేవుడు ప్రతి మనిషిలోనూ, ప్రతి జీవిలోనూ దాగివుంటాడు. నీవు పురాణాలు వింటుంటావు, ఎప్పుడూ వినలా యీ మాట ?
వెంకా:- వినకేమిలే !
రాజ:- మరింకా నేను చెప్పటందేనికి ? దేవుడికి పూజచెయ్యడం దేనికి ? మనుష్యులంతా బాగావుండాలనే. మనుష్యులకు సేవ చేసినా, సహాయం చేసినా దేవుడికి పూజచేసినట్లే. అందువల్లా ముక్తి వస్తుంది. నాయనమ్మా! ఇటుచూడు, నీవు ఇల్లమ్మి దేవుడికి నగలు చేయించి పెట్టిపోతావనుకో. గుళ్లో ఒకమూల పడివుంటాయవి - దొంగలు కాజెయ్యకుండా ఉన్నంతకాలం ! ఎవరికీ పనికిరావు. అట్లాకాక ఇట్లా పంచాయతీకిస్తే వూళ్ళో వాళ్ళందరికీ పనికివస్తుంది. కలకాలం నిన్ననుకొంటారు; ప్రజలు - ఫలాని వెంకాయమ్మ పుణ్యమా అంటూ పంచాయతికి ఇల్లు దొరికిందనీ, జనమంతా సుఖపడ్డారనీ. దేవుడికి నగలుచేసిపెడితే ఆ ఊరేగింపునా డొక్కనాడేగా నీ పేరెవరైనా తలుచుకునేది ? ఇల్లు పంచాయతి కిస్తే, నీ బొందిలో ఊపిరిఉన్నంతవరకూ మే మందరం నీకు సేవ చేస్తుంటాము. ఆ సమయంవచ్చినపుడు పూలల్లో పెట్టుకుపోయి ఆ కాస్తా ముగిస్తాం. దేవుడికి పెళ్ళిచేసినట్లు చేస్తాం. ఏటేటా ఉత్సవం చేస్తాం నీ స్మారకదినంనాడు. ఆలోచించుకో !

రాజశేఖరరావు ఈ మాటలనీ యనకముందే, రామరాజు వద్దెరా లందుకొని వెంకాయమ్మగారితో నిట్లనిరి. "సందేహించవద్దు; అవ్వా! రాజశేఖరం చెప్పిన ఉపాయమే నీకు మంచిది. మే మందరం నీ కళ్ళెదుట వుంటాము. నీకు సంతానంలేదనీ, దిక్కు లేదనీ బాధపడ నవసరంలేదు.

వెంకా:- మీరు చెప్పేదీ ఒకవిధంగా బాగానేఉందట్టా. సరే ! అట్లాగే కానివ్వండి. నేనుమాత్రం కట్టుకుపోతానా ? చేరండి, పంచాయతీ వాళ్ళు, ఇవ్వాళేచేరండి. నేనా వసారా గదిలో పడివుంటాను.

"జై శ్రీమతి వెంకాయమ్మగారికి జై" యని రమణారెడ్డి మ్రోగిపోయెను. ఈ నినాద మందటికి నచ్చకపోయినను కరతాళ ధ్వనులుమాత్రము చేసిరి.

వెంకాయమ్మగారి యిల్లు పాతదైనను విశాలమైన మండువా లోగిలి. చుట్టును ప్రహరీగోడ. ఇంటిచుట్టును విశాలమైన స్థలము. అచ్చటచ్చట మరామత్తులు చేసికొని నేల గచ్చుచేయించినయెడల నొక పంచాయతీ ఆఫీసునకేకాదు, ముందు నెలకొల్పఁదలఁచిన సహకార సంఘమునకుఁగూడ సరిపోవు విశాలభవనమది! మఱుసటివారము తిరుగకముందే వెంకాయమ్మచేత నా యిల్లును మూఁడెకరముల పొల మును ఆమె యనంతరము పంచాయతికి జెందునట్లును, తత్క్షణము పంచాయతీ ఆఫీసు నా యింటియందే పెట్టుకొనునట్లును దస్తావేజు వ్రాయించి రిజిస్టరు చేయించిరి. పంచాయతీ ఆఫీసు వెంటనే యందు నెలకొల్పిరి. "దేవుడి కిస్తానన్న యాస్తి దెయ్యాల కిచ్చావు వెంకా యమ్మా! పెద్దతనాన బుద్ధి పెడతల పట్టిందా ?" యని పుల్లయ్య ఎంతులు చేసిన యాక్షేపణ కామె చలింపలేదు. అంతకుముందు నిర్మానుష్యమై బావురుమనుచుండిన యా పాతకొంప నాఁటినుండియు జనసంకులమై కళకళలాడుచుండెను.

పాపిరెడ్డి సోదరులును, రమణారెడ్డియు వెంకాయమ్మకు వారసు లెవరైన నుండిరేమోయని యుసిగొల్ప రహస్యముగాఁ బ్రయత్నించిరి గాని, వారికట్టివా రెవ్వరును గనిపింపరైరి! రమణారెడ్డి రాజశేఖరు నితో "మీరు చాల లబ్జుగామాట్లాడుతారు. ఆ నాడు వెంకాయమ్మను క్షణంలో బుట్టలో వేసుకొని పంచాయతీ కింత ఆస్తి సంపాదించారు" అని యభినందించెను. "నే నామెను బుట్టలో వేసుకోలేదు. ఆమె కర్థ మయ్యే భాషలో మంచిమాటలే చెప్పాను. హితోపదేశం చేశాను. చదువురానిదైనా బుద్ధిగలది కాబట్టి ఆమె నన్నర్థం చేసికొన్నది." అని చిఱునవ్వుతో రాజశేఖరరావు జవాబు చెప్పెను.

అప్పటినుండియు పంచాయతీబోర్డు తీవ్రముగాఁ బనిసేయఁ దొడఁగెను. పై యధికారులతో నింగ్లీషులో జరుపవలసిన యుత్తర

ప్రత్యుత్తరములన్నియు రాజశేఖరుఁడే జరుపుచుండెను. శాంతాదేవి లోకల్ బోర్డు చట్టమును, "పంచాయతీ పరిపాలనము" అను పుస్తకము దెప్పించి పరిపాలనావిధానమును జక్కఁగా నేర్చికొనెను. అందెవేసిన చేతులకంటె నిపుణముగా మీటింగులు జరుపనేర్చెను. మధ్యాహ్నము మహిళాపాఠశాల. ఉదయము, సాయంకాలము పంచాయతీ పని వీనితో నామెకుఁ దీఱికయే లేకుండఁబోయెను. అంకినీఁడు, రామరాజు లుచితముగా పంచాయతీబోర్డు తాలూకు వ్రాతపనులు చేయుటచేత గుమాస్తాల యవసరము లేకుండఁ బని జరుగుచుండెను.

ఇట్లొక యాఱుమాసములు గడచెను. పంచాయతికిఁగావలసిన హంగులన్నియుఁ గుదురుకొనెను. మొదటి పర్యాయము కలెక్టరు వారు భూమిశిస్తులలోని భాగమును, రిజిస్ట్రేషన్ రుసుములపై సర్‌చార్జి మొత్తమును పంచాయతికిఁ జెందఁజేసిరి. ఇంటిపన్నులు సులభముగా వసూలయ్యెను. చేపలపాటలు, గడ్డిపాటలు, చెట్లనుంచివచ్చు నాదాయములు, తక్కిన చిల్లర యాదాయములన్నియు సులభముగా వసూలయ్యెను. అప్పటికి వసూలైన రు 3000/-ల మొత్తమును గుంటూరు జిల్లా కో-ఆపరేటివ్ సెంట్రలు బ్యాంకిలో నిలువఁజేసి యుంచిరి.

యువకుల మెడపైఁ గాడివైచినఁగాని గ్రామసముద్ధరణ కార్యక్రమము కొనసాఁగదని మొదటినుండియు రాజశేఖరుఁ డభిప్రాయపడి యుండెను. తాను గ్రామమునకుఁ దిరిగివచ్చిన తరువాత నతఁడు ముఖ్యముగా యువకుల నందఱిని జేరఁదీసి తన భావములను వారి బుఱ్ఱల కెక్కించుచుండెను. చదువుకొన్నవారు, చదువుకొననివారు అను భేదములేక యువకులందఱిని వారమున కొకసారియైన సమావేశపఱచుచు వారికి గ్రామభక్తి దేశభక్తి కలుగునట్లుపన్యసించుచుండెను. క్రమక్రమముగా వారిని "స్వచ్ఛంద యువక సేవాదళ"మను సమాజముగా నేర్పఱచి, వారు మానవసేవయన్న జీవితపరమావధిగాఁ బరిగణించునట్లుద్బోధించెను. "అహంభావ మనునది మనకు పెద్దయపకారి. దానిని దరిజేరనీయరాదు. మనం జేస్తున్నసేవ చేయవలసిన సేవలో షష్ఠాంశంకూడా కాదు. సేవాభావం ఉదయించనంతవరకూ మాన

వృకు నాగరకజీవి కాలేదన్నట్లే. సేవవల్లనే మానవుడు తరించగల్గుతాడు. మీకు నేను నొక్కి నొక్కి చెప్పేది ఒకటున్నది అదే వినయశీలం. మీ రెంత ప్రజ్ఞావంతులైనా, ఒకవేళ యెంత సేవ చేసినవారైనా, వినయం లేకపోతే ఎందుకు కాకుండాపోతారు. ఉదాత్త సంస్కారాలు గల వ్యక్తి తన నెవ్వరైనా శ్లాఘిస్తే బాధపడతాడుగాని, పొంగిపోడు. పొంగిపొయ్యే వ్యక్తి వ్యర్థుడే. ఇక ఆత్మస్తుతికంటే నీచమైన గుణం ఇంకొకటి ఉండదు. మన సమాజంలో చేరిన యువకు లెవ్వరూ ఈ దోషాలకు తావివ్వక మహాత్ముని దివ్యనియమావళిని మనస్సులో పెట్టుకొని మానవసేవ చెయ్యాలి. సేవాగౌరవాన్ని గుర్తించాలి. దీన్నే ఇంగ్లీషులో "డిగ్నిటీ ఆఫ్ లేబర్" అంటారు. మన గ్రామం బాగుచెయ్యడంలో మీ రందరూ ఈ "డిగ్నిటీ ఆఫ్ లేబర్" బాగా గుర్తించి ప్రజలకు తోడ్పడాలి." ఈ విధముగ రాజశేఖరుండు యువకు లకు నీతులు నూరిపోయుచు వారి నొక సైనికదళముగాఁ దయారు చేసెను. పౌరవసతులు కల్పించుటలో వా రెంతయు నుపయోగించిరి.

శాంతారాజశేఖరుల యాధ్వర్యవమున పంచాయతీబోర్డు క్రమ క్రమముగాఁ బౌరసౌకర్యములఁ బ్రోదిసేయఁగడఁగెను. తొలుదొలుత వీధుల నెత్తుఁబల్లముల సరిచేసి గుంటలు పూడ్చిరి. నీరుపోవుటకు వీధులలోఁ బ్రక్కకాలువలు త్రవ్విరి. వీధులలోనికిఁ జొచ్చుకొని వచ్చిన యిండ్లను, బ్రహరీగోడలను ఆ యా గృహస్థుల యొప్పుకోలు మీఁదనే సర్దుబాటుచేసి వీధులన్నియు విశాలముగను, దిన్నగను నుండునట్లు తీర్చిరి. ఇందువలనఁ గొందఱి స్థలములు పంచాయతికి స్వాధీనపఱచవలసివచ్చెను. కాని తత్ఫలితముగా గ్రామమునకుఁ గలిగిన సౌకర్యమును సౌందర్యమును జూచి స్థలములు పోగొట్టుకొన్నవారు తమ స్వల్పనష్టమును లక్ష్యపెట్టరైరి.

వీధులమరామత్తు వగైరా కార్యములకు పంచాయతిడబ్బు దుబ్బిడీయైన వ్యయము గాఁగూడదని రాజశేఖరుఁడు పట్టుపట్టెను. త్రవ్వుట, మెత్తిపోయుట మున్నగు కార్యములను దానుగూడఁ జేయుచు స్వచ్ఛంద యువక సేవాదళమువారిచేఁ జేయించెను. రాజ

శేఖరుఁ డీ పని చేయుచుండఁగా రమణారెడ్డి చూచి తనలో "బ్రూట్! ఏఁసైనా చేస్తాడు, ఈ బ్రూటునుచూచి తక్కిన బ్రూట్సు గూడా చేస్తారు" అని గొణుగుకొనుచుఁ బైకి "హల్లో కెప్టెన్! మీ సేవ అద్భుతం. మీరు దేవతాపురుషులు సుమా" యని శ్లాఘించెను. రాజ శేఖరుఁడు నడుముగట్టుకొని పనిచేయుటచూచి యువకులేకాక పెద్ద వారుగూడ నా పనికి సాయమొనర్చిరి. "ఈ పని యెవరిది? మనదే! గ్రామమంతా ఒక పెద్ద సంసారం. మనమందరమూ అందులో భాగ స్వాములము. అనుభోక్తలము. కాబట్టి గ్రామం బాగుపడాలని చేసే యీ పనంతా మనం సుఖపడడానికే. ఇందువల్ల నామోషీ లేకపోగా గౌరవం కల్గుతుంది. సేవాగౌరవం అంటె ఇదే" యని యువకుల నుత్సాహపఱచెను.

తరువాత వీథులలోఁ గంకరరోడ్లు వేసిరి. కంట్రాక్టులు ఇతరుల కీయక పంచాయతీబోర్డే యాపనికిఁ బూనుకొనెను. క్వారీనుండి కంకర, గ్రావెలు తెచ్చుటకుఁ బెద్దబాడుగనొసఁగు మోటారు లారీలను బెట్టు కొనక ఎడ్లబండ్లతోడనే తోలించిరి. గ్రామములోని బండ్లన్నియు నుచితముగాఁ దోలుట కొప్పుకొనెను. వారమురోజులలోఁ గంకర, గ్రావెలు వచ్చిదిగెను. వానిని పఱచుటలోఁగూడ స్వీయ సేవాదళము సహాయముచేసెను. గాని కొంతమంది తరిఫీదైన కూలీలను బెట్టుకొనక తప్పినదిగాదు. గుంటూరునుండి రోడ్డులేకపోవుటచే రోడ్డు బండ తెచ్చుట మాత్రము కొంత కష్టమైనను గ్రామస్థులందఱుఁ ద్రోడై యెడ్లతో లాగించియు, నచ్చటచ్చట జాళ్ళతో దారిచేసియు, నెట్లో గ్రామము నకుఁ జేర్చి వీథులలో రోడ్లువేసిరి. సూపరువైజరుగారు చేసిన యెస్టి మేటులో నాల్గవ భాగము మించకుండ రోడ్లు తయారయ్యెను. ఇంజ నీయరుగారును పంచాయతీ ఆఫీసరుగారును, ఇంత స్వల్పములో రోడ్లు తయారైనందులకు ఆశ్చర్యపడిరి. ప్రతి గ్రామమునందును బ్రజ లిట్లు పౌరసౌకర్యజ్ఞానముగల్గి స్వీయ సహాయముతో గ్రామము బాగుచేసి కొనఁగల్గినయెడలఁ బల్లెలన్నియు స్వర్గతుల్యము లగునని యింజనీయరు గారు సెలవిచ్చిరి. ఇట్టి పట్టుదలయు, సహకార భావమును జూపిన

యెడల గుంటూరు రోడ్డునకుఁ గలియునట్లు గ్రామమునుండి “ఫీడరు రోడ్డు”కూడ చాల చౌకగా వేసికొనవచ్చుననియు గ్రామస్థులను బ్రోత్సహించిరి.

వీధులలో రోడ్లు పూర్తియైన తరువాత నూరినిండ లాంతరులు వేసిరి. దీనికర్చుగూడ వీలయినంత స్వల్పముగా నగునట్లేర్పాటుచేసిరి. లాంతరులు అద్దములు కొనుగోలుచేయుటకు రాజశేఖరరావు, రామరాజు, ధర్మారావుమున్నగువారు స్వయముగా బేరముచేసి, స్తంభములకు గోతులు త్రవ్వుటకు స్వయంసేవక దళమువారి నుపయోగించి మొత్తముమీఁద ఎస్టిమేటు మూఁడు వంతులలో రెండువంతులకే వీధి లాంతరులు తయారుచేసిరి. ఇంకను గావలసిన పెద్దపని గుంటూరు రస్తాకు ఫీడరురోడ్డువేయుట. అందుకుఁ బెద్ద యధికారులతో సంప్రదించి పొరుగు గ్రామముల సహకారము సేకరింపవలయును. కావునఁ గొంత వ్యవధి యవసరము.

ఇప్పుడు గ్రామము కళకళలాడుచుండెను. రోడ్లువేయుటచేతను, వీధి లాంతరులు వేయుటచేతను, రాత్రులందు గ్రామములో హాయిగఁ దిరుగవచ్చును. వీధులు తిన్ననైన రోడ్లుగలిగి శుభ్రముగాఁ గనిపించిన కొలఁదియు గృహస్థులు తమ యిండ్లనుగూడ వీలయినంత శుభ్రముగా నుంచుటకుఁ బ్రయత్నింపఁదొడఁగిరి. వీధివైపు గోడలకు మరామత్తు చేసికొనిరి. ఇండ్ల సమీపములోఁ జెత్తచెదారము వేయుటకు సందేహించుచుండిరి. కొంతకాలమునకుఁ బంచాయతీబోర్డు గ్రామ బహిః ప్రదేశములో “కక్కసు” దొడ్లు గట్టించి వానిని బాగుచేయుటకును, వీధులూడ్చుటకును పాకీవారిని నియమించెను. అప్పటినుండి గ్రామము మఱింత శుభ్రముగా నుండెను.

పంచాయతీబోర్డు నెలకొల్పిన మొదటి సంవత్సరములోనే యీ సౌకర్యములు గల్గినందుకుఁ బెద్దలందఱు మిగుల సంతోషించిరి. రాజశేఖరు నెడల మిగులఁ బ్రేమాభిమానములును విశ్వాసమును జూపఁ దొడఁగిరి. శాంతాదేవి పంచాయతీబోర్డులోఁ బ్రముఖస్థానము వహించుటేకాక, స్త్రీ విద్యావ్యాప్తిలోఁ బ్రశంసాపాత్రమగు సేవచేయు

చుండుటచే నాకాయందును వారల కపరిమిత గౌరవాభిమానములు గలిగెను.

వయోజనమునందు విద్యావ్యాప్తి జరుగని యెడలఁ గాలపరిణామము గుర్తించి సంస్కార ప్రియులు గాలేరని రాత్రులందు రాజశేఖరుఁడును చివుకుల వెంకటరామశర్మయు రామరాజును వయోజన పాఠశాల నడుప మొదలుపెట్టిరి. పంచాయతీబోర్డు కార్యాలయము నందే యీ పాఠశాలయు జరుగుటచే వెంకాయమ్మకు రాత్రులందుఁ గూడ సందడికిఁ గఱవులేకపోయెను. ఏఁబది యేండ్లకు మించినవారు కూడ మొదట సందేహించినను తరువాత మెల్లమెల్లఁగాఁ జదువుకొనుటకుఁ బ్రారంభించిరి. అందులకు రాజశేఖరుని ప్రచారము ముఖ్యకారణము.

పగలుకూడ పంచాయతీ కార్యాలయమునందు విద్యావ్యాసంగము జరుగుచుండెను. పంచాయతీబోర్డువారు ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, భారతి మున్నగు పత్రికలు తెప్పించుచుండిరి. రాజశేఖరాదులు తమ పుస్తకములను దామచ్చటచ్చటఁ బోగుచేసికొనివచ్చిన పుస్తకములను జేర్చి యొక చిన్న గ్రంథాలయము నెలకొల్పిరి. ప్రభుత్వము వారు ప్రచురించు "రాష్ట్ర సమాచారము", "పాడిపంటలు" సహకార సమ్మేళనమువారు ప్రచురించు "సహకారి" పత్రికలుగూడఁ దరువాతఁ దెప్పింపఁదొడఁగిరి. ప్రభుత్వవిరాళము దోడుచేసికొని పంచాయతీ బోర్డువారు గ్రామీణుల కుపకరించు నవీన విజ్ఞాన గ్రంథముల నిటీవలనే తెప్పించిరి. వార్తాపత్రికలు, మాసపత్రికలు, విజ్ఞానగ్రంథములు చదువుట కభ్యాసపడువఱకు గ్రామములోఁ బ్రచారము సలిపిరి. గ్రామములో నాలుగైదు తావులందు, వార్తాపత్రికలు చదువుచుఁగూర్చుండి యచ్చటి కా ప్రాంతమున నుండు గ్రామీణులను జేర్చి వినిపించుటతోఁ దమ ప్రచారము ప్రారంభించిరి. వార్తలరుచి గ్రహించిన తరువాతఁ బ్రజలు తమంతటఁ దామే పంచాయతీబోర్డు కార్యాలయమున కేఁగి వార్తలఁ దెలిసికొనుట కువ్విళ్ళూరఁ దొడఁగిరి. తరువాతఁ దమంతటఁ దామే పత్రికలు చదువుట కభ్యాసపడి వానికొఱకే నాఁటి కానాఁడు

తహతహపడసాఁగిరి. చదువఁగలవారు చదువుచుండఁగాఁ జదువలేని వారు వినుచుండిరి. ముఖ్యాంశములనుగూర్చి తర్కించుటయుఁ, దెలియని యంశములనుగూర్చి తెలిసికొనుటయుఁ బరిపాటి యయ్యెను.

ఒకప్పుడు దీపముపెట్టు దిక్కులేని వెంకాయమ్మగారి యింటి కెంత దశ పట్టినది! బోర్డు వారా యింటిని మరామత్తుచేయించి నేలకు గచ్చు చేయించిరి. ఆవరణలోఁ జెట్లు పూలమొక్కలు నాటిరి. గోడలకుఁ బ్రాకారమునకు సున్నము గొట్టించిరి. ఆ భవనము పురపాలక కార్యాలయమగుటయేకాక గ్రామీణ విజ్ఞాన కేంద్రమయ్యెను. గ్రామకల్యాణమున కాయువుపట్టయ్యెను. ఇంకేమి కానున్నదో! వెంకాయమ్మగారి కోరిక ఫలించెను.

శాంతా రాజశేఖరుల కృషి యిట్లు ఫలించుచున్నకొలఁదియు పాపిరెడ్డిసోదరుల యీర్ష్యాద్వేషములు పెఱుగసాఁగెను. శాంతను గూర్చి వారు గ్రామములో నచ్చటచ్చట నానా దుర్భాషలాడుచుండిరి. కుటుంబ మర్యాద లతిక్రమించి పూర్వాచారము లెటఁగలిపి శాంత తమకుఁ దలవంపులు తెచ్చుచున్నదనియు, వెంకటరెడ్డిగారి నందువలనఁ గులబహిష్కార చర్యలకు గుఱిసేయవలయుననియుఁ గొందఱు కులపుఁబెద్దల యెద్దఁ బ్రతిపాదించిరి. దాయాద మాత్సర్యమే దీనికిఁ గారణమని యెఱిఁగిన యా పెద్దలు వీరి మాటలు పెడచెవిని బెట్టిరి. "మీకూ వాళ్ళకూ సంబంధమే లేనప్పుడు వాళ్ళేగంగలో గలిస్తే మీకెందుకురా?" యని కొందఱు బుద్ధిచెప్పిరి.

రమణారెడ్డి ద్విపాత్రధారియై పాపిరెడ్డి సోదరులకుసిగొల్పుచునే రాజశేఖర బృందముతో నెయ్యమున మెలఁగుచుండెను. వారితో వైరముదెచ్చుకొన్నచోఁ దన కార్యముఁ బుట్టగతులు లేవని గ్రహించెను. పూర్వాచార పరాయణులగు పుల్లయ్యసంతులు మొదలగు వారితో మంతనము లాడుచు రాజశేఖరుని యభ్యుదయ ప్రణాళికలను విఘ్నముసేయించుటకుఁగూడఁ బ్రయత్నించుచుండెను.

శాంతాదేవితోఁ బరిచయము-కాదు-స్నేహమునేసేయవలయునని రమణారెడ్డికిఁ గొంతయాశ! కాని పసిబిడ్డ చంద్రునికొఱకేడ్చు

టలో నెంత ఫలమో యతఁ డామె స్నేహమునకై తపించుటలో నంత ఫలము గలుగుచుండెను. పసిబిడ్డ కోర్కెలోఁ గాలుష్యములేదు. రమణారెడ్డి కోర్కెలోఁ నైర్మల్యములేదు! ఇంతే భేదము! తాయారమ్మతో దూరపుఁ జుట్టఱికము నెమకిఁ దెచ్చుకొన్నప్పటినుండియు నతఁడు వెంకటరెడ్డిగారి యింటికిఁ దఱచుగాఁ బోవుచుండెను. అట్లు పోయి శాంతతో నేదేని విషయముగూర్చి దీర్ఘప్రసంగము చేయ వలయునని యెంతయో ప్రయత్నించెనుగాని యామె యతని కెప్పుడును మూఁడుముక్కలలో జవాబుచెప్పి యుదాసీనము చెప్పుచుండుటచే నతనికోర్కె ఫలింపదయ్యెను. రాజశేఖరరావుతో గంటలకొలఁది మాటలాడు శాంత తనతో నిముసమైన మాటలాడకుండుట యతనికిఁ బెద్ద పరాభవముగా నుండెను. ఒకనాఁ డామెతో నిట్లనెను.

రమణా:- మీ అన్నభార్య నాకు దగ్గరచుట్టమైనట్లు తెలిసిందా?

శాంత:- తెలియకపోతే నష్టమూ లేదు. తెలిస్తే లాభమూ లేదు.

రమణా:- చదువుకున్నదానవు. నీకు బంధుప్రీతి లేదెందువల్ల?

శాంత:- స్వార్థం లేకపోవడంవల్ల.

రమణా:-శాంతాదేవీ! నీతో అనేకవిషయాలు ముచ్చటించాలని నాకు కుతూహలం. కాని అటువంటి అవకాశం ఇవ్వడంలేదు నీవు. అదీ నా బాధ.

శాంత:- మీ కటువంటిబాధ ఉన్నట్లు నాకింతవఱకు తెలియదు. ఇప్పుడు తెలిసినా ఆ బాధ నేను తీసివెయ్యగలదాననుగాను. మీతో నేను చర్చింపదగిన విషయం ఒక్కటీ ఉండడానికి అవకాశంలేదు. సెలవు నమస్తే.

అని చరచర లోనికేఁగెను. ఇట్లనేకపర్యాయములు జరిగెను. ఆమె పంచాయతీబోర్డు ఆఫీసులో నున్నప్పుడు ఆఫీసువిషయములు దప్ప నింకే విషయములు మాటలాడుటకు నొప్పుకొనదు. ఏకాంతమునఁగాని యతఁడు ముచ్చటింపఁదలఁచిన విషయ మెత్తుటకు వీలు లేదు. ఆశాభంగము జరిగినకొలఁదియు నతఁడు తాయారమ్మను రాఘవరెడ్డిని రెచ్చగొట్టి యింటియందు రచ్చ సేయుచుండెను. రాఘవరెడ్డి

తల్లిదండ్రులపైఁ దిరుగఁబడి శాంత నింట నుంచవలసినదేగాని యెట్టి సందర్భములందును బయటికిఁ బోనిచ్చుటకు వీలులేదని పోరాడ మొదలిడెను. రాజశేఖరుఁడు తన యింటికి రాఁగూడదని పట్టుబట్టెను. తాను రాజశేఖరునితో మాటలాడుట మానుకొనెను. శాంతా రాజశేఖరుల శీలమును వెంకటరెడ్డిగారును, లక్ష్మమ్మగారును గ్రహించినంతగా నెవ్వరును గ్రహించియుండరు. రాఘవరెడ్డి తాయారమ్మ దుర్బోధలువిని యవివేకియై లేనిపోని యనుమానములు పెట్టుకొనెనని వారికిఁ దెలియును. కావున రాఘవరెడ్డిమాటలను వారు లక్ష్యపెట్టక యౌదాసీన్యము వహించిరి. ఎంత పెఱిగినను దండ్రియన్న రాఘవరెడ్డి కింకను భయము. రమణారెడ్డి పుణ్యమాయని యా భయ మిటీవలఁ జాలవఱకుఁ దీఱినను దండ్రికిప్పటికిని నెదురాడలేఁడు. వెంకటరెడ్డిగారు కళ్ళుఱిమిచూచి కొడుకు నెప్పటి కప్పు డదిమిపెట్టుచుండెను. శాంతా రాజశేఖరులకును, కోదండరామయ్యగారి కుటుంబమునకును, జూచాయగా నీ విషయము దెలియుచుండెనుగాని సత్యమెఱిఁగిన వారగుటచే నెవ్వరు దాని నంతగా లక్ష్యపెట్టకుండిరి. మొత్తముమీఁద మును పెన్నఁడును లేని విషాదకరపరిస్థితి యిప్పు డీ మూలమున నేర్పడెను. అందులకెల్లరు లోలోనఁ జింతించుచునేయుండిరి. శాంతారాజశేఖరులు ఒండొరుల యిళ్ళకు వచ్చిపోవుట మాత్ర మెప్పటియట్లే జరిగిపోవుచుండెను.

# X

# నాగరికత

వేములపల్లి భవిష్యత్స్వరూపమును రాజశేఖరుఁడు తన హృదయ ఫలకముపైఁ జిత్రించుకొని సర్వకాల సర్వావస్థలయందును దానికి వన్నెచిన్నెలు దిద్దుకొనుచుండెను. తాను నెలకొల్పఁదలఁచిన సంస్కారములకు సాధనములు రెండు. మొదటిది పంచాయతి. రెండవది సహకార సంఘము. పంచాయతి కొంతవఱకుఁ బ్రతిష్ఠింపఁబడినది. రెండవదానికింక నంకురార్పణమైన జరుగలేదు. సహకార సంఘమనఁగా బేదలకుఁ బెన్నిధి. సంపన్నులు దానిని గర్హించుట కనేక కారణములున్నవి. కావున మొట్టమొదట గ్రామములోఁ బ్రజాభిప్రాయమును వాతావరణమును సహకార సంస్థ కనుకూలపఱచినఁగాని వ్యవస్థాపన యత్నములు చేయఁగూడదు. రాజశేఖరుఁ డా యుద్దేశ్యముతో మున్ముందు ప్రచారము చేయసాఁగెను.

ఒకనాఁడు రాజశేఖరుఁ డట్లు ప్రచారముచేయుచు రమణారెడ్డి మామగారగు వీరారెడ్డిగారి యింటికేఁగెను. వీరారెడ్డిగారుకూడఁ గొంత వడ్డీవ్యాపారము గలవారు. చిన్నచేపలను దిను పెద్దచేప. కావున వారినిఁగూడఁ దన యుద్యమమునకు సుముఖులఁ గావించుకొనవలయునని రాజశేఖరుని కోరిక. రమణారెడ్డి తన యింటికివచ్చిన రాజశేఖరునిఁజూచి ససంభ్రముఁడై "హల్లో, కెప్టెన్, కమాన్, దారి తప్పి వచ్చారే మా యింటికి ? వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ ? దయ చేయండి, సిట్ డౌన్, ప్రే! కూర్చోండి, కూర్చోండి" అని యతి మర్యాదచేసి "ఇదుగో! అలివేణీ! మైగుడ్‌గాడ్, మై వైఫ్ ఈజ్ ఎ బ్రూట్! విలేజిబ్రూట్ ఉత్త పల్లెటూరి మొద్దు, నా భార్య! నోన్ నో ఇంగ్లీష్. గెటజ్ సమ్ కాఫీ! మాకు కొంచెం కాఫీ పట్టుకురా! నీకే చెప్పేది" అని కంగారుపడుచుండెను. రాజశేఖరుఁడు తన మామూలు చిఱునవ్వుతో నొక పడక కుర్చీలోఁ గూర్చుండి—

రాజ:- తొందరపడకండి! రెడ్డిగారు, నాకసలు కాఫీ అవసరములేదు. నేను పుచ్చుకోను. మీకవసరమైతే పుచ్చుకోండి.

ఇంతలో లోపలినుండి అలివేణివచ్చి, తన భర్తతో "ఈపాటప్పుడు పాలెక్కడివి? అసలు కాఫీపొడి అయిపోయింది, కాఫీయెట్లా అవుతుంది?" అని విసుకుగాఁబల్కి, రాజశేఖరునివంకఁజూచి "మీరా! దారితప్పివచ్చారే, మా యింటికి?" అని మర్యాద నెఱపెను.

రాజ:- మీ నాయనగారికోసమమ్మా! ఉన్నారా!

రమణా:- నాన్‌సెన్సు. మార్నింగ్ మిల్క్ - ప్రొద్దునతీసినపాలు - మిగిలించాలని తెలియదు. కాఫీపొడి అయిపోతే మీ నాయనకు జెప్పి తెప్పించడం తెలియదూ!

అలివేణి రమణారెడ్డి మాట లసలు వినిపించుకోనట్లుండి, రాజశేఖరుని సంబోధించి "మా నాయన ఇవ్వాళ ఊళ్ళోలేడండీ!-గుంటూరు వెళ్ళాకు - కోర్టులో వాయిదావుండి. రాత్రికిగాని రాడు" అని పల్కెను.

రమణా:- యూ, డేమ్ ఫూల్! నా మాటకు జవాబు చెప్పవేం? ప్రొద్దుటిపాలన్నీ కర్చుపెట్టావా?

రాజ.- రెడ్డిగారూ! నాకవసరంలేదన్నానుగా, కాఫీ. తొందర దేనికి?

రమణా:-బట్, ఐ వాంట్, యూనో! నాకు కావాలిగదండీ! అయినా ఈ పల్లెటూరి గొడ్లకు ఎన్నిచెప్పినా బుద్ధిరాదు.

అలివేణి:- ఈ బస్తీపశువులకు కాఫీకుడితి ఎంతపెట్టినా చాలదు!

రమణా:- టేక్ కేర్! యూ, యాస్! నోర్ మూయ్, నీ ఇంటికి ఇల్లరికం వచ్చి పడున్నాననుకొన్నావు గాబోలు!

అలివేణి:- అనుకోవడం దేనికి? రాజశేఖరరావుగారూ! చెప్పండీ మీరయినా, ఇది యిల్లరికం గాక, కోటరికమా?

రమణా:- ఛీ! ముండమోపీ!

అలివేణి:- అంత పుణ్యమా, నాకు!

రాజ:- రెడ్డిగారూ! సరసం విరసమౌతున్నది. అలివేణీ! నీవు నీ పని మీద పో అమ్మా!

రాజశేఖరరా విట్లు పల్కఁగనే అలివేణి లోపలకుఁ బోయినట్లే పోయి, తలుఁపుచాటున నిలిచి చూడ మొదలుపెట్టెను. తిరిగి రాజశేఖరరావు రమణారెడ్డితో "అయితే రెడ్డిగారూ! మీ మామగారు సాయంకాలానికి వస్తారా?" అని యడిగెను.

రమణా:- ఏం చస్తాడో! అదొక దున్నపోతు! ఎడ్యుకేటెడ్ సన్ ఇన్లా ఇంట్లోచేరి కూర్చున్నాడు గదా! అని కావలసిన వస్తువులన్నీ చేర్చిపెట్టకూడదూ? ఉహూఁ, అదేం లేదు. నాకు రోజుకు పది సార్లు కాఫీ గావాలి. లేకపోతే హెడేక్- తలనొప్పి. ఎన్నోసార్లు చెప్పాను. ఒక మణుగు కాఫీవిత్తులు ఒకేసారి తెచ్చిపడెయ్యమని. నో! హి వోంటు డూ సో, - అట్లా చెయ్యడు. పౌను చెల్లగా పౌను పొడరు తెస్తాడు. మైజర్, - పిసినారి. నా వైఫ్ అంతకంటే బ్రూట్! ఇంకా నాలుగురోజులకు ఐపోతుందనగానే పొడరు తెప్పించుకోడం తెలియదు. ఇంతకూ వీళ్ళ కా ఫైన్‌హాబిట్స్ - సదభ్యాసాలుండి చస్తేగా! వెధవ పల్లెటూరిమూక! ఐ టెల్ యు కెప్టెన్! వీళ్ళకు నా అవసరాలు తెలుసుకోవడం చాల కష్టం, అయామ్ టెరిబ్లి డిస్‌గస్టెట్ విత్ దెమ్! భలే విసుగుపుట్టింది వీళ్ళంటే నాకు.

రాజ:- వీళ్ళు తీర్చలేని మీ అవసరాలేమిటండీ! గంటగంటకూ కాఫీ యేనా?

రమణా:- మై గుడ్ గాడ్! నో, అదొక్కటేగాదు. చెపుతా వినండి! నిద్రమంచం మీదనే నాకు కాఫీ కావాలి. తెలుసుగా మీకు బెడ్ కాఫీ. కాని, ఇంకా అప్పటికే పశువులు పాలివ్వవని అది కాస్తా యెగగొడుతున్నారు. తరువాత, నేను టూత్‌బ్రెషూ, టూత్‌పేస్టూ, టంగ్‌క్లీనరూ, ఉంటే తప్ప మొఖం కడగలేను. వాటికిబదులు వెధవపుల్ల, వేపపుల్ల ఒకటితెచ్చి తగలేస్తారు. అయ్ హేటిట్ లైకెనీథింగ్!-అదంటే నా కసహ్యాం. ఇక నాకు స్నానం చెయ్యడానికి వేరే గది కావాలి. నేను ఓపెన్‌స్పేస్‌లో బంగరు బయలుగా బేత్ చేయలేను. వేరేగది కట్టించమంటే ఒకవసారా

గది చూపుతారు. నాకు బాత్ రూము కావాలిగాని వసారాగది కాదు. అది వీళ్ళకర్థంగాదు. అందులో ముఖ్యంగా, టబ్-తొట్టి-ఉండాలి వీళ్ళు కాగులలో, బిందెలలో నీళ్ళు తెచ్చిపెడతారు. కూర్చొని స్నానం చెయ్యడానికి టబ్ పనికివస్తుందిగాని బిందెలు పనికిరావని వీళ్ళబుఱ్ఱ కెట్లా యెక్కించనండీ, నేను? తరువాత సబ్బులు. ఎప్పుడు తెచ్చినా శాండల్ వుడ్ తప్ప ఇంకేమీ వీళ్ళకు కనపడవు. నాకు నాలుగురకాలైనా వుండాలి. లేటెస్ట్ ఇన్ ది మార్కెట్-కావాలి. క్యూటికూరాసోప్ ఉండితీరాలి. తుడుచుకోడానికి టర్కీ టవల్సే కావాలి. వాటి ఉపయోగం వీళ్ళకు తెలియదు. వాటికిబదులు ఉతికిన అంగోస్త్రాలు తెచ్చి తగలేస్తారు! సరే! బాత్ కాగానే కాఫీ తగలేస్తారా అంటే ఏదో ఆలస్యం చేస్తూనే ఉంటారు. వీళ్ళకు టైమ్ వాల్యూ - కాలంయొక్క విలువ తెలియదు.

అలివేణి:- తాను మండబెట్టే వుద్యోగమేమిటో అడగండి రాజశేఖరం గారూ!

రమణా:- షటప్ యూ, యూస్! నోరు ముయ్.

రాజ:- నీ వింకా ఇక్కడే వున్నావమ్మా! వెళ్ళు నీ పనిమీద నీవు.

తిరిగి అలివేణి పోయినట్లే పోయి తలుపుచాటున నిలిచియుండెను. రమణారెడ్డి మరల తన యుపన్యాసధోరణిలో నిట్లు చెప్పఁదొడఁగెను. "విన్నారా, మరి! ఇక నేను చదువుకొంటూ కూర్చొనే టేబిల్ మీదనే ఆ కాఫీ, ఫలహారం పెట్టిపోతారు. డీసెన్సీ అనేదే వీళ్ళకు తెలియదు. ఆ టేబిల్ మీదనే టాయిలెట్ చేసుకోవాలి. సరైన హేరాయిల్ ఒక్కటీలేదు. స్నో లేదు. ఫేస్‌పౌడరు లేదు. పోరాడి పోరాడి క్యూటికూరా పౌడరు తెమ్మంటే వెధవ వెలిబూడిదవంటి పౌడరు ఒకటితెచ్చి పడేశాడు మొన్న. కూంచ్ బ్రషులు లేనే లేవు. దువ్వెన లెట్లా క్లీన్‌చేస్తాం? టాయిలెట్ కైనా వేరే కుర్చీ, టేబిల్ చేయించమంటే వినరు. ఇక న్యూస్‌పేపర్! రాత్రికిగానిరాదు. మధ్యాహ్ననికైనా ఒక మనిషిని పంపించి తెప్పించమంటే వింటేగా? మరి

భోజనం సంగతి విన్నారా? - మై గుడ్ గాడ్! నేలమీద ఆ వెధవ పీటచెక్కమీద కూర్చొని తినమంటారు, నమ్మండీ! నాకు టేబిల్ మీదనే అలవాటు. సివిలైజ్ అయినవాళ్ళం కదండీ, మనకి అలవాట్లు పట్టుపడతాయ్. మరి వీళ్ళకేం తెలుసు? చూశారా! ఇక తప్పక ఆ స్టడీ టేబిల్ మీదనే భోజనం చేస్తాను. దాని మీద క్లాత్ కూడా వెయ్యరు బ్రూట్స్! సరే, భోజనం కాగానే తాంబూలం ప్రతిరోజూ దొరకదు. వక్కపొడో, వక్కో, లవంగాలో అక్కడ పెడతారు. ఆకు లయిపోకముందే తెప్పించి ఉంచకూడదూ? గుడ్డలు చూడండీ! ఈ పల్లెటూరి చాకళ్ళకు ఇస్త్రీ చేయడం తెలియదు. వారానికొకసారి గుడ్డ లిస్త్రీ చేయించమంటే వినరు. నీరుకావి గుడ్డలు ఇస్త్రీ గుడ్డలకంటె శుభ్రంగా ఉండవా? అని అడిగాడు మా మామ. ఇంకేం చెప్పమంటారు వీళ్ళతో! నేను గుడ్డ మడతబడితే వేసుకోలేను. తీసిపారెయ్యవలసిందే. తరువాత కొంపలో కోట్ స్టాండ్ సరియైనది లేదు. హ్యాట్ స్టాండు అసలే లేదు. అందువల్ల సూట్ వేయడమే మానుకొన్నాను. డ్రాయింగ్ రూమూ, విజిటర్స్ రూమూ, బెడ్ రూమూ, వేరే వేరే కట్టించమంటే ఆ ముసలిగొడ్డు వినదు. మీబోటివాళ్ళువస్తే చూడండీ, ఎంత యిబ్బందో! ఎంత అసహ్యంగా ఉంటుందో! హాయిగా కూర్చోడానికి నాలుగు సోఫాలు లేవుగదా! ఒక్క టీపాయ్ లేదుగదా? ఫ్లవర్ వేస్ లేదుగదా! అన్నట్లు సిగరెట్టు టిన్నూ నిప్పెట్టె ఎక్కడ పెట్టుకోను? ఎప్పుడూ చేతులో ఉంచుకోవలసిందే! ఇక యాష్ ట్రే లేదని చెప్పుకోవడం దేనికి? "నేను చుట్టకాల్చి కొడి రాల్చినట్లే నీవు సిగరెట్టుకొడి కూడా రాల్చకూడదా?" అని అడుగుతాడు మామామ. ఆయనకు నే నేం చెప్పను? నేను గోల్డుఫ్లేక్ కు తక్కువసిగరెట్టు కాల్చను. కాని సిజర్స్ కు ఎక్కువ తీసుకురాడు ముసలాయన. అవైనా, పదిపెట్టెలకు మించి తీసుకురాడు. మొన్న ఒకరోజున స్టాక్ కంప్లీటుగా అయిపోయింది. మై గుడ్ గాడ్! ఆ రోజున నే పడ్డబాధ భగవంతుడికే తెలియాలి. ఎక్కడైనా సెకండ్ హ్యాండయినా దొరుకుతుందేమోనని యిల్లంతా వెదకి, చివరి కేం చెయ్యను? బీడీలు తెప్పించి కాల్చాను.

మీ రాష్ట్రమిత్రులు గనుక చెప్తున్నాను. ఈ విషయం యితరులకు తెలయవలసిందిగాదు. చూడండి! వీళ్ళయింటికి రావడంవల్లనే కదా, నాకు ఇంత యిబ్బంది! భోజనంకూడా అంతేనండి! వెడ్డవ రొటీన్ అయిటమ్స తప్ప కొత్త కొత్త పదార్థాలు చేసిపెట్టడం వీళ్ళకు తెలి యదు. నాకు డెయిలీ ఎగ్సూ, మీటూ - గుడ్లూ, మాంసం - ఉండి తీరాలి. వారాని కొకసారికంటే వీళ్ళ మాంసం వండరు. ఆ కూర గాయలుకూడా ఈ వెధవగ్రామంలో ఏవి దొరికితే అవి చేస్తారుగాని పదిమైళ్ళలో ఉన్న గుంటూరుపోయి తేగూడదూ, రెండురోజుల కొక సారైనా? ఐ మీన్, ఇంగ్లీష్ వెజిటబుల్సండీ! బీన్సు, కాబేజి, రూట్సు, టొమాటోస్ ఎన్నిలేవు గుంటూరుమార్కెటులో? ఇక్కడ ఎన్నాళ్ళుపెట్టినా, వంకాయ, పొట్లకాయ, బీరకాయ వీళ్ళ తలకాయ. పైగా లీఫ్ కర్రీ, - ఆకు కూరలు కూడా తినమంటారు. అందులో గోంగూర, తోటకూర, పొన్నగంటికూర, వీళ్ళ బొందకూర! చదువు కొన్న అల్లుడికి ఇవి పెట్టవచ్చునో లేదో అన్న ఆలోచనే లేదు వీళ్ళకు! ఫలావ్, కుర్మాచేయడం చేతగాకపోతే నేర్చుకురాగూడదూ బస్తీకి పోయి? గుంటూరుపోయినప్పుడల్లా కొనితెచ్చినా తేవచ్చుగా! ఛీ! వీళ్ళకేమీ తెలియదండీ, రాజశేఖరంగారూ! మధ్యాహ్నం టిఫిన్ విషయం విన్నారా? ఎంతసేపటికి అరిసెలు, మినపవుండలు, గారెలు, ఆవడలు, చక్కిలాలు, పకోడీలు తప్ప ఇంకేదీ చేతగాదు. హల్వా, లడ్డూ, గులాబ్‌జామ్ చేయడంకూడా తెలియదు నమ్మండి! ఏం చెప్పమంటారు నా అవస్థ. ఇంకా ఉన్నది చెబితే!

రాజ:- రమణారెడ్డిగారూ! విన్నాను. ఇంకా మీ కేమేమి గావాలో సులభంగా ఊహించుకుంటాను. మీ రింతబాధపడుతున్న సంగతి నాకు తెలియదండి.

రమణా:- బికాస్, నేను చాలా ఓపికగల వ్యక్తిని. ఎవరికీ చెప్పను నా బాధ. చూచారా!

రాజ:- కాని, వీరారెడ్డిగారు శ్రీమంతులైనా పల్లెటూరివారు. పల్లె టూరివారి జీవితం నిరాడంబరంగా ఉంటుంది. వారికి జీవితావస

రాలు చాల తక్కువ. వారి జీవితం మీ రింగ్లీషులో 'సింపిల్' అంటారు. అటువంటి జీవితమే నిజానికి పట్టణాలలోని ఆడంబర జీవితంకంటె సుఖమైనది, శాంతమైనదీ. ఉదయాస్తమానం జీవితావసర వస్తువులు సంపాదించుకోనడంతోనూ, వాటిని సద్వినియోగపరచుకోనడం తోనూ సరిపోతే జీవితం అనుభవించడాని కెప్పుడు వీలవుతుంది ? పైగా పల్లెటూళ్ళలో ఆడంబరజీవితానికి కావలసిన డబ్బెక్కడ పుట్టుతుంది ? పల్లెటూరి గృహస్థుకు అత్యవసరంగా కావలసిన కూడూ, గుడ్డా, కొంప – ఇవి మూడూ వుంటే తక్కినవాటికి అంతగా ప్రాకులాడడు. వాటికోసం మనశ్శాంతి చెడగొట్టుకోడు. తప్పనిసరిగా కావలసిన ఆ మూడూ వుంటే సుఖంగా కాలక్షేపం చేస్తాడు.

రమణా:– సన్యాసిలాగా నట్టింట కూర్చొని తపస్సుచేస్తాడా ? దున్నపోతులాగ దొర్లాడుతాడా ?

రాజ:– నిప్పులమీద కోతిలాగ చిందులుతొక్కే బస్తీవాడుమాత్రం పల్లెటూరివాడికంటె సుఖపడతాడా ? ఎప్పుడూ ఏదో ఒకటి లేదని అతృప్తే. బస్తీమనిషి అవసరాలకు అంతుండదు. అతనికి మనశ్శాంతి వుండదు.

రమణా:– జీవితం అనుభవించడం చేతగాకపోతే పల్లెటూళ్ళో ఉండాలి.

రాజ:– జీవితానికి నిర్వచనమేమిటి ? సుఖంగా, శాంతంగా కాలం బుచ్చుటమేగదా ! బస్తీలో ఇప్పుడు జరిగే జీవితం సుఖమైనదన డానికి వీలున్నదా ? ఉదాహరణకు మీ విషయమే ఆలోచించండి. మీ అవసరాలు ఎన్నో చెప్పారు. చెప్పనివి యింకా ఎన్నో వున్నవికూడా. వీటిలో ఏ వొక్కటి తక్కువైనా, మీకు అశాంతి, అతృప్తి కలుగుతుంది. వీటికంతెక్కడ ? శాండల్ వుడ్ సబ్బు సబ్బులలో మంచిదనే వాడుక. కాని దాన్నిమించి యింకొకటి మార్కెటుకు వచ్చింది. అది లేదుకాబట్టి మీకు అతృప్తి. అట్లాగే సైకిలులేని ఒకాయనకు సైకిలు కొనేవరకూ అతృప్తే. అది కొన్న తర్వాత హెర్క్యులిస్ సైకిలుకంటే ర్యాలీమంచిదని

ర్యాలీ కొనేవరకూ అతృప్తే. సైకిలుకంటే మోటారుసైకిలు మంచిదనిపిస్తుంది. అది కొన్నతరువాత కారుమీద బుద్ధిపోతుంది. తాను మోటారుసైకిలుమీద పోతూ, హాయిగా కారులోపోయే వారినిచూచి అసూయపడతాడు. ద్వేషిస్తాడుకూడా. కారులేని జీవితం అభాగ్య జీవితం అనుకుంటాడు. కారు కొనేవరకూ పడ రాని బాధలు పడతాడు. చెయ్యరాని చేష్టలు చేస్తాడు. తరువాత విమానాలమీద బుద్ధిపోతుంది. ఇట్లా అంతులేకుండా తనకు లేని దానినల్లా సంపాదించాలని కష్టపడతాడు. తనకంటె తక్కువ స్థితిలో ఉన్నవాడితో తన్ను పోల్చుకొని తాను ధన్యుడనుకోలేక తనకంటే ఎక్కువస్థితిలో ఉండేవాడిని చూచి తాను అభాగ్యుడనే అని వాపోతాడు. అటువంటి అతృప్త జీవికి మనశ్శాంతీ, సౌఖ్యమూ ఎక్కడివి ?

రమణా:– నాగరికతచెందిన యూరోపియనులు, అమెరికనులు సైన్సును వశంచేసుకొని అందుమూలంగా మానవ జీవితంలో క్రొత్తక్రొత్త సౌకర్యాలు కల్పించుకొని మునుపటికంటె సౌఖ్యం అనుభవిస్తున్నారు. నాగరికతలేని మనం వాటిని అనుభవించడం చేతగాక పిచ్చి వేదాంతాలు చెప్పుకుంటూ, కూడూ, గుడ్డా, కొంపా ఉంటే చాలునని ఫకీరులమై పోతున్నాం.

రాజ:– ఇంతగా సైన్సును వశంచేసుకొన్న పాశ్చాత్యులు మనకంటె సుఖంగా వున్నారంటారా ? కాట్లకుక్కలాగ వాళ్ళెప్పుడూ తగవులాడుకోవడం దేనికి ? ఆటంబాంబులతో అన్యోన్య విధ్వంసం చేసుకోవడం దేనికి ? సైన్సువల్ల వాళ్ళు బాగుపడ్డారా ? ఆధ్యాత్మికమైన పరిపక్వత రానంతవరకూ, భౌతికమైన అభివృద్ధి ఎంత-వచ్చినా ప్రయోజనంలేదు. జీవితంలో తృప్తీ శాంతీ అనేవి లేక పోయిన తర్వాత, ఎంతభాగ్యమున్నా, సైన్సుమీద ఎంత అధికారమున్నా మానవునకు సుఖం చిక్కదు. పాశ్చాత్యుల జీవితవిధానం చాలా విషమమై పోయింది. ఒక మిల్లులో నట్టో, బోల్టో ఊడి పోతే మిల్లంతా ఎట్లా ఆగిపోతుందో, అట్లాగే వాళ్ళ అనంత

జీవితావసరాలలో ఏ ఒక్కటి తక్కువైనా వాళ్ళ జీవితం విషాద భాజనం అవుతుంది. అట్లా కాకుండా వుండడానికే వాళ్ళన్ని యుద్ధాలాడడం, ఇంత రక్తపాతం చెయ్యడం! సైన్సును వాళ్ళు వశం చేసుకొన్నారా? వాళ్ళను సైన్సు వశంచేసుకొని కోతులవాడు కోతిని పట్టుకొని ఆడించినట్లు ఆడిస్తున్నది. మాటవరసకు మొన్న మీకు సిగరెట్టు లేకపోతే యెందుకంత బాధపడ్డారు? నాకా బాధ లేదే? ఒక్క భోజనానికి ఎన్ని ఉపకరణాలు కావలసి వచ్చినవి? ఎంత హంగామా ఉండాలి, చూడండి! దుస్తులు విచారించండి. గుఱ్ఱానికి జీనువేసినట్లు ఒక్క అరగంటైనా వేస్తేనే గాని తయారుగాదు నాగరికవేషం! వీటిని తగురీతిని ఉంచుకోడానికి ఎక్కడలేని శ్రమ, వ్యయమూ! మొదట మేజోళ్ళు, వాటి పైన బూట్లు తొడగడానికి ఒకసాధనం. బూట్లు మెరుగుపెట్టడానికి "పాలిషు". తర్వాత డ్రాయరనే పొట్టిలాగు. దానిపైన ప్రాగరు. బనియను. షర్టు. షర్టుకు చేతిగుండీలు. కాలరు గుండీలు. కంఠబంధమయ్యే కాలరొకటి. షర్టుపైన వెస్టుకోటు. దానిమీద పెద్దకోటు. కోటులు, లాగులు తలిగించి ఉంచడానికి హ్యాంగర్లు, హ్యాటు తగిలించడానికి ఒక స్టాండు. ఇందులో ఏది తక్కువైనా అతృప్తి ఏర్పడుతుంది. జీవితావసరాలనుగూర్చి ఇది ఒక్క ఉదాహరణగా మాత్రం చెపుతున్నాను. తక్కిన అవసరాలన్నీ ఇంతే.

ఈ అసంఖ్యాక జీవితావసరాలను వాళ్ళా పూరికే కల్పించలేదు. వాళ్ళది కేవలం డబ్బుమీద ఆధారపడిన నాగరికత. పాశ్చాత్యులు మనదేశం వశంచేసుకొన్నతరువాత మనదేశానికి, ఆ నాగరికతను దట్టంగా పట్టించారు. పట్టించి అంతకుముందు బహు స్వల్పములై వుండిన మన జీవితావసరాలను తమ మాదిరే అంతులేకుండా పెంచారు. ఎందుకు? వాళ్ళ మిల్లులలో వాళ్ళ ఫ్యాక్టరీలలో తయారయ్యే వస్తువులన్నిటికీ గిరాకి రావడానికీ, మార్కెటు ఏర్పడడానికీ. మరి వాళ్ళు పంపే పాదరక్షలు, మేజోళ్ళు, రకరకాల వస్త్రాలు, ఫేస్‌పౌడర్లు, స్నోలు, స్టేషనరీ సామాన్లు, గాజుసామాను, పింగాణీసామాను, గిన్నెలు,

కత్తులు, కఠారులు, గుండీలు, హైరుపిన్నులు, రొట్టెలు, జాములూ, వెన్నా, జున్నూ, టిన్నులలో భద్రపరచిన పళ్ళూ, బిస్కట్టులూ, చాకలెటులూ, సిగరెట్టులూ, చుట్టలూ – ఒక టేమిటి ? లెక్కలేనన్ని – ఇవన్నీ మన జీవితావసరాలేనా ? కావు. మరి వాటిని మనం కొంటే తప్ప వాళ్ళ మిల్లులు పనిచేయవు. వాళ్ళ కార్మికులకు పనివుండదు. వాళ్ళపెట్టుబడికి వడ్డీగిట్టదు. వాళ్ళదేశం బాగుపడదు. అందువల్ల వాళ్ళుచేసే తమాషా ఏమిటంటే ఎడ్వర్ టైజ్ మెంటు. ఇందులో వాళ్ళు సిద్ధహస్తులు. ఎడ్వర్ టైజ్ మెంటులో వాళ్ళ ప్రతిభ అద్భుతమైనది. వాళ్ళ పెట్టుబడిలో చాలభాగం ఇందుకే ఖర్చుపెడతారు. వాళ్ళుచేసే ఎడ్వర్ టైజ్ మెంటుచూచి "అయ్యో ! అటువంటివస్తువు లేకపోతే ఇక మనజీవితం దేనికి ?" అనే భ్రాంతిలో పడతాం మనం. వాటిని తప్పక కొంటాం. అవి లేనందుకు అభాగ్యులమని భావించుకుంటాం. మరి, ఒకసారి కొన్న వస్తువును అది పోయేవరకూ మనం కొనకుండావుంటే వాళ్ళ పరిశ్రమలుసాగవు. కాబట్టి ఎప్పటికప్పుడు నమూనా ఫ్యాషను మార్చుతారు. ఫ్యాషను మారగానే ఉపయోగించే వస్తువైనా అవతల పారేసి క్రొత్తది కొనాలి. కొనకపోతే నాగరికత కొరవడుతుంది. గుండ్రని చేతిగడియారం అమాంతం చతుష్కోణావతారం దేనికెత్తింది? బంగారపు పైపూత మానుకొని క్రోమియమ్ ప్లేటింగు అనే వెండిపూత ఎందుకు పూసుకొన్నది ? ఈ నమూనా మార్పుకోసమే. వాళ్ళు ఆ విధంగా జీవితావసరాలను పెంచి పెంచి మార్చి మార్చి మననెత్తిన రుద్దితేతప్ప వాళ్ళకు డబ్బురాదు. ఆ మాయ కనిపెట్టలేక, అవి లేకపోతే మన జీవితం అభాగ్యమాతుందని వాపోతాం. ఇదే డబ్బు మీాద ఆధారపడిన నాగరికత. జీవితమంటే డబ్బే అనుకొనే ధన దాసులు పెట్టుబడిదారులు – వాళ్ళదేశస్థులేకారు, మనవాళ్ళుకూడా– ఈ నాగరికతను తమ క్షేమానికై బాగా వ్యాప్తిలోకి తెస్తారు. ఇప్పుడు మన బస్తీలలో వ్యాప్తిలో ఉండే నాగరికత ఇటువంటిదే. ఇది క్రమంగా గ్రామాలకుకూడా ప్రాకుతున్నది. జాతీయ జీవితంలో ఈ విషయం ఎక్కువైనకొద్దీ జీవితంలో అతృప్తి, అశాంతి ప్రబలి

పోతున్నది. మన గ్రామాలను పునరుద్ధరించాలంటే ఈ డబ్బు నాగరికతను అరికట్టాలి. రూపుమాపాలి.

రమణా:- మై గుడ్ గాడ్! మీ వ్యవహారం చాలదూరం పోతున్నదే! అయితే డబ్బు అవసరం లేకుండానే జీవితం జరిగేలాగు చేస్తారా? ఎన్నడైనా చేయగలరా? ప్రపంచం ఇంతవరకూ జరిగివచ్చిన తరువాత మళ్ళీ వెనక్కు నెట్టడం సాధ్యమా?

రాజ:- వెనక్కి నెట్టడంగాదు. ముందుకు నెట్టడమే. ఏదైనా సాధ్యమైనంతవరకే చేస్తాము. ఇది ముఖ్యంగా గ్రామాలలోనే సాధ్యమౌతుంది. పారిశ్రామిక కేంద్రాలలో, నగరవాసాలలో సమస్యలు వేరు. పరిస్థితులు వేరు. వాటికి వేరే ఉపాయాలు ఆలోచించాలి. అది ప్రస్తుతం మన పనిగాదు. నేను సూచించే పరిణామం పల్లెలలో వస్తే చాలు. అందువల్ల పల్లెలు ప్రశాంత జీవితానికి అనుకూలించి మానవులకు ఊపిరి సలుపుకొనడానికి మంచి తావు లవుతాయి.

రమణా:- ఇలాంటి విప్లవం తేవడానికి మీ మార్గా లేమిటి?

రాజ:- దీనిని 'విప్లవం' అన నవసరం లేదు. గ్రామపునరుజ్జీవనం అనవచ్చు. దీన్ని ఒక్కసారిగా తేవడం చాలా కష్టం. మీబోటి వారికి ఇటువంటి సంస్కారాల మీద వెంటనే నమ్మకం కలుగదు. పైగా ఇదంతా ఒక పిచ్చి క్రింద తేల్చి నవ్వుతారు కూడాను. దీని మూలతత్వాన్ని ముందు ప్రజలలో బాగా ప్రచారం చెయ్యాలి. మొత్తం మీద ఇది డబ్బును బహిష్కరించే విధానం కాబట్టి క్రమక్రమంగా గాని ఆచరణలోనికి తేలేము. డబ్బును సంపూర్ణంగా బహిష్కరించలేకపోయినా డబ్బువలని అపాయాలనుమటుకు కొంతవరకు త్వరలోనే తగ్గించవచ్చు. అదే ప్రస్తుతం మన కార్యం. ఇంతకూ డబ్బనగా ఏమిటి? జీవితావసరాలను సేకరించుకోవడానికి ప్రజలలో చలామణి అయ్యే ఒక ద్రవ్యమానం. ఒక మారకపు విధానం. ఆ జీవితావసరాలను వీలైనంతవరకు తగ్గించి ఆ తగ్గించిన అవసరాలనుగూడ డబ్బువల్లగాక మరియొక విధంగా సేకరించుకొనే విధానం క్రమంగా ప్రవేశపెటితే డబ్బువలని ప్రయోజనం సన్నగిల్లి ప్రజ

లకు డబ్బుమీద వ్యామోహం పోతుంది. ఇతరుల కొంపలుగూల్చి డబ్బు సంపాదించి దాచుకోవలెననే దురాశ పోతుంది. అందువల్ల డబ్బువలని అపకారం తగ్గుతుంది. దాని ప్రభావం సన్నగిలుతుంది. ప్రజలు అన్యోన్య సోదరభావంతో జీవిస్తారు.

రమణా:- మై గుడ్ గాడ్! మీ రెక్కడో కలలో మాట్లాడుతున్నారు. ఇదంతా అయ్యేపనిగా లేదు.

రాజ:-కల నిజంగావచ్చు. నిజంగాలేనిది కలలోమాత్రం కనిపిస్తుందా?

రమణా:- మీ ప్లాను సక్సెసయితే – అంటే – మీ విధానం నెగ్గితే, ఇక పల్లెటూళ్ళలో జనమందరు కూడూ, గుడ్డా, కొంపలతో తృప్తి పడి వుంటారన్నమాట.

రాజ:- జీవితాన్ని విషమింపజేసే అవసరబాహుళ్యాన్ని వలయునంత వరకు తగ్గించుకొంటారు. అంతవరకు చెప్పగలను. పరుగెత్తుతూ పాలుతాగడంకంటే నిలుచుండి నీరుత్రాగడం మంచిదంటాను.

రమణా:- ఇప్పు డుండే వినోదాలు, సౌఖ్యాలు లేనప్పుడు వాళ్ళనుభ వించే దేముంటుంది? ప్రొగ్రెస్ట్లా పోతుంది? జీవితం నిస్సారంగా ఉండదూ?

రాజ:- జీవితానికి అత్యవసరమయిన వాటిని మాత్రం సులభంగా సేక రించుకొంటూ డబ్బుమీది వ్యామోహం జయించినప్పుడు బంది ఖానాలోనుండి బయటపడ్డ మానవుల మాదిరి ప్రజలొక మధుర మైన స్వాతంత్ర్యం అనుభవిస్తారు. అప్పుడే మానవుడు నిజమైన మానవుడౌతాడు. తనను తాను గుర్తిస్తాడు. ఆ మానవుడు అనుభవించదగినది ఈ ప్రకృతిలో అనంతంగా ఉన్నది. ఈ కృత్రిమ వినోదాలు దానితో సాటిరావు. మానవత్వం తన బురఖా తొల గించుకొని నిర్మలంగా ప్రకాశించే ప్రకృతిని దర్శింపగలిగితే ఈ కృత్రిమ వినోదాలజోలికి పోడు. నిజమైన, స్వచ్ఛమైన జీవితం మానవుని కష్టు డనుభూతమౌతుంది. ప్రాచీన భారతంలో మానవు లటువంటి మధుర జీవితం అనుభవించారు.

రమణా:- సైన్సు అప్పుడు నిష్ప్రయోజన మౌతుందా?

రాజ:– కాదు. సైన్సును ఎంతవరకు, ఎక్కడ వుపయోగించుకోవాలో అంతవరకే, అక్కడే ఉపయోగించుకొంటాము. అవసరమైతే పరమాణుశక్తిని ప్రయోగించి సముద్ర క్షారోదకాలను ఎడారులలో మంచినీటి నదులుగా ప్రవహింపజేస్తాం.

రమణా:– ఏమిటో! ఇదంతా కవిత్వంగా ఉన్నది నాకు. మరి మీరు చెప్పే పరిస్థితులలో మానవులందరూ ఏ భేదమూ లేకుండా సమానంగా ఉంటారా ?

రాజ:– అవును. అప్పుడు భేదభావానికి అవకాశం ఉండదు. అందరు అన్నదమ్ములలాగ ఉంటారు సుఖంగా.

రమణా:– దీన్నేనా సామ్యవాద మంటారు ?

రాజ:– కాదు. సామ్యవాదానికీ, దీనికీ చాలా భేద మున్నది. సామ్యవాదంలో వ్యక్తికి స్వాతంత్ర్యం లేదు. పైవారి ఉత్తరువులకు బద్ధుడై యంత్రంలాగ పనిచేయాలి. ఇందులో తన అభిరుచి ననుసరించి పనిచేసుకోవచ్చు. అంతేగాదు. సామ్యవాదంలో ఆధ్యాత్మిక సంపద లేదు. అంతా భౌతిక సంపదే. భౌతిక సంపద మాత్రం ఆశించే మానవునికి తృప్తి యేర్పడదు. తన భౌతిక సౌఖ్యానికి మితి గీత గీచుకోలేడు. ఎంత సుఖపడుతున్నా, ఇంకా సుఖపడకపోతినే అని విచారపడుతుంటాడు. తన ఆత్మను దర్శించలేనిదే ఏ మానవుడూ సుఖించలేడు. దానికి ఆధ్యాత్మిక విజ్ఞానం కావాలి. ఆధ్యాత్మిక విజ్ఞానం లేనిదీ జీవితంలో తృప్తి యేర్పడదు. ఆనందం కలుగదు. కాబట్టి సామ్యవాదంలో మానవత్వం మలినంగానేఉంటుంది.

రమణా:– మరి, మీరుచెప్పేది ఏ వాద మంటారు ?

రాజ:– ఇదొక వాదంగా మన సిద్ధాంతు లింకా పేరుపెట్టలేదు. పల్లీవాదమని ఒకరు సూచించారు. మానవ వాదం అంటే బాగుంటుందని నా అభిప్రాయం. ఎందువల్లనంటే, ఈ విధానం మూలాన మానవుడు తన్ను దాను గుర్తించి యథార్థమైన శాంతీ, సౌఖ్యమూ అనుభవిస్తాడు.

ఈ సంభాషణ జరిగినంతసేపు నలివేణి రమణారెడ్డికిఁ గనఁబడకుండ నతని కుర్చీ వెనుకవైపుననున్న గదివాకిట నిలిచియుండెను. రాజశేఖరుఁ డామె కెదురుగాఁ బడకకుర్చీయందుఁ గూర్చుండియుండెను. అలివేణి యచ్చట నిలిచియుండినది సంభాషణయం దభిరుచికలిగి కాదు. రాజశేఖర వదన బింబము చూచుటకు! ఆమె యతని నింతసేపును నిర్నిమేషముగాఁ జూచుచునే యుండెను. సంవాద లగ్నచిత్తుఁడైన రాజశేఖరుఁ డామెను అంతగా గమనింపలేదు.

అలివేణి యిరువదిరెండేండ్ల పడుచు. మెరుగుఁజామనచాయ మేను. రమణీయమైన యంగసౌష్ఠవము. తీర్చిదిద్దిన ముక్కు. విశాలములైన సోగ కన్నులు. గుండ్రని మొగము పల్లెటూరి సంపన్న గృహమునఁ బెఱిగిన కోమలమైన పెంపు. అన్నిఁటినిమించి పొంగి పొరలెడి పండు జవ్వనము. మొత్తముమీద నలివేణి చూడచక్కని చిన్నది.

ఆమె రాజశేఖరు నెఱుఁగనిది గాదు. కాని యతనితో నామెకుఁ బరిచయములేదు. ఎన్నఁడును మాటాడి యెఱుఁగదు. అతఁడు యుద్ధసేవనుండి తిరిగివచ్చిన తరువాత దగ్గఱగానుండి యతని నెన్నఁడును జూచినదిగాదు. ఆమెకు రమణారెడ్డితో సాంసారిక జీవితమంత సుఖప్రదమైనట్లు తోఁచదు. అతృప్తిచ్ఛాయ లామె వదనమును బరిశీలించువారికి గోచరింపక మానవు. నాఁడు రాజశేఖరునిఁ గన్నువ్రాల్పక చూచుటలో నామె హృదయగతి సులభగోచరమగుచుండెను. రాజశేఖరుఁడుమాత్ర మామెను బరిశీలింపలేదు. యువతుల చరణములనుమించి యతఁడు తన చూపులను బైకిపోనీయఁడు. అది యతని జీవిత నియమము. అలివేణి మాత్ర మతని వదన సుధాంశు బింబమునకుఁ దన కనుఁగల్వ లర్పించి నిలువఁబడెను. ఆమె కట్టిన తెలిజిలుగుచీరె సడలిపోవని యామె జవ్వనపు బిగివిని బట్టి యిచ్చుచుండెను. కుడిచేతితోఁ దలుపు పైయంచు పట్టుకొని యెడమపాదమును గుడి మోకాటిపైఁబూన్చి పరాయత్తయై నిలువఁబడుటలో నామె పయ్యెద జారిపోయెను. జారిపోయిన సంగతి యామె గుర్తించి

నట్లులేదు. ఆమె తొడిగిన సన్నని నున్నని రోజాసిల్కు జాకెట్టు యౌవనభార బంధురములగు నామె పాలిండ్ల పరువమును బయలు పెట్టుచుండెను. అది చాలదో యన్నట్లు నల్లత్రాచువంటి యామె పొడవైన, దట్టమైన వాల్జడ కుచద్వయ మధ్యస్థముగా ముందుకు వేయఁబడియుండెను. రాజశేఖరునివంటి సంయమి చిత్తమును గదలింప లేదుగాని యన్యుల మనముల నా యొయ్యారి భంగిమ వెన్నవలెఁ గరంగఁజేయును. రమణారెడ్డితో సంభాషణ ముగించి రాజశేఖరుఁడు వెడలిపోవఁగనే నల్లగ్రుంకిన దిశాభాగమట్లు ఆమె హృదయ మంధకార బంధురమాయెను. అంతదనుకఁ దా నచ్చట నిలుచుండిన సంగతి రమణారెడ్డికిఁ దెలియకుండఁగనే యలివేణి యచటినుండి లోనికేఁగెను.

రమణారెడ్డి రాజశేఖరరావునకు రెండు విషయములలో తన యాధిక్యమును దెలుపఁజూచెను. మొదటిది తన భార్యపైఁ దనకున్న యధికారము. పాప మాతని కదిలేకపోఁగాఁ దా నిల్లటికమునకు వచ్చి భార్య నదుపుచేయలేని హీనస్థితిలో నున్నట్లు అలివేణి యతనిగుట్టు బయటపెట్టెను. రెండవది తాను గొప్ప నాగరిక జీవినని రాజశేఖరు నకుఁ దెలియఁజేయ నుద్దేశించెను. కాని తా ననుకొన్న నాగరిక జీవి తము కేవలము బుద్ధిహీనమైనదని రాజశేఖరుఁ డన్యాపదేశముగ ఋజువు చేసెను. ఎటుచూచినను రాజశేఖరుఁడు తనకన్నఁ దెలివిగలవాఁడుగ నతనికిఁ దోఁచుచుండెను. కాని యతని గొప్పదనమును మెచ్చుకొను సంస్కార మతనికిలేదు. అతనినిజూచి యసూయ పడుటయే యతనికిఁ జేతనైనపని. ఆ యసూయ నేఁ డినుమడించెను. చేతనైనయెడల నతని కార్యక్రమమును భంగముచేయవలెనని యతఁడు సంకల్పించెను. ఆ సంకల్పముతో నేవేవో యాలోచనలు సేయఁదొడఁగెను.

# XI

## పెండ్లి - కులము

రాజశేఖరరావు రమణారెడ్డితో సంభాషించి ప్రచారమునకై యచ్చటచ్చటఁ దిరిగి యింటి కేఁగునప్పటికిఁ దండ్రి తనకొఱకై వేచి యుండెను. అతఁడు రాకున్నను మామూలుగాఁ దాను భోజనముసేయు కోదండరామయ్యగారేలకో యానాఁడు కుమారుని కొఱకు వేచి యుండెను. కోదండరామయ్యగారును గుమారు లిరువురును గలిసి భోజనమునకు లేచిరి. భోజన సమయములో రాజశేఖరుఁడు గ్రామోద్ధరణకై యే యే ప్రయత్నములు జరుగుచున్నదియు వివరముగఁ దండ్రికిఁ దెలిపెను. భోజనానంతరము కోదండరామయ్యగారు రాజశేఖరునితో నిట్లనెను.

కోదం:- అబ్బాయీ ! నీవు చేసేదంతా బాగానే ఉన్నది. నలుగురు నీ పనికి సంతోషపడుతున్నారు. మా తండ్రి రాజయ్యగారు కూడ నలుగురికీ సౌఖ్యం కలిగే మార్గాలే ఆలోచిస్తుండేవారు. ఆయన పేరు పెట్టుకొన్నందుకు ఆయనశాఖ పోనియ్యకుండా పట్టుకొచ్చావు. సంతోషమే; కాని నేను పెద్దవాణ్ణయిపోతున్నాను. నీకు పెళ్ళిచేసి నీకు నాలుగుకాయలు కాస్తే చూచిపోదామని ఆశపడుతున్నాను. మరి నీ వింతవరకు పెళ్ళిమాటే రానీయవైతివి. అదొక్కటే నా విచారం.

రాజ:- నాయనా ! నీ మాట కెదురు చెప్పకూడదనే నా నియమం. యుద్ధానికి వెళ్ళినప్పుడు నీ కెదురు నడిచాను. కాని అది మన మంచికే అని నా అంతరాత్మ చెప్పడంవల్ల తప్పుకాదనుకొన్నాను. ఇక పెళ్ళి విషయంలో మరొకసారి నీ కెదురు చెప్పవలసి వచ్చింది. తన కుమారులు పెళ్ళిచేసుకొని అందరివలెనే సుఖవంతులై సంతానవంతులై వర్ధిల్లాలని ప్రతి తండ్రికీ ఉంటుంది. నేను కాదనను. కాని ఎవరిమటుకు వారట్లా కోరితే దేశం కొరకు పాటుపడే వారెవరుంటారు ? ఏ కొందరైనా త్యాగంచేసి తమ జీవితాలను దేశాని

కల్పిస్తే తప్ప దేశం ముందుకురాదు. తాత గ్రామహితం కోరే వాడని నీవే చెపుతున్నావు. తాతపేరు నిలపడానికైనా నేను పెళ్ళి మాని గ్రామం కొరకూ, దేశం కొరకూ పాటుపడాలనుకొన్నాను.

కోదం:- ఏం, పెళ్ళిచేసుకొని యిప్పుడు చేస్తున్నమాదిరిగానే పది మందికీ సేవ చేయగూడదూ ?

రాజ:- లేదు; పెళ్ళి చేసుకోగానే సంసారపు జంజాటాలు ఏర్పడు తుంది. స్వార్థం ఏర్పడుతుంది. కోరికలు మారిపోయి త్యాగం కష్ట మౌతుంది. అంతేకాక నిజమైన ప్రజాసేవకు తపస్సువంటి నిరంతర ఆలోచన కావాలి. పవిత్రమైన భావం కలగాలి. ఎంతశ్రమకైనా ఓర్చుకొనే శక్తికలగాలి. సత్యానికి కట్టుబడాలి. అహింస వ్రతంగా పెట్టుకోవాలి. ఇవన్నీ గృహస్థుకు కుదరవు. దీనికి అస్ఖలిత బ్రహ్మ చర్యం అత్యవసరం.

కోదం:- గాంధీగారు పెండ్లిచేసుకొని పిల్లలగన్నవాడు గదా! ఆయన చేయలేదటరా, దేశసేవ ? ఆయనకంటె గొప్పసేవ చేసినవారెవరు?

రాజ:- గాంధీగారికి బాధ్యత తెలియని పసితనంలో తల్లిదండ్రులు పెండ్లిచేశారు. ఆయన చేసుకొన్న పెళ్ళికాదు. అంతేకాక తాను జీవితంలో ప్రవేశించేటప్పటికి ముందు తా నేమిచేయబోతున్నాడో ఆయనకు తెలియదు. అనుభవం గడించిన మీదట తన జీవిత మార్గం ఇది అని నిర్ణయించుకొన్నాడు. అప్పుడనుకొన్నాడు; వైవాహిక జీవితం తనకు తగదు అని. అప్పటినుంచీ సంసార సుఖాలు త్యజించి పవిత్రమైన బ్రహ్మచర్యం అవలంబించాడు. తన పెళ్ళినాటికి ఈ అనుభవం కలిగివున్నా, లేక తాను చేయవల సిన పని యిటువంటిది అని అప్పటి కా యువకునకు తెలిసివున్నా, గాంధీగారు పెళ్ళిచేసుకొనేవారు గాదు. మానవసేవ యెట్లా చేయాలో గాంధీమహాత్ముడు తన జీవితంవల్ల ఇతరులకు చూపిం చాడు. ఆయన కెవరూ చూపినవారుగారు. కాబట్టే తెలియక మొదట సాంసారిక జీవితంలో ప్రవేశించి తరువాత మార్గం మార్చు కొన్నాడు. కాని మాబోటివాళ్ళకు మహాత్ముడు వేసిపోయిన

మార్గం రాచబాటలాగ, శుభ్రంగా కనిపిస్తున్నది. ఆ మార్గాన కళ్ళుమూసుకుపోవచ్చు. అదే నే నిప్పుడు చేసేది, ఆయనమార్గం అనుసరించాలంటే బ్రహ్మచర్యం మొదటి అవసరం.

కోదం:- మానవసేవ చేయదలచిన వారందరు బ్రహ్మచారులు కావలసిందేనా?

రాజ:- అవసరంలేదు. కాని కొందరైనా బ్రహ్మచారులు కావాలి. గ్రామాని కిద్దరు ముగ్గురైనా బ్రహ్మచారులుంటే కొంతసేవ జరుగుతుంది. మన ప్రాచీనకాలంలో ముక్కుమూసుకొని తపస్సుచేసే ఋషులందరూ ఎల్లకాలం అడవులలో ఉండేవారుకారు. తపస్సు చేసినంతకాలంచేసి తరువాత లోకంలో తిరుగుతూ మానవసేవ చేసేవారు. వారూ బ్రహ్మచారులుగా ఉండేవారే. కేవలం తపస్సు చేసుకొంటూ తమంతట తాము తరించిపోయేవారైతే ప్రపంచానికి ఉపయోగించేవారేకారు. ఆ కాలంలో మనదేశం అంతముందుకు పోయేదే కాదు. మానవసేవావ్రతం మనకు పూర్వకాలంనుంచీ సంప్రదాయసిద్ధంగా వస్తూనేవున్నది. ఆధ్యాత్మికబలం మన దేశంలో పెరిగినంత యెక్కడా పెరగలేదు. ఆ బలం పెరగడానికి ఈ మానవసేవ, ఈ సేవ జరగడానికి ఆ బలము అన్యోన్యకారణాలు. మధ్యకాలంలో ఈ సేవావ్రతం, ఆధ్యాత్మిక చింతా రెండూ చాల వరకు నశించినవి. గాంధీమహాత్ముడు నూతన యుగపురుషుడు. బుద్ధుడుపోయిన యింతకాలానికి మళ్ళీ భగవదంశతో ఉద్భవించి ఆత్మవిస్మృతి చెందిన భారతదేశాన్ని మేలుకొలిపాడు. ఆ మేలుకొలుపువల్లనే మన ప్రాచీన సంప్రదాయాలు, కాలానుగుణములైన మార్పులతో, మళ్ళీ ఆచరణకు వస్తున్నాయి. మానవసేవకొరకు బ్రహ్మచర్యం అవలంబించాలని నేను చెప్పడం ఆ సంప్రదాయాల ననుసరించే. ఇంకొకవిషయం. మగవాడై పుట్టిన ప్రతివాడూ పెళ్ళిచేసికొని పిల్లల కనవలెనని మనవాళ్ళు అనుకొంటారు. దేనికి? జనాభా తక్కువైందా? తక్కువగాలేదుసరికదా! భూమి భరించలేనంత పెరిగిపోయిందికూడాను. భూమిలో పండే పంటచాలక ఎంగి

లాకులకోసం కొట్లాడుకొనే కుక్కలమాదిరి ప్రజలు పోట్లాడు కొంటున్నారు. ఒకజాతితో ఒకజాతి, ఒకదేశంతో ఒకదేశం యుద్ధాలు చేస్తున్నాయి. ఇదంతా చూస్తూనే ప్రతివాడూ పెళ్ళి చేసుకొని ఇంకా జనాభా పెంచాలనడం అవివేకంకాదూ? "అపుత్రస్య గతి ర్నాస్తి" అని శాస్త్రం ఉద్ఘాటిస్తారు. అది ఏ పరిస్థితులలో పుట్టిందో! బహుశా, ఒకప్పుడు దేశంలో పురుష బలం కొఱవై రాజ్యసంరక్షణ, ఆహారోత్పత్తి మొదలైన పనులకు ఇబ్బంది కలిగియుండవచ్చు. అప్పుడు ప్రతి పురుషుణ్ణి పెళ్ళిచేసు కొనమని బలవంతపెట్టడం అవసరమై ఉండవచ్చు. ఆ పరిస్థితిలో "అపుత్రస్య గతి ర్నాస్తి" అనే శాసనం పుట్టివుండవచ్చు. జర్మనీలో పురుషబలం తక్కువైనదనేకదా! మన మెరిగినతరువాతనే "హిట్లరు నియంత" ప్రతి స్త్రీని పెళ్ళిచేసుకొని పిల్లల గనమని శాసించింది! మనదేశంలో ఇప్పు డుత్పత్తి చేయవలసింది ఆహారధాన్యాలు కాని పిల్లలుకాదు. పిల్లలకేం పుష్కలంగా ఉన్నారు. వీలైతే ఈ పిల్లల ఉత్పత్తి తగ్గించాలి. అందుకు స్త్రీ పురుషులలో బ్రహ్మచర్యం వ్యాపిస్తే అటు ఉత్పత్తి తగ్గి భూభారమూ తగ్గుతుంది, ఇటు మానవసేవా బాగా జరుగుతుంది. మరి యిటువంటి పరిస్థితులలో నేను పెళ్ళిచేసుకోలేదని విచారపడడం దేనికి నాయనా?

కోదం:- నీ వాదానికి నేనేమీ జవాబు చెప్పలేను. అదీగాక, కొడు కులు తమంతైన తరువాత తండ్రులు నీతిచెప్పడంకూడా సబబు కాదు నాయనా! నీవు పెరిగినవాడవుకాని పసివాడవు గావు! నీ బాగోగులు నీకు తెలుసు. కాబట్టి నీ మనసుకు ఏది బాగని తోస్తుందో అదే చెయ్యి. నా మనసారా దీవిస్తున్నాను. మరి ఒక మాట! తమ్ముడికైనా మంచి సంబంధంచూచి ముడివేస్తే నాకు కొంత సంతోషం. వాడికంటే చెల్లెలిపెళ్ళి ముందుచెయ్యాలి. పొలం పదెకరాలు కనబడుతుంటే మళ్ళా కట్నాలు ఎక్కువవుతు తున్నారు. నా తరం గడిచిపోతున్నది. ఉన్నదానిలో కొంతభాగం కట్నంక్రింద పోగొడితే తమ్ముడి కన్యాయం జరుగుతుంది. ఎవరిని

కదిలించినా నాలుగెకరాలిస్తావా? ఐదెకరాలిస్తావా? అని పై చూపులోనే ఉన్నారు.

రాజ:- మన కమ్మవారిలోనే అమ్మాయి నివ్వాలంటే అంతకు తక్కువరారు.

రాజశేఖరరావు ఈ మాట యనుసరికి కోదండరామయ్యగా రాశ్చర్యచకితులై "ఏమిటబ్బాయి! కమ్మవారికిగాక ఇంకెవరికిస్తాం? నాకర్థం కావడంలేదు!" అని పల్కెను.

రాజ:- ఏం, రెడ్లకివ్వగూడదా, వెలమవారి కివ్వగూడదా, తెలగ వారి కివ్వగూడదా?

కోదం:- మరి కుల మేమై పోతుంది?

రాజ:- ఏమౌతుంది? ఏమీకాదు. రెడ్లు, వెలమలు, తెలగాలు కమ్మవారు, వీరంతా మొదట ఒకటే కులం గాదూ? వర్ణాశ్రమ ధర్మాలప్రకారం అందరూ రైతులేగా! అందరూ యోధులేగా! ఇందులో మరి యిన్ని భేదా లెందుకు?

కోదం:- మరెందు కున్నాయి, యిన్నియుగాలుగా యీ భేదాలు?

రాజ:- ఈ భేదాలు ఎవరు పెట్టారో, ఎందుకు పెట్టారో భగవంతుడికే తెలియాలి. మనం ఫలాని కులం అని మనస్సులో అనుకుంటేతప్ప మనకూ పైనచెప్పిన తక్కినజాతులకూ భేదమేమైనా కనిపిస్తుందా? మనకూ వెంకటరెడ్డి మామగారికీ భేదమేమైనా కనిపిస్తున్నదా? దగ్గరవిషయంగదా విచారించు!

కోదండరామయ్యగారు కొంచెము విచారించి "నిజమే కనిపించదు. అందరి ఆచారాలూ ఒకటే. అందరమూ ఒకేమాదిరిగాఉంటాం.

రాజ:- అంతేకాదు; అందరికీ ఒకటే భాష. ఒకటే మతం. ఒకటే నీతి. ఒకేమాదిరి కట్టు, బొట్టు, జుట్టు! మరి భేదం ఎందులో ఉన్నది?

కోదం:- ఎందులో ఉన్నదో!

రాజ:- మన మనస్సులో. అంతే!

కోదం:- నిజమేగాని మరి నమ్మడానికి వీలులేకుండా ఉన్నది!

రాజ:- అదే పూర్వాచారం యొక్క మహిమ. శతాబ్దాలనుంచీ అర్థంలేని యీ కులభేదాలు పెరిగి గడ్డకట్టుకొనిపోయినాయి. లేని పోని యీ భేదాలవల్ల ఒకళ్ళతో ఒకళ్ళం సఖ్యంగా ఉండక పోరాడుకొంటున్నాం. వివాహ సంబంధాలు "కులం" అనే ఆ గీటు లోనే జరగాలని భ్రమపడి యెంత నష్టానికైనా, కష్టానికైనా ఒప్పుకుంటున్నాం!

కోదం:- మరి యిప్పుడు తీసేసుకుందామంటే పోతాయా?

రాజ:- అసలుండేగా తీసేసుకోవడం? ఇచ్చి పుచ్చుకోవడం జరిగితే ఎక్కడి భేదాలు అక్కడే మాయమయిపోతాయి.

కోదం:- మరి సంఘం ఒప్పుకొంటుందా?

రాజ - "సంఘం" అంటే యేమిటి? మనకు మించి; మనముగాని సంఘం ఎక్కడిది? మనమే సంఘం! మన కూడికవల్లనేగా సంఘం ఏర్పడ్డది?

కోదం:-నిజమే, కాని వాళ్ళందరూ ఈ మార్పులకు ఒప్పుకొంటూరా?

రాజ:- మొదట్లో ఒప్పుకోరు. ఏ పూర్వాచారం మార్చాలన్నా మొదట పెద్ద అలజడి కలుగుతుంది. ధైర్యంచేసి ఒకరిద్దరు మార్పు చేస్తే తర్వాత తక్కినవారు తమంతట తామే కలిసివస్తారు. మనం చూస్తుండగానే ఎన్నిఆచారాలు మారిపోవడంలేదు? బ్రాహ్మలలో నియోగులు వైదికులు ఇచ్చిపుచ్చుకొనడం ఎన్నడైనా వుండేదా పూర్వం? ఇప్పు డెన్ని చూడడంలేదు, అటువంటి సంస్కార వివాహాలు? కృషీవలజాతిలో కులాంతర వివాహాలు అంతకంటె విపరీతం అనిపించుకుంటాయా?

కోదం:- నిజమే. దీర్ఘంగా ఆలోచిస్తే తప్పు కనబడదు. మరి యింత కాలం ఎందుకు జరగలేదో యిట్లాంటి వివాహాలు?

రాజ:- పూర్వాచార భయంవల్ల, ఆలోచన లేకపోవడంవల్ల, వ్యక్తుల మీద సమాజాని కప్పట్లో ఉన్న నిరంకుశాధికారంవల్ల, బహుశా పూర్వకాలపు రాజనీతివల్లకూడానేమో!

కోదం:- అదేమిటి?

రాజ:- వీళ్ళందరూ ఇన్నికులాలుగావుండి దెబ్బలాడుకుంటూవుంటే తప్ప రాజకార్యనిర్వాహకులకు పనిజరిగేదికాదేమో! అదేమైనా కానివ్వండి; ఇప్పుడుమాత్రం ఈ కులభేదాలు అనవసరం.

కోదండ:- మనం ఒక్కళ్ళం అనుకొంటే అవుతుందా; నాయనా?

రాజ:- కాదు, యుగధర్మం మారిపోతున్నది. ఇప్పటికే ఆలోచనగల వారు చాలమంది కులవ్యవస్థపైన తిరుగుబాటు చేస్తున్నారు. కులాంతర వివాహాలు చేసుకొంటున్నారు. జన్మను బట్టి కులం ఏర్పడ్డదంటే ఎవ్వరూ నమ్మడంలేదు. శాస్త్ర ప్రమాణాన్ని భూతద్దంలోపెట్టి పరీక్షచేసి ప్రాచీన ధర్మాలు ఇప్పటి పరిస్థితులకు అన్నీ అన్వయించవని తీర్మానిస్తున్నారు. మనకు స్వరాజ్యం వచ్చినప్పటి నుంచీ కులమత భేదరహితమైన సమాజం ఏర్పడి అందరూ సమాన ప్రతిపత్తిగలిగి ఉండాలని మన నాయకులందరూ ఉద్బోధిస్తున్నారు. మానవునికీ మానవునికీ మధ్య మానవకల్పితమైన భేదం నశించాలనే ప్రబోధ శంఖారావం మోగిపోతున్నది. దేవుడిగుడి ఛాయలకుగూడా రాగూడదన్న హరిజనుణ్ణి గర్భగుడిలోకి కూడా రానిస్తున్నారు.. హరిజనులనీ, సవర్ణులనీ భేదం రూపుమాసిపోతున్నది. హరిజనుడు అన్నికులాలతో ఏకపంక్తిని గూర్చొని భోంచేస్తున్నాడు. గుణంవల్ల, కర్మవల్ల కులం ఏర్పడాలిగాని కేవలం జన్మవల్లగాదని ప్రతి సాధారణవ్యక్తీ అర్థంచేసుకొంటున్నాడు. ఇంకా మన కృషీవల జాతిలోనేకాదు - హిందూజాతి అంతటి లోనూ కులభేదాలు నశించాలి. ఇంకా జన్మవల్ల హెచ్చుతగ్గులున్నాయని భ్రాంతిపడి ఒకళ్ళొకళ్ళు నాశనంచేసుకొంటూవుంటే మనదేశం ఎప్పుడు బాగుపడుతుంది? విశ్వమానవ సౌభ్రాతృత్వం అనే పరమగమ్యస్థానం ఎప్పుడు చేరుకుంటుంది?

కోదం:- మరి మన ధర్మశాస్త్రాలన్నీ బూటకమంటావా?

రాజ:- అనను. కాని ధర్మాలు దేశకాలాలను బట్టీ పరిస్థితులనుబట్టీ మార్పుకావాలంటాను. ఏ యే ధర్మం ఏ యే కాలంలో ఎందుకు పుట్టిందో తెలుసుకోవాలంటే చాల ప్రయాస. ఇప్పుడా విచారణ

అనవసరం, నిష్ప్రయోజనంకూడాను. ఇప్పు డవసరమైనదేమిటంటే- ప్రకృత పరిస్థితులలో ఎటువంటి ధర్మం ఆచరణయోగ్యమౌతుంది, ఏ ధర్మాన్ని ఎట్లా మార్చుకోవాలి, అనే ఆలోచనే. అంతేకాదు; యుగధర్మం మారిపోయి క్రొత్తధర్మం మహా ప్రవాహంలాగున వస్తూవుంటే యింకా ప్రాచీన ధర్మాలు పట్టుకు కూర్చోగూడదు. కూర్చుంటే అవివేకమే. ఏటి కెదురీదినట్లే.

కోదం:- సరే, నాయనా! కానియ్యి. మాతరం గడిచిపోయింది. మీ రెక్కివచ్చారు. మీ యిష్టంవచ్చినట్లే కానివ్వండి. తమ్ముడికీ, చెల్లెలికీ యెక్కడో అనుకూలమైన సంబంధం చూచి ముడివెయ్యి. నీ వెట్లాచేసినా నాకు సమ్మతమే.

ఈ సంభాషణ యంతయు సీతమ్మగారును, శ్రీరాములు, రుక్మిణి వినుచునేయుండిరి. రాజశేఖరునిమాట కెవ్వరు నెదురాడలేరు. తమకుఁ గలిగిన సందేహములు కోదండరామయ్యగారే రాజశేఖరు నడిగి తీర్చుచుండుటచే నితరులు మాటలాడుట కవసరము లేకుండఁ బోయెను. శ్రీరాములు, రుక్మిణి అన్నగారి మాటయనిన వేదాక్షర ముగానమ్మెదరు. అతఁ డేది చేసినను దమ మంచికే. తమకు వర్ణాంతర వివాహము చేయఁదలఁచుటయుఁ దమ మంచికే. వా రేదో తమలోఁ దా మాలోచనా పరంపరకు వశులైరి.

రాజశేఖరుఁడు కార్యాంతరమున వీధిలోనికిఁ బోయెను. కులాంతర వివాహముల విషయమున రాజశేఖర యువకబృందము గ్రామములో విరివిగాఁ బ్రచారము సేయసాఁగిరి. ఈ యుద్దేశ్యము విని పెద్దపెద్దలు మిక్కిలి గగ్గోలు పడిరి. రాజశేఖరుఁడు పట్టినపట్టు విడువవాఁడుగాఁడని గుర్తించిన పెద్దఘటమ్ములన్నియు నతఁ డీసంస్కారముగూడ తప్పక తెచ్చిపెట్టునని భయపడి తమ శక్తివంచనలేకుండఁ బ్రతికూల ప్రచారమునకు దిగి రచ్చబండలలోఁ జర్చలపైఁ జర్చలు సాగించిరి. కాని యువకులు వాదించినట్లు వారు వాదించలేక శాస్త్ర చోదితాచారములను దాకినయెడలఁ బాపము వాటిల్లుననియు, భగవంతుఁడు సంస్కారుల నెల్లర నెప్పుడో శిక్షించితీరుననియుఁ బిల్లి శాప

ములు వెట్టుచు నవివేకులకు భయము గల్గింపఁ దొడఁగిరి. పుల్లయ్య పంతులుగారి కిందుఁ దీరనిపని గల్గెను. ఇంగ్లీషు చదివినవారుకూడ కుల వ్యవస్థ మంచిదనియే చెప్పుచుండుటకు పుల్లయ్యపంతులుగారు రమణా రెడ్డి నుపయోగించుకొనుచుండెను. రమణారెడ్డి వృద్ధులతో నున్నప్పు డొకమాటయు, యువకులతో నున్నప్పు డొకమాటయుఁ జెప్పుచుండు టచే నతనిమాటపై నెవ్వరికిని విశ్వాసము గుదురకుండెను. మొత్తము మీఁదఁ బ్రజలలోఁ గులాంతరవివాహముల కనుకూల వాతావరణమే యేర్పడుచుండెను. వెంకటరెడ్డిగారివంటి పెద్దపాదు వ్యక్తి కూడ అందుల కంగీకారము చూపుచుండెను. "ఇంతమాత్రం మొదటనే తెలిసివుంటే శుభ్రంగా శాంతమ్మను రాజశేఖరానికే యిచ్చివుందు"నని తనలోఁ దాను విచారించెను. లక్ష్మమ్మగారును, సీతమ్మగారును అట్టి భావమునే వెలిబుచ్చుచుఁ గన్నీరు వెట్టుకొనిరి. కులాంతరవివాహ నిషేధముచేఁ దానును బాధపడినది గావున శాంతాదేవియు వెంటనే యీ నూతన సంస్కారముయొక్క సహేతుకతను,సామంజస్యమును గుర్తించి మహిళాలోకములో ననుకూల ప్రచారము సేయ మొదలిడెను. పాపి రెడ్డి సోదరులు వెంకటరెడ్డిగారిపైఁ గత్తిగట్టుట కిది మఱియొక కారణ మయ్యెను. రాజశేఖరుని కార్యదీక్షయు, సంకల్పదార్ఢ్యమును, అస్వార్థతయు, ఆత్మశక్తియు నందుచేఁ బ్రజల కతనిపైఁ గుదిరిన యచంచల విశ్వాసమును రతూకవచముగా నెట్టి ప్రతికూల ప్రచారమునైనను జయించి కులాంతర వివాహ సంస్కారము వేములపల్లిలోఁ గ్రమక్రమముగా విజయమొందుటకు దారి యేర్పఱచెను. ఎవరో యొకరు దారి జూపినఁ జాలు నెన్నియో సంస్కారవివాహములు జరుగుటకు సిద్ధముగా నుండెను. తన తమ్ముని వివాహముతో రాజశేఖరుఁడే యీ దారి చూపుట కాలోచించుచుండెను.

---

•

# XII

## స హ కా ర ము

మఱునటి యుదయము రాజశేఖరుఁడు, రామరాజు, ధర్మారావునాయుఁడు, రమణారెడ్డి గుంటూరిలో సహకార సంఘముల డిప్యూటి రిజిస్ట్రారువారిని సందర్శించి గ్రామ పరిస్థితులను జెప్పి యచ్చట సహకార సంస్థయొకటి వెంటనే స్థాపించుట కవసరమున్నదని మనవిచేసిరి. ఈ యువకుల యుత్సాహమునకు డిప్యూటి రిజిస్ట్రారువారు సంతోషించి మూఁడవనాఁటికిఁ దా మొక ఇన్‌స్పెక్టరును వేములపల్లికిఁ బంపఁగలమనియు, నంతలోఁ దగిన యేర్పాటులు చేయవలసినదనియు సెలవిచ్చిరి. రాజశేఖరుఁడు వారితో నిట్లు మనవిచేసెను.

"ఒక్క ఋణాలిచ్చే సంస్థమాత్రం మా గ్రామానికి జాలదు. గ్రామస్థులకు గావలసిన ఆర్థిక వసతులన్నీ కలిగించే సంస్థకావాలి. ఒక్కొక్క వసతికి ఒక్కొక్క సంఘం వేరువేరుగా పెట్టడం మాకు సాధ్యంగా కనబడడంలేదు. అన్ని సంఘాలు నడపడంకూడా కష్టమే. ఈ విషయం తమరు ప్రత్యేకంగా ఆలోచించాలి.

డి. రిజిస్ట్రారు:— ఈ విషయం మీరే ప్రస్తావించినందుకు సంతోషం. ప్రభుత్వంవారుకూడా ప్రస్తుతం ఇట్లాంటి నానార్థ సహకారసంఘాలు (మల్టి పర్పస్ సొసైటీలు) నెలకొల్పాలనే సంకల్పించారు. ఈ నానార్థ సంఘం నడపడానికి దేశహితార్థులైన వ్యక్తులు, అస్వార్థంగా పనిచేసేవారు దొరకాలి. అటువంటివారు మీ గ్రామంలో దొరికితే తప్పక నానార్థ సంఘమే పెట్టుకోండి. వివరాలన్నీ మా యిన్‌స్పెక్టరుగారే చెపుతారు.

రాజశేఖరాదులు డిప్యూటి రిజిస్ట్రారు వారియొద్ద సెలవుపుచ్చుకొని వేములపల్లికి వచ్చిరి. రమణారెడ్డి గుంటూరులో సొంతపని యేదో చూచుకొని సాయంకాలమునకు వచ్చెదనని యాగిపోయెను.

మూఁడవనాఁటికి కో-ఆపరేటివ్ ఇన్‌స్పెక్టరుగారు వేములపల్లికి వచ్చిరి. ఎప్పటియట్లు కోవెలలో సభ జరిగెను. ఇన్‌స్పెక్టరుగారిని

బరిచయముచేయుచు వారువచ్చిన కార్యమునుగూర్చి రాజశేఖరుఁ డిట్లు చెప్పెను.

"మనకోరికపైన డిప్యూటి రిజిస్ట్రారువారు ఈ ఇన్‌స్పెక్టరుగారిని మన గ్రామంలో సహకారసంఘం ఏర్పాటుచేయడానికి పంపినారు. గ్రామంలో శాంతిసౌఖ్యాలు కలిగించడానికి సహకారసంఘం చాలా అవసరం. సహకారం అంటే ఏమిటి? సహకార సంఘం అంటే ఏమిటి? అని మొదట మనం తెలుసుకోవాలి. సహకారమంటే మనకు క్రొత్త గాదు. కలిసి పనిచేయడమే. ఈ సహకారం మానవజీవితంలో ప్రతి చర్యలోనూ కనిపిస్తుంది. ఇతర మానవుని సహకారంలేనిదే మానవు డేపనీ చేయలేడు. సమాజంలో ఉండలేడు. అటువంటి సహకారం మీాదనే సమాజం నిర్మాణమై యింతవరకూ వచ్చింది. కాని రాను రాను మానవుడు స్వార్థపరుడై తప్పనిసరి ఐనప్పుడు తప్ప ఇతరులతో సహకరించడం మానివేశాడు. అందువల్ల మానవులలో స్పర్ధయేర్పడ్డది.

ప్రాచీనకాలంలో మనదేశంలో ఈ సహకారభావం బాగా ఉండేది. పల్లీ జీవనం అందువల్ల బహుసుఖంగానూ శాంతంగానూ జరిగేది. గ్రామంలో ప్రజలందరూ ఒకే సమష్టి కుటుంబానికి చెందిన రక్తబంధువులు మాదిరిగా మెలిగేవారు."

గ్రామానికిజెందిన భూమికి గ్రామమే కామందు. వ్యక్తులుగారు. ఎవరి కెంతభూమి కావలెనో ఊరిపెద్దలు విచారించి పంచిపెట్టేవారు. పండిన ధాన్యం ఎవరికెంత కావలెనో వారికంతంత యిచ్చి ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తు ధాన్యరూపాననే చెల్లించి తక్కిన ధాన్యం నిలువ చేసి వుంచేవారు. గ్రామోద్యోగులకు, శిల్పులకు, తక్కిన పనివారికి వారివారి భాగాలు పంచియిచ్చేవారు. పేదసాదలకు అందులోనుంచే ధర్మంచేసేవారు. కాని అందరూకలసి తమ సమష్టి కుటుంబముయొక్క సాముదాయిక క్షేమానికే పనిచేసేవారు. కేవలం వ్యక్తిలాభానికి గాను ఏ పనీ చేసేవారుగారు. చెయ్యడానికి వీలూ వుండేదిగాదు. ఎవరేదిచేసినా అందరికీ ఉపయోగించేది. అందరూకలిసి చేసేది ప్రతి వ్యక్తికి ఉపయోగించేది, అదే సహకారం — అంటే.

వ్యక్తిలాభాలూ, వ్యక్తికి ఆస్తులూ ఏర్పడినతరువాతి కాలంలో గూడా మొత్తంమీద ఈ సహకారభావమే వుంటూవచ్చింది. గ్రామాలలో ధర్మగోళాలనే ధాన్యాగారాలుండేవి. ప్రతిరైతూ తనధాన్యంలో కొంత ఈ గోళానికి యిచ్చేవాడు. పేదసాదలకు అందులోనుండి దానధర్మాలు జరిగేవి. బక్క రైతులు అందులోనుండి ఋణం తీసుకొని వడ్డీతో గలిపి ధాన్యరూపంగానే తిరిగి చెల్లించేవారు.

ఒక్కొక్క వృత్తిచేసే వ్యక్తులందరూ కలిసి ఒక్కొక్క శ్రేణిగా ఏర్పడేవారు. ఆ శ్రేణికిచెందిన వ్యక్తులందరూ ఒకరి కొకరు సహాయం చేసుకొంటూ శ్రేణిమొత్తంమీద సుఖంగా జీవితం గడిపే మార్గాలు చూసుకొనేవారు. ఇప్పుడు గట్టిపడి నిలిచిపోయిన కులాలన్నీ ఆ విధంగా ఏర్పడినవే. రానురాను వ్యక్తియొక్క వృత్తి మారిపోయినా కులంమాత్రం అట్లాగే నిలిచిపోయింది. కులానికి అర్థం లేకుండాపోయింది. అది అట్లా వుండనివ్వండి. ఆ కాలపు శ్రేణులలో ఆదర్శప్రాయమైన సహకారం ఉండేది. ఒకశ్రేణికి మరియొకశ్రేణికి మధ్య గూడా ఇటువంటి సహకారమే ఉండేది. శ్రేణులన్నీకలిసి గ్రామంయొక్క సాముదాయిక శ్రేయస్సుకు పాటుపడేది. గ్రామంలో ఉత్పత్తి అయ్యే ధాన్యాదులు, తయ్యారయ్యే వస్తువులు గ్రామస్తుల ఉపయోగానికే ఖర్చుపడేవి గాని బయటికిపోయేవికావు. గ్రామానికి వుపయోగింపగా మిగిలినవాటినిమాత్రం పరగ్రామాలకు పంపి అక్కడనుండి తమగ్రామానికి కావలసిన వస్తువులు వినిమయ (మారకం) పద్ధతిలో తెప్పించుకొనేవారు.

ఆనాటి గ్రామాలు స్వయంపోషకాలుగా ఉండేవి. స్వయంపాలితాలుగానూ ఉండేవి. ఎందుకంటే, గ్రామానికి కావలసిన సమస్త ధాన్యాలూ, వస్తువులూ గ్రామంలోనే ఉత్పత్తి అయ్యేవి. ఏ కొద్ది వస్తువులుమాత్రమో బయటినుంచి రావలసి ఉండేవి. గ్రామస్థులు తమలో తగాదాలు తామే సులువుగా తీర్చుకొనేవారు. పెద్దలను కొందరిని పంచాయతీ దారులుగా ఎన్నుకొని ఆ పంచాయతి చెప్పినట్లుగా అందరూ నడచుకొనేవారు. గ్రామాలీ విధంగా స్వయంపోషక స్వయం

పాలితస్థితిలో ఉండడంవల్ల పైన రాజులు మారనీ, రాజ్యాలు మారనీ, ఆంధ్రులు రాజ్యంచెయ్యనీ, ద్రావిడులు రాజ్యంచెయ్యనీ, చివరకు విదేశంనుంచీ వచ్చిన మహమ్మదీయులు రాజ్యంచెయ్యనీ, హూణులు రాజ్యంచెయ్యనీ, యుద్ధాలు జరగనీ, విలయాలు సంభవించనీ—గ్రామ పరిపాలనా చట్టమూ, ఆర్థిక విధానమూ ఏ మాత్రం మారేవికావు. రాజులకు కావలసిన శిస్తు ఏ పేచీలేకుండా గ్రామం సాముదాయికంగా చెల్లించేది. దానితో వారు తృప్తిపడి గ్రామ పరిపాలనతో ఏమాత్రం జోక్యం కల్గించుకొనేవారుగారు.

కాని బ్రిటిషు ప్రభుత్వం వచ్చిన తరువాత గ్రామపరిపాలనా యంత్రాన్ని బిళ్ళబీటుగా మార్చారు. భూమిమీద వ్యక్తిస్వామ్యం కల్పించారు. ఏ వ్యక్తి ఆస్తికి ఆ వ్యక్తే కామందన్నారు. పైగా, పరిపాలనాధికారం, న్యాయాధికారం, పంచాయతీనుండి తీసివేసి తమ తాబేదారుల చేతి కప్పగించారు. ఆ తాబేదారులు గ్రామాలలో ఉండరు. ఎక్కడో పట్నాలలో ఉంటారు. దీనినే కేంద్రీకరణం అంటారు. న్యాయం తీర్పు చెప్పడానికి గ్రామపంచాయతీలు పనికిరావని కోర్టులు పెట్టారు. అందువల్ల గ్రామంలో ఏ వ్యక్తీ యింకొక వ్యక్తి యెడల మోమోటపడే అవసరం పోయింది. ఎవరికి వారే పెద్ద. ఎవరికి వారే కామందు. కాబట్టి క్రమంగా గ్రామస్థులలో సహకారభావం పోయింది. ఒకరితో ఒకరు కలిసి పనిచెయ్యవలసిన అవసరం పోయింది. ఎవరిపని వారిదే. ఎవరిలాభాలు వారివే. గ్రామమంతా నాశనమై పోతున్నా "నాకేమి నేను బాగుంటే చాలు" అనే భావం ప్రతివ్యక్తిలోనూ ఏర్పడ్డది. సహకారం నాశనమై పోయింది. క్రొత్తగా తెచ్చిపెట్టిన ఈ ఆర్థికవ్యవస్థవల్ల పెద్దచేప చిన్నచేపను మ్రింగడానికి వీలుచిక్కింది. పెద్దరైతు చిన్నరైతును నులిమివేసి అతని ఆస్తిని భూమిని హరించడం మొదలుపెట్టాడు. బలహీనుణ్ణి బలం కలవాడు కొట్టడం మొదలు పెట్టాడు. షావుకారు, వడ్డీవ్యాపారస్థుడు రైతులను చేజిక్కించుకొన్నారు. ఒక రైతుకున్న పొలం కొంచెమూ ఒక షావుకారు కట్టుకొని ఆ రైతు నెత్తిపై చెంగువేసి పంపుతున్నా గ్రామంలో ఎవ్వరూ ఏమీ

అనని పరిస్థితి యేర్పడ్డది. ఆ పొలం ఇవ్వనని ఆ రైతు ఎదురు తిరిగితే దాన్ని యిప్పించడానికి ప్రభుత్వం శాసనాలుచేసింది. కోర్టులు పెట్టింది. ప్రతి చిన్నవిషయమూ, శాసనసహాయంతో పరిష్కారం కావలసిందే కాని పూర్వం మాదిరి మనిషికీ మనిషికీ ఉన్న సంబంధంవల్లగాదు. కాబట్టి రాను రాను మానవత్వం అడుగంటిపోయి ముసుగువేసుకొన్న రాక్షసత్వం గ్రామసీమలలో తాండవింపసాగింది. అందువల్లనే ఒక వైపున మితిమీరిన సంపద, ఇంకొక వైపున అంతులేని దారిద్ర్యం ఏర్పడి ఒకదాని నొకటి ఉరిమి ఉరిమి చూచుకొంటూ ఎడతెగని స్పర్థ, అశాంతి కలిగిస్తున్నవి.

ఈ విప్లవం వల్ల ముందు రైతు ఎక్కువ దెబ్బతిన్నాడు. తర్వాత పరిశ్రమలు నాశనమైనాయి. అందువల్ల గ్రామసౌభాగ్యమంతా నాశనమైపోయింది. అంతకుముందు స్వయంపోషకాలైయుండే గ్రామాలు రానురాను బస్తీలమీాద ఆధారపడడం సంభవించింది. గ్రామాలు సన్నగిల్లి బస్తీలు పరిశ్రమకేంద్రాలైనాయి. గ్రామాలలో సుఖమైన, శాంతమైన జీవితంచేసే ప్రజలకు బస్తీలలోని కృత్రిమజీవితం అభ్యాసమైంది. ఆ జీవితమే ఆదర్శంకూడా అవుతున్నది. జీవితంలో ఎప్పుడూ ఒకవిధమైన అతృప్తి, అశాంతి యేర్పడుతున్నది. గ్రామాలసంగతి యెవ్వరూ పట్టించుకొననందువల్ల గ్రామీణులు విద్యావిహీనులై, మూర్ఖులై అభాగ్యులైపోతున్నారు.

సభలో ఒకరు:- మాకు సహకారం ఏమిటో చెపుతానని యింకేదో చెపుతున్నావు, రాజశేఖరరావు!

రాజ:- నేను విషయం మరచిపోలేదు. ఈ విషమపరిస్థితులనుండి గ్రామాలను పునరుద్ధరించడానికి సహకారం చాలవరకు ఉపకరిస్తుందని మన ఆశ. ఎట్లా అనే ప్రశ్నకు జవాబు చెప్పేముందు ప్రస్తుతం అమలులో ఉండే సహకారసంఘం అంటే ఏమిటి? అని ఆలోచిద్దాం. సహకారమంటే టూకీగా యిట్లా నిర్వచించవచ్చు - కొందరు వ్యక్తులు తమకందరికీ గావలసిన ఆర్థిక ప్రయోజనం సాధించడానికి గాను తమంతట తాము ఒక సంఘంగా ఏర్పడి తాము సాధించిన

ప్రయోజనం సమంగా అనుభవించే ఉద్యమంపేరు సహకారం అనవచ్చు. అటువంటి సంఘంపేరు సహకారసంఘం అంటారు. తరువాత ఈలాంటి సంస్థ మన గ్రామ సభ్యులకు ఎట్లా ఉపయోగిస్తుందో ఆలోచించాలి. గ్రామంలో ఎప్పుడూ రైతుదే పెద్ద సమస్య. రైతు పేదవాడై - ఈ పేదఱికం ఎందుకువచ్చిందో చెప్పవలెనంటే చాలసేపు అవుతుంది - తన వ్యవసాయం సాగించడానికి డబ్బులేక షావుకారువద్ద ఋణంచేస్తున్నాడు. అతని తాతలు తండ్రులు కొంత అప్పుచేసి అతనినెత్తిన పెట్టిపోయివుంటారు. పాతది కొత్తది కలిసి ఋణభారం అతను తీర్చలేనంతగా పెరిగిపోయింది. అతనిచ్చే చెల్లులన్నీ వడ్డీకే సరిపోయి అసలు అసలుగా మిగులుతుంది - యేయేటి కాయేడు! అందువల్ల రైతు షావుకారుకు ఆజన్మాంతం దాసుడై అతడు చెప్పినట్లు చెయ్యవలసి వస్తుంది. అతడు కష్టపడి పండించుకొన్న ధాన్యం మంచిధర వచ్చేవరకూ నిలువచేసుకోలేడు. ఋణదాత పంటసమయం కనిపెట్టి బాకీ చెల్లించమని ఒత్తిడిచేస్తాడు. అతనిధాన్యం తాను చెప్పేధరకు తనకే కట్టిపెట్టమంటాడు. లేకపోతే దావావేస్తానంటాడు. అల్లరి చేస్తానంటాడు. రైతు ఏదైనా భరిస్తాడుగాని అమర్యాద, అవమానం భరించలేడు. అందువల్ల ఋణదాత కోరినధరకే తన ఫలసాయం అర్పించి ఊరుకుంటాడు. లేదా కల్లంలోనే ధాన్యం తెగనమ్మి బాకీకి చెల్లిస్తాడు. మిగిలినధాన్యం అతని జీవితానికి చాలదు.

వీరారెడ్డి:- ఇదంతా అతిశయోక్తి. ఏ షావుకారూ అంతగొంతుమీద కూర్చోడు. రైతు ఎవ్వడూ ఇట్లా బాధపడడంలేదు.

ఒకరు:- రాజశేఖరరావు ఎక్కువ ఏమీ చెప్పలేదు. షావుకారుచేసే దుండగాలకు నేనే సాక్షిని. నా పదెకరాల పొలంలో వీరారెడ్డిగారే ఏడెకరాలు కట్టుకొన్నాడు. నా రక్తం పీల్చాడు.

రాజ:- నన్ను చివరివరకూ చెప్పనివ్వండి. నేను చెప్పేది సాధారణంగా లోకంలో జరిగే విషయం. ఒకరినిగూర్చి ప్రత్యేకంగా నేను చెప్ప

డంలేను. ప్రతిచోటా నేను చెప్పినట్లు జరుగుతున్నదని గాదు నా భావం.

బాకీకి గాను తెగనమ్మగా మిగిలిన ధాన్యం రైతు జీవితానికి చాలదు. సంవత్సరం పొడుగునా వచ్చే శుభాశుభ కార్యాలకు, రోగాలకు, ఇళ్ళ మరామత్తులకు, బళ్ళ మరామత్తులకు, సేద్యపు ఖర్చులకు, దీనికీ దానికీ మళ్ళీ అప్పుచేస్తాడు. మళ్ళీ పంట వచ్చే టప్పటికి యథాప్రకారమే జరుగుతుంది. చివరకు అప్పు బలమై తీర్చలేక పొలం ఋణదాతలకు కట్టి నాశనమౌతాడు. మరి అతని జీవితం సుఖంగా ఎట్లా జరుగుతుంది ? అత నెప్పుడూ కష్టపడు తూనే ఉంటాడు. అతను పడే శ్రమ ఎవరూ పడరు. అతను చేసే కృషికి కష్టం అతనిది, ఫలం యితరులది. ఇందువల్ల వ్యవసాయం సరిగా సాగక ధాన్యోత్పత్తికూడా క్షీణిస్తున్నది. పొలాలు బాగు చేసుకోడానికి, మంచి ఎరువులు కట్టడానికి, మేలిరకపు విత్తనాలు కొనడానికి, సేద్యంలో క్రొత్తపద్ధతులు ప్రవేశపెట్టడానికి రైతుకు ద్రవ్యవసతిలేదు కాబట్టి మన జీవితానికి అతిముఖ్యమైన ధాన్యో త్పత్తి నానాటికి తగ్గిపోతున్నది. దీని కంతటికీ కారణం రైతుకు ఆర్థికబలం లేకపోవడమే కాబట్టి అట్టి ఆర్థికబలం కలిగించడానికి గ్రామాలలో సహకారసంఘాలు కావాలంటున్నాము. సహకార సంఘంవల్ల రైతుకు ఆర్థికబలం ఎట్లా కలుగుతుంది అని ఆలోచిద్దాం.

ఋణవసతి కావలసిన రైతులందరూ కలిసి ఒక సంఘంగా ఏర్ప డాలి. వీరందరికీ కావలసింది—చౌకరేట్లపైన సులభంగా పంటమీద తీర్చుకోడానికి వీలైన ఋణం. విడివిడిగా ఉన్న రైతులకు ఏ షావు కారూ పొలం తాకట్టులేకుండా అప్పుపెట్టడు. పెట్టినా, తాకట్టు ఆస్తిని చివరి కెట్లాగో తాను కట్టుకొనే ఉద్దేశ్యంతోనే పెడతాడు. మరి సంఘంలో చేరిన రైతు కెట్లా పెడతాడు ? సంఘం సాముదా యకంగా—అనగా—ఉమ్మడిగా తెచ్చిన ఋణానికి సంఘంలో చేరిన రైతులందరూ సమష్టిగానూ వేరువేరుగానూ పూచీపడతారు. చిన్ని చిన్ని వాగులు కలిసి పెద్దనది అవుతుంది. సన్నసన్నని నార

భోగులు కలిసి లావైన తాడౌతుంది. విడివిడిగా వుంటే ఎవరూ లక్ష్య పెట్టని బక్క బక్క రైతులందరూ కలిస్తే బలమైన సంఘమవుతుంది. అట్లా బలపడిన సంఘానికి ఎవరైనా అప్పులిస్తారు. ఇటువంటి గ్రామ సంఘాలన్నీకలిసి జిల్లాకేంద్రంలో సెంట్రల్ బ్యాంకి అనే పేరుతో ఇంకా బలవత్తరమైన సంఘంగా ఏర్పడతాయి. గ్రామసంఘానికి అప్పులివ్వ డానికి ఒకవేళ భయపడినా సెంట్రల్ బ్యాంకికి ఇవ్వడానికి ఎవ్వరూ భయపడరు. డిపాజిట్లు అనే పేరుతో బ్యాంకి ప్రజలనుండి అప్పులు తెచ్చి గ్రామసంఘాలకు అప్పులుగా పంచిపెడుతుంది. గ్రామసంఘం ఆ మొత్తాన్ని తన మెంబరులైన రైతులకు అప్పులుగా బట్వాడా చేస్తుంది.

ఇంకా కొన్ని వివరాలు తెలుసుకొందాం. సంఘంలో చేరిన ప్రతి వ్యక్తీ సంఘ మూలధనానికి తన ఓపికకొద్దీ కొంత చెల్లించాలి. అంటే కొన్ని వాటాలు తీసుకోవాలి. చట్టంప్రకారం కనీసం ఒక్క వాటా అయినా తీసుకుతీరాలి. ఇట్లా యేర్పడ్డ వాటాధనంతో సంఘం సెంట్రలు బ్యాంకిలో వాటాలు కొంటుంది. అట్లా వాటాలుకొంటే తప్ప బ్యాంకి సంఘానికి అప్పుపెట్టదు. వాటాలుకొంటె తప్ప సంఘం కూడా మెంబరులకు అప్పులివ్వదు. కాని సంఘం మెంబరులకు అప్పు లిచ్చేటప్పుడు ఏ పూచీమీద ఇస్తుంది? మెంబరు చెల్లించిన వాటా ధనం మీదనా? కాదు. మరి, అతని సొంత పూచీమీద! అతను మంచివాడు, నిజాయతీ అయిన మనిషి, అప్పు తప్పక చెల్లిస్తాడు – అనే నమ్మకంమీద! అత నొక్కడి పూచీమీద యివ్వడం వ్యాపార లక్షణం కాదనుకొంటే ఇంకొక మెంబరును జామీను తీసుకొని యిస్తుంది. అప్పుడుకూడా అప్పుకు పూచీ-జామీనుదారుని మర్యాదే కాని ఆస్తికాదు. సహకారసంఘం ముఖ్యంగా మనిషి మోమోటమిని బట్టీ, మర్యాదనుబట్టీ అప్పులిచ్చినా, అసలు ఏమీ ఆస్తిలేని నిరుపేద లకు అప్పులివ్వలేదు. ఇచ్చిన అప్పు చెల్లించే తాహతులేనివారికి ఒకరు మటుకు ఋణం ఎట్లా యిస్తారు? అసలుదారునికి, జామీనుదారునికీ ఏ కొంచెమో ఆస్తి ఉండాలి. అంతేకాక ఆస్తితాకట్టుమీదకూడా

సంఘం అప్పులిస్తుంది. ఆ విషయం తర్వాత చూద్దాం. మరి జిల్లా కేంద్రంలో వ్యవహరిస్తూ జిల్లా నాలుగుమూలలనుంచీ ప్రజల డబ్బును పట్టుకొచ్చిన సెంట్రలు బ్యాంకి గ్రామ సంఘానికి ఏ పూచీ మీద ఋణమిస్తుంది? సంఘపు మెంబర్ల ఉమ్మడి పూచీమీదనే. దీన్నే "పరిమితిలేని పూచీ" అంటారు. అనగా, సంఘంచేసే అప్పులకు ప్రతి మెంబరూ — అతనికెంత ఆస్తివున్నదో అంతవరకూ — పూచీ పడతాడని భావం.

వీరారెడ్డి:— వినండి! వినండి!! సంఘంలోచేరినవాళ్ళ పెళ్ళాల పుస్తెల వరకు పూచీ ఉంటుందట! సంఘం మునిగిందా అంటే అందరూ మునిగినట్లే.

రాజు:— రెడ్డిగారుచెప్పినట్లు ఎవరూ భయపడనక్కర్లేదు. ఎందువల్ల నంటే గ్రామ సంఘం తెచ్చే ఋణం మెంబర్లకు పంచిపెట్టేముందు మెంబరుయొక్క ప్రవర్తన మంచిదనీ, అతను మర్యాదస్తుడనీ అప్పు దుర్వినియోగం చెయ్యక వ్యవసాయాది ఫలప్రద కార్యాలకే ఉపయోగించి ఆ వచ్చే ప్రతిఫలంనుండి అప్పు చెల్లించగలడనీ తృప్తిపడితేగాని ఎవ్వరికీ అప్పుపెట్టరు. పైగా, గ్రామంలో ఏ వ్యక్తి యెటువంటివాడో, ఎవడెట్లా ప్రవర్తిస్తున్నాడో, అప్పు మొత్తం ఎట్లా వినియోగించాడో, చెల్లించే యెత్తులో ఉన్నాడో, ఎగవేసే ప్రయత్నంలో ఉన్నాడో సులభంగా కనిపెట్టడానికి వీలున్నది. ప్రతి మెంబరుకు పూచీఉన్నది. కాబట్టి ప్రతి మెంబరూ ఈ దృష్టితో ఇతర మెంబర్లను కనిపెట్టి ఉంటాడు. పట్నాలలో అటువంటి వీలులేదు. బస్తీలలో ఒకరివిషయం ఒకరికి తెలియదు. ఒకరిజోక్యం ఒకరికి పట్టదు. పట్టించుకోరు. గ్రామాలలో అందరి విషయమూ ప్రతివారినికీ తెలుసు. ప్రతివాడూ పట్టించుకొంటాడు. సంఘంలోచేరి ఉమ్మడిబాకీకి పూచీ యెప్పుడైతే వహిస్తాడో అప్పుడు ప్రతిమెంబరు ఇతర మెంబర్లమీద పర్యవేక్షణ చేస్తూ ప్రమాదం వచ్చినప్పుడు సంఘానికి చెప్పి ప్రతీకారం చేయిస్తాడు.

కాబట్టి గ్రామసంఘాలు పెట్టిన అప్పులు మునిగిపోవడానికి వీలు లేదు, పరిమితిలేని పూచీవల్ల ప్రమాదం ఎన్నడూ కలగదు.

ఒకరు:- ప్రమాదాలు చాలాచోట్ల జరిగినాయి. దమ్మిడీ తీసుకోని వాళ్ళనుకూడా పీడించి వేలకువేలు వసూలుచేశారు. నాకు తెలుసు.

రాజు:- స్వార్థపరులు నిర్వాహకులుగాచేరి అమాయకులైన మెంబర్లను మోసంచేసిన సంఘాలలో ఎక్కడైనా ప్రమాదం జరిగి వుండవచ్చు. కాని ప్రతిచోటా జరగదు.

ఇన్స్పెక్టరు:- జరగదని నా అనుభవంమీదకూడా చెప్పగలను. స్వార్థపరులూ, మోసకారులూ ఉన్నప్పుడుగాని మెంబర్లందరు కళ్ళు మూసుకొని సంఘ నిర్వాహకులు – అనగా – మెంబర్లందరు గలసి ఎన్నుకొన్న పంచాయతీదారులు ఎట్లా వ్యవహరిస్తున్నారో అని అలనా పాలనా చెయ్యకుండా వున్నచోటకాని – నూటికి కోటికి ఎక్కడో ఒకచోట జరుగుతుంది. కాని అటువంటి అనుభవాలు కలిగిన తరువాత ప్రతిసంఘము కళ్ళుతెరిచింది. సరియైన విచారణలేకుండ అప్పులు పెట్టడంలేదు. పైగా డిపార్టుమెంటు అధికారులు, బ్యాంకి అధికారులు ఈ అప్పులు సరిగా పెట్టారా లేదా అనీ, వచ్చేవా పోయేవా అనీ ఎప్పటికప్పుడు విచారణ చేస్తుంటారు. అప్పులివ్వకముందే, ఈ విచారణ జరుగుతుంది. తర్వాత వసూలయ్యే వఱకూ, అప్పులు ఋజువుచూచి మోసం వుంటే కనిపెట్టి తగిన చర్య తీసుకొంటారు. కాబట్టి ప్రమాదా లెక్కడా జరగవు.

రాజు:- సరే, ఇక సంఘంయొక్క పరిపాలననుగురించి తెలుసుకొందాం. సంఘంలోచేరిన ప్రతివ్యక్తి అందులో మెంబరౌతాడు. అనగా భాగస్వామి అవుతాడు. మెంబర్లందరూకలిసి అయిదుగురినో, ఏడుగురినో అవసరమైనంతమందిని, పంచాయతీదారులుగా ఎన్నుకుంటారు. ఇందులో ఒక్క విశేషం. మెంబరు సంపన్నుడుగానీ, పేదవాడుగానీ ఒక వాటా తీసుకోనీ పదితీసుకోనీ ఒక్కొక్క మెంబరుకు ఒక్కటే వోటు.

వీరారెడ్డి:- వినండయ్యా, వినండి. పెద్దా చిన్నా ఒకటే బౌతారు. వ్యవహారం ఎక్కడకు పోతున్నదో తెలుసుకోండి.

రాజు:- ఇందులో తప్పేమీలేదు. సహకారసంఘం అంటే నిగ్గుతేలిన ప్రజాస్వామికం. ఇందులో చేరేవారు మానవులుగా జేరుతారు గాని ధనవంతులుగానూ, పేదలుగానూ కాదు. ప్రజారాజ్యంలో కూడా అదే మూలసూత్రం. ప్రజారాజ్యంలో ప్రతి మానవునికీ పరిపాలనలో హక్కువుంటుంది. సమానహక్కు వుంటుంది. ఇక్కడా అంతే. సంఘదృష్టిలో మెంబరు లందరూ సమానులే. ఇందులో హెచ్చుతగ్గులకు అవకాశంలేదు. సహకార సూత్రాలలో ఇది చాల ముఖ్యమైనది. తర్వాత మెంబరు లందరూ ఎన్నుకొన్న పంచాయతీదారులు, మెంబరులు అందరూ కలిసి - అనగా - మహాజన సభగాఏర్పడి - నిర్ణయించే పద్ధతులపైన సంఘం నడుపు తారు. వారు సరిగా నడుపుతున్నదీ లేనిదీ విచారించి లోపాలున్న ప్పుడు పంచాయతిని అడగడానికి ప్రతి మెంబరుకూ అధికారం ఉన్నది. అడగవలసిన బాధ్యతకూడా ఉన్నది. ఈ బాధ్యతను ప్రతి మెంబరు గుర్తించి సంఘ వ్యవహారాలలో శ్రద్ధపుచ్చు కొంటుంటే సంఘానికి ఏ ప్రమాదమూ రాదు.

బ్యాంకినుండీ, వ్యక్తులనుండీ తెచ్చిన అప్పులమీద సంఘం ఎంత వడ్డీయిస్తుందో అంతకంటె కొంచెం హెచ్చురేటుతో మెంబ రులకు అప్పులిస్తుంది. అందువల్ల మిగిలే లాభంలో- సిబ్బంది సాదరు వగైరా ఖర్చులు పోను - తక్కిన దానిని మెంబర్లకు వారివారి వాటాధనపు దామాషాప్రకారం డివిడెండుగా పంచిపెడుతుంది. అంతకుముందే లాభంలో సగం తలవని తలంపుగా వచ్చేనష్టం పూరించుకోడానికి క్షేమనిధిగా తీసి దాచిపెడుతుంది. సాముదా యక ప్రయోజనాలకు కొంతతీసి వుంచుతుంది. ఇంకా మిగిలిన లాభాన్ని క్షేమనిధికే కలుపుతుంది.

గ్రామసంఘంయొక్క స్థూల స్వరూపం, స్వభావం మనమిప్పుడు తెలుసుకొన్నాం. గ్రామాలలో ఇప్పుడు పనిచేసే సంఘాలిటువం

టివే. కాని రైతుకు అప్పులిచ్చినంతమాత్రాన అతని సమస్య లన్నీ తీరవు. అతనికి సంవత్సరం పొడుగునా వ్యవసాయానికి గావలసిన ద్రవ్యవసతి ఎప్పటికప్పుడు, సకాలంలో కలుగజెయ్యాలి. అతను మళ్ళీ షావుకారు చేతిలో పడకుండా చూడాలి. అతనికి ఎరువులు సప్లయిచేయాలి. మంచి విత్తనాలు సప్లయిచేయాలి. నీటి వసతులు కల్పించాలి. ఫలసాయానికి మంచిధర వచ్చే ఉపాయం చూడాలి. దళారులు వచ్చి రైతులాభం కొంచెమూ హరించుకుపోకుండా అరికట్టాలి. తగాదాలు పెంచి డబ్బు సంపా దించే టౌటులబారినుండి అతన్ని రక్షించాలి. అతనికి గావలసిన చిల్లర వెచ్చాలు, వస్త్రాలు, తక్కిన జీవితావసరాలు గ్రామంలోనే సరియైన ధరలకు అందజేయాలి. ఈ జీవితావసరాలను సాధ్యమై నంతవరకు తగ్గించాలి. ఇవి కొనడానికి సంవత్సరం పొడుగునా – అవసరమైతే – అప్పుపెట్టాలి. ఒకటేమిటి? రైతుకు కావలసిన అన్ని వసతులూ, సౌకర్యాలూ ఏర్పరచి అతడు హాయిగా సేద్యం చేసుకొంటూ వీలయినంతధాన్యం ఉత్పత్తిచేసేమార్గం చూడాలి. వ్యవసాయంవల్ల అతనికి తగినంత ఆదాయం రానప్పుడు అతని అభిరుచికీ, సామర్థ్యానికీ తగిన ఉపవృత్తులు కల్పించాలి. అందుకు కూడా ద్రవ్యవసతి యేర్పాటు చెయ్యాలి. అతని సంపాదనలో కొంతైనా మిగిలించి దాచుకొనడం నేర్పాలి.

ఇంకొకవిషయం. గ్రామమంటే ఒక్క రైతులే కాదు. పారి శ్రామికులు, కాయకష్టం చేసుకొనేవారు, కూలీలు అనేకులుంటారు. వారు రైతులపైన, రైతులు వారిపైన ఆధారపడి వుంటారు. సహ కారసంఘం వారికి గావలసిన ఆర్థిక సహాయంకూడా చెయ్యగలదు. గ్రామస్థులు యావన్మందికీ గావలసిన ప్రతి ఆర్థిక సౌకర్యమూ కలిగించి జీవితావసరాల ఉత్పత్తిలో, పంపకంలో మధ్యస్థులను దీసివేసి వ్యక్తియొక్క లాభాపేక్షను, స్వార్థపరతను రూపుమాపి ప్రాచీన గ్రామాలలో ఉండే స్వయంపోషకత్వం, ప్రశాంత సుఖ జీవితం పునరుద్ధరించగలదు. పంచాయతీబోర్డును, సహకార

సంఘాన్ని నమ్ముకొనివుండే యెడల గ్రామస్థులు తమ గ్రామాలలో సర్వతంత్ర స్వతంత్రులై నిజమైన స్వారాజ్య సంపద అనుభవించ గలరు. ఇది అతిశయోక్తి గాదు. స్వార్థరహితులై గ్రామాభిమానం కలిగి పట్టుదలతో పనిచేసే వ్యక్తులుంటే సహకారసంఘం నేను చెప్పిన సహాయమంతా చెయ్యగలదు. అటువంటి సంఘమే మన గ్రామంలో నెలకొల్పి జయప్రదంచెయ్యాలి. ఇతర గ్రామాలకు మన గ్రామం ఆదర్శప్రాయం కావాలి. అదీ నా కోరిక.

ఇంతవరకు మన గ్రామాలలో ఉండే సహకార సంఘాలు ఒక్కొక్క కార్యానికి ఒక్కొక్కటి ఉత్పన్నమై పనిచేస్తున్నవి. అప్పులివ్వడానికి ఒకరకం సంఘం— ఇవే గ్రామాలలో ఇప్పుడు ఎక్కువగా ఉన్నవి— వెచ్చాలు సరఫరా చెయ్యడానికి ఒకరకం సంఘం. గుడ్డ లుత్పత్తి చెయ్యడాని కొకరకం సంఘం. హరిజనులకు భూము లిప్పించి సాగుచేయించడానికి ఒక సంఘం. వాళ్ళకు అప్పు లివ్వడాని కొక సంఘం. పరిశ్రమ లభివృద్ధిచెయ్యడానికొక సంఘం. జలాధారాలు కల్పించడానికీ వాటిని మరామత్తు చెయ్యడానికీ ఒక సంఘం. చిన్న చీలికలైపోయిన పొలాలను సంకలనం చెయ్య డానికి ఒక సంఘం. ఇట్లాగే ఒక్కొక్క ప్రయోజనానికి ఒక్కొక్క సంఘం ఏర్పాటుచేస్తూ పోయినారు. కాని విడివిడిగా యిన్ని సంఘాలు పనిచెయ్యడానికి తగినంత మూలధనం లభించక, కార్య నిర్వాహకులు దొరకక, జరిగేవ్యాపారం కొద్దికావడంవల్ల లాభం చాలక అటువంటి విడి విడి సంఘాలన్నీ జయప్రదంగా పనిచెయ్య లేకపోయినవి. ఈ లోపం గమనించి ప్రభుత్వంవారు ప్రస్తుతం గ్రామాలలో పైన చెప్పిన "ఏకార్థ" సంఘాలుగాక, వివిధప్రయో జనాలను సాధించే "నానార్థ" సహకారసంఘాలు నెలకొల్పాలని నిర్ణయించారట. మొన్న (శ్రీ) డిప్యూటీ రిజిస్ట్రారువారితో సంప్ర దిస్తూ అటువంటి నానార్థసంఘమే మన గ్రామంలో పెట్టించమని నేనూ మన మిత్రులూ మనవి చేసుకొన్నాం. అందుకు వారూ

అంగీకరించి యీ మన ఇన్‌స్పెక్టరుగారిని మన గ్రామానికి వెంటనే పంపించారు. వా రిప్పుడు సహకారసంఘాన్ని గూర్చి ఉపన్యసిస్తారు.

అని రాజశేఖరుఁడు కూర్చుండెను. ఇన్‌స్పెక్టరుగారు లేచి యిట్లనిరి.

సోదరులారా, నేను చెప్పదలచినదీ, తలచనిదీకూడా ఇప్పుడు రాజశేఖరరావుగారే మీకు విశదంగా చెప్పారు. మర్యాదకు నన్ను ఉపన్యసించమన్నారేగాని ఇంకా నేను చెప్పడానికి వారేమీ మిగల్చలేదు. సహకారోద్యమం, సహకార సూత్రాలు అర్థం చేసుకొని ఉద్యమాన్ని గ్రామాలలో నడపడానికి పూనుకొన్న రాజశేఖరరావు వంటి యువకులు, దేశాభిమానులు ఉన్నచోట సహకారసంఘాలు చక్కఁగా పనిచెయ్యగలవు. అట్లాంటిచోట మాపని కూడ సులువౌతుంది. మీ గ్రామపరిస్థితిని బట్టి చూడగా ఇక్కఁడ సహకారసంఘాని కెంతో అవసరమున్నట్లుతోస్తుంది. మీ గ్రామస్థులింతవరకూ సంఘం ఎందుచేత పెట్టుకోలేదో నా కాశ్చర్యంగా ఉన్నది. పంచాయతీబోర్డుకూడా యిటీవలనే నెలకొల్పినట్లువిన్నాను. దానికితోడు సహకారసంఘం కూడా ఉంటే మీ సమస్యలు చాలవరకు తీరిపోయి గ్రామస్థులు సుఖిస్తారు. కాబట్టి మీరు వెంటనే సహకార సంఘంగా ఏర్పడమని నా సలహా. నెలకొల్పదలచినది నానార్థసంఘం కాబట్టి, అప్పులు కావలసిన రైతులే కాకుండా గ్రామంలోని వారందరూ ఈ సంఘంలో చేరడం మంచిది. అవసరం కూడాను. గ్రామంలో సంపన్నులుకూడా చాలమంది ఉన్నట్లు విన్నాను. వారి డబ్బు వృథాగా పెట్టెలలో మూల్గకుండా సంఘంలో డిపాజిట్లుగా వేస్తే మంచి వడ్డీలు వస్తాయి. డబ్బు సురక్షితంగానూ ఉంటుంది. ఇంతవరకు నిష్ప్రయోజనంగా పడివున్న డబ్బంతా గ్రామకల్యాణానికి వినియోగమవుతుంది. పారిశ్రామికులకు, హరిజనులకు ముఖ్యంగా మద్యపాన నిషేధంవల్ల పనిలేకుండా పోయిన గౌడులకు సంఘంలో ప్రత్యేక వసతులు కల్పించ సంకల్పించినట్లు రాజశేఖరరావుగారు నాతో చెప్పారు. కాబట్టి యిటు

వంటి వారందరూ ఈ సంఘంలో నిస్సందేహంగా చేరవలెనని నేను సలహా చెప్తున్నాను. అట్లా చేరితేనే గాని సహకార సంఘం వారికి సహాయం చేయలేదు. అది సహకార సూత్రాలలో ముఖ్యమైనది. అందుచేతనే సంఘంవల్ల ఏ యితర ప్రయోజనం కోరక పోయినా వెచ్చాలు కొనడానికైనా ప్రతివారూ సంఘంలో చేరాలి. మెంబరు కానివారికి వెచ్చాలుకూడా అమ్మదు సహకార సంఘం. ఇట్లు నానార్థాలూ, లేక సకలార్థాలూ తన ప్రణాళికలో కలిగిన సహకార సంఘం గ్రామానికి కామధేనువు, కల్పవృక్షం వంటిది. సర్వజనులూ అందులో చేరి సంఘంవల్లతామూ, తమవల్ల సంఘమూ వర్ధిల్లేటట్లు చెయ్యాలని నా కోరిక.

అని ఇన్‌స్పెక్టరుగారు విరమించిరి. వడ్డీవ్యాపారము చేయు రామకృష్ణయ్యగారు (రాజశేఖరుని పెదతండ్రి) వీరారెడ్డిగారు (రమణారెడ్డి మామ) మున్నగువారు కొంచెము ప్రతిఘటించిరి. "మా బాకీలు రాబట్టుకొనడం ఎట్లా? ఫలసాయం కాస్తా సంఘమే తీసుకొంటే రైతులు బాకీ లెట్లా తీర్చుతారు! అని వారడిగిరి.

రాజ:- సంఘమే మీ బాకీలు తీర్చిన తర్వాత నెమ్మదిగా బాకీదార్ల వల్ల రాబట్టుకొంటుంది.

ఇన్‌స్పెక్టరుగారు:- మీరు వడ్డీవ్యాపారం పడిపోతుందని భయపడ నవసరంలేదు. మీ డబ్బంతా సంఘంలో డిపాజిట్టు చేయవచ్చు. మీ రట్లా చేస్తే సంఘం సెంట్రలుబ్యాంకినుండి అప్పు తెచ్చే అవసరం కూడా ఉండదు.

ఈ మాటలు వినిపించుకొనకుండగనే వీరారెడ్డిగారు "వడ్డీరేటు చాల తక్కువ. సంఘం చెప్పినట్లు మేం వినవలసి వస్తుంది" అని లోలోన నేదియో గొణిగికొనిరి. రాజశేఖరుఁ డీ మాటలు వినకపోలేదు.

రాజ:- అది తప్పదు. గ్రామశ్రేయస్సుకొరకూ, సోదర మానవుల సౌఖ్యం కొరకూ మీరు కొంత త్యాగం చెయ్యాలి. అట్లా త్యాగంచేసి సంఘం యిచ్చే వడ్డీ రేటుమీద మీ డబ్బు సంఘంలో

డిపాజిట్టు చెయ్యడానికి మీా రిష్టపడకపోతే మిమ్మెలను ఎవ్వరూ బలవంతం చెయ్యరు. మీా యిష్టం వచ్చినచోట యిచ్చుకోవచ్చు.
పీరారెడ్డి:- ఎటుతిరిగీ సంఘం మాకు అపకారమే చేస్తుంది.
రాజ:- సంఘం మీాకు అపకారం చెయ్యదు. పేదలకు ఉపకారం చేస్తుంది. న్యాయం చేస్తుంది.

వెంటనే కొందఱు వర్తకులులేచి "మా వ్యాపారం ఏంకావాలి? స్టోర్సుపెడితే మేమేం కావాలి?" అని అడిగిరి.
రాజ:- స్టోర్సులో మీారు అదే పని చెయ్యవచ్చు. మీాకు తగినంత ఆదాయం సంఘమే యిస్తుంది.

వర్తకులకు రాజశేఖరుని సమాధానము రుచింపలేదు. "అబ్బే అది ఏ మూలలకు?" అని యాక్షేపించుచుఁ బెదవి విఱువఁ దొడఁగిరి. "మీారు సుఖంగా కాలక్షేపం చెయ్యడానికెంత గావాలో అంత మీాకు దక్కుతుంది. మీారు మితిమించికావాలంటే సంఘం ఇవ్వలేదు" అని రాజశేఖరుఁడు జవాబు చెప్పెను. ఇట్లే కొంతసేపు ప్రశ్నోత్తరములు జరిగెను. సభ్యులలో నేకొలఁదిమందిమో తప్పఁ దక్కిన వారెల్లరు సంఘము స్థాపింపవలయునని కుతూహలముతోఁ దమ యభిప్రాయమును వెలిబుచ్చిరి. "ఈ షావుకారులకోసం, వర్తకులకోసమేనా గ్రామం, వారికి కష్టమైతే ఔతుంది, సంఘం తప్పకుండా పెట్టవలసిందే" అని కొంద తెలుగెత్తి చెప్పిరి.

అంతట ఇన్‌స్పెక్టరుగారు కొన్ని కాగితములు తీసిరి. ఒకటి దరఖాస్తు. రెండవది సంఘపు నిబంధనావళి. సంఘముపేరు "వేములపల్లి నానార్థ సహకార సంఘము" అని పెట్టిరి. పరిమితిలేని పూచీమీాద సంఘము నెలకొల్పుచున్నట్లు చెప్పిరి. నిబంధనలు చదివి ముఖ్యాంశములు సభ్యులకు వివరించిరి. అందఱు సంతకములు చేసిరి. మాసము దినములలో సంఘము రిజిష్టరు కావచ్చునని ఇన్‌స్పెక్టరుగారు చెప్పుచు-రాజశేఖరుని, తదనుచరులగు రామరాజు, ధర్మారావు మున్నగు యువకుల నభినందించిరి. అట్టి సభయందుఁగూడ మహిళామణులు-పాల్గొనుచుండుట మిగులఁ బ్రోత్సాహకరముగా నున్నదనియు, నందు

లకు పంచాయతీబోర్డు ప్రెసిడెంటు శాంతాదేవిగారు చేయుచున్న విద్యావ్యాప్తియే కారణమై యుండవలయుననియు నామె నభినందించిరి. ఈ గ్రామము రాజశేఖరాది యువకుల సేవవలనఁ ద్వరలో నాదర్శ గ్రామము గాఁగలదని తమ యభిప్రాయము వెలిబుచ్చిరి.

సభ యంతటి ముగిసెను. అందఱు వెడలిపోయిరి. రాజశేఖర రావు ఇన్‌స్పెక్టరుగారితో నింక నేవో మాటలాడుచుండఁగా నొక పెద్దమనుష్యుఁడు – వేములపల్లి కపరిచితుఁడు – చరచర రాజశేఖరుని యొద్దకు వచ్చి యిట్లనెను.

పెద్ద:– రాజశేఖరరావుగారు మీ రేనా ?

రాజ:– ఔను, తమ రెవ్వరో అడుగవచ్చునా ?

ఆ పెద్దమనుష్యుఁడు తా నెవ్వరో రాజశేఖరునకుఁ దెలుపక, ఇంచుక నవ్వుచు "మీ కో-ఆపరేటివ్ ఇన్‌స్పెక్టరుగారి నడగండి"యని పల్కెను. ఇన్‌స్పెక్టరుగారును, నా పెద్దమనుష్యునివంక తేరిపారఁజూచి "నేను గుర్తించలేనండి, కంఠస్వరం పరిచితంగానే ఉన్నదికాని......" అని యాలోచనలోఁ బడెను. వెంటనే యపరిచితుఁడైన యా పెద్ద మనుష్యుఁడు తన దొంగమీసములు, తలపాగా తీసివేసి "ఇప్పుడు గుర్తిస్తారా" అని పల్కెను. ఇన్‌స్పెక్టరుగారు కొంచె మచ్చెరు వంది "హాల్లో, సుందరరావుగారూ! మీ రెందుకొచ్చారు, ఈ మీటింగుకు? మారువేషంతో మరీ వచ్చారే! ఏమైనా హడావిడి ఉన్నదా, యిక్కడ కూడా ? అని పల్కుచు రాజశేఖరుని వంక దిరిగి "రాజ శేఖరరావుగారూ, వీ రెవరో తెలుసా, సి. ఐ. డి. సబ్ ఇన్‌స్పెక్టరు సుందరరావుగారు" అని చెప్పెను. రాజశేఖరరావు సుందరరావుగారికి నమస్కరించి, చిఱునవ్వుతో "మా వూళ్లో మీకు గిరాకి యెక్కడిది?" అని అడిగెను.

సుంద:– ఉన్నదని రిపోర్టు ఒకటి వచ్చింది! ఇక్కడ కమ్యూనిష్టు ప్రాబల్యం ఎక్కువైనదనీ, రైతుకు, కూలీలకూ స్పర్ధ పెరిగిపోతున్న దనీ, ధనవంతులైన వీరారెడ్డిగారు మొదలైనవారికి ప్రాణా పాయంగా ఉన్నదనీ ఒకరు పిటీషన్ పెట్టారు. ఎన్నడూ వినలేదు

వేములపల్లిలో అటువంటి హడావుడి ఉన్నదని. అయినా విచారిద్దా మని వచ్చాను.

రాజ:- విచిత్రం! మరి విచారణంతా అయిపోయిందా ?

సుంద:- అయిపోయింది. ఈ మీటింగుకూడా సహకారం అనే పేరుతో కమ్యూనిజం బోధచెయ్యడానికే యేర్పడ్డదనికూడా పిటీషనులో చూచి యిక్కడకుకూడా వచ్చాను.

రాజ:- మరి, యిక్కడ ఉపన్యాసాలుకూడా విన్నారా?

సుంద:- విన్నాను. నేను చెయ్యవలసిన విచారణంతా అయిపోయింది. ఆ కమ్యూనిష్టు నాయకునితో మాట్లాడడం ఒక్కటే మిగిలింది.

రాజ:- ఎవరట, ఆ నాయకుడు ?

సుంద:- మీరే!

ఈ మాట వినుసరికి రాజశేఖరునకు నవ్వాగలేదు. పక పక నవ్వుచు "సరే మాట్లాడండి" యనెను.

సుంద:- ఈ మాట్లాడింది చాలు; ఇంతవరకూ మీ ఉపన్యాసం విన్నాను. మీ భావాలు గ్రహించాను. అంతకుముందు గ్రామంలో మీ పూర్వోదంతం, మీ సేవా కార్యక్రమం అంతా తెలుసుకొన్నాను. మీ గ్రామంలో కమ్యూనిజం లేకపోగా మీ బోటి నిజమైన ప్రజాసేవకు లున్నట్లు తెలుసుకొన్నందుకూ మీతో పరిచయభాగ్యం కలిగినందుకూ చాలా సంతోషపడుతున్నాను.

కో.ఇన్స్పె:- మీరుచెప్పేది చాల ఆశ్చర్యంగా ఉన్నది. సుందరరావు గారూ !

సుంద:-ఆ పిటిషనుదా రెవరో అడగ రేం మీరు, రాజశేఖరరావుగారూ!

రాజశేఖరరావునకుఁ గొంచెము నవ్వు వచ్చెను. "ఎవరైతేనేం తెలుసుకొని యేం చెయ్యమంటారు" అని పల్కెను.

సుంద:- అయినా తెలుసుకోవడం మంచిదికదా! మీ కెవరైనా విరోధులున్నారా, గ్రామంలో ?

రాజ:- నా కెవ్వరూ విరోధులు లేరు. ఎవరికైనా నేను విరోధినేమో నాకు తెలియదు.

సుంద:- పందిపాటి రమణారెడ్డి మీకు మిత్రుడా, శత్రుడా ?

రాజ:- నా కందరూ మిత్రులేనని చెప్పానుగదండీ! మరి ఆయన మా బృందంలోనివాడే!

సుంద:- ఆయన స్వయంగా పిటీషను వ్రాసి మూడురోజులనాడు పోలీసు ఆఫీసులో ఇచ్చివెళ్ళాడు. ఇప్పటికీ మిత్రుడేనా ?

రాజ:-ఇప్పటికే కాదు. ఎప్పటికీ! ఆయన తెలియక చేసివుంటాడా వని!

సుంద:- మీదంతా గాంధీగారి వేదాంతం లాగున్నది!

రాజ:- ఏదైనా కానివ్వండి. పాపం, రమణారెడ్డి చదువుకొన్నవాడే గాని తెలియనివాడు. మొన్న ఏవో ఆర్థికసిద్ధాంతాలను గురించి తర్కించాడు. ఆ మాటలలో ఏ సంవాదంలో, ఏ మాటనుబట్టి ఊహించాడో నేను కమ్యూనిస్టునని, పాపం!

రాజశేఖరుని స్వభావమునకు ఇన్‌స్పెక్టరు లిరువురకు నవ్వు వచ్చెను. వారు నవ్వుకొనుచు బయల్వెడలిరి. రాజశేఖరుడు వారిని ఊరి బయటవఱకు సాగనంపి వచ్చెను.

## XIII

# కార్యకలాపము

సహకారసభ జరిగిన మఱునాఁడు అలివేణి, శాంతాదేవిగారి మహిళావిద్యాలయమునుండి యింటికేఁగుచు కోదండరామయ్యగారి యింటికిఁ బోయెను. బయట వసారాగదియందు రాజశేఖరరావు ఒంటరిగాఁ గూర్చుండి యేదో యాలోచించుచుండెను. అప్పటికింకను గావలసిన కార్యక్రమ మెంతయో యుండెను. పంచాయతీపనియే సాంతము గాలేదు. పాఠశాల, ఆసుపత్రి యింకను బెట్టలేదు. గుంటూరు రస్తాకు రోడ్డింకను గలుపలేదు. సహకారసంఘ మింకను వ్యవస్థాపన దశయందే యుండెను. సంఘము రిజిష్టరై పని ప్రారంభించిన తరువాత చేయవలసిన దెంతయో కలదు. సాంఘిక సంస్కారము లెన్నియో చేయవలసియుండెను. హరిజనసేవ యింకను జరుగుటలేదు. ఈ కార్యములన్నియు నెట్లు నిర్వహింపవలయునో! యేది ముందు చేయవలయునో! దేనికెట్లుపక్రమింపవలయునో! – అతని హృదయములో నివియే యాలోచనలు. రామరాజాదులు తన కెంత సహాయభూతులగుచున్నను, శాంతాదేవి తన విధిని తా నెంత శ్రద్ధగా నిర్వహించుచున్నను, గ్రామ సముజ్జీవన కార్యభారమంతయు నతని భుజములమీఁదనే యుండెను. అతని హృదయ మెల్లప్పుడు నీయాలోచనలతో నిబిడీకృతమై యాహార నిద్రాదులయందు సైతము రవంత వైముఖ్యము గల్గించుచుండెను. అతని కింక నే జోక్యము లేదు.

అతఁ డిట్లు దీర్ఘాలోచనా తత్పరుఁడై తపస్వివలెఁ గూర్చుండి యున్నసమయమున నలివేణి యతనిగదిలోఁ బ్రవేశించి చిఱునగవు వెన్నెల లొలకఁబోయుచుఁ జెంగట నిలువఁబడి యుండెను. ఆమెరాక యతని కక్కజమయ్యెను. తన యాలోచనా సూత్రము నక్కడికిఁ ద్రెంపి యామె మొగముఁ జూడకయే యామె నిట్లు పలుకరించెను.

రాజః– ఎందుకమ్మా! ఎన్నడూరాని దానివి మా యింటికొచ్చావు? ఏమైనా పనివున్నదా, నాతో?

అలివేణి:- మొన్న మీరు మా యింటికి వచ్చారు. తిరిగి నేను మీ యింటికి రావడం ధర్మమని వచ్చాను. రాగూడదండీ!

రాజ:- రాగూడదనికాదు. నేను రమణారెడ్డిగారికొరకు మీ యింటికి వచ్చాను, మొన్న - నీ కొరకుకాదుగదా!

అలి:- *యెల్లారెడ్డికి ఇల్లొకటున్నదా ? మా యింటికి కాపురాని కొచ్చి పడివున్నాడు. ఇంటి కామందురాలను నేనుగాని ఆయన కాదు.

రాజ:- నీవు ఆయన యింటికి కాపురానికి పోనియ్యి. ఆయన నీ యింటికి కాపురానికి రానియ్యి మొత్తముమీద మీ రిద్దరూ భార్యాభర్తలు. ఇంటికిద్దరూ భాగస్వాములు. ప్రతియింటికీఅంతే. అయినా ఇప్పు డా విషయం దేనికి ?

అలివేణి:- ఆ విషయమే యిప్పుడు కావలసినది. మొన్న ఆయన తరహా ఆయన మాటలు చూచారుగదా!

రాజ:- అవి కుటుంబరహస్యాలు. గృహచ్ఛిద్రాలు. వాటినిగూర్చి యితరులకు చెప్పగూడదు. ఎట్లాగో సరిపెట్టుకొని సంసారం జరుపుకోవాలి. రమణారెడ్డిగారు బస్తీమనిషి. ఇంగ్లీషు సంస్కారాలు గలవాడు. నీవుగూడ ఆయన మనస్సు ననుసరించి పోవాలి, కొంత వరకు. చేతనైతే ఆయన పక్కీ మార్చాలి. గృహిణి చెయ్యవలసిన పని అదే.

అలి:- ఏం మార్చమంటారు. మీ దగ్గర నిజంచెపుతున్నాను. మా నాయన నాకు తెలియకుండా ఆయనను నా కిచ్చిచేశాడు. ఆయన పైన నాకు మొదటినుంచీలేదు. నాపైనఆయనకూలేదు. ఆయనలో చాల దుర్గుణాలున్నవి. చెప్పుకుంటే సిగ్గు. ఇప్పటికికూడా తాగుడు మానలేదు. రాత్రిళ్ళు పూలరంగడై వచ్చి నన్ను హింసిస్తాడు. ఇన్నాళ్ళూ భరించాను. ఎవ్వరికీ చెప్పినదానను గాను. మా అమ్మకూ నాయనకూ తెలిసికూడా యేమీ చేయలేకపోతున్నారు.

---

*మగనిపేరు తెలుఁగుఁ బడఁతులు చెప్పరు. అవసరమైనప్పు డిట్లు మారు పేరు చెప్పుదురు.

రమణారెడ్డితోఁ దాను పడుచున్న బాధలన్నియు రాజశేఖరున కెఱిఁగించి అలివేణి యూరక కన్నీరు పెట్టఁదొడఁగెను.

రాజ:- అట్లా విచారించి నిరుత్సాహపడితే లాభంలేదు. మనలో వివాహసంబంధం చాల గట్టిది. తీసివేసుకొనటానికి వీలులేనిది. వీలున్నా అంతంతమాత్రాన తీసివేసికోవడమూ మంచిదికాదు. ఇట్లాంటి సందర్భాలలోనే స్త్రీ తెలివిగలిగి ప్రవర్తించి భర్తను సంస్కరించాలి.

అలి:-మీరు చెప్పేది జరిగే పని కాదు.

రాజ:- ప్రయత్నించి చూడలేదునీవు. చూడు, ఇంకా కొన్నాళ్ళు. తాగుడు వీలులేకుండా మనం చేయవచ్చు. దొంగసారాయి మన వూళ్ళోకూడా దొరుకుతున్నదని యింతవరకు నాకు తెలియదు. ఆ విషయం తీవ్రంగా ఆలోచిస్తాను. నీవు నిరుత్సాహపడక రెడ్డి గారి మనస్సు మార్చే ఉపాయంచూడు. నీవుకూడా ఆయనయందు ప్రేమ కలిగించుకోవాలి.

అలి:- ప్రేమ కలిగించుకోవాలి! ప్రేమ కలిగించుకోవాలి!! ఇదెక్కడైనా సాధ్యమైనపనేనా? ఈ చెప్పేది రాజశేఖరరావుగారేనా?

రాజ:- సాధ్యంకానిపనేమీకాదు, అలివేణీ! ఆయనయందు నీ మనస్సులో నిష్కలంకమైన ప్రేమాభిమానాలు కలిగితే నీయందు ఆయనకు కలిగి తీరుతాయి. ఇది ప్రకృతిసూత్రం. నమ్ము. ఇవ్వాళ నుంచీ ప్రయత్నంచేసిచూడు. వెళ్ళమ్మా, ఇక వెళ్ళు.

అలి:- మీకంటే నాకు సహాయంచేసే వాళ్ళెవరూలేరు. మీరే నా దిక్కు.

రాజ:- ఒకరి సహాయం అవసరంలేదు నీకు. అప్పటికీ, నా చేతనైన సహాయం నేను చేస్తాను వెళ్ళు.

రాజశేఖరరావు ప్రశాంతవదనముతో, నిశ్చలమైన మనస్సుతో, నీమాటలు పల్కుసరికి, అలివేణి కూర్చుండినచోటినుండి లేచుటకుఁ బ్రయత్నించుచు మాటలలో తడబాటు దోఁప "అట్లాకాదు, చేతులో చెయ్యి వెయ్యాలి" అని పల్కెను. రాజశేఖరుఁడు "అవసరంలేదు, నా మాట

ఒకటీ చేత ఒకటీకాదు" అని ధైర్యము చెప్పెను. కాని అలివేణి "చేతులో చెయ్యి వెయ్యకపోతే నేను వెళ్ళలేను, నేను వెళ్ళను" అని గట్టిగాఁ బల్కెను. ఈ సారి యామె పల్కిన పల్కులలోఁ దడబా టెక్కువయ్యెను. ఆమె కూర్చుండను లేకపోయినది, నిలువను లేకపోయి నది. దీనాతిదీనమైన వదనముతో రాజశేఖరుని చెంతఁ జేరి రెండు చేతులు చాఁచెను. ఆమె వాలకములో, మాటలలో నొక వికారము స్పష్టముగ కన్పించెను. రాజశేఖరుఁడు ప్రమాదము శంకించెను. వెంటనే లేచిపోవ నుంకించెను. ఇప్పపాటులో నలివేణి యుబ్బిపోయెడి తన పాలిండ్లను విశాలమైన యతని యురమునకు మోపి గట్టిగాఁ గౌఁగి లించుకొనెను. విస్మయ విషాద చేతస్కుఁడై యతఁ డామె కౌఁగిటి యుఁరిని బలవంతముగ విడిపించుకొని యా గదినుండి వెడలిపోయెను.

"కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్" కలంచకున్నను గాసి పెట్టును. రాజశేఖరుని హృదయ గతిని చిత్రించుట మిగులఁ గష్టము. మిలిటరీ జీవితమునందు సైతము తప్పించుకొని వచ్చిన తరుణీ తనుస్పర్శ నాఁ డాకస్మికముగ నతనిఁ బైకొనెను. ప్రాణమున కన్నఁ బదిలముగ రక్షించుకొనుచున్న బ్రహ్మచర్యమునకు మైల సోఁకెను. శోక మెఱుఁగని యతని హృదయము ఖిన్నమయ్యెను. అతని కేదో క్రొత్తయనుభూతి యొకటి కలిగెను. సంయతమై సంరక్షితమైయున్న తన యింద్రియశక్తిపై బందిపోటువలె నతని కా యనుభూతి తోఁచెను. స్త్రీ సాహసము దాను వినియున్నాడు. స్త్రీ సామర్థ్యమును, స్వభావ మును గూర్చి తాను జదివియున్నాడు. కాని స్త్రీ పురుషునికంటె మెత్తని హృదయముగలది, సంయమము కలదని యతఁడు భావించు చుండెను. స్త్రీ పురుష సంబంధమగు సామాజిక మర్యాద యతిక్ర మించుటలో, నవినీతికరముగాఁ బ్రవర్తించుటలో స్త్రీ కంటెఁ బురు షుఁడే యెక్కువ దోషియని యతఁ డనుకొనుచుండెను. పురుషుడు నీతి మంతుఁడై యున్నయెడల స్త్రీ యతనిఁ జెనకఁజాలదని యతని నమ్మ కము. నేఁ డా విశ్వాసము చలించెను. పురుషుఁ డెంత యింద్రియ లోలుఁడో, స్త్రీయు నంతే యనియు - నొకవాసి యెక్కువే యనియు-

నతఁడు భావింపఁదొడఁగెను. తా నింతగా నుద్బోధించు సంయమనము స్త్రీకిఁ గూడ నవసరమని యతఁడప్పు డూహించెను.

తన వ్రతము భంగముసేయఁ దివిరిన యలివేణిపై నతని కించు కయుఁ గినుకలేదు. స్త్రీ ప్రకృతినిగూర్చి మాత్ర మతఁడు తత్త్వ జిజ్ఞాసలోఁ బడెను. ఆమె పరిస్థితులను గూర్చియు, నజ్ఞాన జన్యమైనదు-దుర్భరమగు నామె చిత్తవ్యథను గూర్చియుఁ దలపోసి యామెపై జాలిగొనెను. అతనిపై నామె కేమియు ద్వేషములేదు. అతనిని హింసించుటగాని. ఖిన్నపఱచుటగాని యామె యభిమతముగాదు. మఱి తన నిట్లు చేసిన దన్నందుల కామె బాధ్యురాలుకాదు. జ్ఞానోద యముకాని ముద్దరాలు. విద్యాగంధములేని యభాగ్య. పాప మామె తప్పేదియు లేదు.

ఇందుఁ దన దోష మేమైన నుండునా యని యంతర్దృష్టి నుప యోగించెను. ఉద్దేశ్యమున నెట్టి దోషము లేకున్నను నాఁటి సంఘట నకుఁ దానుగూడ బాధ్యుఁడే యని యతని యంతరాత్మ యస్ఫుటముగా నేదో చెప్పెను. తా నస్ఖలిత బ్రహ్మచారియై యారోగ్యమును దేహ సౌందర్యమును బోషించుకొనెను. గృహస్థుల కలభ్యమగు తేజస్సొకటి యా సౌందర్యమునకుఁ దోడయ్యెను. అందువలనఁ దన యాకారము ఆనుషంగికముగా యువతీహృదయాకర్షక మగుచుండెను. ఇంద్రియ లోలయగు నలివేణి తనను గామించుటలో నామెయందుకంటెఁ దన యందే కదా, మఱి యెక్కువ దోషమున్నది? ఇది తన దోషమగునా? తిరిగి సందేహము! గగన మండలమునఁ బ్రకాశించు సుధాకరబింబమును గాంచి కువలయములు కలకల వికసించుటలేదా? మఱి కుముదినీ హృదయ చౌర్య మొక దోషమని చంద్రుని కంటఁగట్ట నగునా? కాదు. చంద్రుఁడు ప్రకాశించుట స్వీయధర్మ నిర్వహణ మగును. కామినీజన మనోహరరూపమునఁ దాను రచ్చలఁ జరించుట తన ధర్మమగునా? చరించుట ధర్మమే కాని తన మూర్తియుఁ దేజస్సును తరుణీ హృద యముల నాకర్షింపనిచ్చుట ధర్మముగాదు. గడ్డము, మీసలు బెంచి నచోఁ దన యాకారమునఁ గొంత మార్పు గలుగును. కావి గుడ్డలు

కట్టినచో నింకఁ గొంత మార్పు గలుగును. తాను సంయమి యనియు, విలాసదూరుఁ డనియు నెలతలు గ్రహించి తనపైఁ గనువేదురు మాను దురు. గడ్డములు, మీసలు, కాషాయాంబరములు స్వీయేంద్రియ సంయమమునే కాక యిట్టి ప్రయోజనముగూడ సాధించునని మన ప్రాచీను లిట్టి వేషమును సన్యాసులకు నిర్ణయించిరా? ఏమో, కావచ్చు! నాఁటి సాయంకాల మెల్ల రాజశేఖరుఁ డీ విధముగాఁ దనలోఁ దాను తర్కించుకొనుచుండెను. నాఁటి యపూర్వానుభవముచే భంగపడిన యాత్మశాంతిని తిరిగి సాధించుటకును, అంగనాలింగన కళంకితమైన తన హృదయమును నిర్మలమొనరించుకొనుటకును, అనుద్దిష్టముగానైనను దా నొనరించిన దోషముఁ బరిహరించుకొనుటకును అతఁడు మఱుసటి మూఁడు దినములు నుపవాసముఁ జేసెను. నాలవ నాఁ డతఁడు తేరు కొని యెప్పటి యట్లు తిరుగనేర్చెను.

అయిదవనాఁడు భోజనానంతర మతఁ డిల్లు బయలుదేరఁగనే-రమణారెడ్డి యెదురయ్యెను. తనను కమ్యూనిస్టు నాయకునిగా నధికారులకుఁ దెలిపి తనకుఁ గారానివాసయోగము కల్పింప నుద్దేశించిన రెడ్డిగారిపైఁ దన కే కోశమున నైన ద్వేష మంకురించునేమోయని రాజశేఖరుఁడు భయపడెను. కాని యట్టి ద్వేషమును తాను జయింపఁ గల్గినట్లు రమణారెడ్డి హార్దదర్శనము రుజువుపఱచెను. అతని నెప్పటి యట్ల చూడఁగలిగెను. ఎప్పటి యట్ల మాటలాడఁ గలిగెను. రెడ్డి మాత్రము స్వయంకృత దోషజ్ఞతచే నించుక తడబడఁ జొచ్చెను. కారణ మెఱిఁగిన రాజశేఖరుఁ డతనిపై జాలివడెను. తాఁ జేసిన దోషము మాత్రము రాజశేఖరుని కింకను దెలియదనియే రమణారెడ్డి భావించుచుండెను. తా నంపిన యర్జీ ననుసరించి పోలీసువారు నేఁడో రేపో రాజశేఖరునిఁ బట్టుకొనిపోదురని యింకను గలలు గనుచునే యుండెను.

తరువాత రాజశేఖరుఁ డెప్పటియట్లు వెంకటరెడ్డిగారి యింటి కేఁగెను. శాంతాదేవి మహిళాజనమునకుఁ జదువు చెప్పుచుండెను. అందుఁ జేరిన మహిళలలో నలివేణియుఁ గనిపించెను. ఆమె దర్శనము

వలనఁగూడ నతని హృదయమం దెట్టి వికారమును గలుగలేదు. తన మనస్సు తన యదుపులో నున్నదిగదా యని రాజశేఖరుఁ డెంతయు సంతసించెను.

తనతో మాటలాడువా రెవ్వరు లేకపోవుటచే నతఁ డొంటరిగా మండువాముందరి గచ్చుటరుగులపైఁ గూర్చుండి లోన శాంతాదేవి చెప్పు పాఠములు వినుచుండెను. తాయారమ్మ యతనిని దొంగిచూచి పోయెను. ఇంతలో రాఘవరెడ్డి పొలమునుండి వచ్చెను. లోనికేఁగుచు రాజశేఖరునితో మాటలాడకపోవుటయేకాక యతనిని జులుచుఅఁ జూచుచుఁబోయెను. లోనికిఁబోయి భార్యనుబిలిచి "ఇక్కడ మాట్లాడే వాళ్ళెవళ్ళూలేరు, పొమ్మనకపోయినావా ? వాకిట్లో కూర్చుంటే కన బడడంలేదా ?"యని రొసరొసలాడెను. "వాకిట్లో ఎవరు కూర్చున్నారో నాకేం తెలుసు ? అయినా పరాయిమొగవాళ్ళతో మాట్లాడ్డానికి నేను మీ యింటి ఆడపడుచునుగాను. అదుపు, ఆజ్ఞలలోఁ బెరిగిన వాళ్ళం మేము. ఎప్పుడూ రచ్చకెక్కినవాళ్ళంకాము" అని తాయారమ్మ చులుక్కున నంటించెను. "ఏడిచావ్, నోరుముయ్ !" అని రాఘవరెడ్డి యదుపుచేసెను. "ఇదొకటి చేతనౌతుంది - చేసుకొన్న ఆడది దిక్కు లేకుండా పడివున్నదిగదా యని నోటికొచ్చినట్లు మాట్లాడడం! చెల్లెలి నదుపుచేయడం చేతకాక పెళ్ళాంమీద విరుచుకుపడడం దేనికి ? ఏని గంత మగవాడివి నీవు చెప్పడానికి భయపడి, ఆడపక్షిని నన్ను చెప్ప మంటావేం, ఆయనను పొమ్మని ?" అని నస పొడిగించుచుండెను. తననుగూర్చి జరుగుచుండిన యీ సంభాషణ నంతవఱకువిని యింకను వినలేక రాజశేఖరుఁ డచటినుండి వెడలిపోయెను.

వెంకటరెడ్డిగారియింట నానాఁటికి నీగోల యధికమగుచుండెను. పై సంభాషణ జరిగిన సాయంకాలము రాఘవరెడ్డి పాపిరెడ్డి యింటి మీఁదుగా నెచ్చటికో పోవుచుండెను. పాపిరెడ్డి యెవరితోడనో మాట లాడుచు నింటిముంగిట నిలువఁబడియుండెను. రాఘవరెడ్డినిఁజూచి "మూతిమీసం ఉండగానే సరిగాదు,- రొయ్యకు లేదా మీసము అన్నట్లు ! తలజెడ్డ తోఁబుట్టువులు పడుచుకుతింటుంటే నోరు మెదప

లేని వెధవలకు మీసం దేనికి? అని యింక నేవో వదరఁదొడఁగెను. ఆ మాటలకు రాఘవరెడ్డి యులికిపడెను. పాపిరెడ్డితోఁ గయ్యము సేయుటకంటె నింటఁ దండ్రితో నీ విషయము పరిష్కారముసేయుటే మంచిదని వెంటనే వెనుకకు మరలెను. తల్లి దండ్రులతో నేమేమి మాటాడెనో, శాంతాదేవి యేమి చెప్పెనో, కర్ణకటువులు, హృదయ భంజకములునగు నా వాగ్వాద వివరములన్నియు మనము వినుట కన్నఁ బర్యవసానము దెలిసికొన్నఁ జాలును. శాంతాదేవి యీ యింట నందఱితోఁ గలిసియుండుట పొసఁగదని తేల్చుకొనుటయే పర్యవసానము. వెంకటరెడ్డిగారు తమకుఁ దండ్రి పంచియిచ్చిన యేఁబది యెకరములలో నిరువదియైదెకరములు, నింట సగముభాగము కుమారునకుఁ బంచియిచ్చెను. తక్కిన భాగమునఁ దాను, తనభార్య, తన కూతురు శాంతాదేవి యుండుట కేర్పాటుచేసిరి. రెండుభాగములకు సంబంధములేకుండ నిటుకగోడ యడ్డముగట్టిరి. తమ భాగమున రాకపోకలకు వీలగునట్లు దక్షిణముగా నింకొక వాకిలిబెట్టిరి. రెడ్డిగారి స్వార్జితముతోఁగలిసి నలుబది యెకరముల పొలము. తన యనంతరము తన యాస్తి శాంతకే చెందఁజేయుటకుఁగూడ రెడ్డిగా రాలోచింపఁ దొడఁగిరి.

జాగ యగు భార్య దుర్బోధలు విని హిమజలమువలె నిర్మల మగు శాంతాదేవి శీలమును శంకించి యల్లరిచేయుచున్న కుమారుని వెంకటరెడ్డిగారు క్షమింపలేకపోయిరి. తాను వృద్ధుఁడగుచుండెను. కుమారుఁడు పెత్తనమునకు వచ్చెను. కాని యతఁ డవివేకి. భార్య గీసినగీటు దాటఁడు. అది విధికృతము. కావునఁ దన కర్తవ్యము వేరు పడుటయే. తనకొఱకుగాదు. తన గారాబుతనయ, లోకోత్తరచరిత తన యవివేకముచే బాలవైధవ్యమందిన శాంతకొఱకు. ఇందుఁ గుమారున కన్యాయము జరుగలేదు. కూఁతునకు మాత్రము న్యాయము జరిగెను. రాఘవరెడ్డి తనకెంత కొడుకో శాంత తనకంత కూతురు. అతని కిరువురు సమానులే. ఆడుదిగదా, యని కూతుపైఁ జులకందనమేల? చింతించి చింతించి రెడ్డిగారు చివరకు నిర్ణయమునకు

వచ్చిరి. భార్యయు వల్లె యనెను. ఇప్పుడు తన కాపురము, కుమారుని కాపురము వేరయ్యెను. తండ్రియన్నఁ బులివలె భయపడు రాఘవరెడ్డి యింత సాహసము చూపెనా ? యని యతని స్వభావమెఱిఁగిన వారెల్లరు నాశ్చర్యపడిరి. భార్యా ప్రభావమని యింతలో వారే వ్యాఖ్యానముకూడ చేసిరి. కోదండరామయ్యగారి కుటుంబమొక్కటియే యీ దురదృష్ట సంఘటనకు మిగులఁ బరితపించుచుండెను. శాంతా రాజశేఖరులు దీనిని బట్టించుకొనలేదు. తాము జన్మించినది మానవ సేవకొఱకు. తదితరములు విధి నిర్ణయములై జరిగిపోవును. తమకేల ?

విభాగములైన మఱునాఁడు పంచాయతీబోర్డు మీటింగు జరిగెను. మామూలు ప్రకారము రాజశేఖరరావుకూడ సభకు హాజరయ్యెను. నాఁటి చర్చనీయాంశములలో గ్రామమునఁ బాఠశాల, యాసుపత్రి నెలకొల్పుట మొదటి విషయములుగా నుండెను. ఆ రెండు విషయములను బేర్కొని శాంతాదేవి యిట్లు పలికెను.

“పాఠశాలకు, ఆసుపత్రికి గ్రామములో ఎంతైనా అవసరమున్నది. కాని నా అభిప్రాయంలో గుంటూరు రస్తాకు ఫీడరురోడ్డు వేసికొన్నతరువాత ఈ రెండు కార్యాలు తలపెట్టడం మంచిది. రోడ్డు లేనిది గ్రామాని కెవరు రావలెనన్నా ఇబ్బంది పడుతున్నారు. మొన్న డిప్యూటి రిజిస్ట్రారుగారిని వేములపల్లి రావలసిందని కోరగా ‘వానలు నిలిచినమీదగాని మీ గ్రామం రాలేను’. అని వాయిదా వేశారు. స్కూలు, ఆసుపత్రి పెడితే చేర్చవలసిన సామాను చేర్చుకోలేక కష్టపడవలసి వస్తుంది. డాక్టరు, టీచర్లు రాకపోకలు చెయ్యడమూ కష్టమే. అంతేకాదు, గుంటూరు రస్తాకు పొయ్యే డొంకనానుకొని మూడు గ్రామాలున్నాయి. ఈ మూడు గ్రామాలలోని పిల్లకాయలు మన స్కూలుకే వస్తారు. ఆ డొంకంతా బురదే. రోడ్డుపడినమీదట వాళ్ళు సులభంగా వచ్చిపోగలరు. కాబట్టి రోడ్డు విషయం ముందుగా ఆలోచించాలి.

తక్కిన సభ్యులు చాలామంది యదే యభిప్రాయము వెలిబుచ్చిరి. క్రైస్తవసభ్యుఁడైన ఈసాకు, చివుకుల వెంకటరమణశర్మ రోడ్డు

వేయుటకు ద్రవ్యము చాల కావలసియుండుటచే రోడ్డు పడువటకు స్కూలు, ఆసుపత్రి నిలుపుట మంచిదాయని యనుమానపడిరి. అప్పుడు రాజశేఖరరావు ప్రెసిడెంటు అనుమతితో మాటలాడుచు నిట్లనెను.

"మనకు స్కూలూ, ఆసుపత్రీ, రోడ్డూ అన్నీ ముఖ్యమే. ఈ మూడూ ద్రవ్యం బాగా వుంటేనేగాని సాధ్యంకావు. ప్రభుత్వంవారు కొంత గ్రాంటు ఇచ్చేమాట వాస్తవమే. కాని ఒక్క గ్రాంటుతోనే ఈ పనులు కావుగదా? తక్కిన డబ్బంతా పంచాయతీ భరించాలి. లేదా, గ్రామస్థులు భరించాలి. పంచాయతి కింత ఆదాయంలేదు. మన ప్రభుత్వంవారు పంచాయతీలకు ఏదో ఒక క్రొత్త శాసనం చేయబోతున్నారనీ, అందువల్ల పంచాయతీలకు ఎక్కువ అధికారాలేకాక, ఎక్కువ ఆదాయంకూడా రాగలదని మన మీ మధ్య పత్రికలలో చదివాము. కాబట్టి ఇంకా కొంత కాలం వేచివుండడం మంచిదని నా అభిప్రాయం. రోడ్డు మాత్రం పంచాయతీబోర్డు ఎప్పటికీ తనంతట తాను వేయలేదు. గ్రామమంతా సహాయం చేయాలి. ఆ రోడ్డువల్ల బాగుపడే యితర గ్రామాలుకూడా కలిసిరావాలి. అందుకు ప్రజలలో ప్రచారం జరగాలి. పెద్దరైతులను, ధనికులను సందర్శించి పుష్కలంగా విరాళాలు సంపాదించాలి."

ధర్మారావు నాయుడు:- విరాళాలు ఎందు కిస్తారు?

రాజ:- ఇవ్వడం కష్టమే. కాని వారికి మనం నచ్చచెప్పడంలో ఉంటుంది. తమ కున్న సంపదంతా తమకే కాకుండా గ్రామానికంతటికీ ఉపయోగపడాలి అనే భావం వారిలో ఉదయించాలి. అనగా వారి స్వార్థపరత కొంత విరిగిపోయి త్యాగశీలం ఏర్పడాలి. అందుకు తగిన వాతావరణం మనం కల్పించాలి. అది నెమ్మదిగాకానికాదు. కాంగ్రెసువారు ప్రభుత్వానికి వచ్చిన తరువాత మన ఆర్థిక విధానంలోనే కొంత అనుకూలమైన మార్పు కనిపిస్తూ ఉన్నది. చూడండి, జమీందారు బిల్లు! జమీందారుల స్వార్థపరతకు అడ్డువేశారు. జమీందార్ల వద్దనుండి భూమి లాగివేసి నిజంగా కష్టపడే రైతుకే

అప్పగిస్తున్నారు. ఇట్లాగే ఏ భూస్వామికూడా నిర్ణీత వైశాల్యంగల భూమికంటె యెక్కువ వుంచుకోగూడదని శాసనాలు చేసే సూచనలు కన్పిస్తున్నాయి. వ్యక్తి యొక్క లాభాలకు, స్వార్థపరతకు ఒక హద్దు పెడుతున్నారు. భూమిగాని డబ్బుగాని వ్యక్తిదిగాదనీ సమాజానిదనీ వ్యక్తి అర్థం చేసుకొంటున్నాడు. ఒక్క ఉదాహరణం చూడండి! యుద్ధానంతరం బియ్యం రేషనింగు పెట్టారు. నూరెకరాలు గల భూస్వామికూడా తనకు, తన కుటుంబానికీ ఎంత ధాన్యం అవసరమో అంతమాత్రమే ఉంచుకొని తక్కినదంతా ప్రభుత్వ వశం చెయ్యమన్నారు. తానెంత వాడుకోవలసిందీ ప్రభుత్వమే నిర్ణయించి అంతకు మించి వాడుకొంటే నేరమన్నారు! భూమి మీద, పంటమీద వ్యక్తి యొక్క అధికారం ఎంతవరకు తగ్గిందో చూడండి! మన ప్రభుత్వం ప్రస్తుతం ఆలోచిస్తున్న వ్యవసాయపు బిల్లు అమలులోనికి వస్తే భూస్వామి యింకా చాల కట్టుబాట్లకు లోనౌతాడు. ప్రభుత్వం నిర్ణయించే భూమి సాగుచెయ్యాలి. సాగుచెయ్యకుండా భూమిని ఊరికే పడవేసి వుంచకూడదు— భూమి నాదే, నేనేమైనా చేసుకొంటాననే ధీమాతో! ప్రభుత్వం చెప్పిన పైరులే పండించాలి. ప్రభుత్వంచెప్పినట్లు మరామత్తులు, మార్పులు చెయ్యాలి. నూతన కృషి విధానాలు అమలుపరచాలి. తానట్లా చెయ్యకపోతే, చెయ్యలేకపోతే ప్రభుత్వం భూమి నింకొకరికి కౌలుకిప్పించి, సక్రమంగా ప్రజావసరాలకూ, క్షేమానికీ అనుకూలంగా సాగుచేయిస్తుంది. వ్యక్తి తన భూమికి తాను నిజంగా అధికారైతే యిది జరుగదు. భూమి సమాజానిది. తాను గుత్తకు తీసుకొని సేద్యం చేస్తున్నాడు. తన శ్రమకూ, అవసరానికీ తగిన ఫలం మాత్రమే తీసుకోవచ్చుగాని అంతా తన యిష్టంవచ్చినట్లు వాడుకొనడానికి వీలులేదు. ప్రాచీన భారతంలో ఇదే విధానం అమలులో ఉండేది. మధ్య వచ్చిన మార్పులవల్ల ఇది మరుగున పడిపోయింది. ప్రస్తుతం ఈ రేషనింగు విధానాలూ, వ్యవసాయపు బిల్లులు వగైరాలు చూచి వాటి అంతరార్థం గ్రహించి మూలతత్వాన్ని ప్రజలు

మళ్ళా అర్థం చేసుకొంటున్నారు. వ్యక్తియొక్క స్వార్థపరత, మూటలుగట్టి పాతిపెడదామనే దురాశా, క్రమక్రమంగా విరిగి పోతున్నది. దాని కనుకూలమైన వాతావరణం మన గ్రామంలో కూడా మనం కల్పించాలి. అప్పుడు ధనికులైన రైతులూ షావుకారులూ గ్రామకల్యాణార్థం పెద్దపెద్ద విరాళా లిస్తారు. కాబట్టి ప్రస్తుతానికి ఆసుపత్రి, రోడ్డు వగైరా విషయాలు వాయిదా వెయ్యడం మంచిది.

అందఱు నతని యభిప్రాయముతో నేకీభవించిరి. రాజశేఖరుఁడు మఱియు నిట్లనెను.

"విరాళాల విషయంలో మన గ్రామానికి నూతలపాటి వెంకాయమ్మగారు మార్గదర్శకురాలైనది. తన కున్న పెద్ద మండువాలోగిలీ, మూడెకరాల పొలమూ గ్రామపంచాయతీ కర్పించింది. ఆ తల్లి యీ మధ్యనే కాలం చేసింది. ఆమె ఛాయాచిత్రం ఒకటి పెద్దది తయారు చేయించి పంచాయతీబోర్డు ఆఫీసులో తగిలించడం చాలా అవసరం. చిత్రం ఆవిష్కరించే రోజున పెద్దనాయకుల నెవరినైనా, ఆహ్వానించి గ్రామసభ చేసి యామె యౌదార్యాన్నిగూర్చీ, త్యాగాన్నిగూర్చీ ప్రజలకు చెప్పాలి. అందువల్ల మన మనుకొన్న వాతావరణం కొంత కలుగుతుంది."

ఈ మాటలు విని స్వర్ణ వీరభద్రయ్య గా రిట్లనిరి. "వెంకాయమ్మగారి ఫొటో నా కివ్వండి. నల్లపాటి కొండనుండి ఒక ఱాయి తెప్పించండి. ఆమె ఛాయాచిత్రంకంటె శిలావిగ్రహామే ప్రతిష్ఠించ వచ్చు. ఱాతికర్చు మాత్రమే పంచాయతీ భరించాలి. తక్కినదంతా నేను చూచుకొంటాను."

రాజః— మీా ఆలోచన చాలా బాగున్నది. సరియైన పోషణ లేక మన ప్రాచీన శిల్పాలు నాశనమైపోయినవి. అనువంశికంగా మీాబోటి వారు కొంతమంది యింకా ఆ కళను పట్టుకొస్తున్నారు. ఈ విషయంలో మీారు చెయ్యదలచిన త్యాగంకూడా గొప్పదే. సిమ్మెంటు విగ్రహం చెయ్యడం సులభంగాని శిలావిగ్రహం సాధారణమా ?

వేలు పుచ్చుకొనిగాని సిద్ధహస్తుఁడైన శిల్పి యెవ్వరూ యీ పని చెయ్యరు. అసలు చేసేవారే అరుదు. వీరభద్రయ్యగారూ! మీరు శిల్పకళాచతురులని నాకు తెలుసుగాని ఫొటోజూచి శిలతో జీవకళ వచ్చే విగ్రహం చేసే నైపుణ్యంకూడా మీకు ఉన్నదని నే నెరుగను.

శాంత:- పంచాయతీ తరఫున వీరభద్రయ్యగారికి కృతజ్ఞతను తెలుపు తున్నాను. మరు మీటింగులో దానిని తెప్పించే తీర్మానం పెట్ట వచ్చు.

రామదాసు:- ఇప్పుడే ఎందుకు పెట్టగూడదు ?

శాంత:- మీటింగు నోటీసు (అజెండా)లో ముందుగా ప్రచురింపని యే విషయము సభలో చర్చించకూడదు. తీర్మానించకూడదు. అశాస్త్రీయంగా మన మేపని చేయవద్దు.

వెంకటరామశర్మ:- వెంకాయమ్మగారి ఫొటో వేస్తే చాలదా ? ఇంకా యీ కాలంలో శిల్పాలు దేనికి ? శిల్పం విలాస హేతువేకాని జీవి తానికి అవసరమయ్యేది కాదుకదా!

రాజ:- శర్మగారూ! పొరపడుతున్నారు ? శిల్పం సృష్టికళ. లలితకళ లలో ఒకటి. జాతియొక్క సభ్యతను, సంస్కృతిని సూచిస్తుంది. జాతీయ జీవితం పాలకుండ ఐతే శిల్పాది లలితకళలు మీగడ తరక లనుకోండి. జీవితానికీ, శిల్పానికీ అంత సంబంధం ఉన్నది.

శర్మ:- పాలకుండలో పాలేగదా, యిప్పుడు కరువైనది. పాలవంటి జాతీయజీవితమే అధోగతిలో ఉన్నప్పుడు పైన మీగడతరకలు తెచ్చి అంటిస్తేమటుకు ఏం ప్రయోజనం ?

రాజ:- మన పాలకుండ ఈనాటిదికాదు. యుగయుగాలనాటిది. పాలు పలచబడినా, అసలులేకుండా పోలేదు. కాబట్టి మీగడవంటి లలిత కళలు పైకి వస్తూనేవుంటాయి. పాలు చిక్కబడ జేయడానికే మన ప్రయత్నం. శిల్పంలో ఇంకొకవిషయంకూడా ఉన్నది. అపశ్రుతిలో బడిన జీవిత గానరవాన్ని సరిదిద్దుతుంది. మానవునకి ఆదర్శం చూపిస్తుంది. సముద్రంలోపోయే ఓడకు లైట్‌హౌసు ఎటువంటిదో

మానవ జీవితానికి శిల్పంగానీ కవిత్వంగానీ అటువంటివే. కాబట్టి జీవితానికి శిల్పం చాలఅవసరం. దీనినిగూర్చి ఎంతైనా చెప్పవచ్చు. కాని ప్రస్తుతాంశం ముందు ఆలోచిద్దాం. వీరభద్రయ్యగారు ఉచితంగా విగ్రహనిర్మాణం చేసి యిస్తానన్నారు. కాబట్టి ఒక్క జాతికి మటుకు పంచాయతి సొమ్ము కర్చుపెట్టడంలో తప్పేమీ ఉండదు.

శాంత:- ఇందు కెవ్వరికీ అభ్యంతరం ఉండదనుకొంటాను. మరుసటి మీటింగు నోటీసులో ఈ విషయం చేర్చి అప్పు డింకా ఆలోచిద్దాం. ఈ మీటింగు విషయాలలో ఇప్పుడు మిగిలినదేమిటంటే మీసపాటి వీరారెడ్డిగారు క్రొత్తగావేసిన ఇంటికి పన్ను నిర్ణయించడం. వారి యిల్లు రు 10,400/ లు చేస్తుందని అందరూ ఒప్పుకొన్నారు. దీన్నిబట్టి రూలు ప్రకారం అర్థసంవత్సరానికి రు13/- లు పన్ను విధించవలసి వుంటుంది.

రామరాజు:- వీరారెడ్డిగారు రు 8/-లు వెయ్యమని కోరుతున్నాడు. పంచాయతీ గుమాస్తాను ఇంటిఖరీదు రు 6400/-లు కంటె ఉండ దని. రిపోర్టు వ్రాయవలసిందిగా కోరుతూ అందుకుగాను అతనికి రు 10/-లు లంచం ఇవ్వజూచాడట. గుమాస్తా బుద్ధిమంతుడు కాబట్టి దానికి పాల్పడలేదు. ఐనా, ఇంటిఖరీదు మనందరికీ తెలిసిందే. రెడ్డిగారు నాకుకూడా సిఫార్సు చేయించారు - మా బావ మరదిద్వారా, మా పినతండ్రిద్వారా.

శాంత:- మీకే కాదు. నాకు కూడా సిఫార్సులు వచ్చినాయి. ఆయన కుమార్తె అలివేణి నా దగ్గర చదువుకొంటూ ఉంటుంది. ఆమె నాకు సిఫార్సు చేయడం మొదలుపెట్టింది. చిత్రం! రెడ్డిగా రింత భాగ్యవంతులు. వారుగూడా ఇంత వింతగా ప్రవర్తిస్తున్నారు.

రాజ:- పంచాయతీ పరిపాలన సరిగా జరగాలంటే ఇటువంటి అపాయాలే రాకుండా చూచుకోవాలి. లంచానికిగానీ, శిఫార్సులకు గాని అభిమానాలకుగానీ, పాక్షికభావాలకుగానీ లొంగిపోయి నారా, పరిపాలన కుక్కల పాలవుతుంది. పౌరకార్యాలలోనూ,

ప్రజాకార్యాలలోనూ ముఖ్యంగా ఉండవలసినది పవిత్రత. ఈ విష యంలో చాలా జాగ్రత్తగా ఉండాలి.

శాంతః– నిజం. మెంబరులందరూ రాజశేఖరంగారి ఆదేశాన్ని అర్థం చేసుకొని ఈ సంస్థను పవిత్రంగా నిర్వహించాలని నా మనవి. సరి. వీరారెడ్డిగారి క్రొత్త యింటికి రు 13/–లు పన్ను నిర్ణయిస్తూ వారి పిటిషను త్రోసివేసినట్లుగా తీర్మానం వ్రాస్తున్నాను.

ఆ తీర్మానమును సభ్యులందఱు సమ్మతించిరి. తరువాత శాంతా దేవి యిట్లు పలుకఁదొడఁగెను.

"ఈ మీాటింగు ఇంతటితో ముగిసినది. సభ్యులు విరమించే ముందు ఒక్క మనవి చేస్తాను. ఇంతవరకు హరిజనులకు ఏమీా సేవ చేసినవారముకాము. సహకార సంఘము ఏర్పాటైన తరువాత వారికి ఆర్థిక సహాయం చెయ్యవచ్చునని యింతవరకు వాయిదాలు వేస్తూ వచ్చాము. కాని సహకార సంఘం రాకముందే మన పంచాయతీ ద్రవ్యంనుంచి కొంత వ్యయం చేసి వారి యిళ్లు నివాసయోగ్యాలుగా చేయడం అత్యవసరంగా కనిపిస్తుంది. గడచిన మాసం రోజులనుండి నేను హరిజన గృహాలకు– కుటీరాలకనండి– వెళ్ళివస్తూ మొదట వారికి పరిశుభ్రతా, సదాచారం అభ్యాసం చెయ్యవలెనని తంటాలు పడు తున్నాను. కాని మొదట వీధులు నరకకూపాలుగా వుంటే వారు ఇళ్లేం బాగుచేసుకొంటారు ? వీధులనడానికే వీలులేదు వాటిని! అడ్డ దిడ్డాలుగా ఏర్పడ్డ యిరుకు సందులు. అందులో మోకాటిబంటి బురద. ఎక్కడ చూచినా దుర్వాసన. ఇళ్ళనిండా ఉరక. ఇళ్ళని పెద్ద పేరు దేనికి ? గుడిసెలు! కొన్నింటిలోకి కూర్చొని పోవాలి. ఒకటే వాకిలి. లోపల చీకటి. వంట, తిండి, పడక, సామాను–అన్నీ ఆ గుడిసెలోనే. బయటిప్రదేశంకంటె ఇంట్లో నేల పల్లం. వాన కురిస్తే నీళ్ళు లోపలికి వస్తాయి. రామరామ! వారా కొంపలలో ఎట్లా కాపురాలు చేస్తు న్నారో భగవంతుడికే తెలియాలి! "మీారు పరిశుభ్రంగా ఉండండి" అని మనం పైపైన నీతులు చెపితే వాళ్ళకొక ఎగతాళిగా వుంటుంది. ఆ పరిస్థితులలో వాళ్ళు పరిశుభ్రంగా ఎట్లా ఉండగలరు? దేనితో పరి

శుభ్రత తెచ్చుకొంటారు? మనం ఊళ్లో సుఖంగా ఉంటూ వాళ్ళ క్షేమ సమాచారమే పట్టించుకొనడంలేదు. సమాజంలో అతిముఖ్యమైన భాగం, హరిజనం. వాళ్ళు కష్టపడకపోతే మన సేద్యంసాగదు; మనకు తిండి దొరకదు. మన జీవితమే కష్టమౌతుంది. ఇంత అమూల్యమైన హరిజన ప్రజకు మనం చేస్తున్న దేమిటి? నా అభిప్రాయంలో గ్రామానికి కావలసిన సౌకర్యాల నన్నింటినీ మానుకొనైనా మానుకొని మొదట హరిజనవాడ బాగుచేయాలి.

రాజ:- శాంతాదేవి చెప్పినదానిలో చాలా అర్థమున్నది. హరిజనులకు మనం యిన్నాళ్ళూ అన్యాయం చేశాం. ప్రభుత్వంవారు సహాయం చేస్తున్నారుగదా యని మనం ఉపేక్షించగూడదు. ప్రభుత్వసహాయం ఏ మూలకువస్తుంది? ఏ గ్రామాని కా గ్రామం తన హరిజన సంఘాన్ని బాగుచేయడానికి ప్రయత్నించి, బాగుచేసితీరాలి. రాజకీయ, సాంఘిక సహాయంకంటె హరిజనులకు మొదట కావలసినది ఆర్థిక సహాయం. గ్రామస్థులందరూ పూనుకుంటే ఆ సహాయం సులభంగా చేయవచ్చు. అది చేయకపోవడం వారికి ద్రోహంచేసినట్లే. వాళ్ళు బురదలోపడి మురిగిపోతుంటే మెరకను గూర్చొని ఉపన్యాసాలుచేయడంవల్ల ఏం ప్రయోజనం? లక్ష ఉపన్యాసాలకంటె ఒక్కరూపాయి విలువైన ఆర్థికసహాయం మంచిది. మొదట వాళ్ళకు నివాస యోగ్యాలైన యిళ్ళు ఏర్పాటుచెయ్యాలి - శాంతాదేవి చెప్పినట్లు. అసలు వాళ్ళిప్పుడు నివసించే యిళ్ళు పనికిరావని నా ఉద్దేశ్యం.

మన పంచాయతీకి వెంకాయమ్మగారిచ్చిన మూడెకరాలపొలం హరిజనవాడకు ఆనుకొనే ఉన్నది. అందులో ఒక యెకరంభూమి హరిజనుల యిళ్ళస్థలాలుగా మార్చి, యిప్పుడున్న గుడిసెలన్నీవిప్పి, వీధులు తిన్నగానూ, కొంచెం వెడల్పుగానూ వేయించి క్రొత్త యిళ్ళు వేయిస్తే చాల బాగుంటుంది. ఇళ్ళస్థలాలను ఎత్తుపోస్తేగాని ఉరకరాకుండా ఉండదు. అందుకు ఒక ఉపాయం కనబడుతున్నది. మన చెరువు క్రమంగా పూడిపోతున్నది. ఒకవైపున

కట్ట తెగిపోయి చెరువులో నీళ్ళు నిలవక చెరువు భూములకు పనికి రాకుండా పోయింది. అధికారుల అనుమతిపొంది చెరువు కొంత లోతుతీయించి తెగిపోయిన కట్ట మళ్ళీ పోయించి, తక్కిన మట్టిని హరిజనవాడలో ఇళ్ళస్థలాలకు మెరక వేయిస్తే వీలుగా ఉంటుంది. అందువల్ల చెరువూ బాగుపడుతుంది. హరిజనులూ బాగుపడతారు.

శర్మ:- గుడిసెలు సులభంగా విప్పవచ్చు. అందులో కలపసామానూ అట్టే లేదు కాబట్టి పోయేది యేమీ లేదు. కాని నిట్టాడి యినా క్రొత్తవి వెయ్యాలంటే డబ్బుతోపని. ఆ డబ్బు ఎక్కడనుంచి తేగలం ?

రాజ:- డబ్బెక్కువ అవసరం లేదనుకుంటాను. గ్రామంలో ఆసాములందరూ తమ పొలాలలోని తాటాకూ, తాటి దూలాలూ సహాయంచేస్తే పెద్ద కలప యేమీ కొనకుండా పోతుంది. వెంగులకు, వాసాలకు మటుకే డబ్బు పెట్టవలసి వస్తుంది. మట్టి తోలడానికి బళ్ళుకూడా ఆసాములే ఉచితంగా ఇవ్వాలి. మనం ఇళ్ళప్లానులు వేసి దగ్గరవుండి ఇళ్ళు వేయించాలి. ఇళ్ళ లోపలిభాగంలో గ్రావెలు పోసి గట్టిచేస్తేనేగాని వానదెబ్బకు ఉరక యెక్కకుండా వుండదు. గ్రావెలుకూడా ఉచితంగా తోలిపెట్టాలి. వీధులలో పంచాయతీ బోర్డు గ్రామంలో వేసినట్లే రోడ్లువెయ్యాలి. మొదట ఈ సహాయం చెయ్యగలిగితే తర్వాత కావలసినపనులు మెల్లగా చూడవచ్చు.

ఈ ప్రతిపాదన నెల్లరు సహర్షముగా నామోదించిరి. హరిజన సభ్యు లిరువురును, క్రైస్తవసభ్యుఁడును దమ కృతజ్ఞత దెలుపుకొనిరి. హరిజనుల కీ వార్త దెలిపి వారిలో వారికున్న జగడములు మానుకొని గ్రామసౌభాగ్యమునకు వారుగూడఁ దోడ్పడునట్లు ప్రబోధింపఁగలమని వా రనిరి.

వెంకాయమ్మగారి భూమిలోఁ దక్కిన రెండెకరము లేమి చేయవలయునని ధర్మారావునాయఁడు ప్రశ్నింపఁగా సహకారసంఘము మేర్పడిన తరువాత దాని విషయ మాలోచించుదమని రాజశేఖరుఁడనెను.

## XIV

# పరిపాకము

వేములపల్లిలో సహకారసంఘ వ్యవస్థాపన జరిగి షుమారు మాసమురోజులయ్యెను. సంఘము రిజిష్టరుచేయుచు శ్రీ డిప్యూటి రిజిస్ట్రారువారు ఉత్తరువులు పంపిరి. ముందుగా వాటాధనము వసూలు చేసి యుంచుట మంచిదని ఇన్స్పెక్టరుగారు వ్రాసిరి. కడచిన నాలుగు రోజులనుండియు రాజశేఖర మిత్రబృందము ఆ పనియందే నిమగ్నమై యుండెను. ఆనాఁటి మధ్యాహ్నము సంఘ ప్రారంభోత్సవము జరుగునని గ్రామములో దండోరా వేయించిరి. గ్రామస్థులెల్లరు సభకు విచ్చేయవలయునని సంఘపుఁ దాత్కాలికపు పంచాయతీ సభ్యులు ప్రచారము చేసిరి.

మధ్యాహ్నము రెండుగంటలకు పంచాయతీబోర్డు ఆఫీసులో గ్రామస్థులసభ జరిగెను. సంఘ ప్రారంభపు టుబలాటము మిక్కుటముగాఁగల యువకు లావరణమంతయుఁ దాటాకుఁ బందిరి వేసిరి. గ్రామములోని చాపలన్నియు నచ్చటికిఁ దెచ్చి పఱచిరి. మహిళాజనమునకు వేఱుగా స్థలము నిర్ణయించిరి. పందిరినిండ జనముచేరిరి. సభా ప్రారంభమున కింకఁ గొంతతడవుండుటచే నంతవఱకు నూరకుండుట యేలయని కొందఱు యువతీ యువకులు జాతీయగీతములు పాడుచు సభ్యుల నలరించుచుండిరి. ఇంతలో డిప్యూటి రిజిస్ట్రారువారును, ఇన్స్పెక్టరుగారును, సభకు విచ్చేసిరి. వారును గ్రామములోని పెద్దలును వేదికపై విడిసిరి. వారు కూర్చుండుటకుఁ గుర్చీలు లేవుగదా యని రామరాజాదులు తడబడసాఁగిరి. తివాచీపైఁ జక్కఁగాఁ బద్మాసనము వేసికొని కూర్చుండుటయే సుఖతరమనియు నదియే మనదేశాచారమున కనుకూలమనియు డిప్యూటి రిజిస్ట్రారువారు సెలవిచ్చుచుఁ దమకుఁ గుర్చీ లేదుగదా యని యెవ్వరుఁ జింతింప నవసరములేదని నొక్కి చెప్పిరి. సభకు వయోవృద్ధులగు పుల్లయ్యపంతులుగారి నధ్యక్షత వహింపుమనిరి. అధ్యక్షునికి డిప్యూటి రిజిస్ట్రారువారికిఁ బుష్పమాలలు వేసిరి. అధ్యక్షులు తమ యుపన్యాసము చివరకగుగాక యని

డిప్యూటి రిజిస్ట్రారు వారిని సభా ప్రారంభ మొనరింపుడని కోరిరి. వా రిట్లుపన్యసించిరి.

"అధ్యక్షా! సహకార సోదరులారా! నన్ను మీ వేములపల్లి నానార్థ సహకార సంఘం ప్రారంభించడానికి రమ్మని మీ రాజశేఖర రావుగారు కోరినప్పుడు ఏదో మామూలుగా జరిగే యిరవై ముప్పై మంది సమావేశమని నే ననుకొన్నాను. మీది మరుమూల గ్రామం. చేరడానికి రోడ్డుకూడా లేదు. కాబట్టి యీ గ్రామంలో జరగబోయే సహకారసంఘ ప్రారంభోత్సవం ఎంత వైభవోపేతంగా ఉంటుందిలేయని తేలికగా ఆలోచించాను. అటువంటి నాకు ఈ మీ మహాసభ చూడ గానే గొప్ప ఆశ్చర్యం కలిగింది. ఈ గ్రామంలో ప్రజలు ఇంత ఉత్సాహవంతులై యుంటారని నే నెన్నడూ అనుకోలేదు. నా యిరవై యేండ్ల అనుభవంలో ఏ గ్రామంలోనూ ఇటువంటి ప్రారంభోత్సవ సభకు నేను హాజరుగాలేదు. సహకారోద్యమానికీ, తద్వారా దేశ కళ్యాణానికీ ఇదే నాందియా యనిపించింది నాకు. అబ్బా! ప్రతి గ్రామంలోనూ ప్రజ లింత సహకారభావోజ్జ్వలితులైతే దేశం ఎంత బాగుంటుందో అని కలలు గంటున్నాను. మిమ్ములను నా మనసార అభినందిస్తున్నాను. మీ ఉద్యమం జయప్రదమగుగాక యని సర్వేశ్వ రుణ్ణి ప్రార్థిస్తున్నాను.

మా ఇన్‌స్పెక్టరుగారి రిపోర్టునుబట్టిచూడగా సహకారతత్వాన్ని గూర్చీ, సంఘాన్నిగూర్చీ మీ గ్రామంలో యువకనాయకులైన లచ్చి నేని రాజశేఖరరావుగారు మీ కిప్పటికే వివరంగా చెప్పియున్నట్లు తెలుసుకొన్నాను. మళ్లీ నేను కేవలం తత్త్వబోధచేసి మీకు విసుగు పుట్టించ దలచుకోలేదు. అంతేకాదు. తత్త్వబోధకంటె తార్కాణమే యెక్కువ ప్రయోజనకారి యని నా నమ్మకం. అవసరమైన సహకార విజ్ఞానం మీ కిప్పటికే ఉన్నది. సంఘంవల్ల గ్రామీణు లెట్లా బాగు పడేదీ, మీ పురోభివృద్ధికి సంఘం యే విధంగా మీకు తోడ్పడేదీ మీరు తెలుసుకొనేవున్నారు. మీరు పంపుకొన్న దరఖాస్తు నందువల్లనే

వెంటనే మంజూరుచేసి మీ సంఘం రిజిస్టరుచేశాను. దాన్ని ప్రారంభించి జయప్రదంగా నడపడం ఇక మీ వంతు.

గ్రామాలలో ఇంతవరకు కేవలం ఋణాలిచ్చే పరపతి (క్రెడిట్) సంఘాలుమాత్రమే పెట్టేవారు. ఆ సంఘాలు రైతులకు అప్పులుమాత్ర మిచ్చి వారి నెదుర్కొనే తక్కిన సమస్యలు పట్టించుకోనకుండా ఉండేవి. అందువల్ల అవి రైతుయొక్క ఆర్థిక పరిస్థితిని చక్కపఱచ లేకపోయినవి. తల నొప్పితో బాధపడే రోగికి అమృతాంజనం తెచ్చి కణతలకు పూస్తే రోగం పోతుందా? రోగకారణం గ్రహించి లోపలికి కూడా మందివ్వాలి. రైతుయొక్క ఆర్థిక దుస్థితికి కారణ మేదో ఆలో చించి దాన్ని తొలగించాలి కాని కేవలం అప్పులు మాత్ర మిచ్చి ఊరుకుంటే అతని పరిస్థితి బాగుపడదు. అందువల్లనే దాదాపు ఏబది సంవత్సరాలనాడు సహకారోద్యమం దేశంలో ప్రవేశించినను ఇప్పటికీ అది రైతు నుద్ధరింపవలసినంతగా ఉద్ధరించలేకపోయింది. ప్రభుత్వంవారు ఈ విషయం దీర్ఘంగా విచారించి ఋణాలు మాత్ర మిచ్చే ఏకార్థ సహకార సంఘాలుగాక రైతుయొక్క సకలసమస్యలను దీర్చగలిగే "నానార్థ" సహకార సంఘాలు గ్రామాలలో నెలకొల్పవలెనని సంకల్పించారు. అట్లా నెలకొల్పిన సంఘాలలో మీదికూడా ఒకటి."

ఈ సంఘ మే యే ప్రయోజనముల నెట్లు సాధింపగలదో వివరముగా డిప్యూటీరిజిస్ట్రారువా రిచ్చుటఁ జెప్పిరి. వానిని గార్యక్రమములో మనము తెలిసికొనఁగలము. కావున ఆ యుపన్యాసభాగ మీ యెడ మినహాయించితిమి. వా రింకను ఇట్లు పలికిరి.

"ఇట్టి మీ నానార్థ సహకారసంఘము గ్రామానికి కల్పతరువు వంటిది. మీ రందరు దీనియందు భక్తి తత్పరులై వ్యవహరిస్తే మీ ఆర్థికస్థితి బాగుపడి మీరు సుఖంగా శాంతంగా కాలక్షేపం చేయ గలరు. దీని విజయం కేవలం మీపైనే ఆధారపడివుంటుంది. సహకారం అంటే స్వయం సహాయమని ఇంకొక అర్థంకూడా చెప్పవచ్చు. సహకార తత్వానికి ఇతరులసహాయం పొందడం గిట్టదు. అందువల్లనే పంచాయతీబోర్డువంటి సంస్థకు విరాళాలు, గ్రాంటులు పొందే తత్వం ఉన్నది.

గాని సహకారసంస్థకు అటువంటి విధానం పనికిరాదు. ఎంతవరకూ స్వయం సహాయంపైననే అది పురోగమిస్తుంది. మెంబరులు కష్టపడి తమంతట తామే బాగుపడాలి. ఎట్లా బాగుపడేదీ సంఘం పనిచేస్తున్న కొద్దీ మీకే తెలుస్తుంది. దీని బాధ్యత అంతా మీదే. దీనిపైన అధికారమంతా మీదే. దీన్నే సహకార ప్రజాస్వామికం అంటారు. ప్రపంచమంతా ఒక పెద్ద సహకార ప్రజాస్వామికం చెయ్యాలని కొందరు ప్రముఖులు ఆలోచిస్తున్నారు – అంటే దీని విలువ కొంత అర్థమౌతుంది మీకు. దీన్ని మీరు సక్రమంగా జయప్రదంగా నడుపుకోగలిగితే గ్రామాన్నే కాదు, రాష్ట్రాన్నైనా పాలింపగలరన్నమాట. పరిపాలనకు గావలసిన క్రమశిక్షణ సహకారసంఘం మీకు కలిగిస్తుంది. దీని జయాపజయాలకు కీర్త్యపకీర్తులకు మీరే ఉత్తరవాదులు. దీనిలో మీకు ఎంత అధికారమున్నదో అంతకుమించి జబాబుదారీ ఉన్నది. మేము డైరెక్టర్ల నెన్నుకొన్నాంగదా మా బాధ్యత తీరిపోయిందనుకొనడానికి వీలులేదు. డైరెక్టర్లు సరిగా వ్యవహరిస్తున్నారా, లేదా యని విచారించే బాధ్యత మీయందు సంపూర్ణంగా ఉన్నది. ఎక్కడైనా సహకార సంఘాలు అపజయం పొందినాయంటే దానికి ముఖ్యకారణం మెంబర్ల అశ్రద్ధ, ఔదాసీన్యము, అందువల్ల సంభవించే డైరక్టర్ల స్వార్థపరత, అసమర్థత. మెంబర్లందరు మోమోటమి లేకుండా సమర్థులైన డైరెక్టర్ల నెన్నుకొని వారి కన్నివిధాల తోడ్పడుతూ వారు సరిగా వ్యవహరించనప్పుడు వారిని సస్పెండించడమో, వేరేవారిని ఎన్నుకొనడమో జరుగుతుంటే ఏ సహకార సంఘమూ చెడదు. ఇందులో ఎవరు స్వార్థపరులైనా ఉద్యమం చెడిపోతుంది. సహకారం చాల పవిత్రమైన ఆదర్శాలు గలది. తన ఆదర్శాలతో పాటు వ్యాపారదృష్టికూడా కలిగివుంటుంది. అనగా కేవలం ధార్మిక దృష్టితో వ్యవహరించడం తన ఆర్థిక వ్యవహార ఫలితాలను దమ్మిడీలతో లెక్కచెప్పుతుంది. కాబట్టి సహకారసంఘం ఏ పనిచేసినా అందులో ఆర్థిక ప్రయోజన మున్నదా లేదా యని చూస్తుంది. కచ్చితమైన వ్యాపార సూత్రాలపైననే సహకారం నిల్చివుంటుంది.

నేను చెప్పిన ఈ సూత్రాలకన్నిటికీ ఉదాహరణలు చెపితే చాల కాలహరణం అవుతుంది. అనుభవంలో వీని భావం మీరే గ్రహిస్తారు.

ఈ సహకార సంఘానికి తక్కిన ప్రభుత్వశాఖల సహాయం అవసరమౌతుంది. అనగా, ద్రవ్యరూపంగా గాదు, సలహారూపంగా. అందులో వ్యవసాయశాఖ, పశువైద్యశాఖ, పారిశ్రామికశాఖ మనకు చాల ముఖ్యము. రైతును బాగుపరచే శాఖలన్నీ మన కుపయోగించేవే. ఈ పర్యాయం ఆ యా శాఖాధికారులనుగూడా మీ గ్రామానికి ఆహ్వానించి మీ కుపన్యాసాలు ఇప్పించవలెనని ఇప్పటి మీ ఉత్సాహం చూచి నే నాలోచిస్తున్నాను.

అన్నిటికంటె మీరు మీ గ్రామ పంచాయతీబోర్డుతో అన్ని విధాలా సహకరించాలి. గ్రామోద్ధరణకు, గ్రామసౌభాగ్యానికీ ఈ రెండు సంస్థలే పరమసాధనాలు. ఈ రెండుసంస్థలూ సక్రమంగా శాస్త్రీయంగా ఆదర్శప్రాయంగా వ్యవహరిస్తుంటే గ్రామస్థులకు ఇం కెవరితోనూ అవసరంలేదు. పౌరసమస్యలకు పంచాయతీబోర్డు; ఆర్థిక సమస్యలకు సహకార సంఘము! గ్రామంలో ఈ సంస్థలు చేయలేని కార్యమే ముంటుంది? గ్రామస్థులిం కే రాజకీయాలూ పట్టించుకోనవసరం లేదు. వారి గ్రామంలో వారు సంపూర్ణస్వరాజ్యం అనుభవించవచ్చు. సర్వోదయం అనుభవించవచ్చు. గ్రామానికి కావలసిన ఆహారపదార్థాలు, తదితర వస్త్రాది జీవితావసరాలు ఉత్పత్తి చేయించడానికీ, పరాయిగ్రామాల నుంచీ, బస్తీలనుంచీ రావలసిన వస్తువులు తెప్పించి సరఫరా చేయడానికీ సహకార సంఘం పనిచేస్తుంది. గ్రామపరిపాలన సరిగా జరగడానికి, గ్రామసౌకర్యాలు, విద్యా వైద్య వసతులు కల్పించడానికి పంచాయతీబోర్డు పనిచేస్తుంది. ఈ రెండు సంస్థలూ చేదోడు వాదోడుగా పనిచేస్తుంటే గ్రామస్థులకు ఇక కావలసిం దేమిటి? ఒక్కటే! జీవితావసరాలను నాగరకపద్ధతిలో పెంచుకోనక గ్రామంలో సులభంగా లభ్యమయ్యే వాటితో తృప్తిపడి వుండటం. ఆ తృప్తే గనుక వారికి గలిగితే ఇక నిది స్వరాజ్యంగాక ఇం కే మౌతుంది? ఇంతకంటే మరొకచోట మరొక వ్యాపకంవల్ల గలిగే ఆనంద మెటువంటిది?

భారీ పరిశ్రమల జోక్యం మనకు వద్దు. వాటిని చూచేది ప్రభుత్వం. సాధారణంగా భారీపరిశ్రమలు గ్రామీణజీవితానికి సంబంధించివుండవు. ఆ ప్రణాళికలు వేరు. వాటి ఆర్థికతత్త్వం వేరు. అవీ దేశానికి కావలసినవే. కాని గ్రామాలు వాటితో జోక్యం కలిగించుకో నవసరంలేదు. వాటి జోక్యం ప్రభుత్వానిదే. పారిశ్రామిక నగరాలదే; మనదికాదు.

గ్రామస్థు లీ రెండు సంస్థలయందు భక్తివిశ్వాసాలుంచి అందరూ సమష్టికుటుంబంగా శాంతిసౌఖ్యమయమైన మధుర సాత్వికజీవితం చెయ్యవచ్చు. ఈ కాలంలో ఈ ఆనందాన్ని, ఈ అవకాశాన్ని చెడగొట్టే కొన్ని విపరీతశక్తులు ఏర్పడివున్నవి. వాటినిగూర్చి చెప్పడానికి నాకు వ్యవధీ లేదు, అది నా పనీకాదు. మీ యువకనాయకులు ఈ విపరీతశక్తుల నెరిగినవారే. కావున వాటివల్ల మీ కే అపాయమూ రాదని నా నమ్మకం. ఇప్పటికే చాల కాలహరణమైనది. ఇంతట నా ప్రసంగం ముగిస్తున్నాను. తక్కిన కార్యక్రమం మా ఇన్‌స్పెక్టరుగారు జరుపుతారు." అని విరమించిరి.

తరువాత రాజశేఖరుఁడు వేదికమీఁదికి వచ్చి డిప్యూటి రిజిస్ట్రారువారు తమ కిచ్చిన యమూల్యములైన ఆదేశములకు, సలహాలకు వారిని మిక్కిలి యభినందించి గ్రామస్థులతరపునఁ గృతజ్ఞత వెలిబుచ్చెను. తక్కిన ప్రభుత్వశాఖాధికారులుకూడ వీరివలెఁ బ్రజాభ్యుదయకాంక్ష గలిగి ప్రజాహృదయమునకుఁ జేరువగా నున్నయెడల దేశము త్వరలో బాగుపడఁగలదని తన విశ్వాసమును ప్రకటించెను. డిప్యూటి రిజిస్ట్రారువారు సూచించినట్లు వేములపల్లి నానార్థ సహకారసంఘము నాదర్శప్రాయముగా నడిపి గ్రామస్వరాజ్యము సంపాదించుటకుఁ బ్రయత్నింతుమని గ్రామస్థులకు వాగ్దాన మొసఁగెను.

అంతట కో-ఆపరేటివ్ ఇన్‌స్పెక్టరుగారు చట్టము ప్రకారము జరుపవలసిన చర్యలన్నియు జరిపిరి. విచిత్రమేమన - గ్రామములో నున్న 712 కుటుంబములలో 637 కుటుంబములు (యజమానులు మాత్రము) సంఘములో మెంబరులుగాఁ జేరెను. సాధారణముగా దీని నెవ్వరు విశ్వసింపరు. ఏ సంఘమునందైనను దొలుదొలుత

ముప్పదిమందికంటె నెక్కువ చేరరు. తరువాతఁ గొంతమంది - అప్పటికి ఏ నూరో, నూటయేఁబదియో - క్రమక్రమముగాఁ జేరుదురు. రాజశేఖర మిత్రబృందము, స్వయంసేవక యువకదళము నాలుగైదు రోజు లదేపనిగ గ్రామములోఁ బ్రచారముసలిపి పెద్దతలలకుఁ దత్వబోధచేసిచేసి యింతమంది నొక్కతూరి చేర్పింపఁగలిగెను. హరిజనులు మహమ్మదీయులు దక్కిన యన్ని వర్ణములు నందఱును జేరిరి. ఇంకను జేరవలసిన డెబ్బదిమైదు కుటుంబములుకూడఁ దరువాతఁ జేరవచ్చు ననిరి. అంతకుముందు వసూలైనదానితోఁ గలిసి నాఁడు మొత్తము రు15105/-లు వాటాధనము వసూలయ్యెను. డిప్యూటి రిజిస్ట్రారువారు ముక్కుమీఁద వ్రేలుంచుకొని యిట్టిసంఘముఁ దా మెచ్చటఁ జూడలేదనిరి. మదరాసురిజిస్ట్రారువారికి దీని విషయముప్రత్యేకనివేదికపంపుదుమనిరి.

నాఁటి కార్యక్రమములో ముఖ్యాంశము డైరెక్టర్ల ఎన్నిక. ఆవిషయమున మాటలాడుచు రాజశేఖరరా విట్లు చెప్పెను.

“పంచాయతీబోర్డుకు కులాలవారీగా మనము మెంబర్ల నెన్నుకొన్నాం. నిజానికి నాకా విధానం నచ్చలేదు. కాని ప్రస్తుతపరిస్థితులలో అంతకుదప్ప వేరేమార్గం కనిపించక అట్లా చెయ్యవలసివచ్చింది. గ్రామసౌభాగ్యం, మానవకల్యాణం కలిగించే సామర్థ్యం ఎవరికున్నదో అటువంటి యోగ్యత అన్నివిధాల్గా ఎవరి కున్నదో వారినే ఎన్నుకొనడం ఉత్తమ మార్గం. కాని యీ కుల మత పిశాచం మన సమాజాన్ని ఆవేశించివున్నంతవరకు ఆ యాదర్శం మనకు అందరాని పండు వంటిది. అర్థంలేని కులభేదాన్ని మన మెంత త్వరగా నాశనంచెయ్యగలిగితే అంత త్వరగా మనం బాగుపడతాం. ఆ విషయ మట్లావుంచి, ఈ సహకార సంఘపు ఎన్నికలనుగురించి ఆలోచిద్దాం. ఇందులో కూడా కులాలవారీగా డైరెక్టర్ల నెన్నుకొంటే పని సరిగా జరగదు - కులాలవారీగా యోగ్యులు దొరికితే మంచిదే. దొరకనప్పుడు ఏ కులంవారినైనా యోగ్యులను మాత్రం ఎన్నుకోవాలి. ఇందులో డైరెక్టరు పదవి కేవలం గౌరవహోదా కాదు. చాలా బాధ్యతగల పదవి. అందులో, ఆర్థికబాధ్యత. డైరెక్టర్లు అసమర్థులైనా, అన్యాయపరు

లైనా, పట్టుదలలేనివారైనా, మనస్ఫూర్తిగా సంఘునడిపే ఉద్దేశం లేనివారైనా సంఘం చెడిపోతుంది. ఈ బాధ్యతను గుర్తించి యోగ్యత గలవారు సేవాభిలాషగలవారు మాత్రమే యీ పదవుల నాశించాలి. అటువంటివారినే మనం ఎన్నుకోవాలి.

మన సహకారసంఘం ఒక చిన్న కాబినెట్ – అనగా – మంత్రి వర్గంవంటిది. మనంకూడా మంత్రివర్గంలోమాదిరే ఒక్కొక్క శాఖను ఒక్కొక్క డైరెక్టరుకు అప్పగించి డైరెక్టర్లందరూ కలిసి నిర్ణయించే పద్ధతిమీద ఆ యా శాఖను ఆ యా డైరెక్టరు నిర్వహించే విధానం అవలంబించాలి. ఏకార్థ సంఘంలో అటువంటి శాఖావిభజన అవసరం లేదుగాని, అనేక భిన్నభిన్న విషయాలుగల నానార్థ సంఘంలో శాఖా విభజన చాల అవసరం. మన సంఘపు కార్యక్రమాన్నిబట్టి దాన్ని తొమ్మిది శాఖలుగా విభజించవచ్చు. (1) ప్రచారశాఖ (2) ఋణ శాఖ (3) వ్యవసాయశాఖ (4) ఆహారోత్పత్తిశాఖ (5) ఉపవృత్తి శాఖ (6) హరిజనశాఖ (7) వస్త్రోత్పత్తిశాఖ (8) పారిశ్రామికశాఖ (9) వస్తుభాండారశాఖ.

ఒక్కొక్కశాఖను నిర్వహించడానికి ఒక్కొక్క డైరెక్టరు చొప్పున తొమ్మిదిమంది డైరెక్టర్లను మనమిప్పుడు ఎన్నుకోవాలి.

సభలోనొకరు:- ఇన్ని శాఖలు పనిచెయ్యడానికి మన గ్రామంలో అవసరమూ, అవకాశమూ ఉన్నదా అని నా అనుమానం.

రాజశేఖరుడు:- దాదాపు అన్నిశాఖలకూ ఉన్నది. కాని సంఘ నిర్మాణంలో అన్నిటికీ అవకాశమేర్పరచి అవసరం కలిగినప్పుడల్లా ఒక్కొక్క శాఖను నెలకొల్పవచ్చు. అన్ని శాఖలూ ఒకేసారి పని మొదలుపెట్టవలెనని నిర్బంధంలేదు. మనది ఆదర్శప్రాయమైన సంఘంగా ఉండాలి. ఇతర సంఘాలు దీన్నిచూచి తమ నిర్మాణం దిద్దుకోవాలి. అంతేకాక, గ్రామాన్ని ఆర్థికంగా స్వయంపోషకం చేయాలంటే సహకారసంఘం అన్నిశాఖలతోనూ కార్యక్రమం నడపాలి.

ఇంకొకరు:-మరి వీటిని నడిపే సామర్థ్యంగలవారెక్కడ దొరుకుతారు?

రాజ:- అది కొంచెం కష్టమైన పనే. కాని ఉత్సాహమూ పట్టుదలా గల యువకులు దొరికితే వారి కీపని అసాధ్యంకాదు. వారికి కొంచెం తరిఫీదిచ్చి కార్యరంగంలోకి నెట్టితే అనుభవంవల్ల క్రమంగా వారే సమర్థులౌతారు. కొంతమంది ముందు అనుభవంగడిస్తే తరువాతి వారిని వారే తరిఫీదు చేస్తారు. మనకు తెలియని అంశాలన్నీ జిల్లా కేంద్రంలో డిపార్టుమెంటువారి నడిగి తెలుసుకోవచ్చు. అప్పుడప్పుడు ఇన్‌స్పెక్టరులు, సూపర్‌వైజర్లు, వచ్చిపోతూవుంటారు. తెలియని విషయాలు చెపుతూవుంటారు. గ్రామంలో చదువుకొన్న వారు లేకపోయినా, సామాన్యజ్ఞానం, గ్రహణశక్తిగలవారు చాలమంది ఉంటారు. అవకాశంలేక, ప్రోత్సాహంలేక అనేకులు రాణించకుండా పోతారు. అంతేకాదు. గ్రామసంబంధమైన యే పౌరవిషయంగాని, ఆర్థికవిషయంగాని పైన ఎవ్వరో, యెక్కడో వారికొరకు ఆలోచించి తేలుస్తూ ఉన్నంతవరకూ గ్రామం నిర్జీవంగా ఉండి గ్రామస్థులు నిద్రపోయినవారి మాదిరిగా ఉంటారు. తమ సమస్యలు తామే యెదుర్కొని తామే పరిష్కారం చేసుకొమ్మని వారి కెప్పుడు స్వాతంత్ర్యం ఇస్తారో, ప్రోత్సహిస్తారో అప్పుడే వారి కెక్కడలేని చురుకుదనం, ఆలోచనా కల్గుతుంది. ఇందుకు పెద్ద చదువు, సంధ్యా అవసరంలేదు. కొంచెం వ్యవహారజ్ఞానం, చెపితే అర్థంచేసుకొనే శక్తి ఉండాలి. అవి మన గ్రామంలో పుష్కలంగా ఉన్నాయని నా నమ్మకం. ఇక కావలసినది పట్టుదల. అదీ అసాధ్యమైనదికాదు. రథం కదిలేవరకే కష్టంగాని కదలినతరువాత ప్రతి వాడూ చెయ్యివేస్తాడు. దానంతట అది నడచిపోతూనే ఉంటుంది. ఆ రథంవల్ల తామందరూ బాగుపడుతున్నారని గ్రహిస్తే దాన్ని నడపడాని కెవరు పట్టుదల చూపరు ?

కాబట్టి మనం తలపెట్టిన తొమ్మిదిశాఖలకు తొమ్మండుగురు సమర్థులగు డైరెక్టరులను ఎన్నుకోవాలి. నిన్న కొంతమందిమీ గ్రామంలో గల పెద్దమనుషులతో సంప్రతించి నేనిప్పుడు చెప్ప బోయే తొమ్మండుగురు పెద్దమనుష్యులను ప్రస్తుతం – అనగా –

ఈ సంవత్సరానికీ, ముందు సంవత్సరానికీ - డైరెక్టర్లుగా ఎన్ను కొంటే మంచిదని తేల్చుకొన్నాం.

(1) తుంగల వెంకటకృష్ణారెడ్డి (2) దివాకరుణి జనార్దనశాస్త్రి (3) వీపూరి ఫాలలోచనాచార్యులు (4) కోకా రాఘవరావు నాయుడు (5) గోలి వెంకటప్పయ్య (6) అల్లూరి రఘుపతిరాజు (7) మహమ్మదు రహింతుల్లా సాహెబు (8) జాలాది దేవదానం (9) పిల్లి వెంకటదాసు.

వీరందఱు యువకులు. గ్రామపునరుజ్జీవనం కలిగించాలనే ఉత్సాహం, పట్టుదల గలవారు. తగిన యోగ్యత గలవారనికూడా పెద్దలందరూ భావిస్తున్నారు. కాబట్టి వీరందరినీ ఏకగ్రీవంగా ఎన్నుకోవలెనని నా సలహా".

వెంటనే రహింతుల్లా సాహెబులేచి ముస్లింసంఖ్య ఏబది మించకపోయినను వారి కొక స్థానమిచ్చుటకుఁ దనను ప్రతిపాదించి నట్లుగాఁ దా నర్థము చేసికొనెననియుఁ, దనకు డైరెక్టరు పనిచేయు సామర్థ్యముగాని, యభిలాషగాని లేదనియు, నందఱికి నాప్తుఁడైన రాజశేఖరరావుగారిని దనకు బదులుగా నెన్నుకొనుట మంచిదనియు నొక్కి-పలికి తన పేరు దీసివేయుఁడని కోరెను. ముస్లిములందఱు నట్లే యనిరి.

తరువాత హరిజన సోదరుఁడగు పిల్లి వెంకటదానుకూడ నదే విధముగఁ జెప్పుచు జాలాది దేవదానము క్రైస్తవుఁడైనను హరిజనుఁడే కావున నతఁ డొక్కఁడు హరిజన ప్రతినిధిగా నుండినఁ జాలుననియుఁ దమ కందఱికిఁ దల్లివలె సహాయము చేయుచున్న శాంతాదేవిని తనకు బదులుగా నెన్నుకొన్నచోఁ బదిమంది హరిజనుల నెన్నుకొన్నంత ఫలము దక్కుననియు, నిదియే హరిజనుల యందఱి యభిమతమనియు మనవి చేసెను.

రహింతుల్లా, వెంకటదాసుల యౌదార్యమునకు, వివేకమునకు డిప్యూటీ-రిజిస్ట్రారువారు వారి నిద్దఱిని శ్లాఘించెను. పంచాయతీబోర్డు ప్రెసిడెంటగు శాంతాదేవికి సహకారసంఘ నిర్వాహకవర్గములో స్థాన-

మొసఁగుటచే నా రెండు సంస్థలకు నన్యోన్య సహకారము కుదురు ననియు నామె యెన్నిక చాల యోగ్యముగా నున్నదనియు వర్ణించిరి. పై రెండుమార్పులతోఁ దొమ్మిదిమంది డైరెక్టరుల నేకగ్రీవముగా నెన్నుకొనిరి.

తరువాతఁ గొన్ని యవసరములగు తీర్మానములు, సంఘము గుంటూరుజిల్లా కో-ఆపరేటివ్ సెంట్రలుబ్యాంకితో జత పఱచుచు నొక తీర్మానము చేసి యంతటితో ప్రారంభమహాజనసభ ముగించిరి.

వెంటనే డైరెక్టర్లసభఁ గూడ జరిపిరి. అం దెక్కువ చర్చ లేకుండఁగనే రాజశేఖరరావు నధ్యక్షునిగను, తుంగల వెంకట కృష్ణారెడ్డిని గార్యదర్శిగను ఎన్నుకొనిరి. తొమ్మిది శాఖలను దొమ్మిది మంది డైరెక్టర్లను నిర్ణయించుచుఁ దీర్మానించిరి. రాజశేఖరునకుఁ బ్రచారశాఖ నిచ్చిరి. తక్కిన డైరెక్టర్లందఱును అధ్యక్షుని పర్యవేక్ష ణకు లోఁబడి వ్యవహరింపవలయును గాన అధ్యక్షుని కే శాఖ యిచ్చినను బాధలేదని యందఱు ననిరి. పరిశ్రమశాఖను ఫాలలోచనా చార్యుల కిచ్చిరి. అతఁడు శిల్పియుఁ బరిశ్రమాభిలాషియుఁ గావున నతని కది యనువైనదనిరి. హరిజనశాఖను శాంతాదేవికే యొసఁగిరి. ఒక్కొక్క డైరెక్టరు తనకు సహాయమొనర్చుటకును, సలహాలనొసఁగు టకును ముగ్గురు ముగ్గురు సాధారణసభ్యులుగల ఉపసమితుల నేర్పాటు చేసికొనుటకుఁగూడ నవకాశము గల్గించుచు నొక తీర్మానము చేసిరి. ఉపసమితి సభ్యు లీ విధముగా డైరెక్టరులకు సహాయభూతులగుటయే కాక కార్యనిర్వహణమునఁ దరిఫీదై తమ కదనువచ్చినప్పుడు తాము సొంతముగా డైరెక్టరు పదవి నిర్వహించుశక్తిని గడింతురని యీ తీర్మాన మాశించెను. మంత్రులకు శాసనసభ్య కార్యదర్శు లిట్లే యుందురని సాదృశ్యముఁ దెలుపుచు డిప్యూటి రిజిస్ట్రారు వారీ పద్ధ తిని మెచ్చుకొనిరి.

నాఁటి కార్యక్రమ మట్లు జయప్రదముగా ముగిసెను. మఱు న్నాఁడు రాజశేఖరరావు గుంటూరు పోయి సంఘమునకుఁ గావలసిన లెక్కపుస్తకములను గొనివచ్చెను. సంఘద్రవ్యము-నూరురూపాయలు

మాత్రము తన తావున నుంచుకొని- మిగిలిన దానిని గుంటూరుజిల్లా కరెంటు అకౌంటులో నిక్షిప్తపఱచి వచ్చెను. సంఘము వెంటనే పని చేయుటకుఁ దగిన ప్రయత్నములు చుఱుకుగాఁ జేయసాగెను. సంఘ కార్యాలయముగూడ వెంకాయమ్మ గారి భవనమునందే నెలకొల్పెను.

పని కుపక్రమించుటకు ముందు మెంబర్ల యాస్తులను అప్పులను జూపించు పట్టిక యొకటి అత్యవసరము. ఈ పట్టిక నమూనా బ్యాంకి నుండి తెచ్చి గ్రామకరణముగారికిచ్చి వారు ప్రత్యేకముగా కొన్నాళ్ళ పనియుండే యుండి దానిని బూరించి యీయవలసినదని కోరెను. ఇతర కార్యభారము కారణముగాఁ జూపి కరణముగా రాపని చేసియిచ్చుట కాలస్యము చేయఁదొడఁగిరి. గ్రామములోని రైతులందఱికిని ప్రయోజనకారియగునట్టి ముఖ్యకార్యములో నాలస్యముచేయుట దుష్టమని యొకనాఁడు సంఘపు డైరెక్టర్లును ఇంక నూరిపెద్దలు కొందఱును దొందరపెట్టఁగా నెట్టకేలకుఁ గరణముగారు రామరాజు రాజశేఖర రావు వగైరాల సహాయముతో నాస్తి యప్పులపట్టిక నెట్లో పూరించి యిచ్చిరి. మెంబరులందఱు దానిపైఁ దమ పద్దుల కెదురుగ సంతకములు చేసిరి.

తరువాత ఋణార్థుల నెల్లర నొక్కచోఁ జేర్చి వారి వారికి సంవత్సరము పొడుగునను వ్యవసాయాది కార్యములకుఁ గావలసియుండు నప్పు మొత్తముల అంచనా వేసెను. మొత్తము రు 45000/- ల కు వచ్చెను. కాని సంఘములో నున్నది పదునైదువేలే! తక్కిన ముప్పది వేలు బ్యాంకినుండి ఋణముగాఁ దెచ్చుటా లేక గ్రామములో ధనికుల నుండి డిపాజిట్లుగాఁ దెచ్చుటా యను నాలోచన వచ్చెను. డిపాజిట్లుగాఁ దెచ్చుటే యాదర్శము. కాని యిచ్చువా రెవ్వరు? అయినను బ్రయత్నించి చూతమని తొలుదొలుతఁ దన పెదతండ్రి రామకృష్ణయ్యగారి నడిగిచూచెను. సందర్భమును గుర్తించినవారగుటచే రామకృష్ణయ్యగారు రు 10000/-లు నూటికి సాలునకు రు 3/-లు వడ్డీతో రెండేండ్లకు డిపాజిట్టుగా నిచ్చెను. వెంకటరెడ్డిగారు నట్లే పదునైదువేలిచ్చిరి. రమణారెడ్డి మామగారగు వీరారెడ్డిగారు మాత్రము నిరాకరించిరి.

కాని తక్కిన ధనికులు తలకొక రైదు, ఆఱువేల ప్రకారము మొత్త మింకొక రు 32000/-లు డిపాజిట్లుగా నిచ్చిరి. మొత్తము డిపాజిట్టులు రు 47000/- లు, మెంబరుల వాటాధనము రు 15000/- లు గలిసి రు 62000/- లు అయ్యెను. ఈ డబ్బంతయు నింతవఱకు గ్రామములో నెచ్చటనో మూల్గుచుండెను. లేక దుష్కార్య వినియుక్తమగుచుండెను. నేఁడు గ్రామాభ్యుదయార్థము బైటికివచ్చి తనపని తాఁ జేయసాగెను. ఈ మొత్తమంతయు బ్యాంకిలో కరెంటు ఎకౌంటునందు వేసియుంచిరి.

డైరెక్టర్లు సభచేసి యే రైతున కెంతెంత యప్పు పెట్టవచ్చునో జాగ్రత్తగా నిర్ణయించిరి. ఆసామి జామీనుమీఁదఁ గొంద అప్పు తీసికొనఁ దలఁచిరి. తమ యాస్తిని సంఘమునకుఁ దాకట్టుంచి యొక నిర్ణీత పరిమితికి మించక యప్పు దీసికొనుచుఁ జెల్లించుచుఁ దాకట్టు పత్త్రము నెప్పుడును సజీవముగా నుంచు పద్ధతిని (కంటిన్యూయింగ్ మార్గేజి) గొందఱు తీసికొనఁదలచిరి. జామీనునకై యింకొకరిని గోరు నవసరము లేకుండఁ బోవును గావున నీ పద్ధతియే మంచిదని బహుసంఖ్యాకులు దీనినే యవలంబించిరి. సంఘమునకు నిదియే సులువయ్యెను. డైరెక్టర్ల పద్ధతినిఁ గూడ నామోదించిరి. తరువాత వ్యవసాయములకుఁ గావలసిన యప్పులు మంజూరుచేసి పత్త్రములు వ్రాయించుకొని బట్వాడాచేసిరి. అట్లు బట్వాడా చేసిన మొత్తము రు 30000/-లు అయ్యెను. తక్కిన రు 32000/- లు కూడ వెంటనే యప్పులుగా నొసఁగకున్నను డిపాజిట్లపై నిచ్చు రేటుకన్న నెక్కువగా వడ్డీ సంపాదించు నింకొకరూపమైన పెట్టుబడిగా మార్చకున్నను సంఘమునకు నష్టము గలుగును. మెంబరులు గ్రామములో షావుకార్ల కీయవలసిన బాకీలకుగాను జెల్లించి ఆ యా మెంబర్లపై ఋణములుగాఁ జూపవచ్చునుగాని యట్టి బాకీలు త్వరగా వసూలుగావు. ఈ లోగా మెంబరులకుఁ గావలసిన కొద్ది వాయిదా యప్పు లిచ్చుటకు ద్రవ్యవసతి యుండదు. కావున షావుకార్ల బాకీలు తీర్చుటకు పొడుగువాయిదా డిపాజిట్లు సేకరింపవలయును. కాని ఇట్టి పొడుగువాయిదా ఋణపద్ధతికి గ్రామసంఘములకంటె భూమి తనఖాబ్యాంకులు యోగ్యతరములు.

అవి యంపులకే యేర్పడి యున్నవి. కావున షావుకార్ల బాకీలను - అనఁగా - పెద్ద మొత్తములైన వానిని తనఖాబ్యాంకునుండి యిప్పించు టకే నిర్ణయించిరి. కొద్ది వాయిదాలమీఁదఁ దెచ్చిన డిపాజిట్లను పొడుగు వాయిదా ఋణములుగా నిచ్చుట యవివేకము, వ్యాపార ప్రతికూలమునని గుర్తించిరి. మఱి సంఘములో మిగిలిన రు 32000/-లు ధనము నెట్లు సులభముగా వినియోగింపవలయును? ఈ విషయము డైరెక్టర్లు తీవ్రముగా నాలోచించిరి.

ఇంతలోఁ గొందఱు రైతులు శిస్తు చెల్లించుటకుఁ దమ వద్ద డబ్బు లేదనియు, షావుకార్లు వెనుకటివలె అప్పులిచ్చుటకు నొప్పు కొనుట లేదనియుఁ గరణముగారు తమ్ము కస్తి పెట్టుచుండిరనియు రాజ శేఖరునికిఁ దెలిపిరి. అతఁ డీ విషయము విని కొంత సిగ్గుపడెను. ఏల యన, రైతుల వ్యావసాయిక- అవసరములను అంచనా వేయునపుడు ముఖ్యమగు శిస్తువిషయము నతఁడు మఱచిపోయెను. ఇతరు లెవ్వరును జెప్పరైరి. అనుభవలోపమన్న నిది గదా యని యతఁడు సిగ్గుపడెను. తన కడకు వచ్చిన రైతులకు సంఘమే శిస్తు చెల్లించు నేర్పాటులు చేయునని చెప్పి తమ కే ఋణవసతి గావలసినను సంఘము నడుగవల యునే కాని షావుకార్ల కడ కెట్టి సందర్భములలోఁ గూడఁ బోఁగూడ దని గట్టిగాఁ జెప్పి పంపించెను. డైరెక్టర్లు వెంటనే సమావేశమై గ్రామ ములో రైతులు చెల్లించవలసిన శిస్తునంతయు సంఘమే చెల్లించుటకు సిద్ధముగా నున్నదనియు గ్రామాధికారులనుండి డిమాండు జాబితా తెప్పించవలయుననియుఁ దీర్మానించిరి. ఈ తీర్మానపు నకలు కరణము గారి కిచ్చి డిమాండు జాబితా ఇమ్మని రాజశేఖరుఁడు కోరెను. డిమాండు సంఘమున కిచ్చుటకుఁ దన కధికారములేదని కరణముగారు నిరాకరించిరి. కాని రైతులనుమాత్రము శిస్తు చెల్లింపుడని యొత్తిడి చేయుచుండిరి. శిస్తు వసూళ్ళు చురుకుగా జరగనందున రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగారు గ్రామమునకు వచ్చిరి. రమణారెడ్డి, పాపిరెడ్డి, నీల కంఠశాస్త్రి మున్నగువారు గ్రామములో కమ్యూనిజము ప్రబలుచున్న దనియు, మునుపటివలె రైతులు శిస్తులు చెల్లింపక ప్రభుత్వమున

కెదురు తిరుగుచున్నారనియు రాజశేఖరుఁడు కమ్యూనిస్టులకు నాయకుఁడనియుఁజెప్పిరి. ఈయేడు వసూలుకావలసిన శిస్తులో పదవవంతైనను, నప్పటికి వసూలు కాకుండుటయే తమ వాదమును బలపఱచుచున్నదని వక్కాణించిరి. రివెన్యూ ఇన్‌స్పెక్టరు సహకారసంఘ కార్యాలయమున కేఁగి రాజశేఖరుని మందలింపఁదొడఁగెను. రాజశేఖరుఁడంతయువిని సత్యము వివరించి యా కిస్తీయే కాక రెండవకిస్తీకూడ రైతుల తరఫున నప్పుడేచెల్లించుటకు సంఘము తయారైయున్నదనియు నందుల కాతురపడుచున్నదనియుఁ దెలిపెను. రివెన్యూ ఇన్‌స్పెక్టరు తెల్లబోయెను. వెంటనే డిమాండు జాబితా వ్రాయించి యిచ్చెను. మొంబర్లైన రైతులందఱిచేతను శిస్తుమొత్తములకు సరిపడ సంఘము నుండి బాకీలు పుచ్చుకొన్నట్లు పత్రములు, రశీదులు వ్రాయించుకొని యీమొత్తమును వారితరఫున ఖజానాలోఁ జెల్లించుటకు మఱునాఁడు గుంటూరుపోయి బ్యాంకినుండి పైకము తీసి రివెన్యూ ఇన్‌స్పెక్టరు చెప్పినట్లు ఖజానాలోఁ జెల్లించి రాజశేఖరుఁడు రశీదు దాఖలుచేసెను. ఈ విధాన మన్ని గ్రామములలో నున్నయెడలఁ దమకు శ్రమ తగ్గుననియుఁ దక్కిన గ్రామములలోఁగూడ దీనిని బ్రోత్సహింతుమనియు రివెన్యూఇన్‌స్పెక్టరుగారు చెప్పిరి. రాజశేఖరుని తహశీలుదారుగారికిఁ జూపించి వారి యభినందనములకుఁ బాత్రునిఁ గావించెను. ఇట్లొక పదివేలు వినియోగపడెను.

తక్కిన యిరువది రెండువేలలో రెండువేలు మాత్రము నిలువ యుంచి యిరువది వేలతో రైతులకుఁ గావలసిన యెరువులు, విత్తనములు కొనితెచ్చి పంచిపెట్టిరి. కొంతపైకమును వస్తుభాండారము (స్టోర్సు) నకు వినియోగించిరి.

క్రమముగా సంఘములోఁ బైకము వచ్చుట, పోవుట జరుగుచుండెను. అవసరమైనప్పుడు గ్రామమునందే డిపాజిట్టులు లభ్యములగుచుండెను. తమతోఁ బైకముంచుకొనుటకంటెఁ దక్కువవడ్డీకైనను సంఘమునందే నిక్షిప్తపఱచి యుంచుట యుత్తమ మార్గమని యెల్లరు గుర్తించిరి. అట్లుచేయుట యుభయోపకారియని సంఘము ప్రచారము

సేయుచుండెను. సంఘ మిందులకై సేవింగ్సు డిపాజిట్టు పద్ధతిని నెల కొల్పెను. అంతేకాక గ్రామస్థులు తమ సంపాదనలో నే కొంతయో పొదుపుచేసి మిగిల్చి సంఘములో సేవింగ్సు డిపాజిట్టు రూపముగనో, వాటా ధనము రూపముగనో దాచుకొనుట యభ్యాసమగుచుండెను. రానురాను గ్రామములోనున్న డబ్బంతయు సంఘములోనికిఁ బ్రవహింపఁదొడఁగెను. ఇంక కొంతకాలమునకు మెంబరు లెవ్వరును డబ్బును తాకుటకే యవసరము లేకుండఁబోయెను. వారికి వచ్చునది సంఘములో జమ. వారికిఁ గావలసిన జీవితావసరములు సంఘమే సరఫరాచేయుటచే వారిపై కర్చు! ఇంక వీరికి డబ్బేల ?

ఇప్పుడు సంఘములో నలుగురు గుమాస్తాలు పనిచేయుచున్నారు. వ్యాపారాభివృద్ధియైన కొలఁదియు నింక నెక్కువమంది కావలసివచ్చును. స్వయంసేవక దళమువారు కొంద ఱుచితముగనే పనిచేయుచుండిరి. వేతనముగొనువారైనను డబ్బురూపమునఁ గొనక వారికిఁ గావలసిన వస్తువులను వస్తుభాండారమునుండి తీసికొనుచుండిరి. గుమాస్తాలపని సరిచూచుటకు సెంట్రలుబ్యాంకి తాలూకు సూపరువైజరులు ప్రభుత్వశాఖకుఁజెందిన ఇన్‌స్పెక్టరులు అప్పుడప్పుడు సంఘమునకు వచ్చుచుండిరి. వారికిఁ దగు శిక్షణ యొసఁగుచుండిరి. రాజశేఖరుఁడు వేయికన్నులతోఁ బనియంతయుఁ బర్యవేక్షించుచుండెను.

పంటకాలము వచ్చెను. ధాన్యము పుష్కలముగా దొరకు తరుణముగావున ధరలు మందగించును. ఆ సమయముఁజూచి యంతకు ముందు ఋణములిచ్చిన షావుకారు రైతును ఋణము చెల్లింపుమని యొత్తిడి చేయును. రైతున కితర కార్యములకుఁగూడఁ బైకమవసరమైయుండును. కావునఁ దన పంటను దక్కువ ధర కమ్మి తీరును. లేక షావుకారునకే సమర్పించును. అదేస్థితి వేములపల్లి రైతులకుఁ గూడఁ జాలమందికిఁ బట్టెను. కాని సహకారసంఘము రైతులకుఁ గావలసిన పైకమును ధాన్యము హామీపై నిచ్చి ధాన్యమునంతయు నిలువచేసెను. గ్రామములో నుండు గిడ్డంగులన్నింటిని సంఘమే యద్దెకుఁ బుచ్చుకొనెను. అనేకులు బాడుగ యవసరములేదని యుచిత

ముగ గిడ్డంగులనిచ్చి తమధాన్యమును, ఇతరధాన్యము నందుఁబోయించిరి. కొంతధాన్యము పాతరలలోఁ గొంత ధాన్యము పురులలో నిలువచేయఁ బడెను. రైతులే యిట్టి నిలువసేతకుఁ దోడ్పడిరి. ఇంతలో ధాన్యము నకు ధరలేచెను. గుంటూరునందలి మార్కెటింగు సొసైటీతో వేముల పల్లి సహకారసంఘము జతపడియుండెను. కావున వేములపలి ధాన్యము నంతటిని సరియైన ధర కమ్మిపెట్టుటకు మార్కెటింగు సొసైటీ యంగీక రించెను. ఏ యే ధాన్య మే యే తావులలో మంచి ధరకుఁ బోవునో విచారించి మార్కెటింగు సొసైటీ ఆయా తావులలో నీ ధాన్యమును, ఇతర సంఘముల ధాన్యమును భారీ పద్ధతి నమ్మివేసి పైకమును సంఘ ముల కిచ్చివేసెను. ఇట్లు చేయుటవలన సగటున నూటికి ముప్పది రూపాయలు రైతునకు లాభముగలిగెను. మన సంఘము కొంత ధాన్యము నిట్లమ్మించెను. గ్రామోపయోగమునకు వలసినంత ధాన్య మును దానే ఖరీదుచేసి వస్తుభాండారము వశమున నుంచెను. అంతట రైతు లానాఁటి కియ్యదేలిన (వాయిదాలు వచ్చిన) పైకమును మాత్రము దిగఁబెట్టుకొని మిగిలినపైక మాయా రైతులకు బట్వాడా చేసెను. కాని వారెల్ల రా పైకము తమదగ్గఱ నుంచుకొన నవస రము గానక సంఘమునందే సేవింగ్సు డిపాజిట్లుగా నుంచుకొనిరి. ఇట్లు మెంబరులకుఁ గ్రమక్రమముగా బ్యాంకింగు వ్యవహార సూత్రము లలవాటగుచుండెను.

మెంబరులకుఁ దరుణములో – సకాలములో – ఋణమిచ్చు సామర్థ్యము లేనియెడల వారు తిరిగి షావుకారుల వశమాదురు. ఒక్కొక్క సమయములో సంఘమునందు పైకము కొఱవపడియుండును. డిపాజిట్లు లదనునకు లభింపవు; అందుచే మన సహకారసంఘము కో-ఆపరేటివ్ సెంట్రలుబ్యాంకిలోఁ గొంత ఋణముచేసి యా మొత్త మును క్యాష్ క్రెడిట్ లెక్కకు జమకట్టుకొనియుండెను. అనఁగా పైక మవసరమైనప్పుడెల్ల అప్పు దరఖాస్తు తయారుచేసి మంజూరు చేయించుకొను నవసరము లేకుండ (అట్లు చేసినచో సకాలములో పైకము చేతికిరాదు.) చెక్కులపూర్వకముగా నెప్పటి కప్పుడు పైకము

తెచ్చుకొను ఋణవసతి యేర్పాటుచేసికొనెను. బ్యాంకివారి యనుమతి లేకుండఁగనే, మంజూరైయున్న క్యాష్ క్రెడిట్ నుండి, పైకము తెచ్చి రైతులకు బట్వాడాచేసి, తర్వాత ఆ యా అప్పుదారుల తరఫున సంఘము అప్పుదరఖాస్తు తయారుచేసి బ్యాంకివారికిఁ బంపుకొనును. బ్యాంకి, అప్పు మంజూరుచేసి అప్పు మొత్తము సంఘము పేరిట ఖర్చు వ్రాసి క్యాషు క్రెడిటునకు జమ వ్రాయును. ఏ మెంబరుకైనను మితి మించి యప్పిచ్చినట్లుగాని సరియైన హామీలేకుండ నిచ్చినట్లు గాని బ్యాంకి కనుపెట్టినయెడల నట్టియప్పు మొత్తములను దాను మంజూరు చేయక వానిని వెంటనే వసూలుచేయుమనును. కాని మన సంఘములో నట్టి యప్పు లెన్నఁడును లేవు. సంఘము బ్యాంకినుండి యప్పు దెచ్చినదియు నొక్క పర్యాయమే.

ఆదర్శప్రాయమగు సహకారసంఘ మెన్నఁడును బ్యాంకినుండి యప్పుచేయదు. వేములపల్లి సహకార సంఘము బాగుగాఁ బాదు కొనని ప్రారంభదశలో నొక్క పర్యాయము మాత్రము బ్యాంకినుండి యప్పుతెచ్చెను. తర్వాత గ్రామమునందే డిపాజిట్లను రాఁబట్టి వెంటనే బ్యాంకి బాకి చెల్లించివేసెను. గ్రామములోనున్న డబ్బంతయు నేదో యొక రూపమున సంఘమునకు రాఁబట్టుకొని యుండుటచే నానార్థ వ్యాపారము చేయుచు మిక్కిలి ద్రవ్యవసతి కావలసియుండు పరిస్థితిలో సైతము రాజశేఖరుఁడు బ్యాంకినుండి ఋణము తీయకయే కార్యము జరుపుచుండెను. డిప్యూటి రిజిస్ట్రారువారీ సంఘమును బహుధా అభినందించిరి.

జూన్ మాసముతో సహకారసంఘము ముగియును. వేములపల్లి సహకారసంఘము జనవరినెలలోఁ బని ప్రారంభించి సహకార సంవత్సరాంతమునకు ఆరుమాసములు పనిచేసెను. ఆగస్టు మాసాంతమగుసరికి లెక్కలు తనిఖీ (ఆడిట్) చేయించి డిప్యూటి రిజిస్ట్రారువారు ఆడిట్ సర్టిఫికేట్టు జారీచేసిరి. ఆ సంవత్సరమునకు సంఘము రు1250/-లు లాభము గడించెను. మహాజనసభ జరిపి యా వైనమంతయు మెంబరులకు వివరించిరి. నిబంధనల ప్రకారము లాభములో సగము (రు625/-లు)

క్షేమనిధికి జమకట్టిరి. రు. 480/-లు మెంబర్ల వాటాధనముపై డివి డెండుగా నిర్ణయించిరి. రు.95/-లు సముదాయ ప్రయోజననిధికి జమ కట్టిరి. మిగిలిన రు. 49/- లు క్షేమనిధికే జమకట్టిరి.

డివిడెండు మొత్తమును మెంబరులు పుచ్చుకొనుటకంటె గ్రామములో నేదేని సామాజిక ప్రయోజనమునకై వెచ్చించుట మంచిదని రాజశేఖరరావు సూచించెను. అందఱు నంగీకరించిరి. గ్రామములో రేడియో లేదు గావున డివిడెండు మొత్తము రు. 480/-లను పంచాయతీ బోర్డున కిచ్చి రేడియోకై వినియోగింపుమని కోరుటకుఁ దీర్మానించిరి. సముదాయ ప్రయోజన నిధిని రేడియోకుఁ గావలసిన బ్యాటరీలు కొనుటకై వినియోగింపవలసినదిగాఁ దీర్మానించిరి.

అనతికాలములో సహకారసంఘము తమ కెంతయో సాయపడుటయేకాక తమవద్దనుండి దమ్మిడీ వ్యయముగాకుండ గ్రామమంతటికిఁ గావలసిన రేడియోసౌకర్యము సమకూర్చెఁగదా యని యందఱును సంతసించిరి. కలిసి పనిచేయుట-అనఁగా సహకారము వలనఁ బ్రయోజన మిది గదా యని గ్రామస్థులు సోదాహరణముగా నర్థము చేసికొనిరి. రేడియో ప్రారంభోత్సవమును డిప్యూటి రిజిస్ట్రారువారి చేతనే చేయించిరి. ఆ నాఁడు తిరిగి వారు సహకారమునుగూర్చి యుపన్యసించుచు వేములపల్లి యింత స్వల్పకాలములో సహకార ఫల మనుభవించుచున్నందుకు గ్రామస్థులను మిగుల నభినందించిరి. సహకారసంఘ ప్రాథమికావస్థ యిట్లు జయప్రదమయ్యెను.

## XV

# హరిజన వాటిక

వేములపల్లి హరిజనవాడ మునుపటివలె లేదు. బారులు దీరిన యిండ్లు, విశాలములైన తిన్నని వీథులు, వీథులలో రోడ్లు, లాంతరు స్తంభములు, పరిశుభ్రములగు నిండ్ల పరిసరములు, చూచుట కింపు గొలుపుచు నిది హరిజన వాడయా యను సందియమున కాస్పదమై యుండెను.

ఒక సంవత్సరములోఁగా నచ్చటి కేఁగని యింకొక యూరి హరిజనుఁడు వేములపల్లిలోఁ దనచుట్టములఁ జూడవచ్చి మునుపటి వాడయే యచ్చటఁ గనిపింపక తికమకపడి తరువాత నెటేఁగిన వా రెవ్వరో దారిచూపింపఁ దన చుట్టాలయింటికిఁ జేరెను. ఆ యిల్లు మంగళగిరి వెంకటదాసునిది. ఈ సంస్కారము రాకమున్ను అతని యిల్లొక చిన్న గుడిసె. వంగి లోనికిఁ బోవలసియుండెను. ఇంటినిండఁ దేమ, వాసన. యింటిచుట్టు బురద. ఇప్పుడో యది రెండుదూలముల మట్టిగోడల తాటాకు టిల్లు. విశాలములైన గవాక్షములు, వాకిళ్ళు, ఎత్తైన ప్రదేశమునఁ జుట్టును ఖాళీయుండునట్లు కట్టఁబడినది. లోన నేల గట్టిగా నుండునట్లు, గ్రావెలువేయఁబడి చక్కఁగా నలుకఁబడి యుండెను. దానిపై నాముతో వేసిన ముగ్గులు, మధ్యమున దడులు కట్టి వెనుక వసారా వంటయిల్లు భోజనశాలగను, నడుమ చోవడి పండుకొనుటకును, సామానుంచుకొనుటకును, ముందు వసారా తక్కిన కార్యములకును బనికివచ్చునట్లు తీరికగా నమర్పఁబడి యుండెను. ఇంటిచుట్టుఁ గందికంపతో దడి దానిపైఁ గాకరతీగెలు, పూలతీగెలు కళకళలాడుచుండెను. ఈ మార్పుచూచి వెంకటదాసుచుట్ట మాశ్చర్య పడెను. ఇటీవల హరిజనవాటికకుఁ బట్టిన భాగ్యముగూర్చి వెంకట దాసు తన చుట్టముతోఁ జెప్పుచుండఁగా శాంతాదేవి యతనియింటికిఁ బోయెను. "తల్లీ! నమస్తే, దయచెయ్యండి" యని తడబడుచు మంచముదెచ్చి యచ్చటవేసి "కూర్చోండమ్మగారూ" అని ప్రార్థించెను.

శాంతాదేవి కూర్చుండి దాసు చుట్టమునుగూర్చి పరిచయముఁ జేసికొనెను.

శాంత:- నీ చుట్టము దేనికి, అంత పెడపెడగా బోతున్నాడు ?

దాసు:- వాళ్ళవ్వూళ్ళో నీబోటి తల్లులు మా మాలకొంపలకు రారు. ఇక్కడ మాలచ్చిమల్లె నీవు మా కొంపకొస్తే మావాడి కేదీ అర్థంగాక బెదిరిపోతున్నాడు. "తల్లీ ! వీడు నా బావమరిదికొడుకు, రామదాసు. జానపాడు. వాళ్ళవ్వూళ్ళో మాకు మరీ పుట్టగతులు లేవు.

శాంత:- ఔనుగాని, మాల కొంపలనీ, మాల ముండాకొడుకులనీ మిమ్మల్నిగూర్చి మీరు హీనంగా చెప్పుకోవద్దని నే నెన్నిసారులు చెప్పినా వినరు మీవాళ్ళు, ఎందువల్ల ?

దాసు:- తరతరాలుగా అలవాటమ్మా !

శాంత:- కావచ్చు. కాని మార్చుకొమ్మన్నప్పుడు మార్చుకోవాలి. మార్చుకోనటమే కాదు. మీరూ అందరిలాంటివాళ్ళేననీ, అందరితో సమానులనీ భావించాలి. నమ్మాలి. దాన్నే "ఆత్మగౌరవం" అంటారు. ఆత్మ గౌరవం లేనిదే ఏ జాతీ బాగుపడదు. ఇన్నాళ్ళూ తక్కిన కులాలు మిమ్ము హీనంగా చూచారు. అందువల్ల మీరు నిజంగా హీనులే అనుకొని హీనంగా ప్రవర్తించారు. హీనంగా బ్రతికారు. ఆ యుగం అంతరించింది. గాంధీయుగం వచ్చింది. మానవులందరూ సమానులే యని ఇంతవరకూ పాటిస్తూ కుల భేదాలకు ఆధారం లేదని గాంధీ మహాత్ముఁడు బోధించాడు. ప్రపంచం సత్యం గుర్తించింది. కాబట్టి మీరు మునుపటిమాదిరి హీనజాతి అనుకోనటం చాల తప్పు. అవివేకం. హీనులము కాము అనుకొంటే చాలదు. హీనులుగా ప్రవర్తించగూడదు. జీవించకూడదు. తక్కిన అన్ని జాతులవలెనే గౌరవంగా జీవించాలి. మిమ్ముల మీరే మాల మాదిగ అని హీనంగా పిల్చుకొని పూర్వ పద్ధతి ప్రకారం మురికికూపాలలో పడివుంటే ఎట్లా బాగుపడతారు? మీకు ఇతరులు చేసే సహాయంకంటె మీకు మీరు చేసుకొనే

సహాయమే మిమ్ముల నుద్ధరిస్తుంది. దాసూ! చూచావా! ఆ నట్టిల్లు! ఆ వున్న గుడ్డాగోచీ, కుండాచట్టీ, ఒక పొందికగా పెట్టుకోగూడదూ? ఇప్పుడు ఇల్లు విశాలంగా ఉన్నదిగా! ఎక్కడ వుంచవలసిన వస్తువు అక్కడే వుంచాలి. అన్నిటిలో ఒక తీరిక వుండాలి.

శాంతాదేవి యీ మాటలు పల్కుచు వంటయింటి లోనికిఁ బోయెను. దాసు లిద్దరుగూడ నామెతో లోనికిఁ బోయిరి. వంట యింటిలో క్రిందఁబడి పొర్లాడుచున్న పిల్లలను దాసునకు జూపుచు నామె యిట్లనెను.

"చూచావా! ఆ పిల్లలనుచూడు! ఒంటినిండా మట్టి! అట్లా క్రిందఁబడి పొర్లాడుతున్నారే! ఈ వంటిల్లు చిమ్మినట్లే కనఁబడదు! ఆ యెంగిళ్ళు ఎంతసే పుంచుతారు? ఆ అన్నం మీద మూత యేదీ? అన్నం, కూరలు, ఉప్పు, కారము, తక్కిన దినుసులు, అన్నీ పొయిదగ్గరే ఉండాలా? ఆ బూడిద, దుమ్ము లేచి వాటిలో పడడంలేదూ? చూడు! నీ భార్య చెయ్యి కడుక్కోకుండానే యిందులో చెయ్యి అందులో, అందులో చెయ్యి యిందులో పెడుతున్నది. నే నెంత చెప్పినా పరి శుభ్రత నేర్చుకో లేదింకా! ఆ వున్న రెండుచెంబులూ, కంచాలూ, తోమి పెట్టుకోగూడదూ? ఆ పిల్లవాడు అన్నంతిని చెయ్యి కడుక్కో కుండా యేదో చేస్తున్నాడు. ఎంగిలి కంచంనిండా ఈగలు వాలు తున్నాయి. ఛీ! వంటింట్లో ఉమ్మేస్తారా? చూడు! అ వుమ్మిలక్కడ! (వెంకటదాసుతో) వున్న వాళ్ళలో నీవే కొంచెం మెరుగనుకొంటే నీ యిల్లుకూడా యిట్లా వున్నదే! నాకు చాలా విచారంగా ఉన్నది. రేపు మళ్ళీ వస్తాను. నేను చెప్పినట్లు ఇల్లు శుభ్రంగా వుంచాలిసుమా! నేను మీ యింట్లో భోంచేస్తాను రేపు, తెలుసునా?

దాసు:- అమ్మయ్యో! మా యింటోనే!

శాంత:- ఏం, ఎందుకు చెయ్యగూడదూ? మరి నేను భోజనం చేయ డానికి తగినట్లుగా నీవు ఇల్లు శుభ్రపరచాలి. శుచిగా వంట చేయించాలి. సరే, రా తక్కిన యిళ్ళకుగూడా ఒకసారి వెళ్ళి చూచివస్తాం.

అని దాసులతో మఱియొక వీథికిఁబోయెను. అచట పాపయ్య లచ్చయ్య బావివద్ద తగవులాడుకొనుచుండిరి. పాపయ్య మాల. లచ్చయ్య మాదిగ. పాపయ్య, లచ్చయ్యను మాలలబావిలో నీరు తోడుకొననీయనని యడ్డుపెట్టుచుండెను. మాలలు మాదిగలకంటె శ్రేష్ఠులని పోరాడుచుండెను. ఆ సమయముననే శాంతాదేవి అచ్చటికి పోయి "లచ్చయ్యా! నాకు దాహమౌతున్నది. మీ యింట్లో ఒక చెంబెడు పట్టుకురా?" అని కోరెను. లచ్చయ్య, పాపయ్య పోరాడుట మాని యామె యాకస్మిక దర్శనమునకు నపూర్వపుఁ గోరికకు నచ్చెఱు వందుచుండిరి. "చూస్తావు, దేనికి? తే, మంచినీళ్ళు" అని మఱల నడిగెను. లచ్చయ్య తటపటాయించి "మా యింట్లో చెంబేడది, తల్లీ, ముంతలే గదా!" అని యనెను. "ముంతతోనే తే, ఫరవాలేదు, పో" అని శాంత పలికెను. లచ్చయ్య దాపున నున్న తన యింటికిఁబోయి ఒక నల్లని ముంతతో నీరు తెచ్చియిచ్చెను. ఆ నీటి నామె గటగట త్రాగెను. అంతట పాపయ్యతో "ఏం పాపయ్యా! లచ్చయ్య నీకంటే తక్కువా? నే నతని యింట్లో నీళ్ళు తెప్పించుకు తాగాను. కాబట్టి నేనుకూడా నీ కంటే తక్కువకులం దాననేగదా!" యని చిఱునవ్వుతోఁ బ్రశ్నించెను. పాపయ్య చెంపలువేసికొని "పొరపాటు తల్లీ! ఇక నెప్పుడు పోట్లాడను. పాత అలవాటు-చొప్పున మాదిగలకంటే మాలలు గొప్ప అని కూశాను. నువ్వు చెప్పిందంతా మరిసిపోయాను. ఒరే లచ్చిగా, తోడుకుపోరా, నీళ్ళు" అనెను.

శాంత:- అదుగో మళ్ళీ, లచ్చిగా! అంటున్నావా?

పాపయ్య:- తప్పు. అందరూ పిలిశే వాడుకనుబట్టి పిలిశాను. ఇక పిలవను. లచ్చయ్యా! నీళ్ళు తోడుకు పో!

శాంత:- అందరూ పిలవటమే తప్పు. నీవు పిలవటం మరింత తప్పు. మిమ్ములను మీరు గౌరవించుకోలేకపోతే ఇతరులెందుకు గౌరవిస్తారు?

ఇంతలో వీథిలోనుండి "ఒరే పాపిగా, ఇటురారా! నీ కోసం పాటిమీదికి రావాలిసొచ్చింది, చివరికి" అని యెవరో కేకవేసిరి.

పాపయ్య:- యిన్నావుగా తల్లీ! ఆ పిలిశేది యీరారెడ్డిగారు. 'పాపిగా' అని ఆయన పిలిశేది.

ఇంతలో వీరారెడ్డి వా రున్నచోటికే వచ్చెను. పాపయ్య కొంచెము ధైర్యము తెచ్చుకొని వీరారెడ్డితో నిట్లనెను. "రెడ్డిగారూ! ఇన్నాళ్ళూ ఏం పిలిశారోగాని ఇకనుంచీ నా పేరున నన్ను పిలవండి. నా పేరు పాపయ్య. పాపిగాడు గాదు."

వీరారెడ్డి:- మీకు కళ్ళు నెత్తి కెక్కినయిరా! నిన్ను పాపయ్య అనాలా? పాపయ్యగారూ! అని కూడా అనాలా?

శాంత:- 'పాపయ్యగారూ' అంటే మరీ మంచిది. పాపయ్య మిమ్మ "రెడ్డిగారూ!" అనటం లేదూ!

వీరా:- ఓహో! శాంతమ్మతల్లీ, నీవు తయారైవున్నావా, ఇక్కడ? సరే, ఇక నేంకావాలి. ఊళ్ళో ఆడముండల్నందర్నీ చెడగొట్టావు - చదువనీ చట్టుబండలనీ. గడపదాటిపోని వెధవముండల్ని రచ్చ కీడ్చావు. ఇంటింటికి తిప్పుతున్నావు. మీటింగులకు లాగుతున్నావు. మరి మాట్లాడితే మారుపెళ్ళికికూడా తయారుచేస్తున్నావు. అది చాలక మాలపల్లి మీద పడ్డావా? అందరూ సమానమే అని వీళ్ళను రెచ్చకొడుతున్నావా? వూరు ఏంకావలెననుకొన్నావు?

శాంత:- బాగుపడాలనుకొన్నాను.

వీరా:- వల్లకాడవుతుంది. వెంకాయమ్మచేలో వీళ్ళకొంపలు వేయించి మాలపల్లి వూరిదాపుకు దీసుకొచ్చావు. ఊర బావిలో నీళ్ళు తోడుకెళుతున్నారు ఆ తూరుపేపు మాలవాళ్ళు. అది చాలక నీ వింకా వీళ్ళ కొంపలలో తిరిగి వీళ్ళకు అలవాటులేని ఆచారాలు నేర్పి -

శాంత:- వీళ్ళయిళ్ళల్లో తిని-

వీరా:- హరి! హరి! ఆ పనికూడా అయిందీ! వర్ణసంకరం చేశావు! నీవు సంకరమయిందికాక యెంతమందిని చెయ్యదలచావు, తా చెడ్డ కోతి వనమెల్ల చెరచినట్లు? పైగా యింత బ్రదుకూ బ్రదికి యీ పాపిగాణ్ణి పాపయ్యా అని పిలవమంటావా, నన్ను?

శాంత:—రెడ్డిగారూ! యుగం మారిపోయింది. వీళ్ళను అణిచిపెట్టినన్నాళ్ళు అణిచిపెట్టారు. మాయధర్మాలు పన్ని వీళ్ళకళ్ళకు గంతలుగట్టి, అజ్ఞానాంధకారంలో ఉంచారు. అందువల్ల హిందూసమాజ మొక చెయ్యి చచ్చుబడిన పక్షవాతరోగిలాగా కురూపియై దుర్బలమై క్షీణించింది. ఈ దౌర్బల్యాన్ని విదేశీయులు తమ మతవ్యాప్తికి ఉపయోగించుకొని మనలో ఒకభాగమైన ఈ హరిజనాన్నే మన శత్రువర్గంగా తయారుచేశారు. ఉన్న మతవర్గాలు చాలక క్రైస్తవ మతవర్గం ఒకటి తయారైనది. రాజకీయపు ఎత్తులలో ఈ క్రైస్తవ జనాన్ని ఒక పాచికగా ఉపయోగించారు. ఈ విషాదకరమైన పరిస్థితిని యుగపురుషుడు గాంధీమహాత్ముడు కనిపెట్టి మన హరి జనాన్ని మనలో కలుపుకొంటేనేగాని మనకు మోక్షంలేదని జ్ఞానోపదేశం చేశాడు. మనకూ వాళ్ళకూ నిజానికి యే భేదమూ లేదని నిరూపించాడు. బుద్ధిమంతులందరూ మహాత్ముని సందేశం అర్థంచేసుకొన్నారు. అంగీకరించారు. దేశాభ్యుదయానికి హరిజనో ద్ధరణ ముఖ్యావసరమని అందరూ ఆ కార్యానికి పూనుకొన్నారు. అట్టి సందర్భాలలో మన గ్రామ హరిజనసోదరులను మన మింకా అణిచిపెట్టాలనటం ఎంతఘోరమో, ఎంత అవినీతికరమో విచా రించుకోండి. పాపయ్యను 'పాపయ్యా'! అని పిలవటానికి మీ కంత కష్టమెందుకు? పాపయ్య మీకంటె ఎందులో తక్కువ? కులంలోనా? ఎవరు కల్పించారు కులం? దేవుడు కాదు. మనమే. అతనూ మనమాదిరే పుట్టాడు. సత్యం విచారిస్తే మనకంటే నీతిమంతుఁడుగూడా. సమాజ సౌఖ్యానికి పాపయ్య ఉపయోగ పడ్డంత మీరు ఉపయోగపడుతున్నారా? పాపయ్య చెమటతీసి పొలంపనిచేస్తేనేకదా, మీరు ధాన్యం తెచ్చుకొని వాటంగా పాతరవేసికొనేది? అటువంటి పాపయ్య మీకు "పాపిగాడా"? బొజ్జకదలకుండా మెక్కి కూర్చొనే మీరు వీళ్ళకు "దొరగారా"? రెడ్డిగారూ! ఈ బూజుపట్టిపోయిన సిద్ధాంతాలు ఇక చెలామణి కావు. యుగం మారిపోయింది. ఆమార్పు గుర్తించి అందు కను-

గుణంగా వ్యవహరించకపోతే ప్రమాదం. మీరు కళ్ళు తెరిచి ఆ ప్రమాదం తప్పుకోవాలి.

వీరా:- గవ్వగచ్చికలాగా ఎందుకిట్లా గలగల మీదపడతావు? ఏదెట్లా తగలడితే నాకెందుకు? నా మతం నాదే. నీవూ, ఆ సన్యాసి రాజశేఖరంగాడూ ఊరి నాశనానికి పుట్టారు. ఆ పుల్లయ్య వంతులు ఎప్పుడో చెప్పాడు. ఎట్లానైనా నాశనంకండి. ఏ గంగలోనైనా పడండి. ఈ మాల మాదిగ గుంపును నెత్తికెక్కించుకు ఊరేగండి. నాకెందుకు –

అని రొసరొసలాడుచు వీరారెడ్డి వచ్చిన పని ముగించుకొనకుండఁగనే తిరిగిపోయెను. ఈ సంభాషణ జరుగుచుండఁగా వారి చుట్టును జాలమంది హరిజనులు – స్త్రీలు, పురుషులు – జేరిరి. శాంత వారితో నిట్లనెను.

"రెడ్డిగారు మిమ్ముల నిట్లా చూడడానికి మీరే చాలావరకు కారణం. మీ ఆచారాలు మార్చుకోవాలి. తక్కిన వర్ణాలవారందరు ఎట్లా శుభ్రంగావున్నారో మీరూ అట్లాగే ఉండాలి. ఎంతపేదవాడైనా బ్రాహ్మడెట్లాఉంటాడో చూడండి. తరతరాలుగా ఎట్లా వున్నామో అట్లాగే వుందామని మీరు మూర్ఖంగా పడివుంటే మిమ్ముల దేవుడు గూడా బాగుచేయలేడు. చూడండి! ఆ గుడ్డలమురికి! వాటిని చక్కగా ఉదుకుకోడానికేం కష్టం? ఆ పిచ్చయ్య శరీరంచూడండి; ఎన్నాళ్ళైందో స్నానంచేసి, ఉప్పురికి ఎట్లా అసహ్యంగా ఉన్నదో! ప్రొద్దునా సాయంత్రం కడివెడు నీళ్ళుపోసుకొని ఒళ్ళు శుభ్రంచేసుకోడానికింత బద్ధకమెందుకు? ఆ నాగమ్మ చీరెకట్టడంలో అంతపాలుమాలిక దేనికి? ఆ వున్న చీరె మా మాదిరిగా కట్టుకోగూడదూ? మనం అందరి మాదిరిగా వుందామని మీలో మీకు ఉద్రేకంకలిగితే తప్ప ఇతరులు మిమ్ముల తమతో సమానంగా చూడరు."

అని యా చోటువదలి మఱియొకచోటికిఁ బోయెను. ఒక స్త్రీని బిలిచి "నేనుచెప్పిన ప్రకారం పిల్లలకు నీళ్ళుపోసి శుభ్రంగా ఉండడం నేర్పుతున్నావా?" యని ప్రశ్నించెను.

స్త్రీ:- సబ్బుబిళ్ళ దొరకలేదండి, అమ్మగారూ! నీళ్ళుమాత్రం పోస్తున్నాను.

శాంత:- సబ్బుబిళ్ళ ఉపయోగించమని నేను చెప్పలేదే.

స్త్రీ:- దావీదు భార్య మరియమ్మ సబ్బు ఉపయోగిస్తే చూశాను.

శాంత:- సబ్బుకంటే సున్నిపిండి మంచిది. పెసలు విసిరి సున్నిపిండి చెయ్యి. ఒంటికి చలవకూడా చేస్తుంది. సీకాయ కుంకుడుకాయ గూడ ఉపయోగించు. ఇవి సబ్బుకంటే చౌక. సబ్బు మురికి పోగొట్టలేదు. సువాసనచూచి మోసపోవద్దు. అదిసరే! ఆ పిల్ల తలకు కొంచెం కొబ్బరినూనెరాసి జుట్టు దువ్వలేవూ? అంత బద్ధకందేనికి?

స్త్రీ:- బద్ధకంగాదండి. అలవాటులేదు. ఎన్నడో దువ్వుతా ఒకనాడు.

శాంత:- ఈ చిన్న లోపాలవల్లనే యితరులకంటే వెనకబడ్డట్లు కనిపిస్తారు మీరు. ఊళ్ళో తిరుగుతున్నప్పుడు తక్కిన కులాలవారు ఇళ్ళు ఎట్లా శుభ్రంగా పెట్టుకుంటున్నారో, పిల్లల నెట్లా పోషించుకొంటున్నారో, దుస్తులెట్లా వేసుకుంటున్నారో గమనించి ఆ పద్ధతుల్ని నేర్చుకోవాలి. ఇతరులతో సమానంగా ఉండాలంటే యితరులెట్లా వున్నారో మీరూ అట్లాగే వుండాలి. ఇందుకు పెద్ద భాగ్యం అవసరంలేదు. పట్టుదల కావాలి. పద! ఆ ప్రక్క పదిళ్ళూ చూచిపోవాలి.

అని చెప్పుచు శాంతాదేవి యింటింటికిఁ దిరిగి హరిజనులకు సదాచారములు, సదభ్యాసములు నేర్పుచుండెను. ఒకచోటఁ దాను చెప్పినట్లు శుభ్రముగాఁ బెంచుచున్న యొక పసివానినిజూచి సంతోషించి వానిని ఎత్తుకొని ముద్దాడెను. అందఱి పిల్లలు నిట్లు కంటికింపుగా నుండవలయునని చెంగటనున్న హరిజనమహిళ కుద్బోధించెను. శాంతకుఁ బ్రతి సాయంకాల మిదే పని. పర్యవసానముగా హరిజనవాటికలో జీవితము మారిపోవుచుండెను. ఒకరినిజూచి మఱియొకరు బాగుపడఁ బ్రయత్నించుచుండిరి. శాంతాదేవితమ యిల్లెప్పుడు వచ్చి చూచునో, ఎప్పుడు తమ లోపములు చూపించి కోపగించుకొనునో యని యెవరికివారు జాగ్రత్తపడుచుఁ బరిశుభ్రత కలవాటు

పడుచుండిరి. చక్కఁగా మాటలాడ నేర్చుకొనుచుండిరి. కట్టు బొట్టు జుట్టులలో "సవర్ణు"ల ననుకరించి చూపులకు వారితో సామ్యమును సాధించుచుండిరి. హరిజనులని చెప్పవలెను హరిజను లనుకొనుటకు వీలుగానంతవఱకు నభివృద్ధిఁ బొందుచుండిరి.

రాజశేఖరుఁ డేర్పఱచిన 'స్వచ్ఛంద యువక సేవాదళము' వారు పవలు కొందఱు రాత్రి కొందఱు హరిజనవాడలో నుచితపాఠశాల నడుపుచుండిరి. పవలు పిల్లలకు రాత్రులు పెద్దలకుఁ జదువు నేర్పుచు వారితోఁ గలిసిమెలసి తిరుగుచు వారికిఁ జనవు గాఁ దొడఁగిరి. "వాళ్ళ యిళ్ళకు మనం, మన యిళ్ళకువాళ్ళు నిరభ్యంతరంగా వచ్చిపోతుంటే తప్ప వాళ్ళకు మన మంటే బెరుకు పోదు. కాబట్టి కొంతకాలం పట్టు బట్టి మనం ఈ పని చెయ్యాలి. మనం వాళ్ళలో మెలగడం హెచ్చిన కొద్దీ వాళ్ళ యిళ్ళు పరిశుభ్రపఱచుకొంటారు. వాళ్ళను దూరాన వుంచడం వల్లనే ఈ గతికి వచ్చారు. మనం వాళ్ళతో కలిసి సమయం వచ్చినప్పుడు వాళ్ళ యిళ్ళలోనే భోజనం చెయ్యాలి. మన యిళ్ళల్లో మన పంక్తిని వాళ్ళకు భోజనం పెట్టాలి". అన్న రాజశేఖరుని యుద్బోధ. యువకుల కతని మాటలు వేదాక్షరములు. వా రట్లే చేయుచుండిరి.

ఆర్థికముగా హరిజనులకు సాయము చేయుటకు సహకార సంఘము (హరిజన శాఖ) చుఱుకుగాఁ బనిసేయుచుండెను. పంచాయతీ బోర్డువారి (వెంకాయమ్మ తాలూకు) రెండెకరముల భూమిని దాని కానుకొనియుండు పోరంబోకు రెండెకరముల భూమిని-మొత్తము నాలు గెకరములను- సంవత్సరమునకు నూరురూపాయల చొప్పున సహకార సంఘము గుత్తకుఁ దీసికొని హరిజనకుటుంబములు నూరింటికి- కుటుంబ మునకు నాలుగుసెంట్ల ప్రకారము సాలునకు రెండురూపాయలచొప్పునఁ దిరిగి గుత్త కిచ్చెను. మొత్తము భూమిమీద సంఘమునకు రు 200/-లు ఆదాయము వచ్చును. పంచాయతి బోర్డున కియ్యవలసిన రు 100/-లు పోను రు 100/-లు సంఘమునకు మిగులును. ఈ భూముల చుట్టును చిల్లకంచె నాటిరి. ప్రతి కుటుంబము తన నాలుగుసెంట్ల భూమిలో

రకరకముల కూరగాయల పాదులు పెట్టెను. అదృష్టవశమున వెంకాయమ్మ తాలూకు భూమిలో నొక పెద్ద మోటబావి యుండెను. ఈ బావినుండి యేతమువేసి కూరగాయల పంపులకు నీరు గట్టుచుండిరి. సంఘము బెంగుళూరునుండి మంచి మంచి కూరగాయల విత్తనములు తెప్పించి హరిజన సభ్యులకుఁ బంచిపెట్టెను. బావిలో నెప్పుడును నీరుండుటచేఁ బ్రతి ఋతువునందును గూరగాయల పంపులకు నీరుగట్టి పండించుటకు వీలయ్యెను. ఈ భూమి హరిజనవాడకు దగ్గఱగా నుండుటచే నాడువారు కూడ నీ పనిని జూచుచుండిరి. అన్నిరకముల కూరగాయలు, ఆకు గూరలు పుష్కలముగాఁ బండుచుండెను. వీని నన్నింటిని బోగుచేసి సహకార సంఘము ప్రత్యూదయము గుంటూరు పంపించి మార్కెటులో టోకుగా విక్రయింపఁ దొడఁగెను. వచ్చిన మొత్తమును నే కుటుంబమున కెంత రావలెనో యా కుటుంబమున కంత లెక్కచూచి ఆయా సభ్యుని లెక్కకు జమకట్టుచుండెను. నగదు తప్పనిసరి యైనపుడు తప్ప బట్వాడా చేయుటలేదు. ఈ భూమికిఁ గావలసిన యెరువులుగూడ సంఘమే టోకుగా సరఫరాచేసి ఫలసాయ మమ్మఁగా వచ్చిన మొత్తమునుండి విత్తనముల ఖరీదు ఎరువుల ఖరీదు రాబట్టుకొనుచుండెను. గుత్తపైకము రెండురూపాయలుగూడ నిట్లే యొక మాసము రోజులలో రోజున కణా చొప్పున వసూలు చేసెను. ఈ పని యంతయు చూచుటకు సంఘములో నొక గుమాస్తాయును గుంటూరు పోయివచ్చుట కిద్దరు హరిజనులును ఒక యొంటెద్దుబండియు నవసరమయ్యెను. బండికిఁ బెట్టుబడి సంఘమే పెట్టి హరిజనసభ్యుల యాదఱిమీఁద లెక్క వ్రాసి యాఱుమాసములలో ఫలసాయపు టమ్మకము నుండి వసూలు చేసెను. గుమాస్తా వగైరా ఖర్చులు తమ లాభమునుండి వారే భరించుచుండిరి. ఎన్ని ఖర్చులు పోయినను సగటునఁ గుటుంబమునకు రోజుకు రూపాయకుఁ దక్కువ కాకుండ నాదాయము మిగులుచుండెను. ఇది వారి కెంతయో సహాయమయ్యెను. అంతియే కాక, వేములపల్లి సహకార సంఘపుఁ గూరగాయలన్న గుంటూరు మార్కెటులోఁ బ్రసిద్ధి గలిగెను. కొంత కాలమునకు

విద్యార్థి భోజనశాలకు, పెద్ద పెద్ద హోటళ్ళకు, అధికారులకు వ్యాకుక లేర్పఱచుకొని చిల్లరగాఁ గూడఁ గూరగాయలు సరఫరా చేయుటకు సంఘ మేర్పాటుచేసెను. ఆహా! సహకారము చేయలేని పని లేదు.

ఇట్లు హరిజనులు సంపాదించు డబ్బును సులభముగా వ్యయము గానీయకుండ సంఘపుఁ బ్రచారశాఖవారు రోజువారి డిపాజిట్ల క్రింద ప్రతి హరిజన సభ్యునినుండి రోజునకు నాలుగణాలు చొప్పున వసూలు చేసి వారి వారి లెక్కలకు జమకట్టుచుండిరి. సంవత్సరము తిరిగి వచ్చు నప్పటికి ప్రతిమెంబరునకు రు. 90/-లు నిధి యేర్పడుచుండెను. తక్కిన పన్నెండణాలు సేవింగ్సు డిపాజిటునకు జమకట్టఁబడు చుండెను. ఆ మొత్తము మించకుండ హరిజన సభ్యులు వస్తుభాండారమునుండి తమకు వలయు దినుసులు కొనిపోవుచుండిరి. ఎటుతిరిగినను నగదు మాత్రము వారి చేతికి వచ్చు నవసరము లేదు. అవకాశమునులేదు.

ఈమాత్రముచే వారి కార్థికసౌష్ఠవ మేర్పడునా? వారికిమాత్ర మెవరికంటె ఖర్చుతక్కువ? మామూలుగా వారు భూస్వాములవద్ద జీత గాండ్రుగను కూలీలుగను బనిచేసి జీవింతురు. ధాన్యపు ధరలు విపరీతముగఁ బెఱిగిపోయినతరువాత భూస్వామి యెంతయిచ్చినను జాలదని వీరును, వీరి కెంతయిచ్చినను తృప్తిలేక పీడించుచున్నారని భూస్వాములును జెప్పుచు రాను రాను ఒండొరుల ద్వేషించుకొను పరిస్థితు లేర్పడెను. ప్రపంచ ములో సామ్యవాదప్రభంజనము భీకరముగ వీవఁదొడఁగెను. వేములపల్లి కా గాలి యింకను సోకకున్నను ఎప్పుడో సోకక మానదని రాజశేఖ రునికి నతని యనుచరులకుఁ దెలియును. ఆత్మహీనమగు నా యుద్య మము గ్రామములోఁ బొడసూపకుండుటకు వారొక మార్గము కని పట్టిరి. భూస్వామి శ్రామిక స్పర్థ ముఖ్యముగాఁ బెద్ద పెద్ద భూస్వా ములపట్లనే యేర్పడును. పదియెకరములవఱకు సాధారణముగా నే రైతున కా రైతే తన భూమిని సాగుచేసికొనును. నలుబదులు, నేఁబదులు గలవారికే శ్రామికులతో నిబ్బంది. కావున వేములపల్లి సహ కార సంఘము గ్రామములో నిరువది యైదెకరములకు మించి పొలము

గలవా రందఱితో సంప్రదించి యంతకు మించియున్న వారితాలూకు పొలమును తానే సాగుచేసెదననియుఁ దనకు గుత్తకీయవలెననియుఁ గోరెను. వారి గుత్తపైకము చెల్లించుటకు సంఘమే బాధ్యత వహించెను. ఈ పద్ధతి చిక్కులేని పనియని పెద్దభూస్వాములందఱు నంగీకరించి పది పది యెకరములు మాత్రము తమ సొంత సాగున కుంచుకొని తక్కిన భూమిని సంఘమునకు గుత్తకిచ్చిరి. ఆఱువందల ఇరువది యైదెకరములట్లు సంఘము గుత్తకుఁ దీసికొనెను. ఈ భూమిని హరిజన సభ్యులకు నూరుగురికిని మద్యపాన నిషేధ బాధితులకు ఇరువదియైదుగురికినిఁ దలకొక యైదెకరముల ప్రకారము తిరిగి గుత్తకిచ్చెను. అయిదెకరములు సాగుచేయుట కెద్దులు బండ్లు కొనుట సాధ్యముకాదు. లాభమైన పనియుఁగాదు. కావున ఐదుగురైదుగు రొక్కొక్క సమూహముగాఁ జేరి యొక్కొక్కసమూహము ఇరువదైదెకరములుమ్మడిగా సాగుచేసికొండని సంఘము సలహాచెప్పెను. అందఱు నంగీకరించిరి. అట్లు ఇరువది యైదు సమూహము లేర్పడెను. ఈ సమూహముల కన్నిటికి నెద్దులు బండ్లు వ్యవసాయోపకరణములు నేర్పఱచుకొనుటకు సంఘము ఉమ్మడి ఋణము లిచ్చెను. ఎరువులు, విత్తనములు, ఉపకరణములు, పశువులు సంఘమే కొని సరఫరాచేసెను. వ్యవసాయము చక్కఁగా సాఁగెను. అటు భూస్వామియు, నిటు శ్రామికుఁడును నెట్టి తగాదాలు లేక జీవించుటకు వీలయ్యెను.

కొంతకాలమునకు సహకారసంఘము పంచాయతీబోర్డు మెంబరుల తోడను గ్రామాధికారులతోడను సంప్రదించి హరిజనులకు సమకూర్చిన యీ యార్థిక సహాయమును మద్యపాన నిషేధ బాధితులకే కాక తక్కిన పేదలకును బక్కరైతులకును సమకూర్చెను. పెద్ద భూస్వాములందఱును నిరువది యైదెకరములకు మించిన తమభూమి నంతటిని సంఘమునకు గుత్తకిచ్చుట కిష్టపడుటచే నింకఁ జాలమంది కిట్టి వసతి గూర్చుట సులభసాధ్యమయ్యెను. గ్రామమునఁగల రెండు వేల యెకరములలో దాదాపు పదునాఱు వందల యెకరము లిట్లు సంఘమునకు గుత్తకీయఁబడెను. ఇరువది యైదెకరము లొక ఖండ

ముగా భాగించి యైదుగు రైదుగురి నొక్కొక్కసమూహముగా నేర్పఱచి వారిచే నుమ్మడిసాగు చేయించుట పరిపాటియయ్యెను. ఎరువులు, విత్తనములు, పశువులు, ఉపకరణములు టోకుగాఁగొని సరఫరా చేయుటేకాక సంఘము వ్యవసాయశాఖవారిచే నవీనపద్ధతులపై సాగు చేయుటను బ్రదర్శింపించి యనేకవిధముల వ్యవసాయము నభివృద్ధిచేసి తొలుతటికంటె మిన్నగా ధాన్యోత్పత్తి చేయించెను. డిప్యూటీరిజిస్ట్రారు వారివలన కలెక్టరుగా రీవిషయము దెలిసికొని మిగుల సంతోషించిరి.

హరిజనులకును, దక్కిన పేదవారికిని సంఘముచేసిన సహాయములలోఁ దేనెపరిశ్రమయు, కోడిగ్రుడ్ల యుత్పత్తియుఁ జెప్పఁదగినవి. ఒక్కొక్కరికి నొక్కొక్క తేనెపెట్టియు మూడు నాలుగు మంచిరకపుఁ గోడిపెట్టలను సంఘము కొనియిచ్చి వారిపై లెక్క వ్రాసెను. తేనె నెట్లు సేకరింపవలసినదియుఁ బ్రదర్శించి చూపెను. ఉత్పత్తియైన తేనెను సంఘమేకొని మొత్తముగా గుంటూరువంటి పట్నములలో సంఘపుఁ బేరితో నమ్మించెను. మెంబరులు తెచ్చి యిచ్చు కోడిగ్రుడ్లనుగూడ తరగతులవారిగా విభజించి గుంటూరిలో హాస్టళ్ళకును, ఆసుపత్రులకును వాడుకగా నమ్ముటయేకాక మద్రాసులో నొక టోకు వ్యాపారస్థునికిఁ బ్రతిదినము నెగుమతి చేయుచుండెను. కూరగాయలనుగూడ మద్రాసుకుఁ బంపుట కేర్పాటుచేసెను. ఇట్లే పాలు, వెన్న, నెయ్యి యుత్పత్తిచేయించి యమ్మించుచుండెను. రాట్నపుఁబరిశ్రమ నవారునేత, నులకపేనుట, చాపలల్లుట మున్నగు ననేక-ఉపవృత్తులు ప్రవేశపెట్టి వారివారి తీరికనుబట్టియు, నభిరుచిని బట్టియు, నైపుణ్యమునుబట్టియు నీవృత్తులచే వారి యాదాయము నభివృద్ధి చేయించెను. వారు తయారుచేయు సరుకులను గిరాకిగల తావులలో సోదర సహకార సంస్థల సహాయముతో నమ్మించుచుండెను. ఒక్కొక్క యుపవృత్తి యొక్క యార్థికతత్వమును, నిర్వాహణ విధానము నిచ్చట వివరించుట కష్టము కావున విరమించుచున్నాను. ఒక మాట మాత్ర మిచ్చట చెప్పనగును. ఇందువలనఁ బేదలకు, నార్థిక

ముగా మంచి సహాయము గలిగి వారు సుఖజీవనము సేయుటకు మార్గ మేర్పడెను.

సంఘముచేసిన యీ యార్థిక సంస్కారములవలన దాదాపు గ్రామీణులందఱిలో నొక విధమగు సమానత్వము - ముఖ్యముగా నార్థికసామ్యము - ఏర్పడెను. హరిజనులని, తదితరులని భేదము క్రమముగా నదృశ్యమగుచుండెను. అందఱు వ్యవసాయముపై జీవించు వారే. అందఱికి నొకే మాదిరి యుపవృత్తులే. అందఱి యార్థికపరిస్థితియు నొక్కటే. అందఱికి రక్షాదేవత సహకార సంఘమే. అందఱిది హిందూసమాజమే. మఱి భేద మెచ్చటిది?

కాని వందలకొలఁది వత్సరములనుండి సమాజ క్షేత్రమున నేరులు పారిన కులభేదములు, మర్యాదలు, నొక్కసారిగాఁ బోవునా? శాంతా రాజశేఖరుల హరిజనసేవ గ్రామములోఁ గొంత యలజడి కలిగింపక పోలేదు. మఱియు వారిపైఁ గల వ్యక్తిద్వేషముగూడ దానికిఁ దోడయ్యెను. రమణారెడ్డి, పాపిరెడ్డి, పుల్లయ్యపంతులు మున్నగువారు గ్రామములో తీవ్రమగు విరుద్ధ ప్రచారము మొదలుపెట్టిరి. శాంతాదేవి మాదిగకూడు తిన్నదని వీరారెడ్డిగారు రచ్చబండలపైఁ గూర్చుండి ప్రచారము సేయుచు వెంకటరెడ్డిగారిని వెలిపెట్టవలయునని యొక యుద్యమము లేవఁదీసెను. రాజశేఖరుని తండ్రియగు కోదండరామయ్య గారినికూడ కులబహిష్కారచర్యకు గుఱిసేయవలయునని రాఘవయ్య చౌదరి మొదలగు కమ్మవారు గూడ గట్టిపట్టు పట్టిరి. హిందూ మత మంతయు మంటఁగలియుచున్నదని పూర్వాచార పరాయణులు గగ్గోలు పెట్టుచుండిరి. ఇంతమాత్రమున రాజశేఖరాదులు నిరుత్సాహ పడక దీక్షాదక్షులై పురోగమించుచునే యుండిరి. హరిజనవాడలో నొక మాలయువతిని, మాదిగ యువకున కిప్పించి పెండ్లి సేయించి పెండ్లియింటఁ దా మెల్లరు విందుగుడిచిరి. సమాజశృంఖలలు ద్రెంపుకోఁ గలిగిన యువకులందఱును, ముఖ్యముగా స్వచ్ఛంద యువక సేవా దళమువారును విందులోఁ బాల్గొనిరి. ఊరిలోని శ్వేత శీర్షులందఱు లబలబలాడిరి. హరిజనులే యాశ్చర్యచకితులైరి.

పెండ్లివిందులతో నాగక యువకబృందమూనాటిసాయంకాలము పెండ్లివారిని దక్కిన హరిజన సోదరులను దీసికొని వేణుగోపాలస్వామి యాలయములోనికి వచ్చి నూతన దంపతులకు స్వామి దర్శనము చేయింప వలయునని కోరిరి. అర్చకుడు తటపటాయించెను. అంగీకరించుట శాసన విరుద్ధమనియు, నేరమనియు రాజశేఖరుడు చెప్పెను. పుల్లయ్య పంతులు, నీలకంఠశాస్త్రి, లచ్చిరెడ్డి రామకృష్ణయ్య, కోసపాటి వీరా రెడ్డి, సాగి గోపాలరాజు ప్రభృతులు ముందుకువచ్చి దేవాలయము మైలపడుచుట గ్రామమున కరిష్టదాయకమని వాదించిరి. రాజశేఖరుడు డెలుగెత్తి యిట్లు చెప్పెను.

"హరిజన దేవాలయ ప్రవేశము అరిష్టదాయకంకాదు; మంగళ కరం. ఆ విషయం శాసనసభవారే తేల్చి శాసనంచేశారు. హరిజనులూ మన వంటివారే. మీ కాలంలో వారిని మురికిగుంటలలో కాపుర ముంచి, తలయెత్తితే మొత్తుతూ నీచంగా చూస్తూ వారి నిరంతర ఖేదానికీ దైన్యానికీ కారకులైనారు. వారిని చండాలురన్నారు. తాక రాని వారన్నారు. వారికేమాత్రం ప్రపంచజ్ఞానం కలగకుండా కాపలా గాచారు! మీ మోసం కనిపెట్టలేక తాము నిజంగా చండాలురేయనీ నీచులేయనీ నమ్మి వారూ అట్లాగే ప్రవర్తించారు. జీవించారు. వారు అధోగతిలో ఉండటానికి మీరేకారణం. వారు గాదు. మా కాలంలో మొదట వారికి జ్ఞానోదయం కలిగించాము. సదాచారాలు నేర్పు తున్నాం. మాతో సమానంగా గౌరవిస్తున్నాము. ఆర్థిక సహాయంచేసి ముప్పూట తినటానికీ, హాయిగా తలదాచుకోడానికీ వసతి చేశాం. ఇప్పుడు చూడండి, వారెట్లా వున్నారో! తోమిపెట్టిన లోహపాత్రలు లాగా మీతో సమానంగా ఉన్నారు. మన కంటే వారేవిషయంలో తక్కువ? నీతిలోనా, నియమంలోనా, సమాజాని కుపయోగించడం లోనా, ఎందులో తక్కువ? వారి తక్కువ తనం మన మనస్సులో ఉన్నది! వారి చండాలత్వం మన మాటలలో ఉన్నది!! నిజానికి మన మెంతో వారూ అంతే. సమాజానికి మనకంటే వారే ఎక్కువ వుపయోగపడతారు. మీకు భగవంతుడిమీద భక్తివున్నదా? మొదట

నమ్మకం ఉన్నదా? వుంటే బీద సోదరమానవులైన వీరి నిట్లా అధోగతి పాలు చేస్తారా? కుక్కలకంటే నీచంగా చూస్తారా? మిమ్ములనూ వారినీ సృజించిన దేవుడి దగ్గరకు పోవడానికికూడా వీలులేదని అడ్డు పెడతారా? ప్రభుత్వం చేసిన శాసనాన్ని కూడా ధిక్కరిస్తారా? మరి నిజంగా మీకు దేవుడున్నాడని నమ్మకం ఉందా? పిచ్చి మతావేశం తప్ప మీకేం లేదు! మిమ్ముల మీరు పరీక్షచేసుకోండి! మీ పాత కాలపు బూజుగొట్టు ధర్మాలు, సిద్ధాంతాలు ఇకనైనా మరిచిపోండి! మీలో మరుగుపడివున్న మానవత్వం బైటికిరానివ్వండి. సర్వమానవ సోదరత్వమే ఏకైకమతంగా గుర్తించి శిరసావహించి ప్రపంచకళ్యాణానికి పాటుపడండి. మీరు పాటుపడకపోయినా కాలచక్రం ఆగదు. దాన్ని అడ్డగిస్తే అది హుటాహుటిగా మీ మీదగా పోతుంది! జాగ్రత!! నా మాటలను బాగా అర్థంచేసుకొని మన హరిజనసోదరుల దేవాలయ ప్రవేశానికి ప్రతిబంధకం కలిగించక చేతనైతే మీరు మాకు తోడ్పడండి. మానవసేవ చేసే మాబోటివాళ్ళకు అడ్డురావద్దు" అని నమస్కరించెను. అడ్డగించిన పెద్దలతని వాక్ప్రవాహమునకు ముగ్ధులై యేమియు ననలేక మౌనము వహించిరి. అర్చకుఁడు తలుపు తెఱచెను. "మహాత్మా గాంధీకి జై! భరతమాతకు జై!" యని హరిజనులందఱు దేవాలయములోఁ బ్రవేశించిరి. నూతన వధూవరులకు భగవద్దర్శన మయ్యెను. అంతకుముందెన్నడుఁ గని యెఱుఁగని భగవద్దృశ్యము వలన, ననుభవించి యెఱుఁగని పవిత్ర వాతావరణము వలన హరిజనసోదరు లానందపరవశులైరి. "ఈ పవిత్ర స్థలానికి రావలెనంటే అందరివలె మీరూ పరిశుభ్రంగా వుండాలి. స్నానంచేసి శుభ్రవస్త్రాలు ధరిస్తే తప్ప దేవాలయంలోనికి రాగూడదు. అంతకంటే ముఖ్యంగా పవిత్రమైన భావంకూడా ఉండాలి. జాగ్రత!" అని రాజశేఖరరావు వారిని హెచ్చరించెను.

ఈ సంఘటన జరిగినప్పటినుండియు నభ్యుదయ నిరోధకవర్గములలో మఱింత యలజడి గలిగెను. అజ్ఞులు కొందఱు నిజముగా మతము

నాశనమైనదని నమ్మిరి. "వేములపల్లి కొల్లేరు మునిగినట్లు మునిగిపోతుం గెప్పుడో, పాపం పండిపోతున్న"దని కొందఱు కాలజ్ఞానము చెప్పిరి.

ఇదిజరిగిన మఱునాఁడు ఒకరు "ఒళ్ళుపెరిగి" యల్లరి చేసిరి. సాంబ్రాణి ధూపమువేసి యా "గణాచారి"కి మఱింత యావేశము గలిగించిరి. "వూళ్ళో దేవుడు మైలపడ్డాడు. ఇక నేనూరుకోనండర్రో! ఇక మిమ్ముల్ని కాల్చేస్తా! మసిచేస్తా! వూరు నేలమట్టంచేస్తా! నాకు హారంచాలలా, మిన్నంటే మంటలుచూస్తేతప్ప నాకు శాంతిలేదు" అని యాతఁ డూగుచు నావేశమునఁ బలుకుచుండెను. "నీకు శాంతి యెట్లా కలుగుతుంది, చెప్పుకో!" అని ముదుసలులు, మూర్ఖులు కొందఱతనిని ప్రార్థించిరి. "నే నెవరిననుకొన్నారు! పోలేరమ్మను, అంకాలమ్మను, పోతురాజును, అన్నీ నేనే. నాకు కొలుపులు కొలవడం మానేశారు. నన్ను మరిచిపోయారు. నన్నాపుకోవాలంటే కొలుచుకోండి. నూటొక్క జీవాలు తెగిపడితే నాకు హారం చాలుతుంది. నెత్తురు వారుపోయాలి. నా దాహం తీరాలి. లేకపోతే మిమ్మందర్నీ మింగేస్తా. ఊరు కాల్చేస్తా. మసిచేస్తా. నేలమట్టంచేస్తా. అల్లల్లల్ల! యని వీరావేశమున గంతులిడుచుఁ బట్టుకొన్నవారి కాలుసేతులు విఱుగఁద్రొక్కుచు భయానకక్రీడ జరిపెను. పెద్దలు కొందఱు శక్తికి మ్రొక్కుకొని స్నానములు చేసి ముడుపులుగట్టిరి. 'కొలుపులు కొలుతుము తల్లీ శమింపు'మని యొడలు పెఱిగినవానికి సాగిలఁబడిరి. గ్రామము తగులఁబడకుండఁ జూచుకొనఁదలఁచినచో వెంటనే కొలుపులు కొలువవలయు ననియు, మున్నొకప్పుడు కొలుపులు మానినందువలననే యిల్లు తగులబడుటయు, కలరా, విషూచ్యాది జాడ్యములు ప్రబలి జననాశనము జరుగుటయు సంభవించెననియు కొందఱు చరిత్రస్మృతి సలిపిరి. దున్నపోతులు, పొట్టేళ్ళు, గొఱ్ఱెలు, మేకలు, మొత్తము నూటొక్కటి జీవములు సేకరింపవలయునని యాలోచింపఁదొడఁగిరి. ఇది యంతయు బూటకమని గుర్తించిన స్వచ్ఛంద యువక సేవాదళమువారు గ్రామములో సభలుసలిపి కొలుపులు, జాతరలు భగవదపచారములనియు, జీవహింస వలన భగవంతుఁడు సంతోషింపకపోవుటయేకాక, కుపితుఁ

డగుననియు జీవకారుణ్యమే పరమధర్మమనియు నదేపనిగా ప్రచారమొనరించిరి. ఒక్క జీవమునైన వధార్థము చిక్కకుండఁ జేసిరి. ప్రజలను గొలుపులయెడ విముఖులఁజేసిరి. ఈ ప్రచారమువలన నంటురోగములు దేవతా మహిమవలనఁగాక, యనారోగ్యకారణములవలన మురికివలన ననుచిత భోజనములవలనఁ గలుగునని వారర్థముచేసికొనిరి. నిప్పుతో జాగరూకులైయున్నయెడల గృహదహనములు జరుగవనియు, నందుల కేదేవతయు - పోలేరమ్మ పోతురాజులును - గారకులు కారనియుఁ దెలిసికొనిరి. అందులకుఁ దగినట్లు "గణాచారి" యొకనాఁడు కొన్ని గోగుపుల్లలు దెచ్చి జానెడు జానెడుగా విఱిచి వానికొకవైపునఁ గొంత యన్నమంటించి రెండవవైపున నిప్పుముట్టించి గ్రామమునం దచ్చటచ్చట వేయుచుండెను. స్వచ్ఛంద సేవాదళమువారీ పనిని గనుపెట్టి గ్రామమంతయుఁ దిరిగి చెఱుపు జరుగకమున్నే, యా గోగుపుల్లల నన్నిఁటిని బట్టుకొని వచ్చిరి. ప్రజలఁ బ్రోగుచేసి దానిభావము విప్పిచెప్పిరి. పుల్ల కొకవైపున నన్నమంటుకొని యుండుటచే కాకులు వానిని గొనిపోయి యిళ్ళపైనఁ గూర్చుండి యా యన్నము దినుచుండును. రెండవవైపునఁగల నిప్పు ఇళ్ళకప్పున కంటుకొని గృహ దహనములు జరుగును. దేవతా మహిమవలన నవి జరుగుచున్నవని "గణాచారి" తిరిగి "ఒళ్ళుపెరిగి" ప్రజలకుఁ జెప్పును. ఈ బూటకమును, తంతును వివరించి చెప్పుచు నా గోగుపుల్లలఁ జూపింపఁగనే ప్రజలు ముక్కులమీఁద వ్రేళ్ళువైచుకొని 'గణాచారి'ని తిట్టసాఁగిరి. అతఁడు కొన్నాళ్ళు కనఁబడకుండ నెచ్చటికోపోయి తనకేమియు హానిజరుగదని రాజశేఖరుఁడు వాగ్దానముచేసిన మీఁదట రెండు మాసములకుఁ దిరిగి యిల్లు చేరెను. కొలుపులు, జాతరలు వేములపల్లికిఁ దిరిగి రాకుండఁ దరలిపోయెను.

# XVI

# రాలుగాయలు

రాజశేఖరుఁ డిటీవల క్షణమైనఁ దీఱిక లేకుండఁ బ్రజాకార్యములలో నిమగ్నుఁడై యుండుటచే రమణారెడ్డి యతనితో మాటలాడుటకుఁ గూడ వీలులేకపోయెను. అతఁడు రాజశేఖరునితోఁ జేయవలసిన రాచకార్యము లేవియును లేకపోయినను అతనితో నేదో యొక వాదము పెట్టుకొని తన తెలివితేటలు ప్రదర్శించి రాజశేఖరుఁ డవివేకి యని నిరూపించుట యతని యాశయము. రాజశేఖరుని ప్రజాసేవ యందఱు బూటకమనియు, నెప్పుడో యూరంతయు నతనిపై విఱుచుకొని పడు ననియు వారితో వీరితోఁ బలుకుచుఁ దనతో నేకీభవించు వారెల్లరుఁ దెలివిగలవారని పొగడుచుండును. ఏకీభవింపని వారిని గొఱ్ఱెలని గేలి సేయుచుండును. సహకార సంఘము గ్రామములోఁ జుఱుకుగాఁ బని చేయ మొదలిడిన తరువాత నితని మాటలయం దెవ్వరికి లక్ష్యము లేకుండఁ బోయెను. ఇతఁడసూయావిష్టుఁడని యాలోచన గలవారెల్లరు గుర్తించిరి. రాజశేఖరుఁడు కమ్యూనిస్టు నాయకుఁడని పోలీసువారికిఁ దెలిపి యతని చర్యల నిరోధింపఁ జేయఁ జూచిన యతని ప్రయత్నములు వమ్మైన తరువాత రాజశేఖరు నింకేవిధమున సాధింతునాయని నిరంతర మాలోచింపఁ దొడఁగెను. హరిజనుల యింటఁ బెండ్లి విందు గుడిచి వారికి దేవాలయ ప్రవేశ మిప్పించిన సందర్భములోఁ బ్రజలు రాజశేఖరు నసహ్యించుకొందురని పేరాస చెంది మఱునాఁడు గ్రామములో నతనినిగూర్చి విరుద్ధప్రచారము మొదలిడెను. కాని పెద్దతలకాయ లే కొద్దిమందియో తప్పఁ దక్కిన వారెవ్వరు రమణారెడ్డి యాశించినట్లు రాజశేఖరునెడ విముఖులు గాలేదు. రాజశేఖరుని సందేశములు వారి మనస్సులలో నాటుకొనెను. యుగప్రభావము వారెల్లరు గుర్తించిరి. ఒకనాఁడు రమణారెడ్డి యూరిలో దుష్ప్రచారము సేయుచుఁ దిరిగి తిరిగి, యింటికిఁబోవుచు రాజశేఖరుఁ డొంటరిగాఁ దన యింటి వసారా యందుఁ గనుపించుటచే నతనికడ కరిగెను.

రమణా:- హల్లో కెప్టెన్ - పొరపాటు- నమస్తే మిష్టర్ రాజశేఖర్.

రాజ:- నమస్తే, దయచెయ్యండి, రెడ్డిగారు. "రాజశేఖర్ అనే హలంత శబ్దముతో పిలిచి నన్ను హిందూస్థానీవాణ్ణి చేస్తున్నారు. రాజశేఖర మని పిలవండి. అందులో తెలుగుదనమున్నది.

రమణా:- అబ్బా, ఎన్ని తప్పులు పటతారండి మీరు? దానికేం గాని ఈ మధ్య మాట్లాడడానికి కూడా తీరిక లేకుండా పోయిందేమీకు? మొత్తంమీద మీ మానవసేవ మాత్రం చాలా వండర్‌ఫుల్‌గా జరుగుతున్నదండి. మొన్నటితో క్లైమాక్సుకు వచ్చిందనుకుంటా. మాలమాదిగలతో ప్రజలను విందులు గుడిపించారు. మాలమాదిగ లను గుళ్ళోకి పట్టుకొచ్చారు. ఇంకేం కావాలి?

రాజ:- నిజమైనసేవ మొన్నటితోనే ప్రారంభమైనదని నా అభిప్రాయం.

రమణా:- కాని, పబ్లిక్ ఒపీనియన్ - ప్రజాభిప్రాయ మెట్లా వున్నదో గమనించారా?

రాజ:-కొందరు సుముఖులుగాను కొందరు విముఖులుగానూ ఉంటారు.

రమణా:- విలేజర్సు- అదే- పల్లెటూరివాళ్ళు బ్రూట్స్, మూర్ఖులండీ. మనం చేసే సేవను అప్రీషియేట్- అర్థం చేసుకోలేరు; అభినందిం చనూలేరు. చూడండి ఆ పుల్లయ్యాసంతులు వగైరాలు వర్ణసంకరం అయిపోయిందని దేవుణ్ణి మైలపరిచారని నానామాటలు మాట్లాడు తున్నారు. మీ పెదనాయన రామకృష్ణయ్యగారు, మా మామ వీరారెడ్డిగారూ- వీరందరిదీ అదే అభిప్రాయం!

రాజ:- మూడువేల పైచిలుకు జనాభాగల గ్రామంలో ఆమాత్రం విముఖు లుండడంలో విచిత్ర మేముంది? గ్రామస్థులు మూర్ఖులంటే నేను వినను. మంచి మార్గాలు సుఖంగా గ్రహిస్తారు. కాని స్వార్థ పరులు కొందరుచేరి వారి అమాయక హృదయాలను పెడదారికి లాగుతారు. ఎక్కడ చూచినా యిదే యిబ్బంది. ఈ గ్రామంలో కూడా ఆ స్వార్థపరత్వం లేకపోలేదు. ఉన్నప్పటికీ సేవ చేయదలచిన వారి సంకల్పం గట్టిది కాబట్టీ, వారికి స్వార్థంలేదు కాబట్టీ, అన్నిటి

కంటే ముఖ్యంగా ప్రజలకు బుద్ధి ఉన్నదికాబట్టే యింతవరకూ వ్యవహారం సవ్యంగా సాగివస్తున్నది.

రమణా:- ఔను. నేను గమనిస్తూనే ఉన్నాను. నిజానికి నే నివ్వాళ గ్రామంలో చేస్తున్నపని యేమిటనుకొన్నారు? మీ పైన జరిగే విరుద్ధప్రచారం ఖండించడమే అనుకోండి! మరచిపోయినాను, మీకు చెప్పడం! మీ కాషాయవస్త్రాలు, గడ్డాలు, మీసాలు అంతా దొంగవేషమంటున్నారు కొందరు, విన్నారా?

రాజశేఖరున కీమాట వినుసరికి గొంతెము నవ్వు వచ్చెను. చిఱునవ్వు నవ్వుచు, రమణారెడ్డితో "ఈ మాట నేను వినలేదు, మీ వల్ల తప్ప" అని పల్కెను.

రమణా:- ప్రజ లట్లా అనుకొంటున్నప్పుడు మీరు ఉపేక్షిస్తే!

రాజ:- అపకారం ఏం జరగదు! ప్రజలు నా వేషాన్ని బట్టి గాదు, నా చర్యలనుబట్టి, సేవనుబట్టి, ప్రవర్తననుబట్టి నన్ను అర్థం చేసు కొంటారు. ఎవరినైనా అంతే!

రమణా:- అయాం సారీ! మీకు జరిగే అపకారాన్ని గూర్చి మీకు నచ్చజెప్పేందుకు ఇంకొక విషయంకూడా చెప్పదలచుకొన్నాను. మీరు కోప్పడరుగదా!

రాజ:- కోపాన్ని జయించాలనే నా ప్రయత్నం.

రమణా:- చెప్పడానికే నోరు రావడంలేదు... శాంతాదేవికీ మీకూ సంబంధము ఉన్నదని గ్రామంలో పుకారు.

రాజ:- ఔను. ప్రజాసేవలో. ఇందులో విచిత్ర మేమున్నది?

రమణా:- అంతకుమించికూడా ఉన్నదనే వాదుక. అందుకనే మీరు అవివాహితులుగా ఉన్నారనీ- ఈ ప్రజాసేవ మిషతో ఆమె నంతుకే వెనక వేసుకొస్తున్నారనీ- ఏమిటేమిటో- అంటున్నారు. ఇంక సాగితే పెండ్లి యెందుకనడం మీ పట్ల చెల్లిపోయిందని కూడా అంటున్నారు. అనేకవిధాల చెప్పకొంటున్నారు.

రాజ:- చెప్పకోవచ్చు నిజం తెలియక! మనం వినకుండా ఉంటే ఏ చిక్కూలేదు.

రమణా:- ఆశ్చర్యం! మీరు తొణకనైనా తొణకరేం ?
రాజ:- ఎందుకు ?
రమణా:- ఇంత అపవాదు మీ మీద పడ్డదంటే!

ఈ సారి రాజశేఖరుడు నవ్వాపుకోనలేక నవ్వుచు రమణారెడ్డితో నిట్లనెను. "అపవాదేగాని వాదు కాదుగా! సత్యమే నా రక్షాకవచం రెడ్డిగారూ! నా కోసం మీరేం బాధపడవద్దు, పాపం.

రమణా:- మరి శాంతాదేవి విషయమో!
రాజ:- ఆమెకూ సత్యమే కవచం. ఒకరి సహాయం ఆమెకూ అవసరం లేదు. ఆమే యితరులకు అమూల్యమైన సహాయం చేస్తుంది. చెయ్యగలదు.
రమణా:- అవును. ఆడవాళ్ళకు చదువు చెపుతుంది. విధవలకు పెళ్ళిళ్ళు చేయిస్తున్నది!
రాజ:- అంతేకాదు. మొదటి పెళ్ళిళ్ళు సుఖమార్గాన పడే ఉపాయం కూడా చూస్తుంది. మహిళలకు గృహిణీధర్మాలు చక్కగా ఉపదేశిస్తుంది. అవివేకులైన భర్తలను సంస్కరించే మార్గాలు చూపుతుంది.
రమణా:- ఎంత చేసినా, లోకం చూడండి!
రాజ:- నిజం గ్రహించక లోకం మొదట ఏమైనా అనుకొంటుంది. నిజం తెలిసిన తరువాత పరితపిస్తుంది. నిజం నిలకడ మీద తెలుస్తుందని ఎవరి కర్తవ్యం వారు చేస్తూపోవాలి, లోకసేవకులు.
రమణా:- ఇంతకూ శాంతాదేవి శీలంగురించి మీ అభిప్రాయమేమిటి ?
రాజ:- ఒకరి శీలం గురించి మనకు అభిప్రాయాలు దేనికి ? మన శీలం పవిత్రమైనదా కాదా అనే ఆలోచన ఉంటే చాలు. మన ధర్మం మనం పాలిస్తే చాలు! వేమన్న ఈ సూత్రమే ఎంత సులువుగా చెప్పాడో విన్నారుగా—

తప్పులెన్నువారు తండోప తండంబు
లుర్విజనులకెల్ల నుండుఁ దప్పు,
తప్పులెన్నువారు తమ తప్పు లెఱుఁగరు
విశ్వదాభిరామ, వినుర, వేమ !

రమణా:- అభిమానం వల్ల కాదుగదా మీరు చెప్పేది.

రాజ:- ఎవరిమీద అభిమానం వల్లనంటారు ? ఇప్పుడు నే నెవరి కను కూలంగా మాట్లాడాను ? లోకమర్యాదను మాత్రం సూచించాను. శాంతాదేవియందు నాకు అభిమానం ఉన్నదని మీరు అనుమానం పడుతున్నారా ? నాకు అభిమానద్వేషాలు లేవు. మానవులందరూ సమానమే నాకు. నాకు చెఱుపు చేయదలచినవారిమీద, చేసిన వారిమీదకూడా నాకు ద్వేషంలేదు. ద్వేషం అజ్ఞానంవల్ల కలుగు తుంది. దాన్నే దౌష్ట్యం అంటారు. ఆ దౌష్ట్యం పలచబడ్డకొద్దీ మానవత్వం బయటికొస్తుంది. ఎక్కువైనకొద్దీ మరుగుపడుతుంది. మూల తత్వమైన మానవత్వమే భగవత్తత్వం. అది అందరిలోనూ సమానంగా ఉంటుంది. అజ్ఞానజన్యమైన దౌష్ట్యం కప్పినప్పుడు మానవుడు లోకంలో దుష్టుడనిపించుకొంటాడు. జ్ఞానోదయామై దౌష్ట్యం విడిపోయినప్పుడు సుజనుడనిపించుకొంటాడు. కాబట్టి ఒకర్ని దుష్టుడని, ఇంకొకరిని సుజనుడని భావించి భేదభావంతో చూడగూడదు. అట్లా చూడడమూ అజ్ఞానమే అవుతుంది. ఒకరి నభిమానంతోనూ ఇంకొకరిని ద్వేషభావంతోనూ చూడడంగూడ అజ్ఞానమే అవుతుంది. ప్రాకృత వాసనలవల్ల మరుగువడియున్న మానవత్వాన్ని ఏ విధాననైనా బయటికితీసి ప్రకాశింపచేయడమే నా జీవిత కార్యం. నేనుచేసే మానవసేవ కంతటికీ అదే పరమార్థం.

రమణా:- ఇదంతా వేదాంతం !

రాజ:- అది వేరేలేదు. మన జీవితంలో ప్రవర్తనలో చర్యలలో మిళిత మై వుంటుంది. ప్రతివ్యక్తి తన మానవత్వం గుర్తించాలి. అట్లా గుర్తించేందుకు తన ప్రవర్తనలో మీరు "వేదాంతం" అనే ఒక ఉత్కృష్ట నియమం పాటించాలి. నియమబద్ధంగాని జీవితం గట్టులు లేని చెరువు నీటివలె వ్యర్థమైపోతుంది.

రమణా:- ఏమిటో మీరు చెప్పేది నాకు అర్థంకావడంలేదు.

రాజ:- అర్థంచేసుకోవాలని నా ఆతురత. రెడ్డిగారూ ! జీవితంలో శాంతి సౌఖ్యాలు కలగాలంటే నేను చెప్పిన పద్ధతి అనుసరించాలి.

రమణా:- అంటే సన్యాసమా ?

రాజ:- కేవలం సన్యాసం కాదు. సాంసారిక జీవితమైనా నియమబద్ధంగా నడుపుకోవాలి. ఇంద్రియాలను కట్టుదిట్టం చేసుకోవాలి. జీవితానికి ఉదాత్తమైన ఒక ఆశయం పెట్టుకోవాలి. పల్లానికిజారే నీటి మాదిరి ఎటులాగితే అటు మనసును పోనీయకూడదు......

ఈ ధోరణిలో నడచు రాజశేఖరుని మాటలు రమణారెడ్డి కేమియు రుచింపలేదు. అతఁడు చెప్పునది సాంతము వినకుండఁగనే "సరే! సెలవు" అని లేచిపోయెను. "పల్లానికి జారే నీటిమాదిరి" అతని మనస్సు శాంతాదేవి యింటికి జారెను. అతని కామెపై వలపు నానాఁటికి మందుపడని రోగమువలెఁ బెఱిగిపోవుచుండెను. ఆమె తన కందని పండని స్థిరపడిన కొలందియు నతని కారాటము మిక్కుటమయ్యెను. ఆమెతో నొక తూరియైన నేకాంతముగా ముచ్చటింపవలయునని పాపమాతని యాశ! కాని యతని దుస్సంకల్పము నెఱిఁగిన శాంతాదేవి వంటయింటఁ జొరఁబడఁ జూచు కుక్కనువలె నతనిని దాపునకు రానీయక యెప్పటి కప్పుడు బెదరఁగొట్టుచుండెను. ఒకసారి హరిజనవాటికనుండి యేకాంతముగా నింటికి వచ్చుచు శాంత యతని కెదురయ్యెను. అప్పు డామెతో నేదో ముచ్చటింపఁ బోయెను. కాని నాలుక తడబడి మాటలు పెగిలిరాక తన ప్రయత్నమును విరమించెను. సభలకు వచ్చినప్పుడు వీధిని బోవునప్పుడుఁ బలుసారు లతఁ డట్లే యామెను బలుకరింపఁ బోయి యెవరో నోరు నొక్కి నట్లుండుటచే మాటలురాక మిన్నక పోవువాఁడు. ఆమె చెంత లేనప్పు డిట్లు మాటలాడవలయునని పదములుగూడ ముందే సమకూర్చుకొని కంఠస్థము చేసికొనియు నామె యెదుటికి రాఁగానే నోరుదెఱచుట కశక్తుఁ డగుచుండెను. నేఁ డతఁ డొక యాలోచన చేసెను. ఇంతకుఁ దన భావము నామెకుఁ దెలుపుటయే కదా కావలసిన పని! తన భావము దెలిసికొన్నచో నామె తన కెదురాడఁ గలదా? ఆడలేదు! ముమ్మాటికి నాడలేదు. తా నంత గొప్పవాఁడు. నలకూబర సన్నిభుఁడు. నవనాగరికుఁడు. ఆంగ్ల విద్యా విలసితుఁడు. తన భావ మెఱుఁగకయే శాంత

యిన్నాళ్ళు తనను చెంతకు రానిచ్చుటలేదు. కావునఁ దన భావమెట్లేని శాంతకుఁ దెలుపవలయును. భావము తెలుపుటకు మాటలే సాధనములా? వ్రాత కాదా? ఎందుకు గాదు? కావున తాను బలుకఁ దలఁచిన దంతయు నొక ప్రేమలేఖ వ్రాసి జేబునం దుంచుకొనెను. శాంతతో మాటలాడు శక్తి కలిగెనా, సంతోషమే. కలుగకున్న నా యుత్తరము నామె కిచ్చి యందుఁ దన విన్నప మున్నదనియు నాలింపవలెననియు మాత్రము మాటలతోఁ జెప్పి ప్రత్యుత్తరము పొందవలయును. అది ఆలోచన! అట్లే శాంతాదేవి యింటి కేఁగి యామె యొంటరిగాఁ జదువుచుఁ గూర్చుండఁ జూచి సమయము కలిసి వచ్చినదిలే యని సంతసించి యామెను "శాంతా!"యని హద్దుమీరిన చనువుతోఁ బిలిచెను. ఆమె కన్నెత్తి యాతనిఁ జూచెను. ఆమె వాలుఁగన్నులనుండి యేవో బల్లెములవలె వచ్చి యతని హృదయమును గ్రుచ్చి నట్లతఁడు బాధపడెను. అతిలోకసుందరియైన యామె యతని పాలిటి కేదైనఁ బ్రళయభీకరశక్తియా యనిపించి యతని కొడలు ఝల్లుమనిపించెను! అతఁ డేల భయకంపితుఁ డయ్యెనో యతనికే తెలియక తబ్బిబ్బువడుచు నప్రయత్నముగ జేబులోనున్న యుత్తరము తీసి యామె కిచ్చి ఱాతిప్రతిమవలె నెదుట నిలువఁబడెను. అతని వాలకమున కామె జుగుప్సాగర్భమగు మందహాసము చేయుచు నెడమ చేతితో నతని యుత్తరము దెఱచి చూచెను!

ఒక్కనిముసము మాత్ర మామె యా యుత్తర మచ్చటచ్చటఁ జదివెను. చదివి సాంతము చేయకయే చింపి ముక్కలుచేసి యతనిపై విసరివేసి తలయెత్తకయే "మానవులలో పశువులున్న సంగతి నే నెఱుఁగుదును గాని నీ వంటి వింత పశువున్నదని నే నెఱుఁగను. నీ పోకడ పశువుకంటె, కుక్కకంటె, పందికంటె నీచము. నీవు పీల్చి వదిలే గాలి వల్ల వాతావరణమంతా కల్మషమై దుర్భరమై పోతుందని నిన్నింత వరకూ నా దగ్గరకు రానియ్యకుండా కొట్టాను. ఇవ్వాళ మళ్ళీ తప్పించుక వచ్చావు. మర్యాదగా పో యింటికి అని గట్టిగాఁ బలికెను. ఈమాత్రమైనఁ దనతో ముం దెన్నడుఁ బలికి యుండని కారణముచే నతఁడదియే

పదివేలని కొంతధైర్యము తెచ్చుకొని, "శాంతా! దూర మాలో చించుకో! నీ గుట్టంతా నాకు తెలుసు! నీ వల్లరిపడకుండా, మీవాళ్ళను వెలిబెట్టకుండా ఉండాలంటే బిస అంతా నా చేతిలో ఉంది. మన మిద్దర మైతే ఎవ్వరికి తెలియకుండా కాలక్షేపం చెయ్యవచ్చు........."

దురిత దుర్గంధ పంకిలములగు నీ పలుకు లామె సహింపలేక చెంగటనున్న చెప్పు తీసికొని యతనిపై విసరఁ బోయెను. మహిషాసుర మర్దనివలె నున్న యామె వాలకమున కాతఁ డదరుకొని తిరిగి నోరెత్తక బయ టికిఁ బరుగెత్తి పోయెను. కొంతదూరముపోయి గుండె దడ దడ శమింపఁగా "ఛీ! సమయం కలిసిరాలేదు. ఇంకోసారి ప్రయత్నిస్తాం. ట్రై, ట్రై, ట్రై ఎగెన్ అన్నాడు రాబర్ట్ బ్రూస్. ఒక్కొకతూరి పద్మ ముఖు లొల్లమిసేయుదు రొక్కవేళ పెన్మక్కువ నాదరింతురు. క్షణక్షణ ముల్ జవరాండ్ర చిత్తముల్. పక్కన వేసరం జనదు. ఉపాయములన్ దగు నిచ్చకంబులన్ జక్కఁగఁ జేసి డాసి సతి చిత్తముఁ జేరి సుఖింపఁగాఁ దగున్. అని అల్లసానివారు కూడా సజెస్టు చేశారు. ఆఫ్టరాల్ షి యీజె కంట్రీవిడో! కాని యీ రాజశేఖరంగాడిది పెద్ద యిబ్బం దయింది. వీణ్ణి ఎలిమినేట్ చేస్తేనేగాని లైన్ క్లియర్ గాదు. కానీ, చూస్తాం." అని యాలోచించుచు నింటికిఁ బోయెను.

రాజశేఖరు నింటినుండి రమణారెడ్డి యటువెడలఁగనే యలివేణి యచ్చటఁ దయారయ్యెను. మును పతనిని బలవంతముగఁ గౌగిలించు కొని తిరస్కృతయై పోయినను బాప మామె కీతనిపై వలపుడుగలేదు. కుంభ కుచా పరిరంభ సంభవోద్వేల సుఖం బెఱుఁగని యమాయికుఁడని, అనుభవ దరిద్రుఁడని రాజశేఖరుని భావించెను. ప్రథమయత్నమునకే ఫలము లభింపదని సమాధానపడి మఱల మఱలఁ బ్రయత్నింపసాఁగెను. వలపు లుప్పొంగు తన నులివెచ్చని వక్షోజము లాతని యురఃస్థలము నకు లగించిన యానాఁటి సంఘటన యతని నూరక పోనిచ్చునా? కట్లపాము కాటువలె నుడిగి యుడిగి యుడుకు లెత్తింపదా? యని యామె ధైర్యము. కులుకు జవరాలి బిగికౌఁగిటికిఁ జలింపకుండుట కతఁ డేమి శుకమహర్షియా? ఇనుపకచ్చడాలు కట్టుకొను ముని

మ్రుచ్చులే తామరస నేత్రల యిండ్ల బందాలైరి. విశ్వామిత్రునంతటి బ్రహ్మర్షియే మేనక మేని సోయగమునకు బానిస యయ్యెను! ఇంక, నే యనుభవములేని యీ రాజశేఖరుఁ డలివేణి వలపు వెల్లువలో మునిఁగిపోవక యెన్నాళ్ళు నిలువఁగలఁడు? ఈ యాలోచనలతో నలివేణి వీలయినప్పుడెల్ల రాజశేఖరునిఁ గలిసికొనుటయు నతఁ డామెకు నీతిబోధ సేయుటయు నప్పుడప్పుడు సంభవించుచుండెను. నేఁ డామె మఱల నతఁ డొంటరిగా నుండుటఁ జూచి లోనికేఁగెను. పూర్వానుభవముగల రాజశేఖరుఁడు వెంటనే తన గదినుండి వసారాలోనికి వచ్చెను.

రాజ:— అలివేణీ! నీ మనసు ఇంకా కుదుటబడలేదా, మళ్ళీ వచ్చావు?

అలివేణి:— రాకుండా ఎట్లావుండగలను? నా మనసు కుదుటబడేందుకు మీరేంచేశారు? ఇంట్లోబాధ రానురాను హెచ్చిపోతున్నదిగాని తగ్గడంలేదు. మునుపు ఎక్కడో తాగివచ్చేవాడు. ఇప్పుడు సారా సీసాలు ఇంట్లోనే పెట్టుకొన్నాడు. తాగడం, నన్ను హింసించడం తప్ప ఆయనకేం పనిలేదు. బయటికి వచ్చినప్పుడు మాత్రం మీ బోటివారితో పెద్దమనిషిలాగా మాటలు చెపుతాడు. సంసార సుఖం లేకపోగా – చెప్పుకుంటే సిగ్గు – ఎముకలు విరిగే దెబ్బలు తినలేక చచ్చిపోతున్నాను. ఈ దీనురాలిపైన మీకా జాలి లేక పోయెను. రాజశేఖరంగారూ! నాకు ఇంట్లో నరకం ఎట్లాగూ తప్పించలేరు! ఒక్కసారి మీ కౌగిటి భాగ్యమైనా.........

రాజ:— అలివేణీ! ఎన్నాళ్ళకూ నీ అజ్ఞానం విరిగిపోయేమార్గం కన బడడంలేదు! మళ్ళీ అదేధోరణిలో మాట్లాడుతున్నావు.

అలి:— అజ్ఞానమో, జ్ఞానమో! ఆనందంలేని జన్మ దేనికి? ఏదో శూన్యం చూపించి అందులో ఆనందం ఉన్నది అనుభవించమంటే నాకేం మనశ్శాంతి కల్గుతుంది?

రాజ:— మనస్సును అదుపుచేసుకొంటే ఎందులోనైనా ఆనందం కల్గుతుంది. మనస్సును వశంచేసుకోలేకపోతే స్వర్గంలో కూర్చున్నా ఆనందం కలగదు.

అలి:- ఈ మెట్టవేదాంతం దేనికండీ! రాజశేఖరంగారూ! మీరు నిజంగా దయగలవారైతే, ఇతరుల బాధజూచి మీరు ఓర్వలేని వారైతే యమయాతన పడుతున్న యీ యభాగ్యురాలిపైన, యీ దీనురాలిపైన జాలిచూపండి! మీరు చేసేదంతా మానవసేవ అని గదా, మీరు చెప్పడం! అయితే దయాభిక్షుగోరే యీ యబల పైన కనికరం చూపండి. శరణాగతురాలైన ఆడుదాన్ని రక్షించ లేకపోయిన తర్వాత మీ మానవసేవంతా ఎందుకు పనికివస్తుం దండీ! ఉపన్యాసాలకా?

రాజ:- శాంతాదేవి పాఠశాలలో నీకు అబ్బిన చదువంతా చివరకిట్లా ఉపయోగిస్తున్నావా? ఈ వింత తర్కం ఎట్లా నేర్చావు, సోదరీ?

అలి:- మాటతో తప్పించుకు పోకండి......

ఇంతలో లోపలినుండి కోదండరామయ్యగారు బయటికిఁ బోవుచు వసారాలోనికి వచ్చిరి. ఇఁక సమయముగాదని యలివేణి యప్పటి కింటికిఁ బోయెను.

వేములపల్లి ప్రజాసేవా కార్యక్రమములోనెల్ల వీసపాటి వీరా రెడ్డిగారి కుటుంబము ఏ విధి దుర్విపాకముననో మిగుల గర్హ్యమగు పాత్ర ధరింపవలసి వచ్చెను. వీరారెడ్డిగారా, గ్రామాభ్యుదయమునకు విరోధి. వారి కూఁతురు అలివేణియా, పతికిఁ బరాఙ్ముఖియై రాజశేఖ రునివెంటఁ బడెను. వారి యల్లుఁడు రమణారెడ్డియా మోసకారి యగుటయేకాక శాంతాదేవిని జెఱుపఁదలపోయుచుండెను. అదృష్ట వశమున నీ మువ్వురి మనోరథములలో నొక్కటియు సిద్ధింపదయ్యెను. రాజశేఖరుఁ డీ విచిత్ర సంఘటననుగూర్చి చింతించుచుండెను.

ఆనాఁటి రేయి రమణారెడ్డియింట పాపిరెడ్డియు హనుమా రెడ్డియు గాఢులగు చెన్నప్ప, రాఘవులుఁగూడి యేదో చాలసేపు మాటలాడుచుండిరి. అలివేణి కీ యాలోచన యేదో తెలిసికోనఁ గుతూహలము కలిగెను. వారు కూర్చుండిన చావడి కానుకొనియే తన పడకగది. ఆమె శయనింప నరిగినట్లు లోనికేఁగి తలుపులు మూసి

కొని వీరి మాటలు వినుటకు వీలగునట్లు కిటికీచెంతఁ బొంచి కూర్చుండెను. వారికీ క్రింది సంభాషణ జరుగుచుండెను.

పాపిరెడ్డి:- ఆ వెధవముండకు బుద్ధిలేనప్పుడు ఈ సన్న్యాసిని దండించి మాత్రం ఏం ప్రయోజనం ? వాడుగాకపోతే ఇంకొకడౌతాడు.

రమణా:- వీణ్ణి తంతే యితరు లెవరూ శాంతజోలికి పోరు - తమకూ అదేపని జరుగుతుందని ?

హనుమారెడ్డి:- మనకూ వాళ్ళకూ సంబంధం లేకపోయినతర్వాత అది యేగంగలో కలిస్తే మనకెందు కన్నా ?

చెన్నప్ప:- మీరు మళ్ళీ మొదటికొస్తున్నారు, హనుమారెడ్డిగారూ ! లేదనుకొంటే పోయేసంబంధమా ఇది ? మొన్న గుంటూళ్ళో ఈ సంగతి మాట్లాడుతూ శాంతమ్మ యెవరు అని ఆ ముసలాయన అడిగితే, పాపిరెడ్డిగారి అన్నకూతురే అన్నారా, ఎవరో పరాయి మనిషి అన్నారా ?

పాపి:- ఆ కుంకను చెడగొట్టడమే కాదులేరా, హనుమయ్యా ! ఈ వెధవ చేసే చేష్టలు చాలా ఉన్నాయి. కుర్రముండాకొడుకుల నందరినీ చేరదీసి గ్రామసేవ అనీ, హరిజనసేవ అనీ, వీడి పిండాకూడనీ వాళ్ళను మాలకొంపల్లో కుడిపించి వర్ణసంకరంచేసి, ఊళ్ళో చిన్నా పెద్దా లేకుండా, మాలామాదిగా, సాకీలేకీ అందరినీ మనతో సమానంచేసి మనకు మర్యాద లేకుండా చేస్తున్నాడు. ముండలకు పెళ్ళిళ్ళు చేయిస్తున్నాడు. వీడికి శాస్తి అయితే తప్ప తక్కిన గాడిదలకు బుద్ధిరాదు.

హనుమా:- ఆమాటన్నావు, నేనూ సరేనంటా !

రమణా:- మరి, ఆ మాదిగ గాడిదలు వస్తామని యింకా రాలేదే ?

పాపి:- వస్తారు తొందరపడకు. మరి, చెరొక సీసా అయినా తయారుగా ఉంచావా, వాళ్ళకు ?

రమణా:- అయాం సారీ ! అంతా అయిపోయింది. మనమే సేవించాం!

పాపి:- పానకాలరాయుడివే, బాబూ !

చెన్నప్ప:- రమణారెడ్డిగారికి మా పెద్ద డ్రాహమండీ! మా కాతా దార్లల్లో ఈయన్ని మించినచేయి లేదు. మరి యీ 'ప్రొహిబిషను' లేకపోతే సారాలోనే జలకాలాడేవారేమో!

రమణా:- యువార్ మిస్టేకెన్ - పొరపడ్డావు, చెన్నప్పా, నీవు. ప్రొహిబిషన్ వచ్చిన తర్వాతే మా పని హాయిగా ఉన్నది. ఎందుకంటే యిప్పుడు సారాయి రహస్యంగా గాని తయారుగాదు. భయంవల్ల తాకిడి తక్కువ. మాబోటివాళ్ళం అభిమానిస్తే తప్ప మీకు వ్యాపారం సాగదు. కాబట్టి మా మీద మంచి గురి ఉంటుంది. ఎంతకావాలంటే, అంత, ఏ కాపు కావాలంటే, ఆ కాపు, కాచి మర్యాదగా ఇంటికి చేర్చిపోతారు - నరుడి కంటికి కనబడకుండా! ఇక ప్రియమంటావా? సుఖం ఎక్కువైనప్పుడు ప్రియమైతే మాత్రం లెక్కేమిటి?

రాఘవులు:- మీరు హాయిగా తాగి తందనాలాడుతారుగాని, తయారు చేసే మాకు మాత్రం గుండెలు దడదడ లాడతయ్యండీ!

రమణా:- ఓ, డోంట్ ఫియర్, భయపడవద్దు! మేం ఉన్నాం. మీ పల్లెటూళ్ళో అందులో రాజశేఖరంగాడి వలలో పడిపోయిన పిచ్చిమూకలో మన మంటే ఒక లెక్కలోకి రావడంలేదుగాని, బస్తీ కెళ్ళితే నెహ్రూగారికెంత విలువుందో మనకంత ఉంది! పోలీసు వాళ్ళొస్తే ఇంగ్లీషులో ఒక్క లెక్చరుకొడతాను. వాళ్ళకు గుండెలు హడలెత్తుతుంది. ఇంగ్లీషంటే ఏమనుకొన్నావు?

రాఘవులు:- ఇం కేం ఇంగిలీసండీ, తెల్లోళ్ళు నెత్తిన చెంగేసుకు పోయారుగా!

రమణా:- వాళ్ళు పోయినారుగాని వాళ్ళిచ్చిన వరాలన్నీ యెక్కడ పోయినాయి? ఇంగ్లీషు కున్న విలువ దేనికీలేదు ప్రపంచంలో....

అని యింకను ఏదో చెప్పబోవుచుండఁగా యాకోబు, సముయేలు ప్రవేశించిరి. రమణారెడ్డి సంభాషణ నిలిపి కమాన్ మై డియర్ ఫ్రెండ్స్, అని స్వాగత మొసఁగెను.

పాపి:- కూర్చోరా, సుబ్బాయ్; అటు సర్దుకోరా కోటిగా, నీవుకూడా!

యాకోబు:- ఇంకా కోటిగాడూ, సుబ్బిగాడు ఏమిటండీ, మేం మతం పుచ్చుకొని ఇరవైయేళ్ళయితే? నా పేరు యాకోబు. వాడి పేరు సముయేలు!

పాపి:- ఏడిశారులే! మీ మతంవాళ్ళు వచ్చినప్పుడు మిమ్ముల నట్లానే పిలవనియ్యి. మేం మటుకు మీ అసలుపేర్లతోనే పిలుస్తాము.

యాకోబు:- అందుకొని గాదండీ, మేం మతం పుచ్చుకొన్నది!

పాపి:- మీకు మతం యిప్పించిన తెల్లవాళ్ళుకాస్తా పోయినారు. ఇంకా ఎవడు గౌరవిస్తాడురా మిమ్ములనూ, మీ మతాన్నీ.

యాకోబు:- అదెట్లాగండీ! సొరాజ్యం వస్తే మటుకు ఎవరి కిష్టమైన పేర్లతో ఆరు పిలుసుకోడానికి కష్టమా? ఎవరికి నచ్చిన దేవుణ్ణి ఆరు కొలుసుకోడం కష్టమా? రాజశేఖరంగారు సెప్పడం అట్టాగాదే? ఎవరిపేర్లు ఆరు పెట్టుకోవచ్చు; పిలుసుకోవచ్చు. ఎవరిమతం ఆరు వుంచుకోవచ్చు. కులాలతో, మతాలతో, జోక్యంలేకుండా అందరినీ సమానంగా సూత్తామని సెపుతుంటారే రోజు. మతం పుచ్చుకోనివాళ్ళనుగూడా హరిజనులంటాడేగాని మాల మాదిగ లని పిలవడే ఆ దొర! పైగా ఆళ్ళల్లో ఆళ్ళే అట్టా పిలుసుకుంటే అది తప్పు, హరిజనులని పిలుసుకోమంటాడు. ఆళ్ళందరినీ పాపయ్యా, లచ్చయ్యా, రామయ్యా, సుబ్బమ్మా, శాసమ్మా అని ఎంత మర్యాదగా పిలుత్తాడండి! ఆ శాంతమ్మగారూ అంతే! చెయ్యెత్తి దణ్ణం పెట్టొచ్చు ఆ తల్లికి.

ఈ సంభాషణ యిట్లు పరిణమించుటచేఁ దనకార్య మనుకూలము గాదని కాఁబోలు, రమణారెడ్డి పాపిరెడ్డి కేదో కనుసైగ చేసెను. పాపిరెడ్డి గ్రహించి పథకము మార్చెను.

పాపిరెడ్డి:- సరే లేవోయ్ యాకోబూ, తమాషాకు నిన్ను ఉలికించాను గాని మీ మతంపేర్లతో మిమ్ముల పిలిస్తే మాకేం పోతుంది? అది సరేగాని నిన్నిక్కడికి పిలిపించిం దెందుకో తెలుసుకున్నావా?

యాకోబు:- నాకేం తెలుసునండీ? రమ్మని కబురుచేస్తే వచ్చాం.

పాపిరెడ్డి:- చెప్పవోయ్, చెన్నప్పా!

యాకోబు:- సెన్నయ్యా, నీవు ఈడ ఉన్నావంటయ్యా, శీకట్లో సూడ లేదు! అలవాటుపడ్డ పాణిగనక అడక్కడక్క అడిగితే బలేపని చేశావయ్యా రాత్తిరి!

చెన్నప్ప:- అందుకే వచ్చాననుకో, ఇక్కడికి. రాత్రి యీ పైలెందికాదు. సర్దడానికి. రమణారెడ్డిగారికి పంపేసరికే తల ప్రాణం తోకకొచ్చింది.

రమణా:- మన మంతా ఒక సమాజం యాకోబూ! మనకు ఒకళ్ళ మీద ఒకళ్ళకు అభిమానం, సానుభూతీ ఉంటుంది, ఉండితీరాలి. అందువల్లనే సగం నిన్నిక్కడకు కబురుచేసి రప్పించింది. కాంగ్రెసు వాళ్ళకు బుద్ధిలేక ఈ ప్రొహిబిషన్ పెట్టి మన జీవితంలో ఆనందం లాగిపారేశారు. అప్పటికీ, బుద్ధిమంతులు కొందరు - చెన్నప్పా, రాఘవులు లాంటివాళ్ళు ఏదో తంటాలుపడి రహస్యంగా ఆ అమృతం తయారుచేసి మన ప్రాణాలు దక్కిస్తున్నారు. లేకపోతేనా?

యాకోబు:- నేను మరిసేపోయానండీ! ఈ సెన్నయ్యను జూస్తే మటుకు యెండాకాలం బురదగుంటలోకి దున్నపోతు పోయినట్టు మళ్ళీ అటు లాగుద్దండి పాణం. రాజశేఖరంగారూ, శాంతమ్మగారు మొత్తానికి ఇది కనిపెట్టే మా బోటోళ్ళని జాగత్త, జాగత్త అని సెపుతూనే ఉంటారు. ఆరికన్నీ తెలుసు!

రమణా:- ఓరి పిచ్చివాడా, వాళ్ళ వాగుడంతా నిజమని మంచిదనీ నమ్ముతున్నావా? ఆ కల్లబొల్లి మాటలన్నీ వూరికినే గాదు. మీ చేత చాకిరి చేయించుకోడానికే. మొన్న చెరువులో మట్టి తీయించి మీ కేమిచ్చాడు? అంతకుముందు వూళ్ళో రోడ్లు పోయించి మీ కేమిచ్చాడు? మళ్ళా గుంటూరు రస్తాకు పోయే రోడ్డు వేస్తారట. అప్పుడు మీ చేత వెట్టిచాకిరి చేయించేందుకే ఈ ఎత్తుగడంతా!

యాకోబు:- ఆ శాకిరి వూళ్లో వోరు అంతా శేశారు. శెరువులో మట్టి మా యిళ్ళకే పోసుకున్నాం. గుంటూరు రస్తాకు రోడ్డు పోస్తే మనూరికే మేలాయె. ఇందులో రాజశేఖరంగారికి ఏం వచ్చుద్దండీ?

రమణా:- తమాషా అంతా అందులోనే ఉంది! వీటి కన్నింటికీ రాజశేఖరమే కంట్రాక్టుదారు. అది బ్రహ్మకైనా తెలియనివ్వడు. మీ చేత చచ్చేటట్లు చాకిరీ చేయించి, మీకు రోజుకు రూపాయి ప్రకారం కూలి యిచ్చినట్లు దొంగలెక్కలు జనాయించి ఆ డబ్బు కాస్తా జేబులో వేసికొంటాడు.

యాకోబు:- అంతా యిశిత్త్రరమండీ! అంత టక్కరా, రాజశేఖరం గారు? సాములోరి యాసం యేస్తాడే మరి?

రమణా:-దొంగసన్యాసి! ఒక్కటేమిటోయి, యాకోబు! ఈ రోజుల్లో సొంతలాభం లేనిదీ ఎవ్వడూ పనిచేయడనుకో. ప్రజాసేవ చేస్తున్నామని సొరకాయలు కోసే బాబులంతా యింతే. తక్కినవాళ్ళకంటే వీడొక ఆకు ఎక్కువ జదివాడు. కాంగ్రెసువాళ్ళు గాంధీటోపి ఒక్కటే పెడితే వీడు గడ్డాలూ, మీసాలూ పెంచి కావిగుడ్డలు కూడా కట్టాడు! ఈ సన్యాసివేషం వేయడానికి ఇంకొక కారణం కూడా ఉన్నది, కనుక్కో మరి?

యాకోబు:- నాకేం తెలుసు? పెళ్ళికూడా సేసుకోలేదంట, మరి!

రమణా:- రంకుసాగితే పెళ్ళెందుకోయ్? నీవు చెయ్యెత్తి దణ్ణంపెడతానంటున్నావే, ఆ శాంతమ్మ! శాంతమ్మకూ వీడికీ అతుకు! తెలుసునా?

యాకోబు:- అంతా యిశిత్త్రరం! నేను నమ్మనండీ!!

రమణా:- మరి, మీబోటి అమాయకులందరూ నమ్మేమాదిరి చేస్తే వాడిలో మజా యేముంటుంది? అది సరేకాని నీకు సమయేలుకు కావలసినప్పుడల్లా నిప్పంటి సారాయి సప్లై చేస్తారు - చెన్నప్ప, రాఘవులు. మనమంతా ఒకసమాజం, అని ఇందాకే చెప్పాగదా! ఇది పరమ రహస్యం. మన సమాజం వాళ్ళం అందరం ఒకటిగా ఉండాలని ఇంతగా మిమ్ములను పిలిపించి చెపుతున్నాను. ఎవ్వరికీ తెలియనివ్వగూడదు. ఇంటికిపోతూ చెరొక సీసా పట్టుకెళ్ళండి.

యాకోబు:- ఏదో, మీ దయ! అయినా, మానేద్దామనే ఆలోచనండి. పాడుప్రాణం **నిలవదు**.

రమణా:- ఇశ్శ! అంత కక్కుర్తి దేనికి ? నేనున్నాను. కాని మనకు ఈ అవస్థంతా పోవాలంటే మనం ఒకపని చేయాలోయ్ !

యాకోబు:- ఏమిటండీ, అది ?

రమణా:- మన రహస్యం అంతా బయటపెట్టడానికి ఒక వెధవ తయారై ఉన్నాడు. ఊళ్ళో వాడు చేసే అల్లర్లు ఇంకా వున్నై, తరవాత చెపుతాను. వాడికొకసారి దేహశుద్ధిచేస్తే - అంటే - కాళ్ళూ చేతులూ విరగకొడితే, మళ్ళా మళ్ళా మనజోలికిరాడు. ఇదిగో ఈ రెండు పచ్చనోట్లూ (వందరూపాయలనోట్లు) దగ్గరుంచుకో. కర్చులకు.

అని పల్కుచు రమణారెడ్డి యా రెండు నోట్లు యాకోబుపై విసరివైచి తిరిగి కొంచెము రహస్యముగా నిట్లు చెప్పఁదొడఁగెను.

"అబ్బే! అభిమానపడవద్దు! వెధవడబ్బు! ఈ మాత్రానికే నేనిచ్చిందీలేదు, నీవు పుచ్చుకొన్నదీలేదు. మనం స్నేహంగా ఉండాలే గాని డబ్బుకేమిటోయ్ ! అసలు ఇన్నాళ్ళు నీబోటి స్నేహితుడు ఈ వూళ్ళో వున్నసంగతే తెలియదునాకు ! తెలిస్తే, ఇంతకాలం మనం దూరంగా వుండేవాళ్ళమా ? సరేనా. మరి వాడు రాత్రిపూట ఒంటరిగా డొంకనబడి వస్తూవుంటాడు. మీ రిద్దరు తలుచుకుంటే నేను చెప్పిన పనికాస్తా చిటికెలో చెయ్యగలరు. ఏమంటావు ?"

యాకోబు:- ఎవరండీ, ఆయన ?

రమణా:- ఎవరైతేనేం, చెపుతాగా, నీవు ఊఁ అను.

యాకో:- అసలు, మనిషిని చెప్పండి.

రమణా:- ఎవడేమిటోయ్ ? రాజశేఖరంగాడే !

యాకో:- అమ్మబాబో! రాజశేఖరంగారే ! ! ఇదుగో రమణయ్యగారూ ! మీరు సదువుకొన్నారుకాబట్టి తియ్యంగా మాటలుసెప్పి నన్ను పడేశారు. ముందు మీ డబ్బు మీరు తీసుకోండి.

అని పల్కి యాకోబు, రమణారెడ్డియిచ్చిన రెండు నోట్లు నతనిపైననే తిరిగి విసరివేసి, కొంచెము గట్టిగా నిట్లనెను.

"అసలు ఇట్టాంటిపనులు సేసేరకంగాదు నేను. ఎప్పుడో బుద్ధి గడ్డితిని ఒకాయన్ను కొట్టినమాట నిజమే. అందుకు తగిన శాస్తి అయింది. ఆ సంగతి పాపిరెడ్డిగారు చెప్పి మీకు ఉసిగొల్పివుంటారు. ఏఁవండీ, ఎంతమాలముండాకొడుకులమైనా అంత నీతిలేనోళ్ళం అను కుంటారా? నీతంతా మీదేనా? మా హరిజనులకు రాజశేఖరం గారూ, శాంతమ్మగారూ తల్లిదండ్రులమల్లే వున్నారు. మురికిలో పురుగు లల్లే పడిసచ్చే మాకు మెట్టన కొంపవేయించిపెట్టారు. బతుకుదెరువుకు పాలిపొలాలిప్పించారు. కూరగాయలమళ్ళు పెట్టించారు. కోళ్ళు కొని యిప్పించారు. ఇంకా అనేకం సేశారు. సేత్తుండారు. అందరితో మమ్ము సమానంగా సూత్తుండారు. ఈ సల్లని దొరనేనటండీ కొట్టిరమ్మని నాకు మీరు సెప్పేది! ఎంత మూర్ఖపుగాడిదలం అనుకున్నా కుడిసే రొమ్ము పొడుస్తామా? అబ్బా! ఎంత గోరమండీ! యిందుకటండీ, నాకు సారాసీసాలు సపలయి శేసేదీ? ముండమోపిసారా! సారాకోసం మా దేవుణ్ణి కొట్టమంటారా? బలే, బలే, మీ డబ్బుకూ, మీ సారాకూ, మీకూ యెయ్యి దణ్ణాలండీబాబు! లేరా, సముయేలు!"

అని యాకోబు సముయేలుతో లేచిపోఁబోయెను. ఇక రమణా రెడ్డి కథ యడ్డముతిరిగిన దనుకొనెను. తాను బయటఁబడినచోఁ బ్రయోజనము లేదని తిరిగి తన సంభాషణ మొదలుపెట్టెను.

"ఓరి పిచ్చివాడా! నీవు బాగా బోల్తాపడ్డావు!! రాజశేఖరం ఎవరనుకొన్నావు? నా ముఖ్యస్నేహితుడు. మే మిద్దరం కట్టగట్టుకు తిరగడం చూడలా నీవు? పాపం! అతను మీకోసం ఎంతో శ్రమ పడుతున్నాడు. మీరు ఏమాత్రం ఆయనమీద భక్తితో ఉన్నారో కనుక్కుందామని యీ యెత్తు వేశాను! మీ భక్తికి చాల సంతో షించాను.

యాకోబు:- ఆఁ, మీ మాట లెటునమ్మటానకీ యీలులేదు. మీ రనేది ఏదినిజమో, ఏది అబద్దమో దేవుడికే తెలియాలి. అయినా మాకెందుకు, మాదారిని మమ్ము పోనీయండి. దణ్ణం.

అని యాతఁడు సముయేలుతో నచటినుండి వెడలిపోయెను.

సాపి:- పప్పులో కాలేశావు, రమణారెడ్డీ.
రమణా:- నేనా, నీవా? మాలమాదిగలందరూ రాజశేఖరం అంటే పడిచస్తుంటే వాణ్ణి కొట్టించడానికి వాళ్ళనే కట్టుకొనడం ఎంత తెలివి మాలినపని? పైగా ఈ వెధవలు ఇదంతా వాడికి చెప్పి అల్లరి చేస్తారేమో!
చెన్నప్ప:- అది నేను చూసుకొంటాలెండి. యాకోబు, సమువేలు సారాబొట్టుకోసం నా చుట్టూ తిరుగు తుంటారు. అది కాస్త పోసి వాళ్ళనోళ్ళు మూయించొచ్చు.
రమణా:- ఏమో, నాకు నమ్మకంలేదు. అయినా చూడు!

ఆ ప్రయత్న మట్లు పిండివలె రాలిపోయెను. ఎవరిదారినివారు పోయిరి. రమణారెడ్డి హృదయము మఱింత వ్యాధిగ్రస్తమయ్యెను. అతఁడా రేయి నిదురించెనో లేదో! త్రాగి పడియుండుట కింత సారాయైనను లేకుండుట యతని గ్రహచారము!

## XVII

# పరిశిష్టము

వేములపల్లి సమాజవృక్షమునకుఁ బట్టియుండెన చీడపురుగులలో వ్యాజ్యములవ్యసన మొకటి. ఆ గ్రామముతాలూకు సివిలు వ్యాజ్యములు గుంటూరుకోర్టులలో నేనాఁడైన నిరువదియైదింటికిఁదగ్గియుండవు. ఏ చిన్నవిషయమైనను దమలోఁ దాము తీర్చుకొను నేర్పు లేకయు వ్యాజ్యములపై బ్రదుకు మోసగాండ్ర ప్రేరేపణ వలనను కోర్టులో వ్యాజ్యమువేయు టనిన గ్రామీణులకు ఉచ్ఛ్వాస నిశ్వాసముల వంటిదై యుండెను. గ్రామములోఁ గక్షలు కలిసిపోయినప్పటినుండియు నీ వ్యాజ్యముల సంరంభము కొంత తగ్గెనుగాని పూర్తిగా నశింపలేదు. అంతకుముందు దాఖలుచేసి యున్న దావా లింకను బరిష్కారము గాక విచారణ జరుగుచునే యుండెను. ప్రతి దావాయు నెల నెలకు వాయిదాపడుచుండును. మఱియొక తూరి వాది వకీలు హాజరుగాలేక పోవును. ఒకసారి వాదిసాక్షి, మఱియొకసారి ప్రతివాదిసాక్షి దొరకఁడు. ఒక పర్యాయము వారి దస్తావేజు నకళ్ళు దాఖలుగావు. తరువాత వీరి నకళ్ళు దాఖలుగావు. వాయిదాపడుట కిట్లే యేదో యొక కారణము గలుగుచునే యుండును. ప్రతి వాయిదాకు వాది ప్రతివాదులు సాక్షులతోఁ గూడ గుంటూరు పోవుటయు, వకీలుగారికి, వారి గుమాస్తాకు ఫీజులుఁ గానుకలు నర్పించుకొనుటయుఁ దాము, తమ సాక్షులు భోజనపు హొటళ్ళలోఁ దలకు ముప్పావలావంతున, కాఫీహొటళ్ళలోఁ గనీసము అర్ధరూపాయి వంతున ముడుపులు చెల్లించుకొనుటయు కేసు వాయిదాపడఁగా వృథాగాఁ దిరిగి వచ్చుటయుఁ బరిపాటియై కేసు పర్యవసాన మేమైన నగుగాక, యీ లోపుననే కక్షిదారులు దివాలా తీయుచుందురు.

రాజశేఖరుఁడు గ్రామసముద్ధరణ కార్యక్రమము నెలకొల్పినప్పటినుండియు నీ విషయము తీవ్రముగా నాలోచించి ప్రజలలో

బహుకాలము ప్రచారముచేసి కడకు వారి యంగీకారముతో నొక మార్గము కనిపట్టెను. అది యేమన:-

సాధ్యమైనంతవఱకు గ్రామములోఁ దగవులు రాకుండఁ జూచుకొనవలయును. ఒకవేళఁ దగవులు వచ్చినను వానిని గ్రామములోనే పరిష్కారము చేసికొనవలయును. అందుకు గ్రామములో వయోవృద్ధులును, నిష్పాక్షికులును, యథార్థ వాదులు నగు ముగ్గురు పెద్దమనుష్యులను "న్యాయసమితి"గా గ్రామస్థు లెన్నుకొని తగవు లన్నియు వారికి నివేదించి వారు చెప్పు తీర్పులకు బద్ధులు గావలయును. అట్లు బద్ధులు గాకుండఁ దిరిగి కోర్టులకుఁ బోవువారిని ఒక సామాజిక బహిష్కార చర్యకు గురిసేయవలయును. న్యాయసమితివారు తాము తీర్మానము చేయలేక కోర్టునకుఁ బొమ్మని చెప్పిన తగవులనే కోర్టులకుఁ దీసికొని పోవలయును. ఇందువలన గ్రామీణులకు కోర్టుకర్చులు తగ్గిపోవును. ప్రయాణశ్రమ, వృథా కాలవ్యయము తొలఁగిపోవును. కక్షిదారుల కొండొరులపై మాత్సర్యము పెఱుగదు. వారు వకీళ్ళకు వారి గుమాస్తాలకు దాసులు కానవసరములేదు. తగవులు వెంటవెంటనే పరిష్కారమైపోవును. అన్నిటికంటె ముఖ్యముగ న్యాయము జరుగును.

తగవుజరిగినది వేములపల్లియు, విచారణ గుంటూరిలో నైన యెడల సాక్షులు కోర్టునందు మోమోటమిలేకుండ నిర్భయముగా నబద్ధములు చెప్పఁగలరు. వారు సంకోచించినను వకీళ్ళు వారికి నూరిపోసి యబద్ధములు వాగింతురు. గ్రామములోనే గ్రామస్థులే తగవు విచారించునెడల నే సాక్షియు నబద్ధము చెప్పలేఁడు. చెప్పినచో వారి మర్యాద యందఱికిఁ దెలిసి వారి నెల్లరును నీచులుగాఁ బరిగణింతురు. సమితి సభ్యులు సత్యము సులభముగా గ్రహింపఁగలిగి న్యాయ్యముగు తీర్మానము చేయఁగలుగుదురు. గ్రామ సమితియే విచారణ చేయునెడలఁ దగవులుకూడ పెఱుగవు. చాటులకు (తగవులు పెంచువారికి) అవకాశము దొరకదు. కొంతవఱకు నెవరికివారే తగవులు దీర్చుకొందురు. ఇప్పటివలె నేమియుఁ దోఁచక బస్తీకిఁ బరుగెత్తుకొనిపోయి వకీళ్ళ కాళ్ళమీఁదఁ బడరు.

రాజశేఖరుఁ డీ విధానమును గ్రామములోఁ జాలకాలము ప్రచారము చేసెను. స్థానిక సంస్థల సంస్కరణ చట్టము ప్రకారము పంచాయతీబోర్డులకే యీ న్యాయ విచారణాధికారము సంక్రమింపనుండుటచే నింతలో నీ సమితియేర్పఱచుట యవివేకము; ననవసరము నని కొందఱు-ముఖ్యముగా పుల్లయ్యపంతులు - ప్రతిఘటించెను. ఆ సంస్కరణ లమలునకు వచ్చిన తరువాత సమితి యనవసరమయినచో నప్పుడే దానిని రద్దుపఱచవచ్చుననియు నప్పటివఱకు సమితి యవసరమే యనియు రాజశేఖరుని వాదము. పంచాయతీబోర్డువారి శాసనసమ్మత న్యాయవిచారణకుఁగూడ నవసరములేకుండ న్యాయసమితియే వీలైనంతవఱకుఁ దగవులు పరిష్కరించుచు పంచాయతీబోర్డువారి పని తేలిక చేయుటయందును నైతిక సూత్రములపై న్యాయ్యము జరుపుచు గ్రామీణులయం దన్యోన్య సౌమనస్యము గల్గించుటయందును, న్యాయసమితి-సంస్కరణ లమలునకు వచ్చిన తరువాతఁగూడ- మిక్కిలి యుపయోగముగా నుండఁగలదనియు రాజశేఖరుఁడు ప్రచారమొనర్చెను. కడకొకనాఁడు కోవెలయావరణములో గ్రామీణులు సమావేశమై యీ క్రిందఁ బేర్కొనఁబడిన పెద్దమనుష్యులను సమితి సభ్యులుగా నెన్నుకొని వారి తీర్పులకు బద్ధులముగాఁ గలమని సప్రమాణముగా నంగీకరించిరి.

1. శ్రీ రావు సీతారామ రాయణింగారు
2. ,, రావూరి కుచేలరెడ్డిగారు
3. ,, మాడపాటి హనుమయ్యనాయఁడుగారు

వీరు ముప్పురును డెబ్బదికిఁ బైబడినవారు. పల్లెటూరివా రగుటచే శరీరపాటవ మంతగాఁ గోల్పోయినవారు గారు. బుద్ధిపరిపాకము గలవారు. నిష్పాక్షిక స్వభావముగలవారు. గ్రామ పరిస్థితులను, వ్యక్తులను బాగుగా నెఱిఁగినవారు. న్యాయసమితియందు సభ్యులు ముప్పురును వృద్ధులే యేల యుండవలయునని యొకరు ప్రశ్నించిరి. రాజశేఖరుఁ డందుల కిట్లనెను. "కాగి చల్లారిన నెత్తురు గల వృద్ధుల కున్నంత న్యాయదృష్టి, సమదృష్టి ఉడుకురక్తం ప్రవహించే యువకుల కుండదు. వారి కున్నంత లోకానుభవం, మానవ స్వభావ పరిచితి

వీరికి ఉండదు. న్యాయం ఎప్పుడూ కచ్చితంగా సమ్మిశ్రితం కావాలి. వృద్ధులే ఆ పని చేయగలరు." ఈ యభిప్రాయము నందఱంగీకరించిరి.

ఈ సమితి యేర్పడిన వారము రోజులలో గుంటూరు సివిలు కోర్టులందుండిన దావాలన్నియు వేములపల్లి గ్రామస్థు లెత్తివేసికొనిరి. న్యాయాధిపతులకుఁ బని తగ్గుటచే వారెంతయు సంతసించిరి. రాబడి లేని వకీళ్ళుమాత్రము కక్షిదారులను నిరుత్సాహపఱచిరి. రాబడిగల వారు ప్రోత్సహించిరి. న్యాయవాది మందిరములో రెండుమూఁడురోజు లీ విషయము ప్రధాన విషయమయ్యెను. అన్ని గ్రామము లిట్లైన మెడలఁ దమపని యేమగునా, యని కొందఱు న్యాయవాదులు తమ దృష్టిని జాలదూరము నిగిడించిరి. అప్పుడు చూచుకొనవచ్చునులే యని కొందఱు సంక్షేపించిరి. ఇన్ని సంవత్సరములనుండి కోర్టులలోఁ బరిష్కారముగాక నిలిచియున్న యిరువదియాఱు వ్యాజ్యములును బదునైదు దినములలో వేములపల్లి న్యాయసమితిలోఁ బరిష్కృతము లయ్యెను. గ్రామము నావరించియుండు నభినవవాతావరణ మిందుల కెంతయో కారణమయ్యెను. గ్రామములో నొండొరులయెడ సౌభ్రాత్రము పెంపొందినకొలఁదియుఁ దగవులే యరుదగుచుండెను.

తగవులు విచారించుటలో సమితివారు కక్షిదారులఁ బిలిపించి సాక్షుల రప్పించి యుభయ వాదముల సావధానముగావిని - యన్నియు వ్రాఁతకోఁతలు లేకుండగనే! -యప్పుడప్పుడే తీర్పుచెప్పుచుండిరి. "తీర్పు" అనుటకంటె వారుచెప్పునది యుభయులకు సమాధానముగానుండు "న్యాయము" అనవచ్చును. ఉభయులలో నొక్కరికిని గష్టము దోఁచ కుండునట్లు సమాధానము కుదుర్చుటే సమితియొక్క గమ్యదృష్టి. కోర్టుల న్యాయపాలనమునకును గ్రామసమితి న్యాయపాలనమునకు నిదేభేదము. శాస్త్రదృష్టిలో నెయ్యది న్యాయ్యమో యయ్యదే న్యాయమని కోర్టు వారు తీర్పుచెప్పుదురు. దానివలన నొక కక్షిదారున కెంతకష్టము గలిగినను కోర్టువారికి లక్ష్యములేదు. తమ తీర్పువలనఁ గక్షిదారుఁడు ఇంకను మాత్సర్యముఁ బెంచుకొని యన్యోన్య వినాశము దెచ్చు కొన్నను కోర్టువారికి లక్ష్యములేదు. సమితి యట్లుకాదు. కక్షిదారు

లిద్దరును సోదరులవలె మెలఁగుట కేది యుపాయమో దానినే సమితి యాలోచించును. ఆ యుపాయము శాస్త్రవిరుద్ధమైనను సమితి లక్ష్య పెట్టదు. కక్షీదారులలో శాంతి, స్నేహము, సుమనస్కత పెంపొందించుటే సమితి యుద్దేశ్యము. సమితి వ్యవహరించునది మానవులతో. కోర్టు వ్యవహరించునది శాస్త్రములతో. భేద మింతకన్న వివరింప వలయునా? ప్రాచీన భారత గ్రామములలో నిట్టి విధానమే యుండెడిది. దానిని బునరుద్ధరించుటకే రాజశేఖరరావు తనశక్తి నంతయు వినియోగించెను. అది గాకుండఁ జేయుటకుఁ గొండలు ప్రముఖులు ప్రయత్నించిరి. ఈ సమితి పాలనమువలనఁ దమ యాధిక్యము, ఆర్జన కోల్పోయిన స్వార్థపరులు అమాయకులగువారి కిది యది చెప్పి ప్రేరేచి వారిని దిరిగి కోర్టులపాలు సేయుటకుఁ గడుఁ బ్రయత్నించిరి. కాని గ్రామీణుల సంస్కృతి విచిత్రమైనది. పదుగురుసేయు పనికి సాధారణముగా నొక్కరు నెదురుపోలేరు. అపకీర్తిని వారు భరింపలేరు. అందువలననే పూర్వకాలము సంఘబహిష్కారము అంతవాడిగల యాయుధమై సమాజ నీతిని రక్షించినది. దురదృష్టవశమున స్వార్థపరులచేతిలోఁబడి సంఘమునకే చెఱుపుచేసిరి! వీరారెడ్డి మొదలగువా రెంత ప్రయత్నించినను మొత్తముమీఁద న్యాయసమితి యెడలఁ బ్రజాభక్తి చలింపలేదు. సమితి పూజ్యమగు సంస్థయై విరాజిల్లెను.

రమణారెడ్డి యింటఁ గుట్రజరిగిన నాల్గవనాఁడు న్యాయసమితి వారు పంచాయతీబోర్డు కార్యాలయమునందుఁ దగవులు విచారించుచుండఁగా రమణారెడ్డి యొక కక్షీదారుని తరఫున నతని వ్యాజ్యెమును గూర్చి వాదింతునని వచ్చి నిలిచెను. సమితి యధ్యక్షుఁడగు కుచేలరెడ్డి గా రిట్లనిరి :

కుచేల:—ఎవరివిషయం వారు చెప్పుకుంటారు. ఇతరులజోక్యంవల్లగాదు.

రమణా:— కక్షీదారుడైన వెంకయ్య అమాయకుడు. నోరులేనివాడు. తనసంగతి సరిగా చెప్పుకోలేడు. అతనికి అన్యాయం జరుగుతుంది.

కుచేల:— అతను చెప్పుకోలేకపోయినా, మేం న్యాయం విచారిస్తాం. అబ్బాయి. ఈ గ్రామంలో మాకు తెలియని సంగతిలేదు. అవసర

మైతే వెంకయ్య యింటికికూడా పోయి చుట్టుపక్కల గూడా విచారించి న్యాయం తేలుస్తాం. నీ వకాల్తా అవసరంలేదు. వకాల్తా పద్ధతే లేదిక్కడ.

రమణా:- దీన్ని న్యాయసమితి అనడంకంటే అన్యాయసమితి అనడం బాగుంటుంది. అమాయికుల నోట మట్టిగొడ్డటానికి ఏర్పడ్డది. అందుకే వకాల్తా పద్ధతి ఒప్పుకోదు.

కుచేల:- అబ్బాయి, అనవసర ప్రసంగం చేయవద్దు. న్యాయసమితో, అన్యాయసమితో ప్రజలందరూ ఒప్పుకొని యేర్పాటుచేశారు. ఇందులో నిజంగా దోషాలుంటే ప్రజలలో ప్రచారంచేసి దీన్ని రద్దు చేయించు. అంతేకాని పిలవని పేరంటానికి ఇక్కడికి వచ్చి హద్దు మీరి మాట్లాడటం నీబోటి చదువుకున్న కుర్రవాడికి సబబుకాదు. పో, నాయనా, పో, యింటికి——

కుచేలరెడ్డిగారీ మాట లనుచుండఁగనే వీరారెడ్డిగారి బంధు వొకరు పరుగెత్తుకొనివచ్చి రమణారెడ్డి నావలకుఁ బిలిచి పోలీసువా రతని యిల్లు సోదాచూచుచున్నట్లు తెలిపి వెంటనే యింటికిఁ బొమ్మని చెప్పెను. రమణారెడ్డి నిర్విణ్ణుఁడై తత్క్షణ మింటికిఁ బరుగెత్తుకొని పోయెను.

అతఁ డింటికిఁబోవునప్పటి కింటిబయట రాఘవులు, చెన్నప్ప యొకరి కొకరు సంకెలలతో బంధింపఁబడి నిలువఁబడి యుండిరి. చెంత సాయుధపాణియైన రక్షకభటుఁడుండెను. రెండు సారాయి జాడీలు అరుగుమీఁదఁ బెట్టఁబడి యుండెను. రమణారెడ్డిని చూచి "కొంపతీశారు, రమణారెడ్డిగారూ!" అని చెన్నప్ప భోరున నేడువఁ జొచ్చెను. రమణారెడ్డి లోనికేఁగునప్పటికి సబ్ఇన్‌స్పెక్టరు, హెడ్ కాన్‌స్టబులు మఱియొక పోలీసుజవాను వీరారెడ్డిని వెంటఁగొనిపోయి యిల్లంతయు వెదకుచుండిరి. రెండు ఖాళీసీసాలు దొరకెనుగాని యందొక్కచినుకైనను సారాయి లేకుండెను. రమణారెడ్డిని జూచి సబ్‌ఇన్‌స్పెక్టరు "నీవేనా, రమణారెడ్డివి ? నీవు ఇల్లిసిట్‌లికర్‌చేయించి తాగుతున్నట్లు రిపోర్టు వచ్చింది. ఈ సీసాలు సారాయివాసన వేస్తు

న్నాయిగాని యిందులో సారాయి లేనందున నీవు నేరంచేసినట్లు నాకు నమ్మకంకల్గినా నిన్ను వదలిపెట్టవలసి వచ్చింది. కాని నీమీద పోలీసు కన్నువేసి వుంటుందని హెచ్చరిస్తున్నాను. జాగ్రత్త" యని గద్దించి పలికెను. రమణారెడ్డి "నో, సార్, నాకు ఈ వూళ్ళో విరోధులున్నారు. అయాం ఎ జెంటిల్‌మన్........" అని యేమో చెప్పఁబోవుసరికి "షటప్ ! నీ వ్యవహారం అంతా విచారించాను. ఆ చిక్కిన యిద్దరే చెపుతున్నారు నీ పెద్దమనిషితనంగూర్చి. నీమీద ఎవిడెన్సు లేకపో లేదు. చిక్కకపోదు. ఇక నోరుఎత్తావా నిన్నుకూడా అరెస్టుచేసి తీసుకుపోతాను. జాగ్రత్తగా ఉండు" అని సబ్ ఇన్‌స్పెక్టరు బిగ్గఱగాఁ బలికెను. రమణారెడ్డి గడగడ వణఁకిపోయెను. వీరారెడ్డి యిన్‌స్పెక్టరు చేతులు పట్టుకొని "అయ్యా, ఇక నేను జాగ్రత్త చేస్తాను. ఈ సారికి క్షమించండి". అని మనవిచేయుచు నాయనతో బయటకుఁబోయెను. పోలీసువారు సారాయిజాడీలు చెన్నప్ప రాఘవుల తలలకెత్తి బయలు దేరిరి. గ్రామము వెలుపల జీప్‌కారులో వారి నెక్కించుకొని గుంటూరు చేరిరి. గ్రామమంతయు నిది పొక్కిపోయెను.

పోలీసువారు పోయినవెంటనే రమణారెడ్డి పడకకుర్చీలోఁ గూలఁబడి భార్య వినునట్లుగా "నాన్‌సెన్సు, ఈ ముసలాయన వ్యవహార మంతా చెడగొట్టాడు. వెధవ యెర్రబుట్ట చూడగానే గడగడలాడి క్షమించండి అని కాళ్ళమీద పడడం దేనికి ? నేరం చేసినట్లు ఒప్పుకొన్నట్లేగా ? ఈ పల్లెటూరి బ్రూట్సుకు లా పాయింట్సు ఏం తెలుసు? ఛా ! కథ అడ్డంగా తిరిగింది. చెన్నప్ప, రాఘవులు చిక్కిపోయినారు". అని యేమో యనుకొనుచు "ఏయ్, అలివేణి యిటురా" యని భార్యను బిలిచెను.

అలివేణి:- ఎందుకు ?

రమణా:- ఈ సంగతి పోలీసుల కెట్లా తెలిసింది ?

అలి:- నాకేం తెలుసు ?

రమణా:- మొన్నరాత్రి మేం అందరం మాట్లాడుతున్నప్పుడు నీవూ ఉన్నావుగాదూ, ఇక్కడ ?

అలి:-ఎవ రెవరు మాట్లాడారో, ఏం మాట్లాడారో నే నేం ఎరుగుదును? నే నప్పుడే పండుకొని నిద్రపోతినిగా ? ఆ మాట్లాడినదానికీ, దీనికీ ఏం సంబంధం ?

రమణా:- ఆల్ రైట్, తెలియకపోతే ఊరుకో.

తమ గుట్టు అలివేణికిఁ దెలియదని యిందువలన దృఢపఱచుకొని మఱి యెవ్వరు బయలుపెట్టి యుందురా యని యాలోచింపఁదొడఁగెను. యాకోబు, సముయేలులపై నతని కనుమానము పోయెను. వారు రాజశేఖరునెడ భక్తిపరులై యుండుటచే నతనిని గొట్టించుటకు జరిగిన కుట్రయంతయు నతనికిఁ జెప్పుచు దొంగసారాయి విషయముగూడఁ జెప్పియుండవలయును. రాజశేఖరుఁడు పోలీసు వారికి రిపోర్టుపంపియుండవచ్చును. మఱి యంతపని చేయగలవా రీ గ్రామములో నెవ్వరు గలరు ? రాజశేఖరుఁడే తన కీ యపకారము చేసియుండెనని యతఁడు గట్టిగా నమ్మెను. తా నతనిని కమ్యూనిష్టుగాఁ బట్టించుట కెట్లు కుట్ర పన్నెనో యట్లే యతఁడు తనను నిషిద్ధ మద్యపాయిగాఁ బట్టించుటకుఁ గుట్ర పన్నెనని యతఁడు విశ్వసించెను. ఎవరి సంస్కారములకు, స్వభావములకుఁ దగిన యూహాలు వారికిఁ బుట్టుచుండును. సామెత్త్మొకచోట, అనుమాన మొకచోట యగుట పరిపాటియేగదా ! నాగనాచివలెఁ దన కేదియుఁ దెలియదని చెప్పిన యలివేణియే యా పని చేసెనని యతఁ డూహింపలేకపోయెను. తన త్రాగుడువలన బాధపడునది యలివేణియేకాని యొరులుగారు. గ్రామములో సారాయి తయారుగాకుండఁ బోయిన సుఖపడువారిలో నామెయే ప్రథమురాలు. కావున సారాయి గుట్టు తెలిసిన వెంటనే యామె రహస్యముగాఁ బోలీసు వారికి "ఆకాశరామన్న" యుత్తరము వ్రాసెను. గొడులఁ బట్టుకొనిపోయిరే కాని తన మగనిఁగూడఁ బట్టుకొని పోలేదుగదా యని మిగులఁ జింతించెను. తన పాచిక కొంతవఱకైనఁ బారినందుకు మాత్రము సంతసించెను. కాని తాఁ జేసిన పనివలనఁ దా నింతగా వలచి వలపింపఁదలఁచిన రాజశేఖరునిపైఁ దన మగఁ డన్యాయముగా నిందవేయుచుండె

నని యామె గ్రహింపలేదు. ఎట్టి యకార్యమునకైన వెనుదీయని రమణారెడ్డి రాజశేఖరునిపై నెట్లు పగదీర్చుకొనునో!

పోలీసువారు చెన్నప్ప, రాఘవులను బట్టుకొనిపోయినప్పుడు రాజశేఖరరావు గ్రామములో లేఁడు. అతఁడే యున్నయెడల నీ పని జరుగనిచ్చువాఁడు గాఁడు. సారాయి తయారుగాకుండఁ దాను ప్రాచీ యిచ్చి గౌరవులను దప్పించి తన యాత్మబలముచే వారిని సంస్కరించు వాఁడు. దౌర్భాగ్యమును, దౌష్ట్యమును దొలఁగించుటకు హింసాత్మక మగు శిక్షకంటెఁ బ్రేమస్పర్శచేఁ గలిగించు హృదయ పరివర్తనమే గురుతర సాధనమని యతని విశ్వాసము. దుష్టుని శిక్షించుట యెలుక లను జంపుట కిల్లు గాల్చిన చందమగునని యతఁడు వాదించును. నిర్మూలింపవలసినది మానవు నావరించిన దౌష్ట్యమేకాని మానవుఁడు గాదు. మానవత్వమును దురితపంకమునుండి లాగుటే పరమధర్మము. గాంధీమహాత్ముని యుపదేశ క్షీరమున కిదియే మీఁగడ. శిష్టరక్షణ మునకై దుష్టసంహార మొనర్చుట ప్రాచీన ధర్మము. దౌష్ట్యనిర్మూలన మొనర్చి దుష్టుని శిష్టునిగా సంస్కరించుట మహాత్ముఁడుపదేశించిన నూతన ధర్మము. సూక్ష్మమయ్యును మహత్తరమగు నీ భేదము ను రాజశేఖరుఁడు బాగుగా గ్రహించి జీర్ణించుకొనెను. చెన్నప్ప, రాఘవు లను రక్షక భటులు పట్టుకొనిపోయిరని విన్నప్పు డతడింకఁ బరితపిం చుటలో నాశ్చర్యమేమి? పరమభాగవతుఁడగు నీతని మనఃప్రవృత్తి నెవ్వ రర్థముచేసికొనఁగలరు ? ఎవ్వరైన నేమోకాని రమణారెడ్డి మాత్రముగాదు. కావుననే రమణారెడ్డి చెన్నప్ప, రాఘవుల బంధు మిత్రులతో రాజశేఖరుఁడే యీ యపచార మొనర్చెనని తీవ్రముగాఁ బ్రచారముచేసి యతనిపై వారికి ద్వేషము రగుల్కొల్పుచుండెను. తన ధర్మము తా నాచరించుచుఁ బోవు రాజశేఖరుఁ డీ ప్రచారమును గమనింపలేదు. గమనించినను బ్రతీకారముసేయువాఁడు కాఁడు.

గ్రామ పునరుజ్జీవనమునకు - అననేల ? - మానవాభ్యుద యమునకు వృద్ధులకంటె యువకుల మనఃపరివర్తనము, మనస్సంస్కా రము ముఖ్యతరములని రాజశేఖరుని విశ్వాసము. తాను గ్రామపున

రుద్ధరణ కార్యమునకుఁ బూనుకొన్నప్పటినుండియుఁ దన యుద్యమము నందు యువకులకే మిక్కిలి ప్రాధాన్యమొసఁగి ప్రతి కార్యక్రమము నందును వారిమీఁదనే భారమువేసి వారి యుత్సాహమునకే కాడితగి లించుచుండెను. నియమిత శీలము, గ్రామాభిమానము, దేశకళ్యాణాభి రతి, సత్యవచనము, వినయము, అహింసావ్రతము, బ్రహ్మచర్యము మొదలగు నుదాత్త గుణములను వారిలోఁ బెంపొందించుట కతి ప్రయాసపడుచుండెను. భావి సౌభాగ్యమంతయు మన శీలముపైనను, గార్యదీక్షపైనను, సేవానిరతిపైనను ఆధారపడి యున్నదని వారికిఁ బ్రత్యహము నూరిపోయుచుండెను. కళంకితమైపోయిన జాతీయ జీవిత మును బ్రక్షాళించి పవిత్రమగు ప్రాచీన భారత సంస్కృతిని దిరుగఁ బ్రకాశింపఁజేయవలయునని యతని వజ్రసంకల్పము. విశ్వమానవ సౌభ్రాతృత్వ మతని గమ్యార్థము. అఖిలభారత సమైక్య మతని యభిమతము. కాని యాంధ్ర జాతీయతను జెక్కుచెదరకుండఁ బోషించి భారత జాతీయ జీవిత మహాతరంగిణికిఁ బ్రముఖోపతరంగిణిగాఁ బ్రవ హింపఁజేయవలయునని యాతని యాశయము. అందువలననే యువకు లకు వేషభాషలయందుఁ దెలుఁగుఁదనము పోనీయవలదని నొక్కి చెప్పుచుండును. బొట్టు లేకుండుట కతఁ డొర్వఁడు. అడ్డకట్టు నతఁ డేవగించుకొనును. చక్కఁగాఁ బింజెలువోసి ధోవతి కట్టుట యాంధ్రుల ప్రత్యేకత, విశిష్టత యని యాతని వాదము. పై నుత్తరీయములేకుండ వీధికి వచ్చుట పెద్దమనిషి లక్షణముగా దనును. గాంధీయన్న నతనికి భగవత్తుల్యుఁడైనను దెలుఁగువారు గాంధీటోపీ నెహ్రూ పొట్టికోటు ధరించుట యతనికి గిట్టదు. తెలుఁగువారికిఁ దలగుడ్డయే యందము. తలగుడ్డ చుట్టుటలోఁ దెలుఁగువారికొక ప్రత్యేక కళాకౌశలము గల దనియు, దానిని మఱచి గాంధీ టోపీ పెట్టుకొనుట పరసంస్కార దాస్యమనియు నాతఁడు వాదించును. భారత సంస్కృతిని జీర్ణించు కొనుట కీ బహిర్వేష పరిణామ మవసరములేదనియు, మానసిక పరిణా మమే ముఖ్యమనియుఁ జెప్పుచుండును. అంతర్జాతీయ భాషయగు నింగ్లీషును, భారత జాతీయ భాషయగు హిందీని నేర్చుకొనుట యవస

రమైనను తేనెవంటి తెనుఁగుబాసలోఁ బ్రావీణ్యము సంపాదింపకుండ నన్యభాషలకు సంజలించుట మహోపచారమని యతని అభిప్రాయము. జాతియొక్క సంస్కారము లద్దములో నీడలవలె నాజాతియొక్క భాషలో, వేషములోఁ బ్రతిఫలించుచుండును. కావున ఆంధ్ర సంస్కృతినిఁ బునరుద్ధరించుటకు ఆంధ్రభాషను జక్కఁగాఁ బోషింపవలయును. ఇతర సంస్కృతులను జీర్ణించుకొనఁదలఁచుకొన్నను దమ సంస్కృతితోఁ గలిసిపోవువానినే జీర్ణించుకొనవలయును. ఈ విషయమున రాజశేఖరుఁ డతి జాగరూకుఁడై యువకుల నుద్బోధించును. గ్రామములోఁ దానేర్పాటుచేసిన స్వచ్ఛంద సేవాదళమునకుఁ బ్రతిదినము నీ బోధ సేయుచుండును. గొప్పగాఁ జదువనివారైనను యువకు లీతని యాదేశములను జక్కఁగా గ్రహించి సుశిక్షిత సైనిక బృందమువలె మానవసేవ చేయుచుండిరి.

గ్రామములో బాలురకు, యువకులకు నాటపాటలును వినోదములు నుండుట యత్యవసరమని గుర్తించి తెలుఁగు వారి జాతీయ క్రీడలగు చెడుగుడులు, ఉప్పన బట్టెలు, త్రాడులాగుటలు, మున్నగు వానిని నెలకొల్పి యందులోఁ బోటీలు పందెము లేర్పఱచెను. గెలిచిన వారికి బహుమతులుగాఁ దా నొక వెండిగిన్నెయుఁ, దన మిత్రులు రెండు గిన్నెలును జేయించిరి. వారవారమున కీ పోటీలు జరుగుట, గెలిచినవారికి గిన్నెలు చెందుచుండుట, వానిని గెలుచుకొనుటకుఁ దక్కినవారు తిరిగి తిరిగి ప్రయత్నించుట పరిపాటి యయ్యెను. ఇందువలన యువకులలోఁ గార్యదీక్ష, పౌరుషము, ధీరత్వము ప్రోది యగుచుండెను. పోటీచేయునప్పుడు పౌరుషముతోఁ బోటీచేసి పోటీ యైన వెంటనే జయాపజయ భావమును మఱచి యిరువాగులవారును సోదరులవలె మెలఁగు ధీరత్వము నీ పోటీలు పెంపొందించుననియు, దైనందిన జీవితమునందును, బ్రవర్తనమందును ఇట్టి ధీరత్వమే చూపుచుండుట పురుషలక్షణమనియు రాజశేఖరుఁడు యువకులకుఁ జెప్పుచుండును.

వివిధములగు నిట్టి కార్యముల వలన రాజశేఖరునకు క్షణమైనఁ దీరికయుండెడిదికాదు. అతఁ డస్ఖలిత బ్రహ్మచర్యము ననుష్ఠించుచు

నాహారపానీయములలో నీతి నియమములు గలిగియుండుటచే నెంతశ్రమ చేసినను డస్సిపోవక తన సేవా విధానమును జయప్రదముగాఁ గొనసాఁగించుచుండెను. అతని దినచర్యలను, సేవాఫలమును వివరించుట కష్టము. పంచాయతీ బోర్డులో నతఁడును, శాంతాదేవియుఁ జేసిన గ్రామసేవనుగూర్చి యిటీవల మనము సింహావలోకనమైనఁ జేయలేదు. పౌరసౌకర్యములు గల్గించుటలో పంచాయతీబోర్డు కల్పవృక్షమువలెఁ దయారయ్యెను. పంచాయతీ మెంబరులు తమ తమ ప్రదేశములలో, వీధులలో నెట్టి లోటు రానీయకుండ వేయికన్నులఁ జూచుకొనుచు నచ్చటి పౌరులకుఁ దలలోని నాలుకలై గ్రామపరిపాలనలో ననేక విధములఁ దోడ్పడుచుండిరి. గ్రామీణులెల్లరును పంచాయతీ సంస్థ యను బృహత్కుటుంబమునకుఁ జెందిన యొకే సోదరవర్గము అను భావము వారి హృదయములో నాటుకొనుచుండెను. సహకారసంఘ మీ భావమును మఱింత బలపఱచుచుండెను. గ్రామమునకుఁ గల లోటులలో నానుపత్రి, పాఠశాల, గుంటూరు రస్తాకుఁ జేర్చు రోడ్డు అని మనము తెలిసికొనియున్నాము. కడచిన యాఱుమాసములలో నా లోటులు గూడఁ దీరిపోయెను.

గుంటూరు రస్తాకు వేములపల్లినుండి ఆఱుమైళ్ళ దూరము. ఈ యాఱుమైళ్ళను డొంక గలదు. కాని దాని నిండ బురద. వానలలో నడువ సాధ్యముగాదు. రస్తాకుఁ జేరువలో నీ డొంక నానుకొని రెండు గ్రామములు గలవు: వరిగపాడు, రామనపాలెము. వేములపల్లి పంచాయతీబోర్డువారు ఈ రెండుగ్రామముల సహకారము సేకరించినఁ గాని రోడ్డు వేయించుకొనుట సాధ్యముగాదని వారితో నాలోచనలు జరిపిరి. ఆఱుమైళ్ళ రోడ్డునకు ఎస్టిమేటు వేయించఁగా లక్ష యిరువది వేల రూపాయ లగుననిరి. అందు సగము – అఱువదివేలు – ప్రభుత్వము వారిత్తురు. తక్కిన యఱువదివేలు గ్రామస్థు లిచ్చుకొనవలయును. వేములపల్లివారు ఇరువదివేలును, దక్కిన రెండుగ్రామములవారు చెఱియొక పదివేల ప్రకారము ఇరువదివేలును మొత్తము నలుబదివేలు నగదుగా నిచ్చుకొనునట్లును దక్కిన యిరువదివేలు 'కూలి' రూపమునఁ

జెల్లించుటకును నేర్పాటు గావింపఁబడెను. ఈ మూఁడు గ్రామము లందును రాజశేఖర రామ రాజాదులు పెద్ద పెద్దవారిని సందర్శించి పరోపకారమే పరమధర్మమని నూరిపోసి, కలవారు చేయివేసికొన్న నే కాని గ్రామముల నుద్ధరించుట సాధ్యముగాదని మనవిచేసి, సిరి యస్థిర మనియు మానవసేవయే తారకమార్గమనియుఁ దత్త్వము బోధించి, ప్రపంచములోఁ గలుగుచున్న యార్థిక రాజకీయ సాంఘిక పరిణామముల లోని భావమును విప్పిచెప్పి యెట్టకేలకుఁ దాము వసూలు చేయఁ దలఁచిన నలుబదివేల రూపాయలను వసూలుచేయఁ గలిగిరి. ఎవరి తాహతునుబట్టి వారు విరాళము లిచ్చిరి. డబ్బట్లో సమకూరెను. మఱి కూలిరో! తిరిగి యదే ప్రచారము. ఈ మూఁడు గ్రామములలో నెద్దుల బండ్లు, దున్నలబండ్లు నన్నియుఁ గంకర, గ్రావెలు, ఇసుక చేర్చుటకు నుచితముగా వినియోగింపఁబడెను. కాయకష్టము చేయఁ గల వారెల్లరును బనిలోఁ బాల్గొనిరి. అందుఁ జిన్న పెద్ద భేదములేదు. కుల మత భేదములు లేవు. ఎవరింటి కార్య మిది? మన యింటిదే. ఈ భావ మందఱి హృదయములలో హత్తుకొనెను. సేవాగారవము నెల్లరు నర్థము చేసికొనిరి. త్రవ్వుట, తలకెత్తుట, మోయుట, పఱచుట మున్నగు నెట్టి పనులకైనను బ్రతివ్యక్తియుఁ దయారయ్యెను. ఈ రోడ్డు వేయునప్పు డీ గ్రామస్థుల పట్టుదలయు, నుత్సాహము, సేవాభావముఁ జూచితీరవలయునేకాని, వర్ణింప నలవికాదు. ఈ పనియంతయు వేముల పల్లి పంచాయతీబోర్డే కంట్రాక్టునకుఁ దీసికొనెను. కావున వ్యక్తి యెవ్వఁడు నిందు లాభము పొందునదిలేదు. కూలి పుచ్చుకొనువారెవరు-లేరు. అందుచే పనిదొంగ లెవ్వరును లేరు! వేయేల? దేవుని పెండ్లి చేయుటకు జానపదు లెట్లుత్సాహము జూపుదురో యట్లే తమ యుత్సాహము చూపి గడువునకంటె ముందుగా రోడ్డు ముగించిరి. అధికారులు ముక్కున వ్రేలు వైచిరి. తక్కిన గ్రామస్థు లక్కజపడిరి. అబ్బా!- జన పదములలో సహకారభావ మంకురించి దోహదమైన యెడల గ్రామ కల్యాణ మెంత సులభము?

రోడ్డు పడినవెంటనే వేములపల్లికి మాధ్యమిక పాఠశాల

యేర్పడెను. దానికి మఱల నదే భిక్షాటన. కాని యీపాటికి గ్రామములో సాముదాయిక కార్యములయందు ధనికులకుఁగూడ నభిమానమేర్పడెను. తమతో మూల్గుచుఁ బడియుండు ధనము ప్రపంచ కల్యాణార్థము వినియోగింపకుండుట పాపకార్యమని వారాలోచింపఁ దొడఁగిరి. శాంతా రాజశేఖరుల కృషి యెంత యవసరమో వారెల్లరు గుర్తించిరి; వారిని శ్లాఘించిరి. సహకార సంఘ స్థాపనకును, హరిజన దేవాలయ ప్రవేశమునకును. విముఖులైన లచ్చినేని రామకృష్ణయ్యగారు తమంతటఁ దాము పాఠశాలకు వలయు స్థలము నుచితముగా నిత్తుమని వాగ్దానముఁ జేసిరి. గ్రామోపాంతమునఁగల తమ మెట్టభూమి యెకరమును వెంటనే పంచాయతీ బోర్డునకు వ్రాసియిచ్చిరి. అంతేకాక తాముగూడ గ్రామములోఁ జందాలకుఁ దిరిగి తమవంటి షావుకారుల యొద్దనుండి యైదువేల రూపాయలు ప్రోగుచేసి యిచ్చిరి. తక్కిన గ్రామస్థులందఱునుగలిసి మూఁడువేలిచ్చిరి. ఏడువేలును వినియోగించి ఱాతిగోడలు, పూరికప్పు, కడప ఱానేలగల భవన మేర్పఱచిరి. తక్కిన వేయిరూపాయలతోఁ గుర్చీలు, బల్లలు మొదలగు హంగులేర్పఱచిరి. భవన నిర్మాణమును, పరికర సృజనమును, సహకారసంఘము కంట్రాక్టునకుఁగొని సరసముగాఁ జేసెను. పంచాయతీబోర్డు పాఠశాల యాజమాన్యము వహించెను. ప్రభుత్వమువారిచ్చు విరాళముతోఁ బాఠశాల నడుపుచు నింకను అవసరమైన ద్రవ్య వసతిని దానే సమకూర్చు బాధ్యతనుగూడ బోర్డే వహించెను. పాఠశాల ప్రారంభమయ్యెను! మొదటి సంవత్సరమే మొదటిఫారము వఱకుఁ దరగతు లేర్పడెను. పరిసర గ్రామముల బాలబాలిక లీ పాఠశాలకే రాఁదొడఁగిరి. హరిజనులకుఁ దప్పక ప్రవేశ మీయవలయుననని పంచాయతీబోర్డు పట్టుబట్టి యీ నియమమును బాగుగాఁ బాటించుచుండెను. గ్రామములోఁ జదువుకొనఁదగిన పిల్లల నెల్లరిని బలవంతముగాఁ జేర్పించి పాఠశాలను దొందరలో నభివృద్ధిపఱచిరి. పేదబాలుర కుచితముగా విద్య గఱపుచు, నియ్యఁగలవారినుండియే జీతములు తీసికొనుచుండిరి. అట్లయ్యును పంచాయతీబోర్డు తన సొమ్ము వినియోగింపకయే పాఠశాల నడుపఁ

గలుగుచుండెను. సహకారసంఘము లాభములోని సముదాయ ప్రయోజననిధిని బాలశాలకే యిప్పించుచుండెను. కొంత క్షేమనిధి యుండిననేకాని నిర్భయముగా నుండ వీలులేదని యభిమానులనుండి యింకను విరాళములు వసూలుచేయుచు నొక యాఱువేల రూపాయలు నిలువచేసి యవసరమైనప్పు డా నిధి నుపయోగించుచుండెను.

ఇంకఁ గావలసినది యాసుపత్రి. ఇందులకు రాజశేఖరుఁ డొక యాలోచన చేసెను. వైద్యవృత్తి యతి పవిత్రమైనది. వైద్యునకు ధనకాంక్ష యుండఁజెల్లదు. మానవసేవయే పరమార్థముగాఁ గల వైద్యుని సంకల్పబలముచేతనే కొన్ని జాడ్యములు కుదురును. అదియే యాత్మశక్తి! ఇట్టి యాత్మశక్తి, త్యాగశీలము, జీవకారుణ్యము, రోగి జనసానుభూతి గల వైద్యుఁడెవ్వరైన దొరకునా యని చాలకాల మతఁడు విచారించెను. ఒకనాఁ డతఁడు తెనాలిలో సుప్రసిద్ధ వైద్యు లగు డాక్టరు వెంపటి సూర్యనారాయణగారికడ కేఁగెను. వీరు గాంధీ తత్త్వమును బ్రత్యణువున జీర్ణించుకొన్న మహనీయులు. నిరాడంబరులై, స్వార్థరహితులై యార్తమానవలోకమునకు నిరంతరము సేవచేయు వారు. కంటివైద్యమున వీరి కద్వితీయ ప్రజ్ఞ గలదు. ఎంతపెద్దవైద్యము చేసినను స్వీకరించు పారితోషికము బహు స్వల్పము! కలవారి కడ రాఁబట్టి లేనివారి కుచితముగా వైద్యము సేయుదురు. అందఱియొద్ద నుండి కొద్దియో గొప్పయో పారితోషికము గొనుట నియమము గావున లేనివారికడనుండి కూడఁ బారితోషికము తీసికొని తిరిగి వారికే యొసఁగుదురు! తమకడకు వైద్యమునకు వచ్చిన దరిద్రుల కుచిత చికిత్స చేయుటయేకాక కర్చులకుఁగూడఁ దామే యిత్తురు! స్వీయపోషణకుఁ గావలసిన కనిష్ఠ భాగము తప్పఁ దక్కిన యాదాయమంతయు రోగు లకే యుపయోగింతురు. మానవసేవయే వారి యాదర్శము, పరమా ర్థము. రాజశేఖరరావు వీరిని గలిసికొని తన యాదర్శముల కనువైన వైద్యు నెవ్వరినైనఁ జూపింపఁగలరాయని యడిగెను. డాక్టరుగారి కడఁ గొందఱు వైద్య పట్టభద్రులు పని నేర్చుకొనుచుందురు. డాక్టరు గారు సృజించిన పవిత్ర వాతావరణమున మెలఁగుటచేఁ గొందఱు

వారివలెఁ బరివర్తనమొంది వారివలెనే మానవసేవచేయ దీక్షితులై యుందురు. భ్రమర కీటన్యాయమన నిట్టిదియే కదా! డాక్టరుగారి శిష్యులలో నెల్ల ముక్కంటియను యువకుఁడు మిక్కిలి త్యాగశీలి. సేవాభిలాషి. బ్రహ్మచారి. కులమెయ్యదియో యెవ్వరికినిఁ దెలియదు. తాను భారతీయుఁడను, ఆంధ్రుడను అని మాత్ర మతఁడు చెప్పుకొనును. ఆయుర్వేద, ఆంగ్ల వైద్యములలోఁ బ్రవీణుఁడు. వేములపల్లి కతఁడు తగినవాడని డాక్టరుగారు సెలవిచ్చి యతనికిఁగూడ నచ్చుటకేఁగవలసిన దని సలహా యిచ్చెను. రాజశేఖరుని పవిత్ర కార్యక్రమము నర్థము చేసికొనిన ముక్కంటి వెంటనే యంగీకరించెను. డాక్టరుగారి యాశీర్వాదము లాదుకొని యిరువురును వేములపల్లికి వచ్చిరి.

వెంటనే మంతెన వేణుగోపాలరాజుగారి యింటిలో నొక భాగమున వైద్యాలయము నెలకొల్పిరి. అంతకుముందు పంచాయతీబోర్డు వారు తెప్పించి యుంచిన ప్రథమచికిత్సా పెటారముతోడను, ముక్కంటి గారి సొంత యౌషధములతోడను గ్రామములో వైద్యము మొదలయ్యెను. ధనికుల యిళ్ళలో నయముచేసిన నాలుగైదు కేసులకు వచ్చిన పారితోషికము వినియోగించి ముక్కంటిగారింక కొన్ని యౌషధములు గొనితెచ్చిరి. క్రమ క్రమముగా నౌషధములు పెంపొందెను. ఒకమాసమురోజులు ముక్కంటిగారు రాజశేఖరునింట నతిథియై యుండెను. కాని యాతని కేదో యొక యేర్పాటు చేయవలయునని పంచాయతీబోర్డు ఆలోచించుచుండెను. ముక్కంటికిఁ బొట్టగడిచినఁ జాలును. తక్కిన యాదాయ మంతయు రోగులకే వినియోగింప సంకల్పించి యుండెను! అతఁడు గొప్ప "హస్తవాసి" గలవాఁడని యప్పుడే పేరువడసెను. ఆ త్యాగశీలికి నెల జీత మేర్పాటుచేయుట సరి గాదు. ఏమిచేయుదుమా యని పంచాయతి మెంబరు లాలోచించుచుండ శాంతాదేవి యిట్లు చెప్పెను. "నా వివాహ కాలంలో మా నాయన నాకు వ్రాసియిచ్చిన పదెకరాలలో అయిదెకరాలు అనువత్రికిగాను పంచాయతికి వ్రాసియిస్తాను. అది డాక్టరుగారి భృతికి సరిపోతుంది. వారి ఆదాయం మందులకూ, నర్సుల జీతాలకూ, కాంపౌండరు జీతా

లకూ ఉపయోగించవచ్చు". ఈ త్యాగమునకు, ధార్మికతకు శాంతా దేవి నెల్లరు నభినందించిరి. వేణుగోపాలరాజుగారు తమ యింట నుచితముగా నాసుపత్రి జరుపుకొనవచ్చుననిరి. వెంటనే అన్ని హంగులతో నాసుపత్రి యేర్పాటయ్యెను. నర్సు లెవ్వరును సమయమునకుఁ జిక్క లేదు. శాంతాదేవి విద్యాలయములోఁ జదువుకొను వితంతువులు ముగ్గు రాసుపత్రిలో నుచితముగా సేవచేయుట కిచ్ఛగించిరి. ముక్కంటి వారికిఁ గొంతకాలము శిక్షణమొసఁగి వారినే నర్సులుగా నుపయోగింపఁదొడఁగెను. హృదయపూర్వకముగ నర్సుపని చేయఁజాలినచో దైవత్వము సిద్ధించినట్లే యని శాంతాదేవి వారికి సేవామహత్త్వమును వివరించి, వారేకాక యింకఁ గొందఱుగూడ నా పని నేర్చుకొనునట్లు చేసెను. తానుగూడ శిక్షణపొంది యవకాశమున్నపుడెల్ల రోగులకు సేవచేయుచుండెను. ఆసుపత్రి మానవసేవకుఁ గేంద్రమయ్యెను. పేదల కుచితముగఁ జికిత్సచేయుచున్నను, అనుకొన్నంతకంటె నెక్కువగనే యాసుపత్రి కాదాయము వచ్చుచుండెను. ఎవ్వరి స్వార్థమును బూరింపని యా వైద్యశాల కే ధనికుఁడు విరాళ మొసఁగుటకు వెనుదీయును? అదియునుగాక వేములపల్లిలో డబ్బునెడల నెవ్వరికి లక్ష్యములేదయ్యె! డబ్బు మూటగట్టుకొని యెవరేమి చేయఁగలరు? డాక్టరు మెల్ల మెల్లఁగా నుపకరణములు, శస్త్రసాధనములు, ఆంగ్ల ఆయుర్వేదౌషధములుఁ దెప్పించి నూటికిఁ దొంబది తొమ్మిది రోగము లచ్చటనే కుదిరించుచుండెను. కాన్పులలో నతనికొక ప్రావీణ్యము గుదిరెను. చిరకాల వాంఛితమగు వైద్యసౌకర్యముకూడ నిట్లు చక్కఁగా సిద్ధించెను.

ముక్కంటి రోగములు నయము చేయుటకంటె రోగములు రాకుండుటకే మొదటఁ బ్రయత్నింపఁగడఁగెను. చికిత్సకన్న నిరోధమే మంచిది (Prevention is better than cure) అని యతఁడు ప్రచారము సేయుచుండెను. అన్నపానాదులందు, గృహ సంస్కారములందు నారోగ్య సూత్రముల నెట్లు పాటింపవలయునో సులభమగు మాటలలో నుదాహరణ పూర్వకముగాఁ బ్రజలకు బోధించుచుండెను. ఆరోగ్యవారములు నెలకొల్పెను. భోజనములందుఁ బ్రాచీన భారతీయ

సంస్కృతి ననుసరించి బ్రాహ్మణు లనుష్ఠించు నాచారము లారోగ్య సూత్రములపై నెట్లాధారపడియున్నదియు వివరించి, ప్రజలెల్లరు జాతి మత భేదము లేకుండ నట్టి సదాచారము లవలంబింపవలయునని యుద్బోధించుచుండెను.

రాను రా నతఁడు గ్రామస్థులకుఁ దలలోని నాలుకయయ్యెను. ఆతని సదయాకారము దర్శనమైనంతనే కొన్నిరోగములు నయమగుచుండెను. గ్రామములో నందఱి ప్రాణముల నతఁడు కాపాడుచున్నప్పుడిఁక నందఱు నతని ప్రాణము నెంత కాపాడుదురో చెప్పవలయునా? మందిచ్చి డబ్బడుగుట, డబ్బునకై వైద్యము చేయుట యతఁ డెఱుఁగఁడు. అడిగించుకొని డబ్బిచ్చుట రోగు లెఱుఁగరు! ఆత్మసంతృప్తి యతని పారితోషికము. ఋణముక్తి వారి యాశయము.

---

•

# XVIII

## విహగావలోకనము

పాఠకుఁడా! నేఁడు వేములపల్లిలో గుంటూరు క్రైస్తవ కళాశాల విద్యార్థులు కొందఱు, వేములపల్లి మాధ్యమిక పాఠశాలలోని యుపాధ్యాయులనుగలిసి రాజశేఖరు నింటి కేఁగుచు పోవుచున్నారు. మనము గూడ వారితోఁ బోయి వారేమి చేయుదురో చూచెదము రమ్ము! అదుగో, రాజశేఖరరావు. ఏవో ఖాతాపుస్తకములు తిరుగవేయుచున్నాఁడు. ప్రక్కనే కాగితములు పట్టుకొని సహకార సంఘపు మేనేజరు గాఁబోలు కూర్చుండి యున్నాఁడు. విద్యార్థు లతనితో సంభాషించుచున్నారు వినుము.

ఒకవిద్యార్థి – నమస్తే, మీరేనా రాజశేఖరరావుగారు.

రాజ:– ఔను దయచెయ్యండి.

అని పల్కి యందఱిని జూచి లోపలినుండి చాపలు దెప్పించి వేయుటకుఁ బ్రయత్నము సేయుచుండెను.

విద్యా:– క్షమించండి. చాప లవసరంలేదు. మే మందరం గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాల విద్యార్థులం. జానపద ఆర్థికశాస్త్రం మా అభిమాన విషయం. వేములపల్లిలో నానార్థ సహకార సంఘం నెలకొల్పి గ్రామీణ జీవితంలో పెద్ద పరివర్తన తెచ్చారని విని ప్రత్యక్షంగా ఆ సంఘపు కార్యక్రమం చూచివెళ్ళడానికి బయలుదేరి వచ్చాం. మీ పాఠశాలలో ఉపాధ్యాయులుగూడ మాతోపాటు పరిశీలన చెయ్యాలని కుతూహలంతో వచ్చారు. మీరు శ్రమ అనుకోనక సంఘపు కార్యవిధానం మాకు వివరించి చెపితే చాల కృతజ్ఞులం అవుతాం.

రాజ:– చాల సంతోషం. కాలేజి విద్యార్థులదృష్టి ఇటువంటి కార్యక్రమాలవైపుకు తిరగడం గొప్ప సంగతి! అయితే కార్యాలయానికి వెళదాం పదండి. మేనేజరుగారూ, అన్ని శాఖలూ ఈ వేళకు కార్యకలాపం ప్రారంభించి ఉండునా?

మేనే:- ఎనిమిదిన్నర అయింది. అన్నిశాఖాలూ పనిచేస్తూ వుండాలి.
రాజ:- సరే, పదండి వెళదాం.

అందఱు బయలుదేరి సంఘ కార్యాలయమునకుఁ బోవుచున్నారు. పాఠకుఁడా, మనముఁ బోవుదము. ఇదిగో! ఇదే కార్యాలయము ఈ గది మేనేజరుగారి ఆఫీసు. ప్రక్కన డైరెక్టర్లు కూర్చుండి సభచేయుగది. ఈ ప్రక్కనున్న పొడుగైన హాలును తొమ్మిది భాగములుగా విభజించి తొమ్మండుగురు గుమాస్తాలకు వసతి యేర్పఱచినారు. రాజశేఖరరావు ఏదో, చెప్పుచున్నాఁడు, విందము.

రాజ:- మిత్రులారా, సహకార తత్వాన్నిగూర్చి మీకు నేను చెప్పబోవడంలేదు. తత్వాలనుగూర్చి, సూత్రాలనుగూర్చి నాకంటె మీకే బాగా తెలుసుననుకుంటాను. పుస్తకాలలో మీరు చదువుకునే ఉంటారు. నేను కాలేజిలో ఇంటరు వఱకు చదివినప్పటికీ ఆర్థికశాస్త్రం చదివినవాఁడను గాను. నా అభిమాన విషయాలు గణిత భౌతిక రసాయన శాస్త్రాలు కాబట్టి నేను సిద్ధాంతాలమీద ఆధారపడి సిద్ధాంత పరిభాషలో ఏమీ చెప్పలేను. అనుభవంవల్ల నేనూ నా మిత్రులూ కలిసి ఈ గ్రామంలో చేసిన సహకార ప్రయత్నాల ఫలితాలను మాత్రం మీకు చెప్పగలను.

విద్యా:- మాకు కావలసిందీ అదేనండీ!

రాజ:- మంచిది, ఈ గ్రామంలో మొన్న మొన్నటివరకూ పార్టీలుండేవి. గ్రామస్థులు విద్యావిహీనులై తమబాగు తాము ఆలోచించుకొనే పరిస్థితిలో లేరు. కష్టపడి మొదట పార్టీలు కలిపి మెల్లగా గ్రామపంచాయతీబోర్డు నెలకొల్పి రోడ్లు, లాంతర్లు, గ్రంథాలయం, పఠనమందిరం, రేడియో మొదలైనపౌరసౌకర్యాలు గలిగించాం. ప్రజలలో పౌరత్వ జ్ఞానం రేకెత్తించాం. కాని అంతకంటె ముఖ్యంగా కావలసింది ఆర్థిక సౌకర్యం. రైతును, శ్రామికుని సహకార మార్గాలలో ఉద్ధరించాలని ఆలోచించాం. కేవలం వారి ఆర్థిక పరిస్థితిని బాగుపఱచినంతమాత్రాన శాంతి సౌఖ్యాలు ఏర్పడతాయని మాకు నమ్మకం తోచలేదు. గ్రామానికి

రాజకీయంగాకంటె ఆర్థికంగా స్వయంపోషక స్వయంపాలక సామర్థ్యం కలిగిస్తేతప్ప ముక్తిలేదనుకొన్నాం. అందుకు గ్రామానికి కావాలసిన ధాన్యాదులూ, తదితర జీవితావసరాలూ గ్రామంలోనే ఉత్పత్తి కావాలి. గ్రామానికి ఉపయోగించగా మిగిలిన ఉత్పత్తినే పరాయి గ్రామాలకు, పట్నాలకు పంపి అక్కడనుండి తప్పని సరిగా దిగుమతి కావాలసిన సరుకు తెచ్చుకోవాలి. గ్రామస్థులందరూ తమ జీవితావసరాలను తగ్గించుకోవాలి. నిరాడంబరమైన సౌమ్య, సాత్విక జీవితానికి అలవాటుపడాలి. తప్పనిసరియైన వస్తువులు మాత్రమే కోరుకోవాలి. స్వార్థపరత, లాభాపేక్ష మానుకోవాలి. అందరూ సోదరభావంతో మెలగాలి. ఇంతెందుకు? ఆధ్యాత్మికంగా కొంత పరిణామం పొందాలి. ఈ పరివర్తనం కలిగించడానికి ప్రస్తుతం గ్రామాలలోఉండే ఏకార్థ సహకార సంఘం (ఉదాహరణకు అప్పులిచ్చే పరపతిసంఘం) చాలదు. దానికి బదులు గ్రామస్థులకు అన్ని ఆర్థికావసరాలను తీర్చే నానార్థ సహకార సంఘం కావాలి. ఇదొక ఆర్థిక విధానం. దీనికి అందరూ కట్టుబడితే డబ్బు చలామణీ, డబ్బు ప్రభావమూ తగ్గిపోయి వస్తువు చలామణిలోనే జీవితం జరుగుతుంది. ఇదే సంఘంయొక్క చరమలక్ష్యం. దీనిని మేం చాలవరకు సాధించాం. సంఘ వ్యవస్థాపన సంఘ నిర్మాణం వగైరా వివరాలు మీకు తెలిసేవున్నవి కాబట్టి యిక దీనియొక్క నానాశాఖలను గూర్చి మాత్రం మీకు వివరిస్తాను. ఒక్కొక్క శాఖ ఒక్కొక్క డైరెక్టరు క్రింద పని చేస్తుంది. ప్రతి డైరెక్టరుకు ముగ్గురు మెంబర్ల ఉపసమితి ఒకటి సహాయం చేస్తుంది.

ఇది ప్రచారశాఖ.

సహకార సూత్రాలు మితవ్యయం, స్వయం సహాయం, సర్వ మానవ సౌభ్రాతృత్వం మొదలైనవానిని గూర్చి ప్రచారం చేస్తుంది. తక్కిన శాఖల పనినంతటినీ సమన్వయ పరచే ఉద్దేశ్యంతో పర్యవేక్షణ చేస్తుంది. మెంబర్లకు పొదుపునేర్పి వారు మిగుల్చుకొన్న డబ్బంతా

సేవింగ్సు డిపాజిట్టుల రూపంలో రాబట్టి దాచిపెడుతుంది. ఉత్తమ జీవనమార్గాలు నేర్పుతుంది. వివాహాది శుభకార్యాలకు, దినాలు, తద్దినాలు మొదలైన అశుభకార్యాలకు అనవసరంగా డబ్బు కర్చు గాకుండా వీలైనంత చౌకగా ఆ కార్యాలు జరిగే మార్గాలు చూపుతుంది. శుభాశుభ కార్యాల కర్చుకు ఒక పరిమితి నేర్పఱచి ఆ పరిమితి మించకుండా అజమాయిషీ చేస్తుంది. కట్నాలు కానుకలు అనాచారంగా తేల్చి వాటిని బహిష్కరించాలని నియమాలు ఏర్పఱచింది. ఈ వ్యయపరిమితికీ, నియమాలకు బద్ధులయి ఉండదలచిన వారిచేత ఒప్పుకోలు, ప్రమాణ పత్రాలు వ్రాయించుకొన్నది. వాటికి భిన్నంగా ప్రవర్తిస్తే ఆ పత్రాలలో వ్రాసివున్న ప్రకారం జరిమానాలు వేస్తుంది. సంఘబహిష్కారంకూడా చేస్తుంది. అర్థంలేని ఆచారాలు, అనాచారాలు, దురాచారాలు రూపుమాపడానికి ఈ శాఖ ప్రయత్నిస్తున్నది. ప్రస్తుతం ఈ శాఖ నా చేతిలో ఉన్నది. నేనే ప్రెసిడెంటును కావడం చేత డబ్బుకు దస్తావేజులకు నేనే జబాబుదారిని. మొత్తంమీద కార్యక్రమం ఏదీ నాకు తెలియకుండా జరగదు.

ఇది ఋణశాఖ.

సంఘానికి కావలసిన ద్రవ్యవసతి చేకూర్చుతుంది. కొంతకాలం జిల్లా కో-ఆపరేటివ్ సెంట్రలు బ్యాంకినుండి అప్పు తెచ్చింది కాని గ్రామంలో ధనికులందరూ డిపాజిట్లు ఇవ్వడం మొదలుపెట్టిన తర్వాత—అది మా ప్రచారం వల్లనే జరిగింది – బ్యాంకి ఋణం తీర్చివేసి కేవలం గ్రామాలలోని డిపాజిట్లమీదనే వ్యవహారం నడుపుతున్నది. గ్రామంలో వృథాగా పడివున్న డబ్బును గాలించి డిపాజిట్ల రూపంగా రాబట్టుకొంటుంది. నూటికి సాలుకు రు 3/– లు ప్రకారం వడ్డీ యిస్తుంది.

అట్లా రాబట్టుకొన్న డబ్బును మెంబర్లకు ఋణాలుగా సర్దుతుంది. నూటికి సాలుకు రు 4½/– లు ప్రకారం వడ్డీ వసూలుచేస్తుంది.

రైతుకు సంవత్సరం పొడుగునా ఏయే కాలంలో ఎంతెంత అప్పు కావలెన్నో ముందుగా జాగ్రతగా అంచనావేసి ఆయా కాలానికి అంతంత ద్రవ్యవసతి యేర్పరచడమే ఈ శాఖ చేసే ముఖ్యమైన పని.

రైతు కోరగానే అప్పు ఇస్తుంది. అందుకుగాను ఒకేసారి మెంబరుచేత పత్రం వ్రాయించుకొంటుంది. మెంబరు తన ఆస్తిని సంఘానికి తాకట్టు పెట్టి ఆ తాకట్టుమీద ఒక పరిమితికి మించకుండా తనకు అప్పు లిచ్చే యేర్పాటుతో ఈ పత్రం వ్రాసి యిస్తాడు. ఇందువల్ల అప్పు తీసుకొన్నప్పుడల్లా అతను పత్రం వ్రాసి యివ్వనవసరంలేదు.

ఆస్తిలేక కాయకష్టంమీద, పరిశ్రమలమీద ఆధారపడే వారికి మనిషి జామీనుమీద అప్పులిస్తుంది.

ఈ ఋణశాఖయొక్క ముఖ్యమైన పూచీ యిది:- రైతును ఋణం కోసం ఇంకొకరిదగ్గరకు పోనివ్వకుండా చూడడం; తన దగ్గరైనా అతను అనవసరంగా ఋణం తీసుకోకుండా నిరోధించడం; తీసుకున్న ఋణం దుర్వినియోగం చెయ్యకుండా చెప్పిన పనికే వినియోగించే మాదిరి పర్యవేక్షణ చెయ్యడం. సాధ్యమైనంతవరకూ అప్పులు నగదు రూపంగా ఇవ్వక ఎరువుల రూపంగానో, విత్తనాల రూపంగానో, సర్కారుకు చెల్లించే శిస్తురూపంగానో, మెంబరుకు సప్లయిచేసిన సరుకుల రూపంగానో, పరిశ్రమకు కావలసిన ముడిసరుకు రూపంగానో బట్వాడా చేస్తుంది. తప్పనిసరి అయితే తప్ప మెంబరుచేతికి నగదు ఇవ్వదు.

ఇది వ్యయశాఖ.

అదుగో ఆ ముసలాయన దేనికో వచ్చాడు. ముందు ఆయనను పంపించి తర్వాత మాట్లాడదాం.

ఏం బాబూ, వచ్చావు?

ముస:- మొన్న చెప్పుకొన్నాగా బాబూ! నా కున్న మూడెకరాలూ ఆరుచోట్ల ఉన్నది. అదీ ఆరు పీలికలు. ఒక్కచోటా నాగలి తిరగదు. ఒక ముక్కకు ఒక ముక్క అందుబాటులోనూ లేదు. ఈ ముక్కలు సాగుచెయ్యడమంటే ప్రాణంమీదకు వస్తున్నది.

రాజ:- మరి, పొరుగు రైతులకు ఆ ముక్కలు పోకడపెట్టి యింకొక చోట ఒకే బిళ్ళగా మూడెకరాలు ఏర్పాటుచేసుకోమంటే సరే నని ఒప్పుకొంటివిగా!

ముస:- అందరూ ఒప్పుకొన్నారు. రామినేని బుల్లెయ్యకే రెండు చోట్ల ఎకరం ముప్పాతిక కలుస్తుంది. కాని ధర పడనివ్వడంలేదు బాబూ! తక్కినవాళ్ళు ఫరవాలేదుగాని యితనే మొండికి తిరిగాడు.

రాజ:- సాయంకాలం బుల్లెయ్యగారితో నేను మాట్లాడి పైసలు చేస్తాను. ఎట్లయితేనేం, నీకు ఇంకొకచోట మూడెకరాలు పొలం ఏర్పాటైతే చాలు - ఎవరెంత ధరైనా యివ్వనీ, ఎంతైనా కలుపుకోనీ, అంతేనా ?

ముస:- అంతేగా బాబూ! పదో పాతికో చేతిది పడ్డా ఫరవాలేదు. ఒక్కచోట వ్యవసాయం చేసుకొనే యేర్పాటే జరిగితే తల చిక్కు తీసినట్లుంటుంది. ఈ పీలికలతో నే నిక తంటాలుపడలేను.

రాజ:- నీవు వెళ్ళు బాబూ, రేపు ఉదయం కనబడు మళ్ళీ.

వ్యవసాయ శాఖ చేసే ముఖ్యకార్యాలలో ఈ క్షేత్ర ఖండ సంకలనం ఒకటి. ఇటువంటి సంకలనాలు చాలాచేశాం. రెండువందల పదిముక్కలను అరవైమూడు ఏక ఖండాలుగా మార్చాం ఇప్పటికి. అందువల్ల వ్యవసాయం మునుపటికన్నా బాగా సాగివస్తున్నది. ధాన్యోత్పత్తి యెక్కువైనది కూడా! ఇంకా సంకలనం చెయ్యవలసిన ముక్కలు చాలా ఉన్నవి. ఈ యేడు వాటిని గూడా మార్చగలం.

కాని యెంత సంకలనం చేసినా పెద్దయెత్తున వ్యవసాయం చెయ్యడానికి చాలినంతగా క్షేత్రఖండాలు ఏర్పాటు కావడంలేదు. అంటే సగటున ఒక్కొక్క రైతుకు ఉండే క్షేత్రవైశాల్యం తక్కువన్న మాట. నాలుగైదు ఎకరాలకు మించని ముక్కలే యెక్కువగా కనిపిస్తున్నవి. చిన్నచిన్న క్షేత్రఖండాలుగల రైతులు సొంతంగా ఎద్దులూ బళ్ళూపెట్టుకొని తక్కినఉపకరణాలు ఏర్పరచుకొని సొంతవ్యవసాయం చేస్తే ఆదాయం గిట్టుబాటు కాదు. అట్లా వ్యవసాయం చేసే రైతు అటు చావకుండా, ఇటు బ్రతకకుండా నాసిరిల్లుతూ కాలక్షేపం చేస్తుంటాడు. ఇంకొకపని చేసుకోడానికికూడా వీలుచిక్కక ఎప్పుడూ ఆ పొలానికే కట్టుబడివుంటాడు. అందువల్ల నలుగురైదుగురు రైతులను ఒక్కొక్క సమూహంగా ఏర్పాటుచేసి వారి తాలూకు పొలాలన్నీ

కలిపితే 20, 25 యెకరాలకు తక్కువకాకుండా ఉంటవికాబట్టి వాటిని నలుగురైదుగురు రైతులు కలిసి ఉమ్మడిగా సేద్యం చేయండని సలహా యిచ్చాం. ఈ పద్ధతి కలిసివచ్చింది. వీరందరూ కలిసి ఒకటో రెండో యెద్దుల జతలను కొంటారు. అందుకు తగిన వ్యవసాయోపకరణాలు ఏర్పాటుచేసుకొంటారు. కావలసిన యెరువులు, విత్తనాలు కొంటారు. ఇందుకు గావలసిన డబ్బు సంఘంనుండి సమష్టిగా అప్పు తీసుకొంటారు. అందరూ కలిసి వ్యవసాయం చేస్తారు. వారివారి భూముల దామాషాను బట్టి ఫలసాయం పంచుకొంటారు. కాయకష్టానికి ముందుగానే కూలి పుచ్చుకుంటారు. సమష్టి ఆదాయంనుంచే ఋణంకూడా తీర్చుకొంటారు. చాలమంది రైతు లీ పద్ధతి వీలుగా ఉన్నదని అవలంబించారు. పని కలిసిరావడంవల్ల రైతులు తీరికసమయంలో ఉపవృత్తులుచేసుకొంటూ తమ ఆర్థికస్థితిని బాగుపరచుకొంటున్నారు.

ఈ శాఖ చేసేపనిలో ముఖ్యమైన దింకొకటి. గ్రామంలో భూమిలేనివారు చాలమంది వున్నారు. రైతుజాతులలోనూ ఉన్నారు; హరిజనులు మొదలైన వ్యావసాయక శ్రామికులలోనూ ఉన్నారు. వీరు మామూలుగా పెద్దరైతుల, భూస్వాముల పొలాలమీద పాలి కాపులుగానో, జీతగాళ్ళుగానో శ్రమపడుతుంటారు. భూస్వాములకూ వీరికీ రానురాను స్పర్థ పెరిగిపోయింది. వారిచ్చేది వీరికి చాలదు. వీ రడిగేవి వా రివ్వరు. అందువల్ల అంతులేని స్పర్థ, పరస్పర ద్వేషం, పర్యవసానంగా ధాన్యోత్పత్తి తగ్గడం సంభవిస్తున్నది. అందుకు మే మొక ఉపాయం ఆలోచించాం. పెద్ద భూస్వాముల తాలూకు పొలాలను అనగా 25 ఎకరాలు మించినవాటిని సంఘమే గుత్తకు తీసికొన్నది. అట్లా గుత్తకు తీసికొన్న పొలాలను 25 ఎకరాల ఖండాలుగా విభజించి ఒక్కొక్క ఖండాన్ని అయిదుగురు కలిసి యేర్పడ్డ సమూహానికి తిరిగి గుత్తకు ఇచ్చింది. ఈ సమూహాలలోని రైతులు పైన చెప్పిన ప్రకారం ఉమ్మడిసాగు చేసుకొంటారు. వారికికూడా సంఘం సమష్టి ఋణాలిస్తుంది. భూస్వామికి, వాస్తవంగా శ్రమపడే రైతుకు మధ్య సంఘం నిలబడ్డది కాబట్టి స్పర్థకు అవకాశంలేకుండా పోయింది. ఉభయులకు ఒక విధమైన

ధైర్యం, స్థైర్యం యేర్పడ్డది. పెద్ద యెత్తున ఉమ్మడిసాగు చేయడంవల్ల ధాన్యోత్పత్తి ఎక్కువైనది. ఏయే పొలాలలో ఏయే ధాన్యం పండించాలో సంఘమే నిర్ణయిస్తుంది. గ్రామంలో అవసరాలనుబట్టి, దేశంలో గిరాకీనిబట్టి ఈ ధాన్యనిర్ణయం చేస్తుంది సంఘం.

ఈ వ్యవసాయశాఖే మార్కెటింగు పనికూడా చూస్తుంది. రైతుకు కావలసిన ధాన్యంమాత్రం రైతు కిచ్చి తక్కినధాన్యం తానే తీసుకొంటుంది. గ్రామంలో వ్యవసాయేతరులకు ఎంత ధాన్యంకావాలో అంచనావేసి అంతమాత్రం తానుంచుకొని తక్కిన ధాన్యం మంచి ధరలు రాబట్టుకొని టోకుగా అమ్ముతుంది. గుంటూరులో మార్కెటింగు సొసైటీద్వారాగాని సొంతంగాగాని ఈ పని చేస్తుంది. అమ్మగా వచ్చిన డబ్బు ఆ యా రైతుల ఖాతాకు జమకట్టుతుంది. తనకు రావలసిన బాకీ వుంటే మినహాయించుకొంటుంది. గ్రామంలో వినియోగించడానికి తానే ఉంచుకొన్న ధాన్యానికికూడా ధర కట్టి ఆ యా రైతులకు జమ కట్టుతుంది. ఆ ధాన్యం వస్తుభాండార శాఖకు అప్పగిస్తుంది. అవసరమైన గ్రామస్థులకు ఆ శాఖ ధాన్యం అమ్ముతుంది.

ఇది ధాన్యోత్పత్తి శాఖ.

దీనిని వ్యవసాయ శాఖతోనే కలపవచ్చుగాని యిటీవల- మన దేశంలో విపరీతంగా యేర్పడ్డ ధాన్యపు కరువునుబట్టి ధాన్యోత్పత్తిని ప్రత్యేకంగా అభివృద్ధి చేయవలసిన అవసరం కలిగింది కాబట్టి దీనికి వేరే శాఖ ఏర్పరిచాం. రైతుల కందరికీ కావలసిన ఎరువులు, విత్తనాలు వ్యవసాయోపకరణాలు భారీయెత్తున వీలైనంత చౌకగా సేకరించి రైతులకు సరఫరా చేస్తుంది. ప్రభుత్వాధికారులతో ఉత్తరప్రత్యుత్తరాలుజరిపి రైతులఅవసరాలు సేకరించడంలో చాలా శ్రమపడుతుంది.

క్రొత్త క్రొత్త విత్తనాలు, ఉత్పత్తి నెక్కువచేసే విత్తనాలూ వ్యవసాయ డిపార్టుమెంటువారి సలహాలతో తెప్పించి సరఫరా చేస్తుంది. కృషి సంబంధమైన విజ్ఞానం, ప్రాచీనం, నవీనంకూడా, రైతులకు అందచేసి కృషి అత్యంత ఫలప్రదమయ్యే మార్గాలు చూస్తుంది.

పోరంబోకుభూమి నాలుగెకరాలు ప్రభుత్వమువారి అనుమతితో డిమాన్‌స్ట్రేషను ప్లాటుగా ఉపయోగించుకొని అభినవ వ్యవసాయ పద్ధతులు రైతులకు చూపిస్తున్నది.

పశు సంరక్షణకు ప్రత్యేక శ్రద్ధ పుచ్చుకొంటున్నది. వెటరినరీ డిపార్టుమెంటు వారి సలహాలతో పశువులకు వైద్యం యేర్పాటు చేస్తున్నది. ఎద్దుజాతిని బాగుపరచడానికి మేలిరకము ఆబోతు (విత్తనపు టెద్దు) లను సంఘం తరఫున కొని ఆవులను దాటిస్తున్నది. అందువల్ల మంచి దూడలు దిగుతున్నవి. సింధి ఆవులను, ఢిల్లీ గేదెలను గూడా దిగుమతిచేసి నాటుపశువులతో అంటుచేసి క్షీరోత్పత్తి అభివృద్ధిచేస్తున్నది.

జలాధారాలు మరామత్తు చెయ్యడం కూడా ఈ శాఖ పనే. ప్రభుత్వంవారి అనుమతితో పాడుబడ్డ చెరువు నొకదాన్ని మళ్లీ త్రవ్వించి బాగుచేసి దాని క్రింద మాగాణి పంటల కేర్పాటు చేసింది. వాగునీటిని చెరువుకు మళ్ళించే ఏర్పాటొకటి ప్రస్తుతం ఆలోచిస్తున్నది.

విద్యార్థి:- ఇంతవరకు బాగానే ఉన్నది. కాని యంత్రసాధనంతోనూ, విద్యుచ్ఛక్తి సహాయంతోనూ సాగుచేయించి ధాన్యోత్పత్తి చేయడానికి మీ రెందుకు అలోచించలేదు ?

రాజ:- ఆ విషయంలో మాకు ఒక అభిప్రాయం ఉన్నది. జనబలం తక్కువ గావున అమెరికాలాంటి దేశాల్లో యాంత్రిక వ్యవసాయం అవసరంగాని జనబలం మితిమీరి నిర్వ్యాపారం ఒక దురవస్థగా ఏర్పడ్డ మన దేశంలో దేనికి ? నూరుమందితో జరిగేపని ఒక యంత్రం ఒక్కటే చేయగల్గుతుం దనుకోండి. ఆ నూరుమందిని యేం చెయ్యాలి ? పైగా యంత్రసహాయంవల్ల ఉత్పత్తి యేమంత యెక్కువౌతుంది ? పని సులభంగానూ, త్వరగానూ అయితే కావచ్చు. మనకిప్పుడు కావలసినది అధికాహారోత్పత్తికాని సులభోత్పత్తి కాదుగదా ! ప్రస్తుతం నాగటి వశంకాని బంజరుభూములను అడవులను వ్యవసాయానుకూలం చేయడానికి మాత్రమే యంత్రం ఉపయోగించాలి కాని తక్కిన మామూలు క్షేత్రాలకు కాదు.

విద్యార్థి:- సరే, కానివ్వండి; తర్వాత శాఖ ?

రాజ:- తర్వాత శాఖ ఉత్పత్తి శాఖ.

చాల ముఖ్యమైనది. రైతుకు, శ్రామికునకు, ఆదాయం వృద్ధి చేసేది యిదే. కుటీరపరిశ్రమలకు కావలసిన ద్రవ్యవసతి చేకూర్చి ముడిసరుకులు సేకరించి తయారైన వస్తువులను చాలవరకు గ్రామంలోనే వినియోగపరచి మిగిలిన వాటిని బయటి మార్కెటులో అమ్ముస్తుంది. దీని కొక పెద్ద నియమం ఉన్నది. యంత్రపరిశ్రమవల్ల పోటీ రాగల యే వస్తువునూ ఇది తయారుచేయించదు. ఉదాహరణకు కాగితం చూడండి. చెత్తా, చెదారం, పాతగుడ్డలు దీనికి ముడిసరుకు. ఇది గ్రామంలో సులభంగా దొరుకుతుంది. కాని చేతి పరిశ్రమవల్ల తయారయ్యే కాగితం యంత్రంవల్ల తయారయ్యే కాగితంమాదిరి సన్నగా నున్నగా తయారుకాదు. ధరచూడగా దానికంటె చాల యెక్కువ! అందువల్ల మార్కెటులో పోటీకి నిలువలేదు. కేవలం జాతీయతను, కుటీర పరిశ్రమాభిమానాన్ని ముందుపెట్టుకొని దీన్ని ప్రజలకు అంటగట్టాలంటె సాధ్యంకాదు. ధర్మంకూడా కాదు. కాబట్టి అటువంటి పరిశ్రమలను సంఘం పోత్సహించదు. గ్రామీణులు సులభంగా చెయ్యగలిగి, దేశంలో గిరాకీగలవస్తువులనే తయారుచేయిస్తుంది. రాట్నపరిశ్రమ, మధూత్పత్తి, తాటిచాప, నులక, నవ్వారు, వెన్న, నేయి, కూరగాయలు, కోడిగుడ్డు, తాటిబెల్లం మొదలైన పరిశ్రమలనే ప్రస్తుతం చేయిస్తున్నది. ఎవరికి వీలైనపరిశ్రమ వారు చేస్తున్నారు. సంఘం ముడిసరుకుకొని సరఫరా చేస్తుంది. పాడిపశువులను, కోడిపెట్టలను, వాటి పోషణకు కావలసిన వస్తువులను తేనె యంత్రాలను కొని సప్లయిచేస్తుంది. తయారైన వస్తుద్రవ్యాలను మంచి ధరకు అమ్మిపెటుతుంది.

మద్యపాన నిషేధ బాధితులకు బెల్లపు పరిశ్రమ చాల ఉపయోగించింది. కొందరికి గుత్తభూము లిప్పించి వ్యవసాయం చేయిస్తున్నది. కూరగాయల మళ్ళు పెట్టించి కొందరికి సహాయం చేస్తున్నది.

ఇక్కడ తయారయ్యే వడుకునూలు ఇక్కడే మగ్గాలకిచ్చి గుడ్డ నేయిస్తున్నది. కోడిగుడ్లు, తేనె, నెయ్యి, వెన్న గుంటూరులో అమ్మకమౌతున్నవి. కూరగాయలు గుంటూరుకు కొన్ని యెగుమతి

అవుతున్నవి. ఒక్కొక సమయంలో బెజవాడకు కొన్ని, మద్రాసుకు కూడా కొన్ని యెగుమతి అవుతున్నవి. తాటిచాపలు, ముఖ్యంగా బెల్లంకట్టలు కట్టడానికి గోదావరి జిల్లాకు పంపుతున్నాం. ప్యాకింగ్ పనికిగాను ఈతచాపలుకూడా చాలా ప్రదేశాలకు సప్లయిచేస్తున్నాం. తాటిబెల్లం విషయం డిప్యూటి రిజస్ట్రారువారితోను స్పెషల్ డెవలెప్‌మెంటు ఆఫీసరుగారితోను సంప్రదిస్తున్నాం.

ఇది హరిజనశాఖ.

ఇదీ, ఉపవృత్తి శాఖ, వ్యవసాయ శాఖ అన్యోన్య సంప్రతింపులతో పనిచేస్తుంటాయి. హరిజనులకు కౌలుభూములు సేకరించి ఉమ్మడి సాగు చేయించడం, వారు పండించే కూరగాయలు మార్కెటు చేయించడం, వారికి ఉపవృత్తులు కల్పించడం, చిన్నచిన్న అప్పు లిచ్చి వసూలు చెయ్యడం ఈ శాఖ పని. వీరు చేసే తోళ్ళ పరిశ్రమకు కూడా ద్రవ్యవసతి చేకూర్చి తయారైన పాదరక్షలు, బెల్టులు, సంచులు మొదలైనవాటిని గుంటూరులో హోల్‌సేల్ కోఆపరేటివ్ స్టోర్సు సహాయంతో అమ్మిపెటుతున్నది.

ఇది వస్త్రోత్పత్తి శాఖ.

ఈ గ్రామంలో నేత నేసే పద్మశాలీలు ఇరవైఅయిదు మంది ఉన్నారు. పన్నెండు మగ్గాలకు గ్రామంలో తయారయ్యే వడుకునూలే సప్లయి చేస్తున్నది. తక్కిన మగ్గాలకు మరనూలు తెప్పించి యిస్తున్నది. తయారయ్యే గుడ్డ తానే తీసుకొని చాలవరకు గ్రామస్థులకే వినియోగిస్తున్నది. కొంతగుడ్డ గుంటూరు కోఆపరేటివ్ హోల్‌సేల్‌స్టోర్సు ద్వారా అమ్మిస్తున్నది.

ఇది పరిశ్రమ శాఖ.

ఉపవృత్తిశాఖతో దీనిని కలుపవచ్చుగాని ఆ పరిశ్రమలకు ఈ పరిశ్రమలకు కొంత భేదం ఉండడంచేత వేరేశాఖ పెట్టవలసివచ్చింది. అవి కేవలం ఉపవృత్తులు, సహాయవృత్తులు. పనిరోజులలో మాత్రమే అవి జరుగుతుంటాయి. ఈ వృత్తులు ప్రధాన వృత్తులు. ఆనువంశికంగా కొందరు ఈ వృత్తులమీాద ఆధారపడి జీవితం చేసేవారున్నారు?

వడ్రం, కమ్మరం, కంచరం, బంగారు, వెండిపని, తాపీపని, కుమ్మరిపని ఈ వృత్తులలో చేరినవి. ఈ పనులు చేసేవారివల్లనే శిల్పాలు అభివృద్ధి అయి జాతీయ జీవిత వృక్షానికి కుసుమప్రాయాలుగా ప్రకాశిస్తాయి. గ్రామ సమాజ జీవితానికి ఇవి జీవగఱ్ఱలు. వ్యవసాయ కృషికి వడ్రం, కమ్మరం ఆధారభూతాలు. గృహనిర్మాణానికి వడ్రం, తాపీపని ఉండి తీరాలి. కంచరం లేనిది వంటపాత్రలు, పానపాత్రలు, కాగులు, బిందెలు తయారుగావు. కుండలు, పిడతలు, మూకుళ్ళు వగైరాలు కుమ్మరిపనివల్ల తయారౌతాయి. పేదలకివే పాత్రలుగాబట్టి గ్రామంలో కుమ్మరిపని చాల ముఖ్యమైనది. కాబట్టి సమాజ సౌఖ్యానికి ఈ వృత్తులు అత్యవసరాలై ప్రాచీన కాలంనుండీ చాల గౌరవింపబడు తున్నాయి. ప్రస్తుతం మేము అవలంబించిన ఆర్థిక విధానంలోకూడా వీటికి ప్రముఖస్థానం కల్పించి వీటికొరకు ప్రత్యేకశాఖ నెలకొల్పాము. ఈ పరిశ్రమలకు కావలసిన ద్రవ్యవసతి, ముడిసరుకులు ఈ శాఖ చేకూర్చుతుంది. గ్రామంలో కావలసిన వ్యవసాయోపకరణాలు, పాత్రసామగ్రి తయారుచేయిస్తుంది. గృహనిర్మాణం, మరామత్తులు చేయిస్తుంది. పనివారు పనిచెయ్యడంవరకే. తక్కిన వ్యవహారమంతా, అనగా మజూరి వగైరాలు సంఘమే చూచుకొంటుంది. ఎవరిశ్రమకు తగిన మజూరి వారికి గిట్టించి వారివారి ఖాతాలకు జమకట్టుతుంది. పనిచేయించుకొన్నవారి ఖాతాలకు ఖర్చువ్రాస్తుంది.

ఇది వస్తుభాండారశాఖ.

చాల ముఖ్యమైనది. గ్రామంలో ఉత్పత్తి అయి గ్రామస్థులకు కావలసియుండే ధాన్యంగాని, వస్తువులుగాని తాను తీసుకొని నిలువ చేస్తుంది. బయటినుండి తెప్పించవలసిన యితర జీవితావసరాలను గూడ తరుణంలో పెద్దయెత్తున తెప్పించి వుంచుతుంది. మెంబరులైన గ్రామస్థులకు వారివారి అవసరాలనుబట్టి సప్లయి చేస్తుంది. ఇందుకు గాను మంచి గిడ్డంగులు - నిప్పుకు, నీటికి, ఎలుకలకు వగైరాలకు అలవిగానివాటిని యేర్పాటు చేసుకొన్నది. మెంబర్ల చేతులలో నగదు మెదలదు కాబట్టి ప్రతి మెంబరుకు ఖాతాలుపెట్టి అప్పుగానే సరుకు

సప్లయి చేస్తుంది. ఏ యే మెంబరుకు ఎంతెంత డబ్బు జమపడి వున్నదో, ఎంతెంతవరకు అప్పు ఇవ్వవచ్చునో తెలుసుకోడానికి ప్రతిశాఖతోనూ సంబంధం ఉంటుంది. ప్రతిమెంబరుకూ ఒక పాసుపుస్తకం ఏర్పాటు చేసి యిచ్చింది. ప్రతిశాఖ, ఆ పాసుపుస్తకంలో, ఆ మెంబరుతాలూకు జమ, ఖర్చులు, ఋణాధికారం, ఏ రోజు దా రోజు వ్రాస్తుంది. ఆ పాసుపుస్తకాన్నిబట్టి ఈ శాఖ అరువుగా సరుకులిచ్చి తానుగూడ పుస్తకంలో ఖర్చువ్రాసి ఋణాధికారం తేల్చి యిస్తూవుంటుంది.

సంఘపు మేనేజరు అన్నిశాఖల ఆవర్జాలనుబట్టి మరునాటికి ప్రతి మెంబరుయొక్క లావాదేవీలు, జమలు, ఖర్చులు, నిలువలు, కొదవలు చూపించే పెద్ద ఆవర్జా తయారుచేయిస్తుంటాడు. ఈ ఆవర్జా సంఘానికి జీవగఱ్ఱ.

సంఘంలో పెట్టిన లెక్కపుస్తకాలు ఇంకా దైనిక వ్యవహార వివరాలూ చాల చెప్పవలసి ఉన్నవిగాని అవి మీరు తెలుసుకోనక పోయినా ఇబ్బంది లేదు.

విద్యార్థి:- ఆ మాట నిజమేకాని మాకు కొన్ని సందేహాలున్నాయి. గ్రామంలో ఉన్న కుటుంబాలన్నీ సంఘంలో మెంబర్లుగా జేరితే తప్ప ఈ సర్వంకష విధానం సాగదు. సహకార సూత్రాలప్రకారం సంఘంలో ఎవ్వరినీ బలవంతంచేసి చేర్చకూడదు. సహకారం అంటే నిగ్గుతేరిన ప్రజాస్వామికం. ప్రజాస్వామికంలో బలవంతం చెయ్యడం గిట్టదు. స్వేచ్ఛగా చేరేవారినే చేర్చుకోవాలి. అట్లా స్వేచ్ఛగా ఎంతమంది చేరారు ? చేరనివారి విషయం ఏంచేశారు?

రాజ – మా గ్రామంలో 712 కుటుంబాలున్నాయి. ఇప్పటికి 698 కుటుంబాలు (యజమానులు) చేరాయి. తక్కినవారుకూడా కొద్ది రోజులలో చేర్తారు. ఇంతమందీ స్వేచ్ఛగానే చేరారు. అందుకు మా నిరంతర ప్రచారమే కారణం. కొన్ని మాసాలపాటు మేం అదేపనిగా ప్రచారంచేసి ఈ విధానంవల్ల గ్రామం ఏ విధంగా బాగుపడేదీ ప్రజలకు నచ్చచెప్పి క్రమంగా అందరినీ ఒప్పించాం. అధిక సంఖ్యాకులు చేరేసరికి తక్కినవారు – వారికీ విధానం

నచ్చకపోయినా – "నలుగురితో పాటు నారాయణా" అనే సూత్రాన్ని బట్టి చేరారు. చేరకపోతే తామొక బహిష్కృత శాఖగా పరిగణింపబడతామేమో అనే భయంతో కొంతమంది చేరి వుండచ్చు; మొత్తంమీద బలవంతంగా ఎవరూ చేరలేదు. కాని ప్రతి గ్రామంలోనూ ఇట్లా జరుగుతుందనడానికి వీలులేదు. కాబట్టి ఈ విధానం ప్రకారం గ్రామాలను ఉద్ధరించాలంటే ప్రతి కుటుంబమూ సంఘంలో చేరితీరాలని ప్రభుత్వం శాసించవలసి వస్తుంది. సహకార సూత్రం, ప్రజాస్వామిక నియమం ఈ శాసనంతో రాజీపడవలసి వస్తుంది. రోగి మందు త్రాగనప్పుడు బలవంతంగా త్రాగించినట్లే అజ్ఞానం వల్లనో, స్వార్థపరతవల్లనో సంఘంలో చేరనప్పుడు శాసన మూలకంగా బలవంతంచేసినా తప్పులేదని నా అభిప్రాయం.

విద్యార్థి:– బలవంతం చెయ్యడం కమ్యూనిస్టుల పద్ధతి. ప్రభుత్వం ఒప్పుకోదు.

రాజు:– ఒప్పుకోనప్పుడు ప్రచారమే శరణ్యం. కొంత కాలహరణం అవుతుందన్న భయమేకాని ప్రచారంవల్లనే ఈ పరివర్తన తేవచ్చునని నాకు ధైర్యం ఉన్నది.

ఈ నానార్థ సంఘ విధానం, తద్వారా గ్రామ స్వయంపోషక విధానం దేశంలో వ్యాపించడానికి భూముల విషయంలోనూ, వ్యవసాయ విషయంలోనూ, మార్కెటింగు విషయంలోనూ, పరిశ్రమల విషయంలోనూ కొన్ని శాసనాలు చేయవలసి వుంటుంది. విరాళాలుకూడా యివ్వవలసి వుంటుందేమో! రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలూ, కాంగ్రెసువారూ ఈ విషయాలలో అప్పుడే ఆలోచనలో పడ్డారు. కమిటీ లేర్పరిచారు. వ్యవసాయపు బిల్లు ప్రవేశ పెడుతున్నారు. గ్రామపంచాయతి కింకా ఎక్కువ అధికారాలిచ్చి గ్రామప్రభుత్వం చాలవరకు పంచాయతీకే అప్పగించే శాసనసంస్కారం ఇప్పుడు రాష్ట్ర శాసనసభలో నలుగుతూ ఉన్నది. అట్టి సందర్భాలలో పంచాయతీబోర్డూ, నానార్థసంఘం అన్యోన్య సహకారంతో గ్రామాన్ని చక్కగా పాలించి ప్రాచీనకాలపు స్వయంపోష

కత్వం, స్వయంపాలకత్వం మళ్ళీ నెలకొల్పడానికి మంచి అవకాశం ఉంటుంది.

విద్యార్థి:- పూర్వకాలం గ్రామాలు స్వయంపోషకాలుగా వుండటానికి వస్తు వినిమయపద్ధతి (బార్టరు పద్ధతి) ఉండేది. ఆ పద్ధతి ప్రవేశ పెట్టకుండా మీ గ్రామాన్ని స్వయంపోషకం ఎట్లా చెయ్యగలరు?

రాజ:- చాలవరకు ఆ పద్ధతి ప్రవేశించింది మా గ్రామంలో. సహకార సంఘంద్వారా కాక ఆర్థిక వ్యవహారం ఏదీ గ్రామంలో జరగడం లేదు గదా! గ్రామంలో ఉన్న డబ్బంతా ఏదో ఒకరూపాన సంఘంలో చేరిపోయింది - ఏ కొద్దిమందో దాచుకొన్నది తప్ప! డబ్బు చలామణీ కావాలంటే సంఘానికి తెలియకుండా, సంఘం ద్వారా కాకుండా చలామణీకాలేదు. ఒక్క వస్తువైనా సంఘంలో కాక వేరే దొరకదు. ఇంకా చూడండి! గ్రామంలో అధిక సంఖ్యా కులు రైతులుగదా! రైతు సంఘంలో అప్పు తీసుకొంటాడేకాని నగదురూపంగా ఒక్క దమ్మిడీ తీసుకోడు. ఎరువుల రూపంగానో, తాను చెల్లించవలసిన శిస్తురూపంగానో, తనకుగాను సంఘం చెల్లించిన కూలీ రూపంగానో, తాను సంఘంలో వాడుకొన్న సరుకు రూపం గానో అప్పు పుచ్చుకుంటాడు. తన ఫలసాయం అంతా - తన ఉప యోగానికి ఉంచుకొన్నది కాక - సంఘానికే అప్పగిస్తాడు. ఈ ఫల సాయం ఖరీదుగట్టి సంఘం అతనిపేర జమ వ్రాస్తుంది. అతను వాడు కొన్నదంతా అతనిపేర ఖర్చు వ్రాస్తుంది. సంవత్సరం పొడుగునా రైతుకు ఏ సరుకు కావలసినా వస్తుభాండారంనుండి తీసుకొంటూ ఉంటాడు. సంఘం అతనిపేర ఖర్చు వ్రాస్తూ వుంటుంది. కాబట్టి సాధారణంగా అతనికి నగదుతో అవసరమే ఉండదు. తన ధాన్యాన్ని సంఘం ఈ విధంగా మార్చి అతని అవసరాలు సప్లయి చేస్తున్నది. ఇది వినిమయపద్ధతే గదా? ఇక తక్కినవారి విషయమూ ఇంతే. పారిశ్రామికులు తయారుచేసిన వస్తువులను సంఘం కొంటుంది. కాని నగదు ఇవ్వదు. వారి పేరిట జమ వ్రాస్తుంది. ఒక బేలుదారు ఒక గోడ కట్టుతాడనుకోండి. గోడ కట్టించుకొన్న ఆసామిపేరిట గోడ

మజూరి ఖర్చు వ్రాస్తుంది; బేలుదారిపేర ఆ మొత్తం జమ వ్రాస్తుంది. పారిశ్రామికులకు ముడిసరుకులు సంఘమే కొని సప్లయిచేసి వారి పేర ఖర్చు వ్రాస్తుంది. వారి తయారు వస్తువులు తాను కొని గ్రామంలో గాని మరొకచోట గాని అమ్మి వారిపేరిట జమకట్టి అందులో నుండి తన బాకీ మినహాయించుకొంటుంది. వారికి కావలసిన వెచ్చాలు సప్లయిచేసి వారిపేర ఖర్చు వ్రాస్తుంది. అన్ని వ్యవహారాలూ ఇంతే. అదుగో చూడండి ఆయన కోడిగుడ్లు తెచ్చి సంఘంలో ఇచ్చిపోతున్నాడు. రెడ్డో ఆయన తేనె యిచ్చిపోతున్నాడు. ఇంకొకాయన చాపలు వేసిపోతున్నాడు. గుడ్డలొకాయన ఇచ్చిపోతున్నాడు. వడుకునూలు ఇచ్చిపోతున్నది ఆ ముసలమ్మ. నులకవుండలు, నవ్వారు తెస్తున్నారు మరికొందరు. వెన్న, నెయ్యి అన్నీ యిట్లాగే వస్తున్నాయి, సమయానికే. చూడండి! వీరొక్కరూ దమ్మిడీ తీసుకుపోరు సంఘంనుండి. తమ ప్యాసుపుస్తకాలలో వాటి ఖరీదు జమ వ్రాయించుకు వెళ్తారు. వెళ్ళుతూ తమకు కావలసిన సంబారాలు, గుడ్డలు, తక్కిన జీవితావసరాలూ, వస్తుభాండారం నుంచి తీసుకుపోతారు. అక్కడ వీరు దమ్మిడీ యిచ్చేది లేదు! తమ పుస్తకాలలో ఖర్చు వ్రాయించుకొని సంఘపు పుస్తకాలలో సంతకాలు చేసిపోతారు. ఒకరి దగ్గరనుండి వచ్చిన వస్తువులను ఇంకొకరికి – ఆ వస్తువు కావలసినవారికి – సంఘం ఇక్కడే సర్దుతుంది, మిగిలివుంటే ఇంకొకతావున అమ్ముతుంది. సాధారణంగా గ్రామంలో ఖర్చు అయ్యే వస్తువులే, గ్రామంలో కావలసిన వస్తువులే ఎక్కువగా ఉత్పత్తి చేయిస్తుంది. అందరికీ ఏదో ఒక వృత్తి కల్పించి, వారికి తగినంత ఆదాయం సమకూర్చడానికీ, పరాయి తావుకు పంపించి తమ గ్రామానికి కావలసిన వస్తువులు తెప్పించుకోడానికీ – ఇందుకు మాత్రమే తక్కిన వస్తువులు ఉత్పత్తి చేయిస్తుంది. మొత్తం మీద గ్రామానికి కావలసిన సరుకంతా గ్రామంలోనే ఉత్పత్తి చేయించి బయటనుంచి తెచ్చుకోవలసిన అవసరం చాలవరకు తగ్గిస్తుంది. లెక్కలలో జమాఖర్చుల రూపంలో ఒకరి

ఉత్పత్తి యింకొకరికి సప్లయి చేయించి యిప్పటికి డబ్బు చలామణీ నూటికి తొంభై పాళ్ళు తగ్గించింది. మరి, ఇది వినిమయపద్ధతిగాదా? మేం సాధించేది స్వయంపోషకత్వం కాదా?

విద్యార్థి:- మీరు చెప్పేది ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఇదంతా ఈ గ్రామంలో జరుగుతున్నదా?

విద్యార్థి వేసిన ప్రశ్నకు రాజశేఖరునకు కొంచెము నవ్వువచ్చెను. వెంటనే లెక్కలపుస్తకములు కొన్నిటిని బయటకుతీసి "నేను చెపితే మీకు నమ్మకం కలగకపోవచ్చు. ఇవిగో, లెక్కలపుస్తకాలు! తిరగేసి చూడండి! ఇంకా మీకు నమ్మకం కలగకపోతే, అట్లా గ్రామంలోకి వెళదాం పదండి, కొంతమందిని విచారించికూడా చూడవచ్చు!" అని పల్కెను.

విద్యార్థి:- అబ్బే, ఎందుకండీ, ఇదంతా ఎట్లా సాధ్యమైందా, అని!

రాజ:- ఇదంతా ఎట్లా సాధ్యమైనదంటే గ్రామస్థులందరూ సంఘంలో చేరడంవల్లనూ, అన్ని ఆర్థిక చర్యలనూ సంఘమే వశంచేసుకో వడంవల్లనూ! అన్నిటికంటె ముఖ్యంగా, గ్రామస్థులు ఈ విధానం యొక్క ప్రయోజనం బాగా అర్థంచేసుకొని దానికి బద్ధులు కావడం వల్లనూ!

విద్యార్థి:- సంఘం పెట్టకముందు గ్రామంలో వ్యాపారస్థులు అలవాటు చేసిన విలాస వస్తువులు, వినోద వస్తువులు, ఇప్పుడు సంఘం సప్లయి చెయ్యదుగదా! వాటి నెట్లా మరచినారు ప్రజలు?

రాజ:- అవి అందుబాటులో లేకపోవడంవలనా, వాటిని వాడవద్దని మేం చేసే ప్రచారంవలనా! అయితే కాలానుగుణంగా జీవితానికి అవసరంఅనుకొన్న వస్తువులను సంఘంకూడా తెచ్చి సప్లై చేస్తున్నది. అనవసరములైన జుట్టు పిన్నులు, ఫేసుపౌడరులు, క్రీములూ, రిబ్బనులూ, రంగాణిసరుకు, గ్లాసుసామాను, సబ్బులు, పరిమళ ... టీ, కాఫీ, వోవల్టిన్, గాక్సో, హార్లిక్సు, బిస్కట్లు, ... మొదలగు అనవసర వస్తువులను మాత్రం గ్రామంలోనికి

రానివ్వకుండా అరికట్టాం. డబ్బు దాచుకొన్న కొద్దిమందిమాత్రం బస్తీకిపోయి తెచ్చుకొంటారు.

విద్యార్థి:- అట్లాంటి వస్తువులు లేనందువల్ల ప్రజలలో అసంతృప్తి ఏర్పడడంలేదా ?

రాజ:- లేదు. జీవితావసరాలు తగ్గించుకొంటె, శాంతమైన, సుఖమైన జీవితం చేసుకోవచ్చునని మేం చేసే ప్రచారమే చాలవరకు దీనికి కారణం. అనుభవంవల్ల మేం చెప్పేది నిజమేనని వారూ గ్రహించారు. బస్తీలనుంచి మా స్కూలులోకి ఉపాధ్యాయులుగా వచ్చిన వారుకూడా క్రమంగా మా జీవితంలో కలిసిపోయి సౌమ్యమైన, నిరాడంబరమైన జీవితం చేస్తున్నారు. అట్లా సర్దుకోలేనివారికి మా గ్రామంలో తావేలేదు.

విద్యార్థి:- మరి వీరికి వినోదాలేమిటి ? ఎప్పుడూ శ్రమిస్తూవుండేవారికి ఏ కొంచెమైనా వినోదం లేకపోతే మనుష్యులు మొద్దుబారిపోరా ?

రాజ:- వీరు చేసేపనే చాలవరకు ఉల్లాసంగా ఉండేటట్లు ఏర్పాటు చేశాం. అయినా, వినోదాలు లేకపోలేదు. వీధినాటకాలు, కథా కాలక్షేపాలు, బాల బాలికానృత్యాలూ, యువక క్రీడలూ, ఆటలూ, పాటలూ, పోటీలూ, కవితా గానాలూ, శిల్పాలూ, చిత్రలేఖనలూ అనేకం ఉన్నాయి. మన జాతీయ జీవితానికి అనుకూలించే వినోదాలూ, విలాసాలూ క్రీడలూ మనకు పూర్వ కాలంలో చాలా ఉండేవి. వాటినే కాలానుగుణంగా కొంచెం సంస్కరించి మళ్ళీ అభ్యాసం చేయిస్తున్నాం. సినీమాలవంటి బస్తీ వినోదాలకంటే యివే మంచివని నా అభిప్రాయం. ఉత్తమమైన సంగీతం వినడానికి, వార్తలు తెలుసుకొనడానికి రేడియో ఉండనే ఉన్నది. వార్తాపత్రికలు, గ్రంథాలయం ఉన్నాయి. అప్పుడప్పుడు మనస్సుకు ఉత్తేజకరములైన ఉపన్యాసాలుకూడా ఏర్పాటు చేస్తున్నాం. ప్రాంతీయములు, జాతీయములు అయిన పండుగలు పబ్బాలు మునుపటికంటె ఎక్కువగా పాటిస్తున్నాం. కాబట్టి ఇటువంటి గ్రామంలో వినోదాలు లేక ప్రజలు మోడువారి

రనే భయంలేదు. పైగా మునుపటికంటె మెరుగెక్కుతున్నారు. ప్రాచీన జానపద జీవితం, ప్రాచీన భారత సంస్కృతి ఇంత మధుర మైనదా అని ప్రజ లిప్పుడు గతాన్నిగూర్చి సాశ్చర్యంగా ఆలో చిస్తున్నారు. మధ్య వచ్చిన వ్యర్థ సంస్కారాలనుగూర్చి, విదేశ నాగరికతనుగూర్చి ఏవగించుకొంటున్నారు. ఇంకొక విశేషంకూడ ! గ్రామీణులలో సోదరభావం పెంపొందుతూ ఉన్నది. ప్రతి వ్యక్తీ జీవితానికి అవసరమైన ఏదో ఒక కార్యం చేస్తూనే ఉంటాడు కాబట్టి యే ఒక్కరు దురవస్థలోపడినా అందరూ ఆ బాధను అనుభవిస్తారు. బాధితునికి సహాయంచేస్తారు. అందరూ ఒకరిమీద ఆధారపడి ఉండడంవల్ల ఈ సోదరభావం బాగా దోహదమౌతున్నది. నూతన మైన ఈ ఆర్థిక వ్యవస్థలో తరతమ భావాలు అంతరించి అందరూ సమాన గౌరవం అనుభవిస్తున్నారు. ఆర్థిక సంస్కారాలకు తోడుగా సామాజిక సంస్కారాలుకూడా నెలకొల్పినాము కాబట్టి కులభేదాలుకూడా చాలవరకు అదృశ్యమౌతున్నాయి. కులాంతర వివాహాలు విరివిగా జరుగుతున్నాయి. ఆర్థిక సమత్వం రావడంవల్ల ఈ సామాజిక సమత్వం సులభసాధ్యమౌతున్నది. ప్రజలంతా ఒక క్రొత్త అనుభవం పొందుతున్నారు. మొత్తంమీద అందరూ ఆనంద మయమైన జీవితం గడుపుతున్నారు.

విద్యార్థి:— ఇంత పరివర్తన రావలెనంటే విస్తారమైన ప్రచారం జరగాలి. ఇందు కొరకు కొంతమంది తమ జీవితాలను సంపూర్ణంగా వినియో గించాలి. అట్లాంటి ఆత్మత్యాగం చేసే వ్యక్తులు మీబోటివారు ఈ గ్రామంలో ఉండబట్టి యింత అద్భుత పరిణామం జరిగింది కాని కేవలం మాటలతోనూ ఉపన్యాసాలతోనూ జరగదు.

రాజ:— ఆ మాట వాస్తవమే. గాంధిమహాత్ముడు యువకులను గ్రామ సేవకు పొమ్మని ఊరకే చెప్పలేదు ! భారత సౌభాగ్యం అంతా గ్రామాలలోనే ఉన్నది. గ్రామాలు బాగుచేయందీ దేశం ఉద్ధరిం చడం కల్లోమాట. మహాత్ముడు చెప్పినట్లు కొంతమందైనా యువకులు తమ యావజ్జీవితం దేశసేవకై అర్పించాలి. అటువంటి

త్యాగం లేకపోతే దేశానికి మోక్షంలేదు. యువకులదృష్టి గ్రామ సీమలకు మళ్ళాలి. అందువల్ల కనీసం ఆరుమాసాలైనా గ్రామ పునరుజ్జీవన కార్యక్రమాలలో అనుభవం పొందితేతప్ప కాలేజీ విద్యార్థులకు పట్టాలివ్వకూడదనే శాసనం అవసరమని నా అభిప్రాయం.

విద్యార్థి:- ఇంకొక్క సందేహం. యంత్రసాధనలతో భారీ పరిశ్రమల నభివృద్ధిచేసి యితర దేశాల పోటీని ప్రతిఘటించాలని మన నాయకు లభిప్రాయపడుతుంటే ఈ కుటీర పరిశ్రమలు, స్వయం పోషక గ్రామాలూ వస్తు వినియమ పద్ధతులూ దేశీయ విధానంతో ఎట్లా సమన్వయ మౌతాయి?

రాజ:- భారీ పరిశ్రమలు దేశానికి అవసరమే. కాని గ్రామీణ ఆర్థిక విధానంతో వాటి కేమాత్రం సంబంధంలేకుండా ఉంటేతప్ప జానపద జీవితం పూర్వం మాదిరి ప్రశాంతంగా జరగదు. భారీ పరిశ్రమలలో గ్రామీణులు పాల్గొనవలసిన అవసరం లేదు. పట్నాలలో నగరాలలో కావలసినంత జనబలం ఉన్నది. గ్రామీణులు అవిచ్ఛిన్నంగా వ్యవసాయమూ, కుటీర పరిశ్రమలూ చేసుకుంటూ జీవితం గడుపుకుంటుంటే భారీ పరిశ్రమలసంగతి ప్రభుత్వం చూచుకుంటుంది. యంత్రపరిశ్రమలు కుటీర పరిశ్రమలతో పోటీకి రాకుండా ఉంటే చాలు. గ్రామానికికూడా యంత్రంవస్తే నిర్వ్యాపారత పెరిగిపోయి అసంతృప్తి ప్రబలి మానవత్వం మరుగుపడి జానపదజీవితం విషమిస్తుంది. గాంధీ మహాత్ముడు మనకు నూరిపోసింది ఈ సూత్రమే.

విద్యార్థి:- రాజశేఖరంగారూ! మీకు చాలా శ్రమకల్గించాం. క్షమించండి. మీ యెడల మాకు చాలా కృతజ్ఞత యేర్పడ్డది. మీ సేవను గూర్చి ముఖస్తుతి చేయకూడదుగాని మీబోటివారు ఇంకా ఎంతమంది దొరుకుతారా అని సందేహిస్తున్నాం! మరో పర్యాయం మీ గ్రామం వచ్చి ఈ విధానాన్ని ఇంకా పరిశీలించాలని అభిలాష ఉన్నది. ఇప్పటికి సెలవు ఇప్పించండి. నమస్తే.

వారు వెడలిపోవుచున్నారు. ప్రొద్దెక్కినది. మనమును బోవుదము.

## XIX

# తుదిపొంగు

అది శారదరాత్రి. పాలభాండము దొరలినట్లు పండువెన్నెల ప్రకాశించుచుండెను. ఇళ్ళముంగిళ్ళ నమ్మలక్కలు గూర్చుండి పాటలతో, మాటలతోఁ గాలక్షేపముసేయుచుండిరి. కొందఱు రాట్నములు పెట్టుకొని నూలు దీయుచుండిరి. "చందమామ రావే, జాబిల్లిరావే" యని చంద్రుని బిలుచుచుఁ బసిపిల్లలకుఁ దల్లులు గుజ్జెనగూళ్ళు గుడుపుచుండిరి. "ఒప్పులకుప్పా, ఒయ్యారిభామ" యని కొందఱు, "చెమ్మచెక్క చేరెడేసి మొగ్గ" యని కొందఱును ఈడైన కన్నెలు జోడులుగూడి యాడుచుండిరి. కొందఱు వెన్నెల బంతు లాడుచుండిరి. ఎదిగిన బాలురు కొందఱు చెడుగుడు లాడుచుండిరి. కొందఱు ఉప్పనబట్టె లాడుచుండిరి. రచ్చబండలపైనను, వీధి యరుగులపైనను గూర్చుండిన వారు వినోదప్రసంగములతోఁ బ్రొద్దు పుచ్చుచు వెన్నెల సుఖముచేనన్నము మాట మఱచి పోవుచుండిరి.

హరిజన వాటికకుఁ బోయిన శాంతాదేవి యానాఁ డేలకో యాలస్యముగ నింటికి వచ్చెను. గ్రామమునకు, హరిజనవాటికకు నడుమ సుమారు రెండు ఫర్లాంగుల దూరముండును. అది డొంకబాట. ఇరుపార్శ్వముల వరిమళ్ళు. వెన్నెల యగుటచేతను, ప్రొద్దెంతయో పోవకుండుటచేతను దోడువచ్చెదమని బయలుదేరిన రామదాసును, లచ్చయ్యను బలవంతముగ నిలిపి శాంతాదేవి యొంటరిగ నింటికి వచ్చుచుండెను. అట్లు వచ్చుటలో నామెకు వివేకముకన్న ధైర్యమే హెచ్చయ్యెను. చేలువ వెన్నెల వెల్లువలు గ్రమ్మరించు నా శారద యామినియందు వినీల సస్యకేదారముల మధ్యమున సుందరమందయానమొనరించుచు నేతెంచు నా నిండు జవరాలి రామణీయక మిట్టిదని పదపరిమితము చేయుటకంటె నిరవధికమగు నూహకు వదలుటే మంచిది. నిరాడంబరమయ్యు నామె ధరించిన ధవళాంశుకము నిర్వ్యక్తమగు నామె యావనమును బట్టి యిచ్చుచుండెను. నిరాభరణత్వ మామె మనోజ్ఞ

సహజ సౌందర్యము నినుమడించుచుండెను. నిర్లక్ష్యముగ ముడివేసిన యామె వినీల కచసందోహము శరచ్చంద్రికా ధావళ్యమున కొక యలంకారమై యామె సోయగము నతిశయింపఁజేయుచుండెను. శాంతాదేవి యప్పు డొంటరిగ వచ్చుట నిజముగ నవివేకమే !

గ్రామ మింక నొక నూరు గజములలో నుండఁగ నెవ్వరో యొక రెదురు వచ్చుచున్న ట్లామె గమనించెను. నడకనుబట్టి రమణా రెడ్డి యని గుర్తించెను. ఇట్టి యదనునకే వేచియుండెనా యనునట్లతఁడు చరచర నామె వంకకు నడచివచ్చెను. రెండుగజముల దూరములో నాతఁ డామె యెదుట నిలువఁబడెను. ఉదయము కురిసిన వానచే నా చోట నటునిటు బురదయు నీరు నుండెను. కాని బాటమాత్రమే యడుగులు పడియుండెను. ఎవరో యొకరు తొలఁగినఁగాని యడుగు ద్రొక్కకుండఁ బోవ వీలులేకుండెను. రెడ్డి దారి యీయలేదు. శాంత నిలువఁబడెను. అతఁడు పశుతుల్యుఁడు. కామపిశాచ మతని నావేశించి యుండెను. పాదరక్షాప్రయోగము సేయఁబోయిన పడఁతిని గూడఁ బ్రసన్నను గావించుకొనఁజూచు పరమమూర్ఖుఁడు; లేక బలవంతముగ నామెను బాహుబంధమునఁ జిక్కించుకొనఁజూచు పరమదుర్మార్గుడు. ఎట్లయిన నేమి? అతఁ డామె కొఱ కెంత సాహసమైనఁ జేయ సంసిద్ధుఁడైనాఁడు. కనీస మామె యాలింగన భాగ్యమైన నొక్కసారి లభించినచోఁ దృప్తిపడి యుందునని ఆలోచించువాఁడు. అతని కిప్పు డా యవకాశము చిక్కినది. అతని కాపాదమస్తక మనిర్వచనీయమగు శక్తి యేదియో యావరించిన ట్లనుభూతి దోఁచెను. అతఁడు కామాతురుఁడు. అతనికి భయములేదు. లజ్జలేదు. పశువుకంటె హీనుఁడు. శాంతా పునీత శరీరమును బలవంతముగఁ గౌఁగిలించుకొనుటకుఁ జేతులెత్తుచుండెను. ఇంతయు నొక్క క్షణముననే. క్షణశకలములో నామె యతని వెనుకకు వచ్చి తన చెప్పుకాలితో నతని నడుముపై గట్టిగాఁ దన్నెను. అతని ముందు నిలువఁబడియున్న యామె యతని వెనుక కెట్లేఁగెనో, యెప్పుడేఁగెనో చెప్పనలవికాదు. తన్నున కతఁడు బురదలో బోరగిలఁబడెను. ఆ యాకస్మిక సంఘటనచే నతని కాలోచనాశక్తి యుడిగెను. శాంత

యతని నంతటం బోనీయక ప్రక్కనున్న నీటి గుంటలోనికిం బడునట్లింక నాలుగు తన్నులు తన్నెను ! అతం డా కంగారునుండి తెప్పరిల్లునంతలో నామె మెఱుపుం దీగెవలె నూరివైపునకు గమించి యిల్లు చేరెను.

రమణారెడ్డి తరువాత మెల్లంగాం దెప్పరిల్లి లేచి నడుములు విఱుగనందుకు మాత్రము సంతసించుచుం గష్టముతో నింటికి నడచి పోయెను. ఆమె తన్నునప్పుడు పాదరక్షలు లేకుండ, నుత్తపాదముతోం దన్నియుండిన యెడలం బాప మతనికిం గొంతయైన ఫలము దక్కి యుండెడిదేమో ! ఆమె పాదపల్లవ మాతని మేనం దాంకిన నతని కింక నేమి కావలయును ? "నను భవదీయ దాసుని మనంబున నెయ్యపుం గిన్క బూని తాంచిన నది నాకు మన్ననయ, చెల్వగు నీ పదపల్లవంబు మత్తను పులకాగ్ర కంటకవితానమునన్ గడు నొచ్చెనంచు నే నని యెద; నల్క మానవుగదా, యికనైన నరాళ కుంతలా!" యని తిమ్మన్నగారికృష్ణమూర్తిగారితో గొంతుకలిపి పాడుకొనెడివాండుగదా! ఆ యదృష్ట మతనికిం బట్టలేదు. పాదరక్షతోడనే యతనికిం బాద ప్రహారము లయ్యెను. జాతకమున లేని సౌభాగ్య మెవరికి మాత్ర మెట్లు సంభవించును ?

బురదగుడ్డలతోం గుంటుకొనుచు నింటికింబోవు నతని "నదియేమి" యని కొంద ఱడిగిరి. పిల్లకాలువ దూకుటలో ధోవతి చెంగు కాలి కడ్డము పడి కాలువలోం బడితినని చెప్పుచుం బోయెను. ఇంటికడం గూడ నదే కథ చెప్పెను. తానై శాంతాదేవి ఈ సమాచార మెవ్వ రికిం జెప్పదని యతనికిం దెలియును. ఆ రేయి శాంతాదేవి యతనికిం బలుసారులు కనంబడెను— మనోహరాకారముతోం గాదు, మహిషా సురమర్దనివలె! ఇంక నామె జోలికిం బోవనని చెంపలువేసికొని కడ కెట్లో నిద్దుర వోయెను.

ఉదయమున మామూలునకు భిన్నముగాకుండ నెట్లో చెఱువు కట్టకుం జేరెను. నడుములోం గొంత నొప్పి లేకపోలేదు. నడకలోం గుంటుందనము కనిపింపకపోలేదు. అయినను జెఱువుకట్ట యన్న నతని కంత ప్రియము. నాం డతం డచ్చటి కేంగునప్పటికి మిత్రబృంద మగు

పాపిరెడ్డి, వెంకంభొట్లు మొదలగువారు ముచ్చటలు సెప్పుకొనుచుఁ గూరుచుండిరి. పిప్పిపంటికిఁ జలిబాధయన్నట్లు రమణారెడ్డికిఁ బుల్లయ్య పంతులు తటస్థించెను. అతని కుంటినడకనుజూచి యితరులు సానుభూతితోఁ బ్రశ్నింపఁ బంతులు వేళాకోళముసేయఁ దొడఁగెను.

పంతులు:- ఎవరైనా కాయశుద్ధి చేశారా! గోడలుదూకి పడ్డావా, రమణారెడ్డీ, నడుములు విరిగినట్లున్నాయి ?

రమణా:- లేదు తాతా, పిల్లకాలవ దూకబోతే ధోవతిచెంగు అడ్డంపడి కాలవలో పడ్డాను రాత్రి.

పంతులు:- చదువుకున్నవాడికి సంజాయిషీలు కరువా ?

రమణా:- మీ వెధవగ్రామంలో బయటకెళ్ళడానికే ఇబ్బంది.

పంతులు:- నీ పుణ్యమా అంటూ వేములపల్లిని వెధవగ్రామమే చేశావు. నీవూ, నీ మిత్రుడూ కలిసి వెధవముండను ప్రెసిడెంటుగా పెట్టారుగా; శాంతమ్మను! వెధవగ్రామంగాక ముత్తైదువ గ్రామం అవుతుందా ?

వెంకంభొట్లు:- వెధవలందరూ ముత్తైదువ లవుతుంటే వెధవగ్రామ మెట్లా అవుతుంది తాతా ? నాకు తెలిసి మనవూళ్ళో యిరవైమంది విధవముండలకు మళ్ళీ పెళ్ళిళ్ళయినాయి.

పంతులు:- నీవే పౌరోహితం చేశావా ?

వెంకం:- ఒకవేళ నేను చెయ్యదలచినా మనదాకా రావడంలేదు. దానికీ రాజశేఖరమే తయారైనాడు! ఆ చేశేది వేదోక్తంగా మరీ చేస్తాడు!

పంతులు:- ఏమిటీ, వివాహమంత్రాలు కూడా చెప్పుకున్నాడా వీడు ?

వెంకం:- మంత్రాలు చెప్పుకున్నాడో లేదో ? ముఖ్యమైన మంత్రాలకు తెలుగు నేర్చుకొన్నాడు. తెలుగులోనే తంతు అంతా నడుపుతాడు.

పంతులు:-వీడు పిడుగులాగున్నాడు! ఎవరు ఆ వచ్చేది? ఆదినారాయణ రెడ్డి గాదూ ? దయచెయ్యండి రెడ్డిగారూ! మీ మామగారు కోదండరామయ్య చౌదరిగారూ, మీ బావగారు ధర్మారావు నాయుడుగారూ క్షేమమా ?

పరాయి గ్రామస్థుఁడును, వెంకంభొట్లు బంధువు నగు విశ్వనాథ శాస్త్రి ఈ మాటలువిని—"అదేమిటండీ, ఈయన రెడ్డీ, యీాయన మామ చౌదరి, బావ నాయుడూనా ? ఇదంతా వేళాకోళమా ? యధార్థమా ?" అని యడిగెను.

పంతులు:- మా వూళ్ళో వేళాకోళాలు లేవు. అన్నీ ఉక్కుముక్కల లాటి యధార్థాలే!

విశ్వ:- అయితే నిజంగా కులాంతర వివాహాలు జరుగుతున్నాయా, మీా గ్రామంలో ?

రమణా:- మై గుడ్ గాడ్ ! ఇప్పటికెన్నో జరిగిపోయినాయి.

విశ్వ:- వేదికలమీాద ఉపన్యాసాలు విన్నాంగాని నిజంగా కులాంతర వివాహాలు జరుగుతాయని యెన్నడూ అనుకోలేదు సుమా !

పంతులు:-మా వూళ్లో ఒక ఉద్దండుడున్నాడు—రాజశేఖరరావు—అని, ఒక కమ్మవారబ్బాయి. ఈ ఆదినారాయణరెడ్డి బావమరిదే. వాడు చేస్తున్నాడు— ఈ అల్లరంతా ! తన చెల్లెలి నీ రెడ్డి కిచ్చి చేశాడు. తన తమ్ముడికి ఒక తెలగవారమ్మాయిని చేశాడు. తర్వాత, చూడు తమాషా ! రెడ్డి, కమ్మ, వెలమ, తెలగ వగైరా కులాలన్నీ ఏకమయ్యేలాగు ఇచ్చిపుచ్చుకొన్నారు లెక్కలేకుండా ! ఇప్పటి కటువంటి వివాహాలు ఇరవై అయిదుకు తక్కువ జరిగి వుండవు. ఇంకా పదింటికి సంబంధాలు కుదిరివున్నాయి. ఇవ్వాళే ఒకటి జరుగుతూవుంది. తెలగవారమ్మాయిని వెలమవారబ్బాయి కిచ్చి చేస్తున్నారు. ఇంతకుముందే పెళ్ళికూతురువారు కమ్మవారి తోనూ, పెళ్లికొడుకువారు రెడ్లతోనూ వియ్యమంది వున్నారు. ఏం, ఎట్లా వున్నది వ్యవహారం ?

విశ్వ:- బాగానే ఉన్నది, యుగధర్మం !

పంతులు:- చట్టుబండలు ! వర్ణసంకరం !

ఆదినారాయణరెడ్డి:- ఏ యే వర్ణం సంకరం అయిందండీ ? మా వర్ణా లన్నీ ఒకటిగానే వున్నాయే !

పంతులు:- ఉండవోయ్ ! నీ మిడిమిడి విజ్ఞానంతో నీవు ఏం అర్థంజేసు

కుంటావు ? తెలిసీ తెలియక రాజశేఖరం వాగిందంతా వేదమే అని నీబోటివాళ్ళు గంతులేస్తున్నారు.

విశ్వ:- పంతులుగారూ, నాకుగూడా కమ్మ, వెలమ, రెడ్డి, తెలగ వగైరా కులాలలో వర్ణభేదం లేదనిపిస్తున్నది. ఈ కులాంతర వివాహాలు మంచివేనేమో !

పంతులు:- నీవూ, రాజశేఖరం సహపాఠివా, కొంపదీసి ? అయితే, యే యే కులాలమధ్య వర్ణభేదం ఉన్నదని, నీ అభిప్రాయం ?

విశ్వ:- ఆ మాటకువస్తే, ఎవరిమధ్యా లేదనే.

పంతులు:- గుండు గూల్చావుపో ! బ్రాహ్మడవుగా, నీవుకూడా కలిసిపో, యీ సమాజంలో, నానా కులగోత్ర సాంకర్యంలో, పంచకూళ కషాయంలో ! నీకు పెళ్ళికెదిగిన కూతురుంటే, మా వూళ్ళో యే చౌదరికో, నాయుడుకో యివ్వరాదూ ?

విశ్వ:- తీగె కదిలింది, కొన్నాళ్ళకు అదీ జరుగుతుంది. రుక్మిణమ్మ అరండేలు దొరను పెళ్ళాడడంకంటె తీసిపోతుందా అటువంటి సంబంధం ? రాధాబాయమ్మ, సుబ్బరాయనుగారిని పెళ్ళాడలా ? రామచంద్రరావుగారి అమ్మాయిని హరిజనుడికిచ్చి పెళ్ళిచేశారట వినలా ? తాతగారూ; యుగం మారిపోయింది. అంతేకాక, ఆర్థికంగా అందరూ సమానమైనప్పుడు కులభేదాలు వాటంతటవే మారిపోతాయి. బ్రాహ్మణ – అబ్రాహ్మణులకు పెద్ద భేదం – అదీ దక్షిణ దేశంలో – ఆహారంలో ఉన్నది. రానురాను ఈ భేదంకూడ అట్టే బాధించడంలేదు. నిజానికి, యిప్పటిశాకాహారులు ఒకప్పటి మాంసాహారులే. శాకాహారులు మాంసాహారులౌతున్నారు. మాంసాహారులు శాకాహారులౌతున్నారు. శాకాహారం సాత్విక బుద్ధికి ఇంద్రియసంయమనానికి లక్షణమైనమాట వాస్తవమేకాని, కేవలం శాకాహారంవల్ల కుల, గుణ ప్రాశస్త్యం ఆరోపించుకొనడం ఇప్పుడంతగా చెల్లడంలేదు. ఉత్తర హిందూస్థానంలో కొన్ని ప్రాంతాలలో బ్రాహ్మణులుకూడా మాంసాహారులే. మన ప్రాచీన కులవ్యవస్థకూడా గుణ కర్మలనుబట్టి యేర్పడ్డదేకాని జన్మను

బట్టి కాదు. వివేకానందస్వామి చెప్పినట్లు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు భారతదేశంలోనే కాదు; అమెరికాలోనూ, యూరోపులోనూ ఉన్నారు. ఆ భేదాలు గుణకర్మలనుబట్టి కలిగినవేగాని జన్మనుబట్టికాదు. ప్రథమంలో మనదేశంలోనూ అంతే అయి ఉండాలి. జన్మనుబట్టి వచ్చే కులభేదాలు నశించకపోతే మనదేశం బాగుపడదు. కాబట్టి మా అమ్మాయిని చౌదరికో నాయుడికో ఇవ్వమంటే నేను సందేహించను.

పంతులు:– హరిహరీ! ఈ వూరి కేదో విప్లవం వచ్చింది. ఈ వూరి వాళ్ళకేకాక పరాయి వూరివాళ్ళకుగూడా ఇక్కడ కాలుపెట్టగానే ఏదో గాలిసోకుతుంది! మరి కొల్లేరు మునిగినట్లు మునిగిపోతుందేమో కొద్దిరోజుల్లో. ఒక కులంలేదు, గోత్రంలేదు. ఒక చిన్నా లేదు, పెద్దా లేదు. ఒక ముండా ముత్తైదువు లేదు. సర్వం జగన్నాథమై పోతున్నది. "మాలలకు మంచాలు, బాపలకు పీటలు" వస్తాయని మహానుభావుడు పోతులూరి వీరబ్రహ్మంగారు కాలజ్ఞానం చెప్పినట్లే జరుగుతున్నది. ఇక మాబోటివాళ్ళకు స్థానం లేదీ ప్రపంచంలో. మేం గడిచిపోతేనే మంచిది, తొందరలో!

అని చివుక్కున పంతులు లేచిపోయెను.

విశ్వ:– ఎవరండీ, రాజశేఖరరావు? పెద్ద సంస్కారిలాగున్నాడు!

ఆది:– చూపిస్తానురండి, ఇవ్వాళ పెళ్ళియింట్లోగాని దొరకడు!

విశ్వ:– పౌరోహిత్యంకూడా చేయిస్తాడా?

ఆది:– పౌరోహిత్యం బ్రాహ్మలచేతనే చేయిస్తాడుగాని మంత్రాలన్నీ తెలుగులోకి తర్జుమాచేయించి పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ వాటిని అర్థంచేసుకొనే లాగున చెప్పిస్తాడు. పెళ్ళి అంటే ఏమిటో ఆలుమగళ్ళు జీవితంలో ఎట్లా ప్రవర్తించాలో, లోకానికి దంపతులు ఏ విధంగాతోడ్పడాలో–ఇంకా యిట్లాంటివే చాలా చాలా నీతులు, నియమాలు, ధర్మాలు చెప్పిస్తాడు. ఇవన్నీ వేదాలలో ఉన్నాయనీ, అవి తెలుసుకొనకుండా పెళ్ళిచేసుకొనడం తప్పనీ వాదిస్తాడు. ఆయనదంతా ఒక కొత్తమార్గం. కాని మంచిమార్గం అని అందరికీ

నచ్చింది. ఇంకొక విశేషం పూర్వం పెళ్ళిచేసిచూడు, ఇల్లుకట్టి చూడు అనేవారు. అంటే పెళ్ళికి అంతఖర్చు అవుతుందని! పెళ్ళిళ్ళుచేసి దివాళా అయినవాళ్ళు అనేకులున్నారు. ఆ పద్ధతి మారిపోవాలని రాజశేఖరం పట్టుపట్టాడు. ఓపికవున్నవాళ్ళు ఎంతైనా ఖర్చుపెట్టమంటాడు. లేనివాళ్ళు యాభైరూపాయలతో కూడా పెళ్ళిచెయ్యవచ్చు. పదిపన్నెండు పెళ్ళిళ్ళు ఒకేసారి ఒకే ఖర్చుతో చేయిస్తాడు. "పెళ్ళిళ్ళలో ముఖ్యమైనది సంబరంకాదు. వధూవరులు తమతమ ధర్మాలు తెలిసికొనడం, పెళ్ళైనట్లు లోకం గుర్తించడం. ఇవే ముఖ్యం" అంటాడు. పెళ్ళికొడుకూ, పెళ్ళి కూతురూ ఒకళ్ళొకళ్ళు పూలదండలు వేసుకోవడంతోనే ముగిసిపోతాయి, మరీ లేనివారి యిళ్ళల్లో! చాలపెళ్ళిళ్ళు ఈ క్రొత్త మార్గాన జరిపాడు. ఇవ్వాళ జరిపేది అట్లాంటి పెళ్ళే. అనవసరంగా ఖర్చుచేస్తారేమోనని తానే స్వయంగా పెళ్ళిపెత్తనం చేస్తున్నాడు.

వెంకంభొట్లు:– పెళ్ళిళ్ళేగాదురా, విశ్వనాథం, దినాలు తద్దినాలు గూడా బహుసూక్ష్మంగా చేయిస్తాడు. బ్రాహ్మణులకు పాత్రల క్రింద, దానాలక్రింద దక్షిణలక్రింద ఎక్కువ ఖర్చు కానివ్వడు. ఆ చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మకు శాంతి కలగాలంటే కేవలం దరిద్రనారాయణార్చన జరిగితే చాలునని కుంటి గ్రుడ్డి మొదలైన వికలాంగులకు దినంనాడు ఓపిక ఉన్నంతవరకు అన్నదానం, వస్త్ర దానం చేయిస్తాడు. మోతుబరులుకూడా ఈ పద్ధతి బాగున్నదని అట్లాగే చేస్తున్నారు. ఓపిక కలవారు పదిమందిని తృప్తిపరిచితే ఓపికలేనివారు ఒక్కరినే తృప్తిపరచమంటాడు. అంతా మహా లోకంగా ఉన్నది మా వేములపల్లి! రాజశేఖరరావు ఈ వూరికి బ్రహ్మాండనాయకుడైనాడు!

విశ్వ:– కాదగినవాడుగానే కనిపిస్తాడు మీరు చెప్పేదాన్నిబట్టి. రెండేళ్ళ క్రిందట నేను వేములపల్లి వచ్చినప్పుడు ఎప్పటి మాదిరి పాడుబడ్డ దివాణంలాగా ఉన్నది. ఇప్పుడు చూస్తే పంచాయతీ

బోర్డు, రోడ్లు, లాంతర్లు, స్కూలు, ఆసుపత్రి, లైబ్రరీ, రేడియో- అన్ని హంగులూ కలిగి కళకళలాడుతున్నది. వీధులు తీర్చి దిద్దినట్లు కనబడుతున్నాయి. ఊరు గుర్తుపట్టడానికే వీలులేకుండా ఉన్నది. ఈ సంస్కారమంతా ఈ రాజశేఖరరావు కృషివల్లనే జరిగిందని విన్నాను. కాబట్టి ఈయన సామాన్యఘటంగాలేడు. వెళ్ళేలోగా పరిచయం చేసుకుపోవాలి.

ఆది:- ఇంకా ఉన్నది, సహకార సంఘం. దానితో గ్రామంలో పెద్ద మార్పు తెచ్చాడు. కూటికీ గుడ్డకూ ఇప్పుడెవ్వరికి కరువులేదు.

రమణా:- అదంతా కమ్యూనిజం.

ఆది:- కాదండీ, పెద్దపెద్దలంతా పరిశీలించారు. కమ్యూనిజంలో కడుపునిండా తిండి దొరికినా, వ్యక్తికి యేమాత్రం స్వాతంత్ర్యం ఉండదట. ప్రభుత్వం ఏది చెయ్యమంటే అది చెయ్యాలట. సొంతంగా ఏదీ ఆలోచించటానికి కూడా వీలులేదట. ప్రజలందరూ యంత్రాలలాగా పై వారెట్లా చెపితే అట్లా చేసితీరాలట. మరి మన గ్రామంలో అట్లాంటిపద్ధతి యేదీ కనబడదుగా! ఎవరి యిష్టం వచ్చినపని వారు చేసుకుంటూ ఆడుతూ పాడుతూ జీవితం గడుపుకుంటున్నాం. అందరం స్వేచ్ఛగా ఒక సంఘంగా ఏర్పడ్డాం. మనకు కావలసినవన్నీ సంఘం చేకూర్చిపెడుతుంది. ఒక్కొక్కరం విడివిడిగా చేసుకుంటే సాధ్యంగాని పని పదిమందిమీ కలిసి సులభంగా చేసుకుంటున్నాము. ఒకరిమీద ఒకరికి గౌరవం, అభిమానం కలిగింది. చివరికి హరిజనులనూ, మహమ్మదీయులనూ, క్రైస్తవులను గూడా అందరితోపాటు చూచుకుంటున్నాము. పెద్దరైతులు, చిన్నరైతులు, కూలీలు అందరు చేతులు కలుపుకొని హాయిగా కాలక్షేపం చేస్తున్నాం. బొడ్డులో దమ్మిడీ డబ్బులు దాచుకొనే అవసరం లేకుండా బరువంతా సంఘం మీద వేసి కులాసాగా కాలం గడుపుతున్నాం. ఇది కమ్యూనిజం (సామ్యవాదం) ఎట్లా అవుతుంది? దీనికి హ్యూమనిజం (మానవవాదం) అని పేరు పెట్టాడు రాజశేఖరం. గాంధీగారి మతం ఇదేనంటాడు.

రమణా:- మై గుడ్ గాడ్! వీళ్ళందరూ రాజశేఖరం నేర్పిన చిలక పలుకులు పలుకుతున్నారు. వీళ్ళు పలికేవి వీళ్ళకే అర్థంగావు!

విశ్వ:- ఆయన మాటలు వింటే అర్థం చేసుకొని మనఃపూర్వకంగా చెప్పినట్లే తోస్తుంది. ఈ సంఘం ఏమిటో దీన్నికూడా తెలుసుకోవాలి. పదండి, వెళదాం.

అని విశ్వనాథశాస్త్రి లేచెను. అందఱును లేచిపోయిరి. రమణారెడ్డికి విశ్వనాథశాస్త్రి మాటలు రుచింపలేదు. అది యేమి చిత్రమో, అతఁడేకాదు, రాజశేఖరుని కార్యక్రమమును తత్ఫలితములను విన్నవారెల్లరు నట్లే మాటలాడుచుండిరి! గుంటూరులో కాఫీహోటళ్ళలోఁగూడ వేములపల్లి ప్రశంస వచ్చినపుడు గాంధీమహాత్ముని సిద్ధాంతములతో గ్రామములోఁ బెద్ద పరివర్తనము దెచ్చినాఁడని రాజశేఖరుని బొగడుట రమణారెడ్డి చెవులార వినినాఁడు. పత్రికలలో దీని ప్రశంస చూచుచుండెను. రివిన్యూ ఇన్స్పెక్టరు మొదలు కలెక్టరువఱకు నధికారులుగూడ నీ ప్రణాళికను బొగడువారే! వివిధశాఖలకుఁ జెందిన యధికారులు వేములపల్లికి వచ్చి యందు జరుగు పనిని మెచ్చుకొనుచు నింకను బాగుగా జరుగుట కేవో సూచనలు, సలహాలు నిచ్చిపోవుచుండిరి. ఎవరు వచ్చినను రాజశేఖరుని బొగడువారే! రోగములలో నన్నింటికంటె నసూయ చాలపెద్దది. రమణారెడ్డి కా రోగము వచ్చెను. రాత్రి జరిగిన పాదరక్షాప్రయోగము ఆ రోగము నినుమడింపఁజేసెను. అతని నడుములలోఁ గలుక్కుమని నొప్పి దోఁచినప్పుడెల్ల శాంతను రాజశేఖరుని నతఁడు శపించుచుండెను. రాజశేఖరుఁడే లేనియెడల నతనికి శాంతా నిగూఢ సంసర్గము చిక్కియుండునని యతని దృఢ విశ్వాసము. శాంతా స్వభావము నతఁ డింతవఱకు గుర్తింపకుండుట కతని మూర్ఖతకన్న మూఢతయే కారణము.

నాఁటిరేయి పాపిరెడ్డియింట నొక యపూర్వ సమావేశము జరిగెను. పాపిరెడ్డియు, రమణారెడ్డియు మధ్యాహ్నమునుండి యా సమావేశమున కతి రహస్యముగఁ బ్రయత్నములు సలిపినట్లుండెను. రాత్రి పదిగంటలకు పాపిరెడ్డిగారియింటి కొక్కొక్కరుగాఁ గొంత

మంది చేరిరి. రమణారెడ్డియు, వీరారెడ్డియుఁ గడపటికి వచ్చిరి. అందఱును జేరిన తరువాత వారందఱు నొకగదిలోఁ జేరి తలుపులు మూసికొనిరి. వీరారెడ్డిగారి యింటివైపున నున్న కిటికీ మాత్రము సగమే మూయఁబడి యుండెను. రెండవ తలుపు పగిలియుండుటచే మూయవలనుగాలేదు. తరువాత వారిలో వారణాసి నీలకంఠశాస్త్రి ఇట్లు మొదలుపెట్టెను.

"మనం ఆలోచించేది చాలా పవిత్రమైన కార్యం. దైవకార్యం అన్నా తప్పులేదు. కాలవైపరీత్యం వల్ల అప్పుడప్పుడు ప్రపంచంలో ధర్మచ్యుతి జరుగుతూ వుంటుంది. ధర్మం నాశనమై భూదేవి దుఃఖం మితిమీరిపోయినప్పుడు భగవంతుఁ డేదో అవతారమెత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తుంటాడు. అందువల్లనే భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడిట్లా చెప్పాడు.

"యదా యదాహి ధర్మస్యగ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

ధర్మచ్యుతి జరిగినప్పుడల్లా భగవంతుడే కృష్ణుడు మాదిరో పరశురాముడు మాదిరో అవతారం దాల్చనవసరంలేదు. అట్లాంటి అవతారం ఎత్తితే తప్ప భూదేవి నిలువలేదు అనుకొన్నప్పుడే భగవంతుడు భూలోకంలో అవతరిస్తాడు. తక్కిన సాధారణ సందర్భాలలో తన దివ్యాంశ యే మానవుడిలోనో ప్రవేశపెట్టి అతనిద్వారా ధర్మ సంరక్షణ చేయిస్తాడు. దేశంలో బౌద్ధమతం ప్రబలిపోయి వేదాధికారం వేదప్రామాణ్యం నాశనమౌతున్నప్పుడు, భగవంతుడు శ్రీమచ్ఛంకర భగవత్పాదులలో తన అంశ ప్రవేశపెట్టి నాస్తిక మతమైన బౌద్ధమతం నాశనం చేయించాడు. అట్లాగే గాంధీ హిందూమత విధ్వంసం చేస్తుంటే శ్రీ మన్నాథూరామ వినాయక గోడ్సే మహాశయునిలో తన అంశ ప్రవేశపెట్టి గాంధిని సంహరించి హిందూ

మతాన్ని సంరక్షించాడు. ప్రస్తుతం మన దేశంలో ధర్మం, మతం నాశమౌతున్న సంగతి అందరూ ఒప్పుకుంటున్నారా ?”

ఈ ప్రశ్న కందఱును ‘ఔ’ నని తలలూచిరి. వారి యంగీకారముపొంది తిరిగి నీలకంఠశాస్త్రి యిట్లు మొదలుపెట్టెను.

“ఇప్పుడు మనం మన పవిత్రమైన మతాన్ని ధర్మాన్ని రక్షించుకోవలసి వచ్చింది. అందుకే మనం ఇక్కడ సమావేశమయినాం. ఈ కార్యక్రమం ఇతరులకు ఎవ్వరికీ ఏ సందర్భంలోనూ తెలియ నివ్వగూడదు. ప్రాణంపోయినా రహస్యం బయటపెట్టగూడదు. పెడితే రౌరవాది నరకాలు సంభవిస్తాయి. అందరూ ఈ భగవద్గీతను పుచ్చుకొని ప్రమాణం చెయ్యండి – ఈ రహస్యం ఎవరికీ చెప్పం అని. ఇదుగో, మొదట నే చేస్తున్నాను”. ఈ విధముగఁ బల్కి యాతఁడు తాను వెంటఁగొనితెచ్చిన భగవద్గీత నెత్తిపైఁ బెట్టుకొని ప్రమాణము చేసెను. తరువాత నందఱును అట్లే ప్రమాణము చేసిరి. అంతట నీలకంఠశాస్త్రి “సరే, ఇక అసలువిషయం మాట్లాడుకొందాం. మన గ్రామంలో ఎవరివల్ల ధర్మచ్యుతీ, మతనాశనం జరుగుతున్నదీ అందరికీ తెలుసుగదా !” యనెను. వెంటనే మాచినేని రాఘవయ్య యా మాటలందుకొని యిట్లనెను.

“శాస్త్రిగారూ, దీనికి పెద్ద ఉపన్యాసం దేనికండీ ? నేను చెపుతాను వినండి, ఈ దుర్మార్గం చేసేది రాజశేఖరంగాడు. అది అందరికీ తెలుసు. మళ్ళీ చెప్పించడం దేనికి ? వాడూ నాకు పరాయివాడుగాడు. వేలిడిచిన మేనత్తకొడుకు. వాడి చెల్లెలు రుక్మిణమ్మను మా తమ్ముడి కివ్వాలని వాళ్ళనాయన ఆలోచించాడు. వెయ్యిన్నూట పదహార్లూ రెండెకరాల కట్నమూ అడిగాడు మా నాయన. మిలిటరీకి పోయి సంపాదించుకొచ్చాడు రాజశేఖరం. ఇవ్వాలంటే ఆమాత్రం లేకపోలేదు. కాని పిసినారితనం బలిసి కట్నం ఎగగొట్టడానికి దొంగెత్తులెత్తాడు. ఆఖరికి కులం వదిలిపెట్టి రెడ్లకిచ్చాడు చెల్లెలిని. అంతటితో ఊరుకున్నా నాకు బాధ వుండేదిగాదు. మా తమ్ముడి మనసు విరిచి వాడికి తెలగాల పిల్లను పెళ్ళిచేశాడు. ఇందుకోసం మావాడు తన

భాగం పంచుకుపోయి పెళ్ళిచేసుకొన్నాడు. ఇట్లా కులం నాశనంచేసి నందుకు నాకు మంటపుట్టింది. తా చెడ్డ కోతి వనమెల్లా చెరిచినట్లు తన చెల్లెలికి తమ్ముడికి చేసినట్లే ఊళ్ళో అన్ని మూలలా కులాంతర వివాహాలుచేయించి మహా ఘనకార్యంచేసినట్లు తెగనీలుగుతున్నాడు. అసలుసంగతి తెలుసుకోలేక ఈ మూర్ఖప్రజ వాడికి తప్పెట వేస్తు న్నారు. ఇకనైనా కులనాశనం, సాంకర్యం అరికట్టకపోతే ఊరంతా సంకీర్ణ సంకర జాతితో నిండిపోతుంది. అందుకుగాను వాణ్ణి తొలిగించాలి. ఇదీ నా అభిప్రాయం."

వీరారెడ్డి:- కులం, మతం, ధర్మం నాశనం చెయ్యడమేకాదు. పచ్చ పచ్చగా ఉన్నవాణ్ణి చూస్తే అతనికి కళ్ళుమంట. ముప్పయి నలభై వేల కవిల వుండేది నాకు. ఇప్పుడు వెయ్యికూడాలేదు. డబ్బుచేసు కొని నూటికి రూపాయన్నర చొప్పున బ్యాంకిలో పోసుకున్నాను. వెధవ సహకారసంఘం ఒకటిపెట్టి తరతరాలుగా వచ్చే పద్ధతులన్నీ నాశనంచేశాడు. కోర్టులలో ఉన్న దావాలన్నీ ఎత్తివేయించాడు. ప్రైవేటు చేసుకొని పొట్టబోసుకొనేవాళ్ళ నోట మట్టిగొట్టాడు.

ఎండ్లూరి (శ్రీ)రాములుగుప్త:-ఒక్క వడ్డీవ్యాపారం, ప్రయివేటు వృత్తీ ఏమిటండీ? మా వైశ్యులబేరం అంతా నాశనంచేశాడు. గ్రామంలో ఒక్క చిల్లర దుకాణంలేదు. ఏ వీధిలో చూచినా స్టోర్సు బ్రాంచీలే! పైగా స్టోర్సు గూడా అరువు బేరానికి దిగింది. గింజలూ పట్టుతుంది. మాకంటె ఒక కానీ చౌకగా యిస్తుంది. అసలు ఎవరి చేతిలోనూ ఒక్క పైసా నగదు మెదలకుండా కట్టుదిట్టంచేశాడు. ఇంకా మా బేరం ఏం సాగుతుంది ? 'అలోలక్షణా' అంటూ పది దుకాణాలవాళ్ళూ పరాయి గ్రామాలకు పోయినారు. ఏదో కొంచెం భూవసతి ఉన్నది కాబట్టి నే నెట్లాగో తంటాలు పడుతున్నాను.

పెనుమచ్చ భీమరాజు:- మీ బేరాలు నాశనం కావడమేకాదు. కుల మత ధర్మాలు దగ్ధంగావడమేకాదు. గ్రామంలో చిన్నా పెద్దా భేదం లేకుండాపోయింది. అందరూసమానమే అంటాడు. ఈ పిచ్చి

జనం వాడు వాగినదానికల్లా తల ఊపడమే. మరి యెన్నడైనా ఎరుగుదుమా, గొల్లా గోడీ, మాలా మాదిగా వీధిలో చెప్పులూ గొడుగూ వేసుకొని పోవడం ? నా యెదటికి రావాలంటే చెప్పులు పదిగజాల దూరంలో వదిలి వంగి దణ్ణం పెడుతూ వచ్చేవాళ్ళు! ఇప్పుడో ప్రతివాడూ నడ్డివిరుచుకొని కళ్ళు తలమీద పెట్టుకొని వొచ్చి మాట్లాడడమే! 'దణ్ణమండీ దొరగారూ', అనడంపోయింది. "నమస్తే" అని ప్రతివాడికి నేర్పాడు - నమస్తే అట! మాల మాదిగల నోటగూడా దేవభాష అయిన సంస్కృతపు ముక్కలే! "దణ్ణం దొరా" అనే మాల మాదిగలు నమస్తే అంటుంటే నాకు అరికాలిమంట నెత్తికెక్కుతుంటుంది. ఛీ! ఈ వూరు వొదిలి పోదామా అనుకుంటే తరతరాలుగా ఉన్న గ్రామం, ఈ అరవై యెకరాల భూమి ఒదలుకోలేక పడివుండవలసి వచ్చింది. కాని ఈ విప్లవం అరికట్టకపోతే మటుకు ఈ గ్రామంలో నేనేగాదు, యే పెద్దమనిషీ ఉండలేడు.

గోలి రామయ్యనాయుడు:- మీ మర్యాదలు అట్లా ఉండనివ్వండి. కూలీలను మాల మాదిగలను పాలికాపులను కండగల రైతుల మీదికి ఎగదోలాడు. వ్యవసాయం సాగక దేవుడా అంటూ పొలాలు సహకార సంఘానికి గుత్తకిచ్చాం. ఆ సంఘం ఇచ్చినంత, మనం పుచ్చుకొన్నంత! సగానికి సగమైనా గిట్టడంలేదు. మన పొలంగదా అని అందులో అడుగుపెట్టడానికికూడా వీలులేదు. ఆ పాలికాపులు మన మాటవినరు. అంతా సంఘం సంఘం అంటారు. ఏం సంఘమో పాపసంఘం. పరిస్థితులన్నీ తారుమారైనాయి. ఏదో నివారణ కాకపోతే బ్రతకడం కష్టంగానే ఉన్నది. ప్రతివాడూ తెనుగుమీరాడు.

నీలకంఠశాస్త్రి:- మీరదూ మరి! చదువు చదువు అని ప్రతివాడికి చదువుచెప్పి, వెట్టిమొట్టి సిద్ధాంతాలు బుఱ్ఱకెక్కిస్తూ, మాల మాదిగలను గాంధీపెట్టిన హరిజనులనే పెద్ద పేరుతో పిలుస్తూ, అంటరానివాళ్ళు అనే భావంకూడాలేకుండా వాళ్ళకు సదాచారాలు

నేర్పుతూ, ఇళ్ళు బాగుచేయిస్తూ, గుళ్ళల్లోకి రానిస్తూ ఊరిబావిలో నీళ్ళు తోడుకోనిస్తూ, బళ్ళోకి వాళ్ళ పిల్లలను రానిస్తూ, తానూ తన ముఠా పోయి వాళ్ళకొంపల్లో తింటూ, తురకలతోకూడా మీకూ మాకూ భేదం ఏమీలేదు, అందరం ఒకటే నని నెత్తికెక్కించుకొంటూ – ఛీ, శరీరం భగ్గున మండి పోతున్నది! ఇన్ని చేస్తుంటే మరి ప్రతివాడూ తెనుగుమీరడూ? ఎవళ్ళను ఎక్కడ వుంచాలో అక్కడే వుంచాలి. తన మిడి మిడి జ్ఞానం ఉపయోగించి అప్రాచ్యపు సంస్కారాలు ప్రవేశపెడితే మనుష్యులు మాట వింటారా? ఇన్ని యుగాలుగా పుణ్యభూమీ ఆర్యభూమీ అయిన భారతదేశంలో నాటుకొనిపోయిన హిందూ ధర్మం, పవిత్రధర్మం, సర్వ ప్రపంచంలో పేరెన్నికగన్న వైదిక ధర్మం అమాంతంగా మార్చడానికి ప్రయత్నిస్తాడా? ఇతని కే శాస్త్రం తెలుసు? ఏ ధర్మం తెలుసు? వెధవ ఇంగ్లీషు ముక్కలు నాలుగు నేర్చుకోగానే అన్నీ తెలిసినట్లేనా? యుద్ధంలో నా నా కూళ్ళూ గుడిచి తా చెడ్డకోతి వనమెల్లా చెరిచినట్లు గ్రామంలో పిచ్చిపిచ్చి సంస్కారాలు చేస్తాడా? ఇత నొక పెద్ద సంఘ సంస్కర్తా? మన దురదృష్టం ఏమిటంటే ఇతని మాట వినే కుర్ర సంచు కొంత చేరింది గ్రామంలో, ఇతనిఆట సాగుతున్నది. అంతే–

వీరప్ప:– మీ అందరికంటె మా కొంపలు దీశాడండీ, రాజశేఖరయ్య! గుట్టుగా నాలుగు జాడీలు సారా గాసుకొని పొట్టపోసుకుంటుంటే పోలీసోళ్ళకు రిపోరటురాసి నా బావమరదు లిద్దర్నీ ఆర్నెల్లు జైలుకు పంపించాడు. ఆళ్ళపెళ్ళాలూ,అమ్మలూ,నాయనలూ ఈయన జీవా నికిపడి యేడుస్తుండారు. పైగా తనకేం తెలీయనట్లు ఆళ్ళింటికిపోయి ఓదారుస్తాడు; యదవకల్లు బెల్లంచేసుకోమంటాడు. కూరగాయలు పండించమంటాడు. తాటిసాప లల్లమంటాడు. కోళ్ళుపెంచి గుడ్లు అమ్ముకోమంటాడు. తేనె తుట్టెలు పెట్టుకోమంటాడు. నవ్వారు నేశి, నూలకపేని సంపాయించుకోమంటాడు. ఈ యెదవ పనులు ఎన్నిచేస్తే కడుపునిండుద్దండి! నిండుతదే అనుకో – మావాళ్ళు

శానామంది ఈపనులు శేశేమాటా నిజమే – అయితేమటుకు మా బావమరుదులు సారాగాచుకొని నాలుగురాళ్ళు ఎనకేసుకుంటే యీాయనదేంపోయింది? ఈయనకెందు కొచ్చిన కడుపుమంట? చూస్తూ చూస్తూ ఆళ్ళిద్దర్నీ జైలుకు పంపించాడు. ఈయన యీాసమంతా సన్నాసి యీాసం. చేసేదంతా దుర్మార్గం! ఇటువంటాయన ఎప్పటికైనా వూరికి మోసం తెచ్చేవాడే!

పాపిరెడ్డి:– దొంగవేషంవేసి వెధవ ముండలను చెడగొట్టుతున్నాడు. ఆ శాంతముండతో వీడి సంబంధం తలుచుకుంటే నాకు కడుపులో బాకు పొడిచినట్లు ఉంటుంది. ఇటువంటి దుర్మార్గుణ్ణి ఊళ్ళో ఉండనియ్యగూడదు.

రమణా:– మై గుడ్ గాడ్! అందరూ కడుపుమంట వెళ్ళబెట్టేవాళ్ళే గాని ఏం చెయ్యాలో ఒకళ్ళూ చెప్పరు! ఈ ఉపన్యాసాలకా, ఈ పిల్లిశాపనార్థాలకా, మనం ఇక్కడ చేరింది?

నీలకంఠశాస్త్రి:– కర్తవ్యం నేను ఉపోద్ఘాతంలోనే సూచించాను.

రమణా:– బట్, హూ యీాజ్ టు బెల్ ది క్యాట్? – పిల్లికి గంట గట్టేదెవరు?

వీరప్ప:– పిల్లేమిటి? గంటేమిటండి? అసలు ఏం చేద్దామనుకున్నారు?

శాస్త్రి:– ఉరువు గల్లంతుచెయ్యడమే.

వీరప్ప:– బాబో, మాటలేనా?

శాస్త్రి:– మరి దేనికి, ఈ గుడుగుడుగుంచాలన్నీ? ఆడముండలమాదిరి ఆడిపోసుకోడానికా? ఇటువంటి పిరికిపేగులవాణ్ణి మొదట పిలవడం దేనికయ్యా, పాపిరెడ్డీ?

వీరప్ప:– ఆ మాటకొస్తే నాకంటె మూర్ఖంచేవాడు ఎవడూ లేడనుకోండి.

శాస్త్రి:– మరి సందేహం దేనికోయ్, వీరప్పా? ఇందులో ఒక ధర్మరహస్యంకూడా ఉన్నది. అది తెలుసుకోలేక మీాబోటి పామరులు ప్రతిదానికీ "రామ రామ" అంటారు. మొదట చావు అంటే ఏమిటి? చెప్పుకో, నీకు తెలిస్తే?

వీరప్ప:- ప్రాణాలు పోవడం.

శాస్త్రి:- కాదు. జీవాత్మ లేచిపోవడం. ఆ జీవాత్మకు నాశనం లేదు. పరమాత్మలో కలిసిపోతుంది, లేదా, మళ్ళీ ఒక శరీరంలో చేరు కుంటుంది. పరమాత్మ అన్ని జీవరాసుల్లోనూ నిండి వుంటుంది. చూడూ, గుంటూరులో ఎలెక్ట్రిక్ దీపాలు చూచావు గాదూ, గాజుబుడ్లలో వెలిగేవి ? బుడ్డి పగిలితే దీపం ఆరిపోతుంది. కాని దాని శక్తి పోదు. విద్యుత్తు అనే శక్తి ఒకటి అందులో కలిసి ఉంటుంది. ఇంకొక గాజుబుడ్డి దానికి తగిలిస్తే మళ్ళీ దీపం వెలుగు తుంది. అంతే చావు, బ్రతుకు గూడా! ఈ శరీరం ఆ గాజుబుడ్డి వంటి దనుకో. చావు అంటే, ఆ బుడ్డి పగలడం అనుకో. బుడ్డి పగిలినంతమాత్రంచేత విద్యుచ్ఛక్తి ఎట్లా నాశనం కావడంలేదో చావు వచ్చి శరీరం పోయినంత మాత్రంచేత జీవాత్మ నాశనం కావడంలేదు. కాబట్టి చావు అనేది లేనేలేదు ! ఆ గాజుబుడ్డివల్ల, లేక ఆ శరీరంవల్ల లోకానికి అపకారం జరుగుతుంటే దాన్ని నాశనం చెయ్యడమే ధర్మం. శ్రీకృష్ణభగవానులు భగవద్గీతలో చెప్పిందంతా ఈమాటే. నీ మాదిరిగానే అర్జునుడుకూడ ఆయుధం పట్టననీ, జీవనాశనం చెయ్యననీ ఎదురు తిరిగితే భగవానుడు తన విశ్వరూప ప్రదర్శనం చేసి అతనికి తత్వ రహస్యం బోధించి అతని చేత యుద్ధం చేయించి అతని రక్త బంధువులనుకూడ నాశనం చేయించాడు.

రాఘవయ్య:- మహాబాగా చెప్పారు శాస్త్రిగారూ !

వీరప్ప:- సరే, కానియ్యండి, సముఫుకున్న పెద్దలు సెప్పేదానికి నేను మాత్రం ఎందు కొప్పుకోను ?

రమణా:- రైట్ దెన్ ! మరి, ఎట్లా, ఎక్కడ, ఎప్పుడు, ఎవరు ? ఊఁ, కానివ్వండి వేగంగా !

పాపిరెడ్డి:- ఆగు ! సంగతి తేల్చేముందు ఇంకొకవిషయం తేల్చుకోవాలి. కేసు ఎటుపోయి ఎటు వస్తుందో ? ముందుగా మాట తయారు చేసుకోనిగాని వ్యవహారం మొదలుపెట్టగూడదు. తరువాత ఎవరికి

వారే యమునాతీరే అంటే ఏం చెయ్యగలం? కనీసం అయిదు వేలైనా చేతులో ఉండాలి.

శాస్త్రి:- నిజం. మరి మనలో తడి వున్న వారంతా ముందుకు రావాలి.

వీరారెడ్డి:- నేను ఒకటి సర్దుకుంటాను. భీమరాజుగారు ఒకటి, గుప్త గారు ఒకటి, నాయుడుగారు ఒకటి. నాలుగువేలైనవి. అయిదోది?

శాస్త్రి:- నేనొక సగం.

రాఘవయ్య:- తక్కిన సగం నేను. సరిపోయిందా?

పాపిరెడ్డి:- ఇదంతా రేపు ప్రొద్దునే వీరారెడ్డిగారి వశం చేసేపద్ధతి మీాదనే ముందుమాట ఆలోచించాలి.

ఈ మాటకందఱు "సరే" యనిరి. వేడి చల్లారకూడదని రమణారెడ్డి వెంటనే "ఇక కానివ్వండి మరి" యని పల్కెను.

రాఘవయ్య:- ఇందుకు పెద్ద ఆలోచనేమిటి? రేపు ప్రొద్దుటిపూట వాడు గుంటూరుపోయి రాత్రి యెనిమిది గంటలకు ఒంటరిగా ఇంటికి వస్తుంటాడు. రామనపాలెం దాటిం తర్వాత రోడ్డు మలుపులో తూముదగ్గర చెట్లగుబురున్నది. తూము...............

తరువాతి మాటలు వినరానంత మెల్లఁగా చెవులలో నూదెను. గుసగుసలాడుచుఁ గొంతసేపింకను ఆలోచనలుచేసి కడకందఱు "సరే, సరే" యనిరి. శాస్త్రి తిరిగి భగవద్గీతతో నందఱిని ప్రమాణము చేయించెను. రాత్రి షుమారు పన్నెండు గంటలకు ఎవరి యిండ్లకు వారేఁగిరి.

## XX

# విజయకుసుమము

మరునాఁటి యుదయము అలివేణి రాజశేఖరు నింటికిఁ బోయెను. అతఁ డప్పుడే గుంటూరు పోయెనని తెలిసికొనెను. తా నతని కేదో ముఖ్యమగు విషయము చెప్పఁదలచి యచ్చటికేఁగి యతఁడు లేనందుకు మిగుల విచారించెను. తాను రాజశేఖరరావునం దనురక్తయై యున్న విషయ మతనియింటఁ బసిపట్టిరేమో యని యామె కనుమానము. కావున రాజశేఖరరావు గుంటూరిలో నెచ్చట నుండువదియుఁ దిరిగి యెప్పుడు రానున్నదియుఁ దెలిసికొనఁదలఁచియు నా యనుమానముచే మఱి యేమియు నడుగఁజాలక వెడలిపోయెను.

రాజశేఖరుఁడు గుంటూరిలో సహకార, వ్యవసాయశాఖాధ్యధికారులతోడను, ఆర్థిక శాస్త్రాచార్యులతోడను జాలసేపు తన సందేహములఁ గూర్చి ముచ్చటించి, కాలేజి సహపాఠులతోఁ గొంతకాలము గడపి మార్కెటులోఁ దనకుఁ గావలసిన సమాచారము సేకరించి, కూరగాయలు, పాలు, వెన్న, నేయి మున్నగు పదార్థములు తన సంఘమునుండి వాడుకగాఁ బుచ్చుకొను ముఖ్యులతో వారి యనుభవములనుగూర్చి తెలిసికొని సుమారైదున్నర గంటల కింటికి బయలుదేరెను.

పదిమైళ్ళు నడచుటయన్న అతని కొక లెక్కగాదు. అతఁడు. యువకుఁడు. అస్ఖలిత బ్రహ్మచారి. నియమిత శీలి. ఆజానుబాహువు. అనాయాసముగ నతఁడు గంటకు నాలుగుమైళ్ళు నడచును. నడచుట యన్న నతని కానందము. నడచుచున్నప్పు డాతఁ డాలోచనా డోలికలలో నూఁగిపోవును. తక్కిన సమయములలో విడదీయలేని సమస్యల నతఁడు నడచునప్పు డవలీలగ విడదీసికొనును. అప్పు డతనికి గమనజ్ఞానమే యుండదు. శ్రమ యసలే లేదు. నాఁ డట్లే యాలోచనా తరంగములపైఁ దేలిపోవుచు సుమా రెనిమిది గంటలకు రామనపాలెముదాటి, మలుపు

దిరిగి చెట్ల గుబురులోనున్న తూముకడకు వచ్చెను. వెంటనే తూములో నుండి నలుగురు వ్యక్తులు బయటకువచ్చి "ఆగు, అక్కడ" యని గద్దించి పలుకుచు నెదుట నిలిచిరి! రాజశేఖరుఁడీ యనిరీక్షిత సంఘటన కించుక విభ్రాంతిచెంది తన్నెదిరించిన వారిని- వెన్నెలగావున- వెంటనే గుర్తించెను. పూర్వ మొకప్పుడు తనను గొట్టుటకుఁ గుట్రలు జరుగు చున్నట్లు యాకోబువలన వినియుండెను. కాని యట్టిది జరుగదని యాత్మబలముచేఁ ద్రోసిపుచ్చి యెఱుఁగనివానియట్లు ప్రవర్తించు చుండెను. ఇప్పు డట్టి సంఘటన తన కెదురుపడుటచే నతఁడు విభ్రాంతుఁ డగుటలో నాశ్చర్యము లేదు. తన యెదుట వీరప్ప, పాపిరెడ్డి, రాఘ వయ్య, నీలకంఠశాస్త్రి నిలువఁబడి యుండిరి. రాజశేఖరుఁడు సైనిక శిక్షణ పొందినవాఁడు, దృఢకాయుఁడు. బ్రహ్మచర్యమువలన బల పడిన యౌవనము గలవాఁడు. తలపడినచో నా నలువురి నవలీలగాఁ జితుకఁగొట్టఁగల సామర్థ్యము గలవాఁడు. కాని యతఁ డహింసా వ్రతుఁడు. ప్రాణసంరక్షణార్థమైనను వ్రతభంగము గానిచ్చువాఁడు గాఁడు. ప్రేమస్పర్శచే దౌష్ట్యమును సౌజన్యముగాఁ బరివర్తనము సేయఁగలనను ధైర్యము, విశ్వాసము గలవాఁడు. సబర్మతీ సంయమికి ఏకలవ్యన్యాయమున శిష్యుఁడు. వేయేల ? సింహబలముగల మేష డింభకము! ఇఁక నతఁడు హింసాత్మకముగ నెదుర్కొనునా ? ఎదు ర్కొనఁడు! నీలకంఠశాస్త్రి నుద్దేశించి యతఁ డిట్లనెను.

రాజ:- శాస్త్రిగారూ, గీతాపారాయణకు ఇది అభ్యాసమా, అనుష్ఠా నమా ?

నీల:- నిస్సంశయంగా! నీవు ధర్మచ్యుతి చేస్తున్నావు. నీవంటివాళ్ళను అంతం చెయ్యవలెననే గీత బోధిస్తున్నది. అయినా, నాస్తిక శిఖా మణికి నీకు గీతా ప్రసక్తి దేనికి ?

రాఘవయ్య:- వర్ణసంకరం చేశావు. కులగౌరవం మంటగలిపావు. నీవు బ్రతికుంటే ప్రపంచం నాశనమౌతుంది.

పాపిరెడ్డి:- దొంగసన్యాసివేషం వేసి వెధవముండలతో వ్యభిచారం చేస్తున్నావు.

వీరప్ప:- తినే తినే యిస్సట్లో మట్టిపోశావు. సారా కాసుకొని పొట్ట బూడ్చుకొనేవాళ్ళను జైలుపాలు చేశావు.

నీల:- పూర్వ మర్యాదలు మంటగలిపావు. మాల మాదిగలను మా నెత్తి కెక్కించావు. దేవాలయం మైలపరిచావు. వ్యాపారస్థులనోట మట్టిగొట్టావు. వాళ్ళు అంతకుముందు చేసే ధర్మపరిపోషణ చెడ గొట్టావు. సామ్యవాదం తెచ్చి నెత్తికి రుద్దావు. నిన్ను సంహారిస్తే తప్ప ధర్మం నిలువదు. మా హిందూ ధర్మసిద్ధాంతాల ప్రకారం ఇది చాల పవిత్ర కార్యం. ఇవి నీకు చివరి ఘడియలు.

రాజ:- నన్ను చంపుతారనే భయంతో నేనేం మాట్లాడడం లేదు. క్షణభంగురం, అశాశ్వతం, అయిన ఈ భౌతిక శరీరంమీద ఆశా, అభిమానంగల వ్యక్తిని గాను నేను. పైగా పవిత్రమైన ఒక ప్రయోజనానికై యీ పనికిమాలిన శరీరం ఆహుతిచెయ్యడం గూడ ఒక గొప్ప యోగమే. ఆ అవకాశం అందరికీ చిక్కదు - ఏ గాంధీ మహాత్ముడు వంటివారికో తప్ప. అత్యల్పుడనైన నాకు కూడా అటువంటి అవకాశం కల్పిస్తున్నారంటే మీకు నేను కృత జ్ఞణ్ణి కావలసిందే. ఇందువల్ల నా ఉద్యమం ఆగిపోతుందనికాని, క్షీణిస్తుందని కాని నాకు ఏ కోశాన భయంలేదు. ఉద్యమంకొరకు నా జీవితం అర్పించడంవల్ల అది యింకా జయప్రదంగా వ్యాపిస్తుంది. మహాత్ముడు తన జీవితం అర్పించడంవల్లనే హిందూ మహమ్మదీయ రణక్రీడ అరికట్టగలిగాడు. మన గ్రామంలో ఇప్పుడు నేను ప్రారం భించిన ఉద్యమం తక్కిన గ్రామాలలోకూడ ప్రవేశపెట్టి నడిపించా లనే సంకల్పంతో ఉన్నాను. నేను జీవించి ఉండి అట్లాచెయ్యడం చాలా కష్టం. ఉత్తమోత్తమమైన, అత్యంత పవిత్రమైన త్యాగం చెయ్యనిదీ ఏ వ్యక్తినీ లోకం గుర్తించదు. ఇప్పుడు మీరు నన్ను బలిగొనే యెడల నా జీవితగాథ, నా జీవిత మిష అందరికీ అర్థ మాతుంది. నా ఉద్యమం బహుసులభంగా ప్రపంచంలో ప్రాకి పోతుంది. కాబట్టి, యిదుగో, ఆత్మబలికి సిద్ధంగా ఉన్నాను. నా ప్రాణాలకంటె ప్రియతరమైన నా ఉద్యమం కొరకు ఆత్మార్పణం

చేస్తున్నాను. ఏ విధంగా చెంపదలచారో, ఆ విధంగానే చంపండి, నన్ను! నిరభ్యంతరంగా, నిర్భయంగా చంపండి. సందేహించవద్దు. రండి! కత్తులుంటే తియ్యండి! ఇదుగో నా ఱొమ్ము! గుచ్చండి! గొంతు పిసకదలచారా, కానివ్వండి, ఉరివెయ్యండి! త్రాడు లేక పోతే, యిదుగో నా పైగుడ్డ. మెలివెయ్యండి! తుదిమాట. మీరు నన్ను చంపుతున్నారని మీయందు నాకు అణుమాత్రమూ ద్వేషం లేదు. కృతజ్ఞతాపూర్వకంగా మీకు నమస్కరిస్తూ, నా పవిత్రోద్యమానికి నా జీవితం అర్పించుకుంటాను. చివరి ఊర్పువరకు మిమ్మల్ని ప్రేమిస్తాను, రండి, రండి!

అని యతఁడు తన చొక్కా గుండీలు తీసి ఱొమ్ము చూపుచు, పై వస్త్రము శాస్త్రిపైనవేసి, నమస్కరించుచు మందహాసముచేయుచు నిలువఁబడెను!

విషభాండములో నమృతము తొణికి చినుకులు పడెను! చినుకు రవ్వంతయేయైనను భాండమునందలి విషము నంతటిని అమృతముగాఁ బరివర్తనము చేసెను. ప్రేమస్పర్శచే వారి దౌష్ట్యము విఱిగి ద్వేషము మాయమై వారి హృదయములు ప్రేమమయము లయ్యెను.

పరుగెత్తువానిని బట్టుకొని చంపవచ్చు. ఎదురు తిరిగినవానిపైఁ బడి హింసింపవచ్చు. ఇందేదియో యొకటి జరుగునని వారు తయారై వచ్చిరి. కాని తానే "నన్ను చంపండి, రండి" అని ఱొమ్ముచూపుచు, గొంతు చూపుచుఁ, బ్రేమపూర్వకముగఁ దమ్మాహ్వానించునని వారెఱుఁగరు. ఈ యశ్రుతపూర్వ సంఘటనము వారిని విభ్రాంతి పఱచెను. ఆతని ప్రేమభావము, నిర్భీకత వారిని విజితులఁ జేసెను. వారు మాఱాడఁజాలక కొయ్యబొమ్మలవలె నిలువఁబడిపోయిరి. అందఱికన్న వీరప్ప నిలువున నీరైపోయి "రాజశేఖరంగారూ! బుద్ధి పొరపాటు మన్నించండి" అని చటుక్కున నాతని పాదములపై వ్రాలెను. జోటజోట గారు బాష్పతోయములతో నాతని పాదములు గడిగెను. వెంటనే లేవనెత్తి రాజశేఖరుఁ డతనిఁ గౌఁగిలించుకొని "వీరప్పా, నాకు ద్వేషం, కోపం ఉంటేగదా నిన్ను క్షమించేది? నా కే మాత్రం

కోపం లేదు. మనశ్శాంతితో ఉండు" అని బుజ్జగించెను. తక్కినవారు నల్లే క్షమాపణ చెప్ప నుంకించునంతలోఁ జింతచెట్టు గుబురునుండి లచ్చయ్య, పాపయ్య, యాకోబు, సముయేలు, రామదాసు క్రిందికి దుమికిరి! వారి చేతులలోఁ గఱ్ఱలుఁ గత్తులు నుండెను. నీలకంఠాదులు భయకంపితులై చూడఁదొడఁగిరి. రాజశేఖరుఁడుగూడ నాశ్చర్యముతో వారివంకఁ జూచెను. "యీఁరి కతంతా అలివేణమ్మ శెప్పింది మాకు. పెద్దపెద్దలు యింకా వున్నారు యవారంలో. అందుకని ఎత్తుకు పైయెత్తుగా మేమూ కాపేసుక్కూకున్నాం శెట్టుమీద! మీ వొంటి మీద దెబ్బ పడితే ఉండేది మజాకా! నాలుగుపుర్రెలూ శిటికెలో లేశేయి!! అయితే రాజశేకరయ్యగారూ, యెంత దైర్నం చేశారండీ, పొడవమని రొమ్ము సూపుతారా?" అని లచ్చయ్య బాణాకఱ్ఱ గడ్డముక్రింద మోపుచేసికొని నిలుచుండి యడిగెను.

రాజశేఖరరావు విషయమంతయు నర్థముచేసికొని యిట్లనెను. "లచ్చయ్యా! మీరు నాయందుజూపిన ప్రేమకూ, అభిమానానికీ కృతజ్ఞుణ్ణే. కాని మీరు చెయ్యదలచిన పని నా మతానికి విరుద్ధం సుమా! వారు నన్ను హింస పెట్టదలచినప్పటికీ నాకు విరోధులు కాలేరు. వారిని నేను ప్రేమించక మానను. దౌర్జన్యాన్ని ప్రేమచేత జయించటమే ధీరలక్షణం. హింసను హింసతో ఎదుర్కొనడం పిరికితన మౌతుంది. ద్వేషాన్ని ప్రేమచేత ప్రేమగా పరివర్తనచేస్తే స్థిరంగా నిలుస్తుంది కాని ద్వేషంచేతా, హింసచేతా అణగద్రొక్కితే అప్పటికి కనబడకపోయినా, తిరిగి తిరిగి తలయెత్తుతూనే ఉంటుంది— మూలం పోలేదు కాబట్టి. మరి చూడండి, యిప్పుడు! మన మిత్రులు వారి వారి అభిప్రాయాలనుబట్టి నేను చెడ్డవాడను, చంపదగినవాడను అని చంపడానికే వచ్చారు. వచ్చినందుకు వారిని నేను ద్వేషించలేదు. 'చంపండి నన్ను' అని ప్రేమపూర్వకంగా ఆహ్వానించాను. వారు చంపలేకపోయినారు. పైగా వారి ద్వేషం పటాపంచలైపోయి నన్ను ప్రేమించడం మొదలుపెట్టారు. చూచారా, ప్రేమ యెటువంటిదో! ఇదే అమృతం!" అని రాజశేఖరుఁడు నీలకంఠశాస్త్రిని, రాఘవయ్యను,

పాపిరెడ్డిని ఒకరితరువాత నొకరిని గౌఁగిలించుకొనెను. తరువాత హరిజన మిత్రులనుగూడఁ గృతజ్ఞతా పూర్వకముగా నాలింగనమొనర్చుకొనెను. నీలకంఠాదుల కంతకు ముందున్న బెఱుకుఁదనము పోయి మాటలాడఁ దొడఁగిరి. కమ్మని పండువెన్నెలలో నందఱు నానందమయులై సంభాషించుకొనుచు నింటికి నడచిరి.

త్రోవలో నీలకంఠశాస్త్రి క్రిందటిరాత్రి జరిగిన సమాచార మామూలాగ్రము రాజశేఖరునికిఁ దెలియఁ జెప్పెను. ఇప్పుడు వారికి దాపఱికము లేదు. ఏదో యొక పెద్ద బండ తీసినట్లు వారి హృదయములు తేలికయయ్యెను. తాము అరగంటకుముందు విపరీతముగా ద్వేషించుచున్న రాజశేఖరునిపై నిప్పు డపూర్వమగు ననురాగ ముద
ఇప్పుడు అతని యాలింగన మా పరివర్తనము చేసెనా? ఏమో!
యించెను. వారిష్టసఖులు!!

సుమా రెనిమిదిగంటలకుఁ గదా రాజశేఖర హత్యా ముహూర్తము! హత్య జరుగవలసినచోట జరిగిన కథ తెలిసికొంటిమి. ఇఁక నూరిలో నేమయ్యెనో! రమణారెడ్డియు, భీమరాజును, శ్రీరాములు గుప్తయు, రామానాయఁడు నేమియుఁ దోఁచక చేరినట్లు వీరారెడ్డి యింట నెనిమిదిగంటలకుఁ జేరిరి. "ఈపాటికి అయిపోయి వుండవచ్చు" నని వీరారెడ్డి యనెను. అతని మాటలలో నుత్సాహములేదు. భయము, భయముకంటె నెక్కువగఁ బరితాపము గనిపించుచుండెను. ఇంతగాఁ గుట్రకాధ్వర్యము వహించిన రమణారెడ్డియు "తొందరపడ్డామా? అయ్యో, పాపం! నిజం ఆలోచిస్తే నాకు అతను చేసిన అపకారం ఏమీలేదు. మానవసేవ చేస్తున్న సుజనుడేగాని దుర్మార్గుడు కాడు. కామాతురతచేత, శాంత మీద కోపం అతనిమీదకు తిప్పుకొన్నానేగాని నిజానికి అతడు నిర్దోషి. మంచివాడు" అని మనస్సులోఁ బరితపించుచు మౌనముతోఁ గూర్చుండెను. అతని కట్టి మనఃపరిస్థితి యెన్నఁడుఁ గలిగియుండలేదు. నేఁడు కలుగుట కేమికారణమో! భీమరాజు, శ్రీరాములుగుప్త "శాస్త్రి ఉపన్యాస ధోరణిలో పడిపోయినాం గాని ఈ పని చేయఁదగ్గదికాదు. ఏ కారణంవల్లనైనా అనుకొన్నది

జరక్కపోయిన బాగుండు" నని విచారింపసాగిరి. రామానాయఁడు, వీరారెడ్డియు నట్లే చింతింపసాగిరి. సగము తెఱచిన కిటికీక్రిందఁ బొంచి నిలుచుండి కుట్రయంతయు విని యుదయముననే హరిజన సోదరులకుఁ దెలిపి వారిని రాజశేఖర రక్షణార్థము పంపియున్నదగుటచే నలివేణి సంతోషముతో నింటియందుఁ దిరుగుచు మగనిని దక్కిన వారిని జూచి లోలోన నవ్వుకొనుచుండెను !

అనుకొన్న సమయము దాటిన గంటసేపటి కందఱును వీరారెడ్డి గారి యింటికి వచ్చిరి. వారితో రాజశేఖరుఁడుఁగూడ నుండెను! ఇంటనున్నవారికిఁ బెద్ద యేనుఁగు నెక్కినంత యానందము గలిగెను. ఏ వ్యక్తిని హత్యచేయవలయునని గతరాత్రి వారు కుట్రచేసిరో ఆ వ్యక్తిని జూచుటకు వారికంత యానందమేల? చిత్రము. ప్రేమప్రభావ మిదియే. జరిగిన కథ యంతయు వారు తెలిసికొనిరి.

రాజశేఖరుఁడు మొట్టమొదట రమణారెడ్డిని, దరువాత వీరారెడ్డిని, భీమరాజును, గుప్తను గౌఁగిలించుకొని తన హృదయమున వారిపైఁ గాసంతయు ద్వేషము లేదని నొక్కి చెప్పి యందఱమును బ్రేమామృతము ననుభవించుచు మానవసేవ చేయుదమని మనవి చేసెను. పరితాపమున వారి హృదయములు గరఁగి బాష్పజలరూపమున నతని మూర్ధమున వ్రాలెను.

"బాబూ, రాజశేఖరం, ప్రేమచేత ద్వేషం జయించడం అంటే యేదో కవిత్వం అనుకొన్నాం గాని నీవు నిజంగా జయించి చూపించావోయ్ ! నీవు అజాతశత్రువ్వు. నీకు ఇక ప్రపంచంలో ఎదురులేదు. నీవు చెయ్యదలుచుకొన్న పనిలో మేమందరం మనఃపూర్వకంగా తోడ్పడతాం. తోలుకుపో, రథం." అని భీమరాజు అతని శిరమును జేతితో నిమురుచుఁ బలికెను. తక్కినవారుగూడ నట్లే పలికిరి.

ఇది యంతయుఁ జూచుచున్న యలివేణి రాజశేఖరుఁ డొక లోకోత్తర పురుషుఁడనియు, నపవిత్రమగు కాముకత్వ మతనియెడఁ జూపుట గొప్ప పాపమనియు నిశ్చయించుకొనుటకాక యతఁ డుదో్బధించినట్లు తాను తన మగనియెడ సుప్రసన్నయై గుట్టుగాఁ గాపురము

సేయుటలయునని దృఢ సంకల్ప యయ్యెను. రమణారెడ్డి కదే సమయమున నట్టి మనఃపరివర్తనమే కలిగెను. శాంతాదేవియెడ మాతృభావ ముదయించెను. రాజశేఖరునిపై గురుభావము కలిగెను.

ప్రొద్దుపోయెఁ బోదమని యందఱు బయలుదేరుచుండఁగా, రాజశేఖరుఁ డొక మనవిచేసెను. "ఇవ్వాళ ఉదయం మీరు వసూలు చేసిన అయిదువేల రూపాయలతో మీ మనఃపరివర్తనకు సాక్షిగా ఒక సత్రం కట్టించితే మంచిదిగాదా? గ్రామానికి సత్రం ఒకటి కొరవగా ఉన్నది. ఇప్పటికే చందాలు చాలా వసూలుచేశాంగదా అని ఎవ్వరినీ అడగలేకుండా ఉన్నాను. వసూలై మీవద్ద సిద్ధంగా ఉన్నది కాబట్టి యీ మొత్తం యిట్లా సద్వినియోగం చెయ్యడం బాగుంటుందని నా అభిప్రాయం". రాజశేఖరుఁడు పల్కిన యీ మాటల కందఱును "సెబా" సనిరి. "ఈ మొత్తం ఖర్చుపెట్టడానికి ఇంతకంటె సత్కార్యం దొరకదు. కానియ్యిబాబూ, నీ యిష్టం వచ్చినట్లు సత్రం కట్టించు. అయిదువేలుగాదు, ఇంకా అయిదువేలైనా యిస్తాం. పాపిష్టిసొమ్ము, మూటలుకట్టి పాతిపెట్టుకొంటే, యేంలాభం? నీవు చెప్పే ప్రపంచ కళ్యాణానికి వినియోగిస్తే ఇహపరాలు రెండూ లభిస్తాయి. నీవు చేసే లోకోపకారం చూస్తే డబ్బు దాచుకొనే మా బోటివాళ్ళు ఏదో గొప్ప నేరమూ,పాపమూ చేస్తున్నట్లు అనిపించుతూ వుంది. ఇతరులకు ఉపయోగించే ఈ డబ్బును ఇన్నాళ్ళూ మేం యెందుకు బందిఖానాలో ఉంచామో మాకే అర్థంగావడంలేదు. నీతో మనసిచ్చి మాట్లాడిన యీ కాసేపటిలో మా మనస్సులపైనున్న తెరలు ఏవో తొలిగిపోయినట్లు అనిపించింది! బాబూ, మా డబ్బంతా నిరభ్యంతరంగా మానవసేవకు ఉపయోగించు. మేమూ అందరితోపాటు ఉంటాం. అందరితో సమానంగా ఉండడంవల్ల గలిగే ఆనందం మాకు ఇప్పు డర్థమౌతున్నది." అని రామానాయఁడు చెప్పఁగాఁ దక్కిన వారు సంతోషముతో నంగీకరించిరి. ఆ నిర్మింపఁదలఁచిన సత్రమునకు "పరివర్తన ధర్మశాల" యని నామకరణముకూడ రాజశేఖరుఁడు చేయఁగా వా రంగీకరించిరి.

నీలకంఠశాస్త్రి సందేహించుచు నింకొక్క మాట యనెను. "రాజశేఖరం, నీవు అమూల్యమైన సంఘసంస్కారంచేశావు. అర్థంలేని కులభేదం నిర్మూలించావు. పాడుబడ్డ దివాణంలాంటి గ్రామంలో నిత్యకళ్యాణం పచ్చతోరణం నెలకొల్పావు. సర్వశ్రేయస్కరంగా అపూర్వమైన ఆర్థిక సంస్కారాలు తెచ్చావు. అద్భుతమైన త్యాగం చేశావు, చేస్తున్నావు. మానవకళ్యాణానికి కంకణం కట్టుకొన్నావు. కాని నీవు మటుకు కళ్యాణం మానుకొన్నావు! ఇది మాకు విచారం కలిగిస్తున్నది. బాల్యంనుంచీ నీవూ,శాంతమ్మా అన్యోన్యప్రేమవల్లికలు పెంచుకొన్నవాళ్ళు. అప్పటిలో కులభేదం అడ్డంరాబట్టిగాని లేకపోతే మీ రిద్దరూ పెండ్లాడి ఆదర్శదంపతులై వుండేవాళ్ళు. ఇప్పటికీ మించిపోయిందిలేదు. శాంతాదేవి నిజంగా వితంతువేకాదు. పునస్సంధానం కాకముందే ఆ పెనిమిటి అనే వ్యక్తి గతించాడు. వైదికవివాహం కాదు కాబట్టి వాళ్ళిద్దరికీ సాప్తపదీనమైత్రి కూడా కలిగి వుండలేదు. కాబట్టి శాంతాదేవిని వితంతువు అనడంకంటె కన్య అనడమే ఒప్పు. ఒకవేళ వితంతువు అనుకొన్నా సంస్కర్తవు నీవు లక్ష్యపెట్టవు. ఒండొరులకు చేదోడు వాదోడై గ్రామాన్నింత వృద్ధికితెచ్చిన మీ యిద్దరూ వివాహమాడి సుఖించాలని మా కోరిక.

ఈ మాటలకు రాజశేఖరుఁ డేమి ప్రత్యుత్తర మిచ్చునో యని యందఱుఁ గుతూహలముతో నిరీక్షించుచుండిరి. మందస్మితవదనముతో నతఁ డిట్లనెను.

"ఏ నాడు శాంతాదేవిని చంద్రారెడ్డి కివ్వడానికి నిశ్చయించారో ~~ఆ నాడే~~ నేను జన్మాంత బ్రహ్మచర్య దీక్ష వహించాను. తర్వాత మానవసేవాదీక్ష వహించాను. బ్రహ్మచర్యంలోనూ, మానవసేవలోనూ ఉండే మాధుర్యం తనివిదీర అనుభవిస్తున్నాను. ఇక నిప్పుడా, నాకు సాంసార సుఖావేక్ష? సంసార సుఖం పాలవంటిది కావచ్చు; కాని నే నిప్పుడు అమృతం త్రాగుతున్నాను. కాబట్టి నే నిక వివాహం చేసుకోలేను. నా బ్రహ్మచర్యవ్రతం, మానవసేవావ్రతం వొదులుకోలేను. నేను వొదులుకొవకపోగా ఇంకా కొంతమందికి బ్రహ్మచర్యదీక్ష

యిప్పించి మానవసేవా తత్పరులను చేస్తాను. ప్రతి గ్రామానికీ నలుగురైదుగురైనా బ్రహ్మచారి సేవకులుంటేతప్ప దేశం బాగుపడదు. ఇక శాంతాదేవి మాట : ఆమె నాకంటె సేవాతత్పరురాలు. వైధవ్యాన్ని మానవ సేవా సాధనంగా మార్చిన మహాత్మురాలు. ఆమె కూడా సంసారసుఖం కోరదు. చాలా ఏవగించుకుంటుంది కూడా! కాబట్టి శాస్త్రిగారూ, మీ సలహాను తిరస్కరించినందుకు క్షమించండి!"

ఏమి యనుటకుఁ దోఁచక నీలకంఠశాస్త్రి కడ కిట్లనెను : "మీ రిద్దరూ లోకోత్తరవ్యక్తులు. పవిత్రులు. మీరు పెండ్లాడి భార్యాభర్తలు గాకపోయినా మీ భావసంసారానికి ప్రతిఫలంగా, పర్యవసానంగా పరివర్తనం చెంది యీ అభినవరూపం దాల్చిన వేములపల్లికి. మీరే జననీ జనకులు. ఆ విధంగా మీరు దంపతులు! శాశ్వత దంపతులు!! తథాస్తు!!!"

సంపూర్ణము.



భారతీ ప్రెస్, తెనాలి — 1954

## ఈ కవి యితర కృతులు

స్వప్న సందేశము　　　　　రు. 1—0—0

(కవిత్వ విమర్శతోఁగూడిన
రమణీయ ఖండకావ్యము)

కళాతపస్వి

(పద్య కావ్యము)

చెదఱు చినుకులు

(ఖండకావ్య సంపుటి)

చివరి రెండుకావ్యములును ముద్రణము నపేక్షించుచున్నవి.


ప్రతులకు:

ఆంధ్ర శిల్పకళాపరిషత్తు,
తెనాలి.